# కొత్తగడ్డ

శాస్త్రి వెంకటేశ్వరరావు



చిత్రకారులు:

శ్రీ తేజోమూర్తుల కేశవరావు.

శ్రీ బి. పి. సుబ్బారావు

# మనవి

ద్వితీయ ముద్రణ సందర్భంలో ఈ సంపుటిలోని నాటికలలో చేర్పులు, మార్పులు అనేకం చేశాను. "జీవజ్వాల" అనే నాటికను తగ్గించి, "ఆశాపాశం" అనే కొత్తదాన్ని చేర్చాను కూడా. ఈ మార్పులన్నీ పాఠకుల ఆమోదాన్ని పొందగల వని, ప్రథమ ముద్రణకు వారినుంచి లభించిన విశేషాదరణ దీనికీ లభించగలదని ఆశిస్తున్నాను.

ప్రూఫులలో పేజీలకు పేజీలనే పూర్తిగా మార్చి వేస్తూ పోయినా, ఓర్మిని, నేర్మిని చూపి ఈ సంపుటిని సర్వాంగ సుందరంగా ముద్రించి యిచ్చిన వహీరా ప్రింటర్స్‌వారికి కృతజ్ఞుడను.

—రచయిత



# నాటికలు

ముద్రణ :
కుబేరా ప్రింటర్స్ (ప్రైవేట్) లిమిటెడ్
'కుబేరా బిల్డింగ్స్'
21. సుంకురామచెట్టి స్ట్రీట్
మద్రాస్ - 1



Kubera Printers (Private) Ltd., Madras-1

## పాత్రలు

రైతు : పల్లెటూరి ఆసామి

అతని భార్య

అతని కొడుకు

అతని కూతురు

సెట్టి

షాహుకారు

## స్థలం

రైతు ఇంటి చావడి

## కాలం

వర్తమానం

రైతు. రెండు, మూడు బస్తాలకోసం నీ యింటి కెవ డొచ్చి కాటా కడతాడు? పైగా, మన మమ్మే పుట్లకిన్ని మాట్లు చేరాలు కూడానా?

భార్య. సరే, నీ యిష్ట మొచ్చినట్టు చేసుకో - నాకు దేనికి? నేను ఆర్చేదాన్నా, తీర్చే దాన్నా?

వెట్టివాడు [బయటినుంచి]. దొరోయ్, మున్సబుగారు కూకేసుకు రమ్మన్నాడు.

రైతు. అమ్మా, కొడుకూ చేరి, ఆగమన్నారుగా! ఆగితే, ఇదే మర్యాద! [వెట్టివాడితో] ఊఁ. వొస్తున్నా, నువ్వు పోరా!

వెట్టివాడు. నిలుచున్న పాళాన రమ్మన్నాడు. మరి ఊరుకోడానికి ఊల్లే దన్నాడు.

కొడుకు. ఊరుకోక పోతే, ఉ రెట్టుకోమను.

భార్య. అరి పాడి దిమ్మడ, కొంపమీదికి యమములాళ్ళని పంపకం చేస్తున్నాడు.

వెట్టివాడు. దొరోయ్!

రైతు. పదరా, పద! నీ యెనకాలే వొస్తున్నానని చెప్పు.

వెట్టివాడు [వెళ్ళిపోతూ]. ఆ అయ్య నన్ను కోంపదతాడు. బేగి రా, దొరోయ్!

కొడుకు. ఈ మునసబు కరణాలు ఏం సవారి చేసినా, మనంటి పేదా బిక్కీ మీదే. అదే మోతుబరు ఆసాములనైతే, ఇట్టా మాటుడు చేస్తాడూ?

భార్య. అళ్ళదగ్గర ఈళ్ళ అంకిలి నొక్కుకు పోతుంది. నిరుడు మానానికి నిరుడు కూడా ఈళ్లు పీకమీద కూర్చుండబట్టేగా

అయినకాడికి తెగనమ్ముకున్నాం. తీరా మనం అమ్ము కున్నాక వారానికే బస్తాకి రూపాయి పావలా పెరిగింది.

కొడుకు. ఒక్క రూపాయి పావలా ఖర్మ మేమిటి? కార్తీకమాస మొచ్చేసరికి రెట్టికి రెట్టి ధర పలికింది.

రైతు. నిజమేరా! కాని, కార్తీకమాసందాకా కిస్తీ ఆపగలమా? అప్పులవాళ్లని ఆపగలమా? గింజలు మన చేతికొచ్చేసరికి ఎవరికి రావలసింది వాళ్ళు గుంజుకోడానికే చూస్తారు. కాదు గూడదంటే పరువూ పోతుంది; పరపతీ పోతుంది.

కొడుకు. ఇంతకీ మన కమిషనన్‌దారు బాగుపడే గీత వుంది. నిరుడు నిల్వబోసిన మూడువేల బస్తామీద పది, పదకొండు వేలు కళ్ళ జూశాడు. అందుకని ఈ యేడు మరీ తెగబడి కొంటున్నాడు.

భార్య. ఎన్నేలు పోసుకోందే ఆడి పెళ్లాం మెడ తిరగకుండా అన్ని నగలు చేయించి పెట్టుకుంటదీ? అద్దంతరంపు సిరొచ్చిం దని అది నేలమీదే నడవడం లేదు. ఆడైతే సరేసరి. ఒక్క ల్లోకి చూస్తున్నాడు.

కొడుకు. వాణ్ణి చూసి, మన షావుకారు కూడా వడ్డవేరం ప్రారంభించాడే, అయ్యా!

రైతు. ఔ నౌనురా! నిన్న మనకు కబురు చేశాడు. వాడి ఆశ కైతే అసలే అంతూ పొంతూ లేదు. అయిదణాల కాడికి తనకి కొలవాలట.

కొడుకు. వాడి పుణ్యమాయిరి! పావలాకాడికే అడిగాడు కాదు.

భార్య. ఆరి ఆడి శిరసు పగల! పోసుకుంటున్న వడ్డీలు చాలవు కాబోలు! ఒక మేడకు మరొక మేడ కట్టాలని చూస్తున్నాడు.

రైతు. సర్లేరా, అబ్బాయ్! నాకు బద్ధకంగా వుందికాని, నువ్వోళ్లి కిస్తీ కట్టిరా! [బొడ్డునుంచి డబ్బు తీస్తూ] "ఒక యాభై సర్దరా" అని కమిషన్‌దారు నడిగితే, "లేవే" అని, ఒక యిరవై మాత్రం బయానాగా యిచ్చాడు. ఇది బొటా బొటిగా కిస్తీకే సరిపోతుంది.

కొడుకు [పేనుతున్న తాడూ, నారా గడమంచంపై పెట్టి, తండ్రి చేతినుంచి పైకం అందుకుంటూ]. ఇంకా ఎంత కట్టాలేమేం, అయ్యా?

రైతు. పద్ధెనిమిది చిల్లరటరా!

కొడుకు. ఇంకా అంత దేనికేం?

తండ్రి. ఏవో సెస్సులట; జమాబందీ మామూళ్ళట.

భార్య. ఆళ్ళ పాడె, ఆళ్ళ పిండాకూడు!

కొడుకు. మనకేం సాయితా చేస్తున్నా రేమిటి? మనం మామూళ్ళివ్వడానికి.

రైతు. సర్కారు ముడుపైనా తప్పుతుందేమో కాని, మామూళ్ళ ముడుపు తప్పుతుందట్రా? నిరుడు పల్లపీధివాళ్ళు మామూళ్లివ్వలేదనేగా మునసబు కరణా లేకమై చురక తగిలించారు? వాళ్ళ చేతి కద్దేమిటి? వాళ్ళది ముడుపులా వాళ్ళకి ముట్ట జెప్పక పోతే, గండిసాగో, గిండిసాగో అని పరపర రాసేస్తారు.

భార్య. ఆ మునసబు కేమి పోయేకాలమో కాని, మొన్న పుత్తి పుణ్యానికి సుబ్బమ్మత్త గేదల్ని బందెలదొడ్డికి తోలించాడు. అటో దిటో మంటూ ఆ దొక్కటే గోల!

కొడుకు. ఎవరైనా మనం వొంగిన కొద్దీ, మరింత వొంగ దీస్తారు. మామూళ్ళూ గీమూళ్ళూ మన మివ్వొద్దే, అయ్యా!

రైతు. వాళ్లతో మన మెక్కడ గెలవగలంరా? మన కెందు కొచ్చిన పేచీలు గాని, ఆ మామూ లేదో తగలేశే రా! వాళ్లతో పేచీకి దిగితే పీకమీదికి తెస్తారు.

భార్య. చేశే రా - అళ్ల వెవస మేమో చేశే రా!

రైతు [దండెంపైనుంచి పైపంచె తీసుకుని, మునసబు కచ్చేరీకి బయల్దేరిన కొడుకుతో]. వొస్తూ, వొస్తూ కోమటింటి కెళ్లి, ఒక కాడ పుగాకు తేరా, అబ్బాయ్! కాస్త చూసి తే, బొత్తిగా నాసి రకమిస్తున్నాడు. నిలిచి కాలడమే లేదు.

కొడుకు. సరే నయ్యా.

[వెళ్ళిపోతాడు.

భార్య. పొద్దున్నేగా ఒక అర్ధణాకి తెచ్చావ్! మళ్లీ అప్పుడే కావాలీ? మన పుగాక్కి చాలడం లేదు ఎంత డబ్బైనా!

రైతు. ను వ్వెప్పుడూ నా పుగాక్కి పడి యేడుస్తూనే వుంటావ్. ఇవాళ్ళ కొత్తే ముందిలే?

భార్య. సర్లే. ఏది ఎలా తగలబడితే నాకు దేనికి కాని, నా కట్టు కోకలు చిరిగిపోయాయి. ఒక జత కొనకపోతే, ఇక జరగదు.

కూతురు [వడమటింటిలోంచి వస్తూ]. బియ్య మేరడం కానే లేదటేఁ అమ్మా ?

భార్య. ఆఁ వొస్తున్నా.

కూతురు [చావడిలోకి వచ్చి]. ఎసరు సలసల కాగిపోతోందేఁ అమ్మా !

[పదిహేడేళ్ళ పడుచు, మూడేళ్ళనాడు పెళ్ళి అయింది. తండ్రివద్ద గారాం హెచ్చు. కల్లా కపటం యెరగదు].

భార్య. నా మాట చెవి నట్టించుకున్నావా ? ఎంత అతుకు లెట్టుకుందామన్నా మరి ఆగేలా లేవు. ఒక జత కట్టుకోకలు....

రైతు. చెము డింకా రాలేదు.

భార్య. సరే, తేబోకు. మసిపూసుకు తిరుగుతాలే.

[బియ్యపు చేట చేత బుచ్చుకుని విసురుగా లేచి వెళ్ళిపోతుంది.

కూతురు. అయ్యా !

రైతు. ఏమమ్మా ?

కూతురు. పంట అమ్మేశావా ?

రైదు. ఔను.

కూతురు. ఎప్పుడు ?

రైతు. ఇవ్వాళే.

కూతురు. ధరొచ్చేదాకా ఆగుతా నన్నావుగా ?

రైతు. మనం ఆగుదా మన్నా, మనకు అప్పూ సప్పూ పెట్టిన వాళ్లు ఆగనిస్తారా ?

కూతురు. వాళ్లు తొందర చేస్తున్నారన్న మాట.

రైతు. మరి చెయ్యరూ ?

కూతురు. సరే.

రైతు. సరే ఏమి టమ్మా ?

కూతురు. ఆఁ ! ఏమీ లేదు.

రైతు [ఆప్యాయంగా]. నా దగ్గరనా నీ దాపరికాలు ? మనసులో మా టేమిటో చెప్పు !

కూతురు. నిజంగానా ?

రైతు. నిజంగా కాక, అబద్ధంగానా !

కూతురు. అయితే, నిరుడు నువ్వు....

రైతు. ఆఁ, నిరుడు నేను....

కూతురు. నీకు గ్యాపకం లేదటే ?

రైతు [చిరునవ్వు నవ్వుతూ]. ఏమి టది ?

కూతురు. పైపంటనాటికి నల్ల పూసల గొలుసు చేయించి పెడతా నన లేదూ ?

రైతు. అయితే, ఇప్పుడు చేయించమంటా వన్నమాట.

కూతురు. నువ్వే అన్నావుగా, అయ్యా ?—పైపంటనాటికి చేయించి పెడతానని.

రైతు [నవ్వుతూ]. మరి అన్నాక తప్పుతుందీ? అలాగే చేయిస్తాలే.

కూతురు. వెంకట్రావమ్మ పిన్నిగారి రెండో కోడలు మొన్నే చేయించుకుంది. ఎంతో కాలేదు—మజూరి కలుపుకుని నూటు రూపాయల లోపే. అయినా, కొట్టొచ్చినట్టు నదరుగా కన బడుతున్నది. ఊః పక్క పక్కవాళ్లంతా దాన్ని పసందు చేశారే, అయ్యా !

రైతు [నవ్వుతూ]. అంత బాగుందేఁ!

కూతురు. అంతా, యింతానా? చాలా బాగుంది. ఒకసారి తెచ్చి చూపించినా?—నీకే తెలుస్తుంది.

రైతు. తెద్దువుగాని లేఁ. ఇప్పు డంత తొందరేమిటి?

కూతురు. అస లొకసారి నీ కళ్ళతో చూడవే ఎలా వుందో? నవర్సు మీద అయిదు చిన్నాలు పడిందట. కొత్తపేట కమలాచారి చేశాడు. మనంకూడా ఆ కంసాలిబత్తుడికే యిద్దామే, అయ్యా! పిన్నిగారింటి కెళ్ళి, మా అయ్య కొక్కసారి చూపించి లెస్తానంటూ దాన్ని పట్టుకు రానా?

రైతు. మంచి దమ్మా!

[కూతురు వెళ్ళబోతూ వుంటే, భార్య వంటింటిలోనుంచి తిరిగి వస్తుంది.

భార్య. ఇప్పుడు ఆళ్లింటికి దేనికి? అక్క డేం పాచిపోతున్నది?

కూతురు. అయ్యకు చూపించడానికి వాళ్ల నల్లపూసల గొలుసు తెస్తానే. కొత్త పంట డబ్బు పెట్టి మా అయ్య నాకు అలాంటి దాన్నే చేయించి పెడతా నంటున్నాడు.

[వెడుతుంది.

భార్య. ఆ చేయించుకునేది నిరుడు చేయించుకున్నా బాగుండేది. నిరుడు బంగారం ఇంత మండిపోవడం లేదు. పెళ్లినాడు చేయించిన ఆ ఒక్క జత గాజులు తప్పితే, మళ్లీ దానికొక వస్తు వేదీ యేర్పడనే లేదు. మెడ బోసిగా వుంది. పైపంటనాటికి, పైపంటనాటికి అంటూ అప్పుడే మూడేళ్ల

వెళ్ళిపోయాయి. మన యిబ్బందులూ, సబ్బందులూ వాళ్ళకేం తెలుస్తాయ్? రేపు దాన్ని కాపరానికి పంపితే, దిసిబొమ్మలా వొచ్చిందని అత్తా, ఆడబిడ్డలూ ఆరడి పెట్టరూ? కావాలంటే ఒక అప్పైనా దిగివిడిచి దాని మెడ కొస్త పచ్చబడేటట్టు చూడు. అలాగే నా కొక జత కోకలు కూడా....

రైతు. చెప్పినమాటే ఎన్నిసార్లు చెప్తావ్? తెస్తాలే, తెస్తా.

భార్య. ఆ నాయుడమ్మ కోట్లోవి నా కొద్దు. అవి మూడు రోజు లైనా నిలవడం లేదు. పోసుకునే డబ్బా పోసుకుని, వొత్తి పలలాంటి గుడ్డల్ని అంటగడుతున్నాడు. వేరే ఎక్కడైనా కొనుక్కురా.

రైతు. వేరే కొనడానికి డబ్బేదీ?

భార్య. అంతేలే! నాకాడి కొచ్చేసరికి నీకు డబ్బే వుండదు. పాడి చేసీ, పిడక లమ్ముకునీ, దమ్మిడీ దమ్మిడీ చొప్పున పోగుజేసి, గుడ్డా గుడుసూ కొనుక్కుందామని పాతిక రూపాయలు కూడబెట్టుకుంటే, మాసూలు ఖర్చులకని దాన్ని నువ్వే మండబెట్టుకున్నావ్.

రైతు. అవి రావే! సర్దవలసిన బాకీ లన్నీ సర్దాక, మరేం మిగుల్తుంది? ఆ నాయుడమ్మ కిప్పుడు ఏ ముప్పైయ్యో, నలభయ్యో యివ్వదేలాం. ఆ బాకీ తీర్చి, మళ్ళీ వాడి దగ్గరే తెచ్చుకుంటే పైపంటదాకా ఆగుతాడు.

భార్య. దొరికాడులేఁ, మన కొక నాయుడమ్మ, ఎక్కడాలేని ధర లేసుకుని కొట్టుచీకుడు గుడ్డ లంటగట్టడానికి, అది బిమ్మరడ! మరి, అది కెలా దక్కుతుందో, ఏమో?

సెట్టి [ప్రవేశిస్తూ]. ఎవర్ని పిన్నీ, శాపనాకారాలు పెడుతున్నావ్?

[సెట్టి వయస్సు ఇంచు మించు నలభై సంవత్సరాలు. ముందు క్రాఫు, వెనక పిలక. బొత్తాలులేని చొక్కా, జీరాడుతున్న పంచెకట్టు, సగం చెరిగిన పంగనామాలు. చేతిలో ఖాతా పుస్తకం].

భార్య. ఆఁ, ఎవర్ని లేదు. ఎవర్ని అంటే ఎవ రూరుకుంటారు?

సెట్టి [రైతుతో]. ఎక్కడి బాకీ లక్కడ నిలిచిపోయాయే, బాబాయ్! మూడు రోజుల్నుంచీ ఎక్కే గడప, దిగే గడపే కాని - రామరామ - ఎఱ్ఱటి ఏగాణైనా వసూలైతే వొట్టు. ఊరుమీద అమాంబాపతు రెండు వేలెట్టి - నా మొఖం-నే నిఖ యాపారం సేసినట్టే!

రైతు. ఆఁ, రెండు మూడు వేలు నీ కొక లెఖ్ఖా? పత్రమా?

సెట్టి. నా యింట్లో సొమ్మంటే బాబాయ్! ఎప్పటి కప్పుడు ఫిరాయింపు సెయ్యందే అక్కడ నా మొగు దూరుకుంటా డంటే? మొన్న సరు కేసుకొద్దా మనెళ్లితే, నానా మాట లన్నాడు. ను వ్విప్పు డిస్తే, ఊరికే యిచ్చినట్టు! లెక్కేమైనా యిస్తావటే, బాబాయ్?

రైతు. పెద్దపెద్ద వద్దులు వసూ ల్జేసినా, చేసి నందం. ముందు వాటిని....

సెట్టి. బాబ్బాబు, నువ్వలా అంటే కాదు. చిల్లర శివాలచ్చి మన్నారు. కొంత కాకపోతే, కొంతైనా వసూ ల్జేసి సరు కేసుకు రాకపోతే, యాపారం బొబ్బుంటుంది. కొట్లో-రామ రామ-ఉప్పుంటే చింతపండు లేదు, చింతపం డుంటే ఉప్పులేదు. ఏ

వొట్టు పెడితే ఆ వొట్టు. చెయ్యంగ గొట్టుకున్నట్టుగా వుందంటే నమ్మ.

భార్య. ఇంతకీ ఎం తివ్వా లేమిటి ?

సెట్టి [పద్దుపుస్తకం చూస్తూ]. అఁ! వెరసి ఇరవైమూడు రూపాయల పన్నెండణాల కానీ అయిందే. పిన్ని.

భార్య. అంత యెచ్చు మేమి పుండబెట్టుకున్నాం ?

రైతు. నెల రోజులనా డొకసారి లెఖ్ఖ జూస్తే, పదిహేనేగా యివ్వదేలాం ?

సెట్టి. నే నగావ్ వేస్తున్నానటే, బాబాయ్ ? పద్దు పుస్తకం తేనే తెచ్చాగా. కావాలంటే, నువ్వే చేరీ చేసి చూసుకో.

రైతు. నాకు చదు వొస్తే, కానీకి మరొక కానీ నువ్వెలా రాసు కుంటావులే !

సెట్టి. అరి నీయిల్లు బంగారం గాను ! ఎంత మా టన్నావేఁ, బాబాయ్. [పద్దు పుస్తకం పేజీలు తిరగవేస్తూ] అసిరాయ పట్టుకోడాని కని మొన్నే కాదటే, మా పిన్ని రెండు పీసెల మంచినూనె, వీసెడు మిర్చి, అరవీసెడు ఆవాలు, అర్ధసేరు నవటాకు మెంతులు. నవాసేరు వెల్లుల్లి వగైరా వగైరా తెప్పించుకుంది? వీసె రెండుం బావలా చొప్పున రెండు పీసెల మంచి నూనె....

రైతు. రెండుం బావలా వేసుకున్నావ్ ? పేటలో రెండు రూపా యలకాడి కిస్తుంటే !

సెట్టి. అఁ. అక్కడైనా, రెండుం బేడా అమ్ముతున్నారే, బాబాయ్.

భార్య. మరి ఆకాడికే మా కెందు కివ్వలా ?

సెట్టి. ఆ కాడి కిస్తే నా కెలా గిడుతుందే, పిన్నీ ? కిరాయిలు పెట్టా లయ్యె; వడ్డీలు కట్టా లయ్యె; పారూ గిరూ పోతుం దయ్యె. నాకు వీసె కొక కానీ, అర్ధణా మిగిత్తే, అక్కాడి కవి పెద్ద లాభాలే!

భార్య. పోసుకో! ఇంకా పోసుకో!

సెట్టి. ఆఁ, ఆ మాదే మున్నదేఁ పిన్నీ! ఏడా దయ్యాక జమా ఖర్చు లెత్తితే సెట్టి మిగుల్తాడు. ఏమైనా రైతు రైతే. మంట్లో మానెడు, ఇంట్లో పుట్టెడు.

సెట్టి [రైతుతో]. ఏం, బాబాయ్, మరి నన్ను పంపించవటే ?

రైతు. ఇంతకు ముందే ఆ గింజ లేవో బేర మిచ్చొచ్చా! రేపో, మాపో కాని పైకం చేతి కందదు. అందగానే పదో, పరకో జమ కడతాలే.

సెట్టి. బాబ్బాబు! దీన్లో మళ్లీ కాస్త బకాయి పెట్టొద్దు. బాకీ చుప్తా చేసెయ్. కావాలంటే మళ్లీ వాడుకోవచ్చు. నీకు ఎప్పు డైనా నేను అడ్డుచెప్పానటే, బాబాయ్ ?

రైతు. మంచో, చెడ్డో, ఆ యిరవై మూడు రూపాయ లిస్తా గాని, బాకీకి శ్రీరామ చుట్టు.

సెట్టి. నాకైనా కాస్త గుటక దిగొద్దటే, బాబాయ్ ? ఆ పై చిల్లర డబ్బులే నాకు మిగిలేది.

రైతు. అయితే, దమ్మిడీలతోసహా గోళ్లూడగొట్టి పుచ్చుకుంటా నంటావ్!

సెట్టి. నీ మాటెందుకు కాదనాలి? ఆ పైకానీ తోసెయ్యవే. బాబాయ్.

భార్య [సెట్టితో]. ఊఁ! మహలావ్ చేశావులే ఎలాగైతేనేం మా కొరక ముష్టికానీ రాయితీ! [రైతుతో] టక్కా టొక్కా తిన్నగా చూపించి మరీ యివ్వు! ఎంతంటే అంతా యిస్తా ననక! మనం కళ్లు మూసుకుంటే చేతి కెంతొస్తే. అంతా పరపర రాసేసుకుంటాడు.

సెట్టి. కావా అంటే, నీ యిష్ట మొచ్చినవాళ్ళచేత పట్టు చూపించు కునే యివ్వవే, బాబాయ్! ఇందులో తగా దేముస్నది? మరి నన్ను వెళ్ళి రమ్మంటావా?

రైతు. ఊఁ.

సెట్టి [వెళ్ళిపోబోతూ]. నా మాట దక్కించాలి, బాబాయ్! పోనీ, నన్నే రమ్మంటే, మళ్ళీ రేపు....

రైతు. మళ్ళీ నువ్వు దేనికిలే? నేనే వొస్తా.

సెట్టి [ఆగి]. కందులూ, పెసలూ కొత్త వొచ్చాయ్. పిస్స్! మొదటిరకం సరుకు. అన్నప్పు డల్లా దొరకవ్. అవో యిరస, ఇవొక యిరస పంపనా?

భార్య [మూతీ ముక్కూ విరుస్తూ]. మా కేమీ వొద్దులే.

సెట్టి. పోనీ, బెల్లం కావాలా? పాలకొల్లునుంచి నిన్నే ఒక బుంగ వచ్చింది. తెల్ల బెల్లం; గెడ్డంటి బెల్లం. అయిపోతే, ఇంతలో మళ్లీ అంత మంచి సరుకు రాదు. ఒక యెత్తెడు తూయించుకోండి—రాయితీ ధర కిస్తా.

భార్య. ఎత్తేదూ వద్దు; ఎత్తుబారమూ వద్దు. మరి నే నెళ్లాలి. — వణ్ణ మేమైపోయిందో!

[వెడుతుంది.

సెట్టి. సర్లేవేఁ బాబాయ్! నే నొస్తా. నా బాకీ నిలపబోకు సుమీ!
[తలవాకిలి దాపుకు చేరేసరికి ఎదురుపడిన షాహుకారును చూచి] కోమటి నెదురొచ్చా నయ్యా, నీకు కోటి లాభాలు.

షాహుకారు. ఆఁ! అన్నీ లాభాలుగానే వున్నాయ్!

[షాహుకారు ఒక్కీ మనిషి. గట్టిగా గాలి వేస్తే ఎగిరిపోయేలా వుంటాడు. కాని, మాట కరకు; చూపు చురుకు. వయస్సు నలభైలోపు; యాభై అన్నట్టు కనబడతాడు.

సెట్టి. నీకేం తక్కువయ్యా? ఊరు మొత్తంమీద పెద్ద షాహుకారువు. ఇంట్లో లచ్మి మూల్గుతున్నది. [రైతుతో] నేను బక్కవాణ్ణి. మర్చిపోబోకు—బాబాయ్—నా మాట.

[వెళ్ళిపోతాడు.

రైతు [మంచంపైనుంచి లేస్తూ] రావయ్యా. రా! కూర్చో.

షాహుకారు. ఆఁ! కూర్చోడానికి రాలేదులే.

రైతు [మంచం చూపుతూ]. రాక రాక, దారి తప్పి మా యింటి కొచ్చావ్. కూర్చో.

షాహుకారు [నిలుచుండే]. రాక తప్పుతుందీ? కాలం మారి పోయింది. కూర్చుంటే లేవలేని వాడికైనా కాళ్లొచ్చాయి.

రైతు. ఎందుకయ్యా అంత కాక పడుతున్నావ్?

షాహుకారు. ఒకసారి వచ్చి కనబడి పొమ్మని కబురు చేస్తే నివ్వొచ్చావ్?

రైతు. వచ్చేవాణ్ణే. కాని, మునసబు తొందర కొచ్చిపడింది. కిస్తీ కట్టలేదని ధాము ధూము చేస్తున్నాడు. అందుకే సర్దుబాటు చేసుకుని ఇవ్వాళ కొద్దా మనుకున్నా.

షాహుకారు. నీకు మంచి వచ్చినా, చెడ్డ వచ్చినా సర్దుబాటు కోసం నా వద్దకే వచ్చేవాడివిగా! ఈ సారి ఎందుకు రాలేదు? మూడేళ్లనాడు నీ కూతురు పెళ్లికి ఐదువందలు కావా లంటే నే సర్దం వెయ్యాలా? బండి ఎద్దుల పడిందని, మరమ్మత్తులు చేయించుకోవాలని అప్పిస్తే యిచ్చాయ్యా, అదేమయ్యా తిరిగి నిరుడు భరోసాగా నే నివ్వలా? వందలకు వందలే సర్దినవాణ్ణి నువ్వు కిస్తీ కట్టుకోడానికి సాతికో, పరకో సర్దలేక పోయానా?

రైతు. అమాసనాడు అట్టు పెట్టానని, పౌర్ణానికి బూరె పెట్టానని ఎందుకయ్యా ఇప్పు డీ చెప్పుళ్ళన్నీ? అప్పో సప్పో కావా లంటే నువ్వు అడుకున్న మాట నేను కాదన్నానా?

షాహుకారు. కాదనాలన్నా నోటూ పత్రాలూ వున్నాయిగా! ఎలా కాదంటావులే! కాని, నీకు అప్పో సప్పో అవసరమైతే నేను కావాలి; గింజా గిట్రా అమ్ముకోవాలంటే కమిషన్‌దారు కావాలి. నిన్న వాడికి బేర మిచ్చేశావటగా!

రైతు. అబ్బే! ని న్నివ్వ లేదు.

షాహుకారు. అయితే, ఇవ్వాళా?

రైతు. ఇంతకు ముందే మా టిచ్చాను. నాలు గైదేళ్లగా వాడే కొంటున్నాడు. ఆనువాయితీ ఎందుకు తప్పించాలని మళ్లీ వాడికే బేర మిచ్చా.

షాహుకారు. నేను కబురంపితే, నన్ను కాదని వాడికే బేరమివ్వ డానికి నీకు అనువాయితీ అడ్డం వొచ్చిందన్న మాట !

రైతు. ఆఁ ! అది కాదు.

షాహుకారు. అయితే, మ రేమిటి ?

రైతు. న న్నేమి చావమంటా వయ్యా ? నువ్వు అయిదణాలకే అడిగా వయ్యె ! చూస్తూ, చూస్తూ అంత తక్కువకు ఎలా వొదిలిపెట్ట మంటావ్ ?—నువ్వే చెప్పు!

షాహుకారు. నిన్నటి ధ రది.

రైతు. నిన్నైనా కమిషనుదారు అర్ధణా తక్కువ ఏడణాలదాకా తూగాడు.

షాహుకారు. తూగుతాడు; తూగుతాడు. తూలి పడేదాకా తూగు తూనే వుంటాడు. ఇలా మిడిసిపడ్డవాళ్లని చాలామందిని చూశాలే. నాపై పోటీ కొచ్చి నాకు రావలసిన బేరం వీడు పడగొడతాడూ ?

రైతు. ఆఁ ! నే నిచ్చిందీ ఒక బేరమేనా ? పెద్ద బేరమైతే పుచ్చు కున్నా పుచ్చుకున్న అందం.

షాహుకారు. పెద్దదో, చిన్నదో—బేర మన్నాక బేరమే. ఇవ్వా కెంతదాకా ధర పెట్టా డేమిటి ?

రైతు. కానీ తక్కువ ఏడణాలు.

షాహుకారు. అలాగేఁ ! అయితే, వాడు బస్తాకి 170 పౌనులు ఖచ్చితంగా తూసుకుంటాడు. ముక్కానీ, అణా పెచ్చి స్తున్నాడని నువ్వు ఎగిరి గంతేశావే కాని, నాలుగు పౌనులు ఎక్కువ తూసుకుంటాడని పారజూసుకున్నావ్ ?

రైతు. ఏమో, ఆ మాయ మర్మాలన్నీ నా కేం తెలుసు ?

షాహుకారు. అయితే, నే నిప్పుడు తెలియ జెబుతున్నాగా! బేరం వదులుకున్నా నని వాడికి చెప్పెయ్.

రైతు. ఊహుఁ! వీల్లేదులే. చెయ్యి దాటి పోయింది. ఇంతకు ముందే వాడి దగ్గిర యిరవై రూపాయలు బయానా కూడా పుచ్చుకున్నా.

షాహుకారు [జేబులోకి చెయ్యి పోనిచ్చి డబ్బు తీస్తూ] ఇదుగో! ఇరవై కాదు; నూట యిరవై బయానాగా నే నిస్తున్నా. వా డిచ్చింది వాడికి వాపసు చేసెయ్!

రైతు. మా టిచ్చాక. అంత తఫావత్తా! ఊళ్లో వాళ్లందరూ ముఖాన ఉమ్మేయ్యరూ?

షాహుకారు. అయితే, వాడి కిచ్చిన బేరం వదులుకోవన్న మాట!

రైతు. అది మర్యాదేనటయ్యా?

షాహుకారు. నీకే యింత పట్టుదల వుంటే నాకేనా లేంది! నువ్వూ. వాడూ కట్ట గట్టుకుని ఏ గంగలో కలిస్తే నాకు దేనికి కాని. నా నోటు బాకీ నాకు పూర్తిగా తీర్మానం చేసెయ్.

భార్య [వడమటింటిలో నుంచి వస్తూ షాహుకారుతో]. ఏ మన్నయ్యా! అంత కోపం చేసుకుంటున్నావ్?

షాహుకారు. కోపం లేదు; తాపం లేదు! నా కిప్పుడు పైకం అవసరంగా కావాలి.

రైతు. అంతా ఒక్క దఫాగా తెమ్మంటే, నే నెక్కడ తెస్తా నయ్యా?

షాహుకారు. ఏఁ ? మీ కమిషన్‌దా రున్నాడుగా ?

భార్య. ఈ తడవకి అయిం దేదో అయిపోయిందిలే, అన్నయ్యా! పైపంట నీకే తోల్తాంలే.

షాహుకారు. నా కేమీ తోలొద్దులే. నా బాకీ అసలు ఫాయిదాలు నాకు పారెయ్యండి.

భార్య. మరీ అంత నిక్కచ్చి చేస్తావేమిటేఁ, అన్నయ్యా ?

షాహుకారు. మీరు చెయ్యలా నిక్కచ్చి బేరం ?

రైతు. అయితే, నువ్వు ముందే అచ్చుకో లేదటయ్యా అప్పు వాయిదాల మీద తీర్చుకోవచ్చని ?

భార్య. నిరుడు, ముందటేడు గింజ లమ్ముకోగానే, అత్తార బత్తంగా నీకు డబ్బు తెచ్చివ్వలే దటేఁ అన్నయ్యా? మిగతాది కూడా నింపాదిగా తీర్చుకుంటాం! ఈ బాగ్యానికి మేము ఈ రొదిలిపెట్టి పారిపోతామటే ?

షాహుకారు [కాకగా]. ఈ వాయిదాలు, గీయిదాలు నా కిఖ పనికి రావ్. నన్ను మీరు ఖాతరు చెయ్యనప్పుడు. నాకు మీ లా వేమిటి ?

రైతు. ఏఁ ? ఏ యేటి వడ్డీ ఆ యేడే కచ్చితంగా పుచ్చుకుంటున్నా నొప్పేనా ?

షాహుకారు. నీ వడ్డీ డబ్బుల కెవ్వడూ వాసి లేడు. రేపీపాటికి దస్తు తెస్తేనే తెచ్చావ్. లేకపోతే దావా పడేస్తా. తర్వాత నీ యిష్టం.

రైతు. కోర్టు కెక్కించాలని అంత ముచ్చటగా వుంటే యెక్కించవయ్యా !

షాహుకారు. ఒక్క కోర్టు కాదు; ఏటి కేసు పధ్నాలుగు కోర్టులూ తిప్పి నీ అంతు కనుక్కోక పోతానూ ? నీకు ఏ కమిషన్ దారు అడ్డుపడతాడో అదీ చూస్తాగా !

[విసురుగా వెళ్ళిపోతాడు. ఒక్క క్షణంపాటు రైతు, భార్య నిశ్శబ్దంగా వుంటారు.

భార్య. అరి ఊడి సిరి మంట ! ఎట్టాగైతేనేం పెట్టా డిప్పు !

రైతు. తనడిగినదానికి గింజలు పారబొయ్యలేదని వీడికెంత గుర్రొచ్చింది ! ఈ రెండు మూడేళ్ళనుంచి వీడికేం పనొచ్చినా మనం హాజరుగా నిలబడ్డామనే యిశ్వాసమైనా వుందేమో చూడు ?

భార్య. ఆడి దెవసం చేశారులే ! మొన్న మాసూళ్ళలో పాడి గొడ్డుకుద్దా తోలుకువెళ్లి కుప్పలు తొక్కించుకో లేదూ ? మాయదారికమ్మ యిరగబడి పోతుంది కాని. ఆడి డబ్బు ఆడి మొఖాన గిరగిర తిప్పికొట్టు. ఇం కెం తివ్వాలి ? మూ అయితే నూట యాభయ్యేగా ?

రైతు. కాదే ! వాడి మదత వడ్డీలతో చేరి, రెండువందలదాకా దేకుతుంది. పంటమ్మిన దంతా వాడి మొఖాన పెడితే, మిగతా చిల్లర మల్లర బాకీల మాటేమిటి ?

భార్య. ఊఁ ! అంతగా అయితే, పిల్ల దాని చేతిగాజులు కుదవ బెట్టుకుందాంలే.

రైతు. దాని కింకొక వస్తు వేదైనా యేర్పరచడం లేకపోగా, అవి కూడా కుదవబెట్టుకుని మొండిచేతుల్తో ఎలా నిలుపుతామే ?

భార్య. ఆఁ, ఇబ్బం దొచ్చినప్పుడు మరేం చేస్తా వేమిటి ? ఇప్పుడు అడ్డం వేసుకుని, అని అత్తారింటి కెళ్ళేనాటికి వొదిలించిద్దాం.

రైతు. సరే, ఏదో ఒక దారి చూద్దాంలే. వాడిది తాసుపాము పగ. మొత్తం బాకీ చెల్లుబెట్టకబోతే, వాడు కోర్టు కీడ్వక మానడు.

కొడుకు [ప్రవేశిస్తూ]. ఏమి టయ్యా ? కోర్టేమిటి ?

భార్య. ఆడి యెలుగు మంద ! వా దడిగిన కాడికి గింజ లివ్వ లేదని షాహుకారుకు పుస్సొచ్చింది. మొత్తం బాకీ యిప్పుడే కక్కమంటున్నాడు.

రైతు. రే పీపాటి కివ్వక పోతే దావా పడేస్తాట్ట.

భార్య. ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ల తాగిస్తాట్ట!

కొడుకు. ఎంత హాజం !

రైతు. డబ్బునుబట్టే హాజం.

భార్య. నడమంత్రంగా ఈనా డొచ్చాయిలే వీడికి నాలుగు డబ్బులు. చెడి బతకబట్టే కిందూ మీదూ కానడం లేదు.

కొడుకు. మరి ఇప్పు డేం చేస్తావే, అయ్యా ?

రైతు. తల తాకట్టు పెట్టయినా వాడి బాకీ తీర్మానం చెయ్యా ల్సిందేరా. కసి పట్టాడు. వా డిఖ నిలవడు.

కొడుకు. పీడ వొదుల్తుంది. వాడిది వాడికి పారెయ్యవే. మనకి ఎలాగైతే తనే అప్పెట్టాను గదా అని పెద్ద పాలేరులా నన్ను పనిలో నిలబెట్టుకుంటున్నాడు. తనింటి చాయల్లో కన బడితే చాలు—బులావ్ అని, ఆ పనీ, ఈ పనీ పురమాయిస్తు

న్నాడు. ఊడిగం చెయ్యడానికి వీడు మనకి ఉచ్చితార్థంగా యిచ్చా దేమిటి? అంత కంత పుచ్చుకోడూ?

[ఆవేశంతో మాట్లాడుతుంటేగా పైపంచె కొంగున కట్టినున్న మూట జారిపడుతుంది. దానిలోంచి మువ్వలు గణగణ మ్రోగుతాయి.

భార్య. మువ్వ లెక్కడివిరా?

కొడుకు. కంచర లింగయ్య పొద్దు పొడ్చి. సవిసిధిలో చేరా వేశాడే, అమ్మా! సీతన్న కొనుక్కుంటూ వుంటే నేనూ మన యెద్దకని సరిదాపటి తెచ్చుకున్నా. సరే...ఇప్పు డేం చేస్తాం? పాప సిచ్చేస్తా.

[మువ్వల మూట తీసుకుంటాడు.

రైతు. ఉంచుకోరా, అబ్బాయ్! ఉంచుకో! పద్దు రాసుకోమను. పైపంటనాటికి చెల్లిద్దాం.

కొడుకు. ఆఁ! వాటికి రొఖ్ఖం రావాలంటే! అరు విస్తే, చెట్టికి రెట్టి కట్టాలట. పైపంటనాటికే కొనుక్కుంటాలే. ఇప్పు డొచ్చిన తొందర రేమిటి?

[వెళ్ళిపోతాడు.

రైతు. శిస్తు కట్టావట్రా?

కొడుకు. ఆఁ! మర్చిపోయా? ఇదిగో రసీదు.

రైతు. ఎంత కట్టుకున్నారు?

కొడుకు. అణా తక్కువ యిరవై.

రైతు. అంతదాకా దేకించారూ ?

కొడుకు. ఆహాఁ ! పట్టాకి రూపాయికాడికి ఈ యేడు జమాబందీ మామూలు వసూలు చేస్తున్నారట ! తిన్నకొద్దీ వాళ్ళకు ఆకలెక్కువౌతున్నది !

భార్య. తిననీ? ఇంకా తిననీ! ఇలా పీక్కు తిన్నాళ్ళు ముందుకు రారులే !

రైతు [కదలి వెడుతున్న కొడుకుతో]. ఆ కంచర లింగయ్యకి పైపంటనాటికే యివ్వొచ్చులే. అప్పటికి వాడడిగిందే పారేద్దాం. ఈ భాగ్యానికి మళ్ళీ వాపసు దేనికి ? ఎవడు తినవలసింది వాడు తింటాడు. ఇంతతో వాడు బాగుపడతాడా ? ఇంతకంటె మనం చెడిపోతామా ?

కొడుకు. మువ్వలు లేకపోతే, ఇప్పుడు మన కొచ్చిన ముప్పేమిటి ?—తర్వాతే కొనుక్కుంటా. అప్పుచేసి పప్పుకూడు దేనికి ? అప్పు పెట్టిన కాడినుంచీ అడ్డమైన వాడూ అములు చేస్తాడు.

[వెళ్ళిపోతాడు.

భార్య. పిచ్చి తండ్రి ! మూడేళ్ళనుంచి మువ్వలు మువ్వలని ముచ్చట పడుతుంటే, ఈనాటికైనా ఒక దారి లేకపాయె ! తప్పుకోవడం, పూడ్చుకోవడం—ఇదే సరిపోతున్నది.

రైతు. ఆ దేవుడు చల్లగా చూస్తే పైపంటతో మన చిక్కులన్నీ తీరిపోతాయి లేవే !

భార్య. దేవుడికేఁ ! వాడు చల్లగానే చూస్తున్నాడు. మనుషులే పీక్కు తింటున్నారు !

రైతు. ఆఁ! మంచి రోజు ఎప్పటికైనా కనబడక పోతుందటే, అన్నట్టు, అబ్బాయి పుగాకు తేనే లేదు. మర్చిపోయాను కాబోలు.

భార్య. తేకపోతే ఇప్పు డేమి మునిగిపోలేదులే!

రైతు. నీదంతా మర్రతనం కాని, నే నడిగేది ఆపుగాకు కాని. అర్ధణా పుగాకే కాదటే?

భార్య. ఆ కానీ, అర్ధణా తేకేగా ఈ తిప్పలన్నీ! ఆ డబ్బులు పెడితే ఇంత కూరో నారో రాదూ? పూట పూటా పచ్చడి మెతుకులు దేనికి?

రైతు. సర్లే! చుట్ట కాల్చడం మానేస్తాను.

భార్య. మానాలని నీకు లేనప్పుడు నాకోసం మానెయ్యడ మెందుకు?

రైతు. అ దేమైనా గాని, ఇక చుట్ట ముట్టను!

భార్య [చిరునవ్వుతో]. ఆఁ! ఈ మురిపె మెన్ని రోజులులే! కూడైనా లేకపోతే సువ్వుంటావు గాని, చుట్టముక్క లేక పోతే బతగ్గలవూ? కాల్చితే కాల్చు: కాని, కాస్త తగ్గించి కాల్చు. ఇంటికీ, ఒంటికీ మంచిది.

కూతురు [నల్లపూసల గొలుసుతో హుటాహుటిగా ప్రవేశిస్తూ].
చూడవేఁ! అయ్యా! ఎంత నదరుగా వుందో!

రైతు [నీరసంగా]. ఔ నమ్మా! బాగానే వుంది.

కూతురు. ఈ బిళ్ళ చూడవే! కొట్టొస్తున్నట్టుగా లేదూ!

రైతు. ఔ నమ్మా!

కూతురు [గొలుసు మెడలో పెట్టుకుంటూ]. అయ్యా! నా కిది బాగుందా ?

రైతు [నీరసంగానే]. భేషగ్గా వుంది.

కూతురు. బాగుండ లేదా యేమిటి ?—గట్టిగా చెప్పడం లేదు.

రైతు. బాగుండ కే మమ్మా ? బాగానే వుంది.

కూతురు [అద్దం తెచ్చుకుని చూచుకుంటూ]. మరి కాస్త బారుం డొద్దూ? లేకపోతే బిగు తనిపిస్తుందేమో ?

భార్య. బిగుతూ, వొదులూ ఆ తర్వాత చూచుకోవచ్చులేవే.

కూతురు [తల్లి మాట వినిపించుకోకుండా]. ఇంకొక అంగుళ మైనా వుండాలి. అయితే, అప్పుడు తీగ మరీ పల్చనై పోదూ ? మరి పది చిన్నాలైనా పెట్టందే ఈ పాటి మందం రాదు.

భార్య. ఓపికుంటే ఎన్ని చిన్నాలైనా పెట్టుకోవచ్చు.

కూతురు. అయితే, నాకు తెల్లరా ళ్ళొద్దు; ఎర్ర రాళ్ళు కావాలి.

భార్య. ఏ రాళ్ళకైనా, ఇప్పుడు డబ్బే దమ్మా ?

కూతురు. ఉఁ! నువ్వు చెప్పొచ్చావ్‌లే మాలావ్! నాకు గొలు సొద్దుగాని, నీకు కొత్త కోకలు కావాలేఁ ?

భార్య. ఈ యేటికి నా కిఖ కొత్త కోకలుకూడానా ? జీరలో, బారలో ఆ పాతగుడ్డలే గతి.

రైతు [కూతురుతో]. ఇంత వెర్రిబాగులదాని వే మమ్మా! నీకు లేకుండా మీ అమ్మ తనకి కావా లంటుందా ? నామాట విను. పైపంటనాటికి....

కూతురు. అయితే, ఇందాక నే నడిగితే....

రైతు. ఔను! ఈ పంటలోనే చేయిస్తా నన్నాగాని, షాహుకారు తొందర చేస్తున్నాడు—వాడి బాకీ నిలపడానికి వీల్లేదు.

భార్య. అది తీర్చినా ఇంకా లేవూ తలమోపి తప్పులు?

కూతురు [తండ్రితో]. అయితే, నాకు లకాళ్ళ ఎందుకు పెట్టా వేమిటి?

రైతు. నాకు మాత్ర మేం తెలుసు నమ్మా, వా డిప్పుడు గొంతు మీద కూర్చుంటాడని? మా తల్లివి కావూ? నా మాట విను, తప్పకుండా పైపంటలో నీకు....

కూతురు. నా కేమీ వొద్దులే!

భార్య. దారి లేనప్పుడు మరి ఆయన మాత్రం ఏం చేస్తాడే?

కూతురు. వా ళ్ళంద రిప్పుడు నన్ను చూచి నవ్వుతారు. గొలుసు చేయించుకుంటున్నానని — సిగ్గు చేటు — అందరికీ చెప్పొచ్చా.

రైతు. లేదమ్మా! నత్తె ప్రమాణంగా నీకు పైపంటలో...

కూతురు. ఆఁ! అన్నీ చేయిస్తావులే! నిరుడు మానానికి నిరు డిలాగే అనలా?

[చేతిలోని అద్దం అక్కడే పారవేసి, కోపంగా విర చర వసారాలోనికి వెళ్ళిపోతుంది.

రైతు. పిచ్చి నన్నాసి! గంపెడాస పెట్టుకున్నదేమో పెద్ద కోప మొచ్చింది. ఏమైనా పైపంటనాటికైనా దాని ముద్దు తీర్చాలి.

భార్య [నిట్టూరుస్తూ]. పైపంట.... పైపంట.... పైపంట........, ఎక్కడిదీ పైపంట ? కళ్ళన్నీ దానిమీద పెట్టుకోవడమే కాని, అది నోటిదాకా వొస్తేనా ? కాకులు, గద్దలు తన్నుకు పోయి నట్టు చేతిలోదాన్ని చేతిలోనుంచే తన్నుకు పోతా రయ్యో ! పండించేపరకే పంట మనది.

రైతు. ఏమైనా, లే దనుకోగూడదే ! రోగం రొష్టూ లేకుండా రెక్కాడుతూ వుంటే, బండిని ఎట్టాగో దొర్లించుకు పోలేక పోతామా ?

[రైతు ఈ మాటలు అంటుండగా "ఎందుకైనా వుంచినావూ బందిఖానాలో" అని పాడు కుంటూ తలవాకిలిలోకి బిచ్చగాడు వస్తాడు.

భార్య. చెయ్యి ఊరితే లేదు. పో ! పో !

రైతు. దేహీ అంటూ వాకిట్లోకి వచ్చినవాణ్ణి కసిరి కొట్టగూడదే! ఏదీ! లే! బద్ధకించ బోకు. నాలుగు గింజ లేసిరా !

భార్య. ఆడి కేం తీపరం ? మొద్దులా వున్నాడు. కూలీ నాలీ చేసుకో లేడూ ? అడుక్కోడం దేనికి ?

రైతు. అది వాడి ఖర్మ ! దానికి మన మేం చేస్తాం ? పిడికెడు బియ్యం పెట్టి పంపించు.

భార్య. దబ్బా సోలెడు బేడ కమ్ముతున్నారు. వొచ్చినవాడికల్లా పిడికెడు కాడికి పెడితే, రోజుకు మానెడైనా చాలవ్.

# ప్రారబ్ధం

[విషాదాంత నాటిక]

## పాత్రలు

లక్ష్మయ్య : పల్లెటూరి రైతు

మాణిక్యమ్మ : అతని భార్య

కృష్ణమూర్తి : అతని కుమారుడు

కమల : అతని కుమార్తె

డాక్టరు

బండివాడు

## స్థలం

లక్ష్మయ్యగారి యింటి చావడి

## కాలం

వర్తమానం



# ప్రారబ్ధం

లక్ష్మయ్య యింటిచావడి. కుడివైపున సింహద్వారం; ఎడమవైపున పెరటిగుమ్మం. ఎదుటి గోడనడుమ ఒక అలమర. దాని కుడిపక్క పడమటింటి గుమ్మం; ఎడమపక్క పడకగది గుమ్మం.

గోడలకు శ్రీరాముడు, గోపాలకృష్ణుడు, తిరుపతి వెంకటేశ్వర్లు, లంకాదహనం మొదలైన పటాలు. ఒక పటంపైన దాని మేకుకే తగిలించి ఒక విసనకర్ర వ్రేలాడుతూ వుంటుంది.

చావడిలో ఒక మూల గడమంచి; దానిమీద తవుడు, ఉలవల బస్తాలు.

తెర లేచేసరికి లక్ష్మయ్య చావడిమధ్య కూర్చుని వుంటాడు. అతని వయస్సు నలభై అయిదుపైన, యాభైలోపు. అయిదుంబావు అడుగుల మించని యెత్తు. స్థూలకాయుడు కాదు గాని, పొట్టనిబట్టి గుమ్మంటంలా కనబడతాడు. చిన్న బొర్ర. జులపాల జుట్టు, వెనుకముడి. క్షురకర్మకు శుభముహూర్తం ఒకపట్టాన కుదరదు గనుక, సామాన్యంగా మాసిన గడ్డంతోనే వుంటాడు. నీర్కావి ధోవతి కట్టి, భుజంపైన తడి అంగవస్త్రం వేసుకుని వుంటాడు.

తెర లేచేసరికి అతడు పంగనామాలు పెట్టుకోవడం పూర్తిచేస్తూ వుంటాడు. అతని ముందు బొట్టుపెట్టె, నీళ్ళచెంబు. బొట్టుపెట్టెచుట్టూ అద్దం, నామకడ్డి, తిరుచూర్ణం కాయ, బొట్టుకణిక వగైరా.

లక్ష్మయ్య [కళ్లు మూసుకుని, చేతులు జోడించి]. పరమాత్మా! పరమపావనా! పరమకల్యాణ గుణాభిరామా! పాపహరణా! పుండరీకవరదా! భక్తవత్సలా! భవబంధవిమోచనా! పుండరీక నయనా! భుజగేంద్రశయనా! కరుణాకరా! కామితార్థప్రదా! నందకుమారా! నవనీతచోరా! ఇందిరారమణా! ఇభరాజ గమనా! సుందరాకారా! మందరోద్ధారా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! ఆదిమధ్యాంతరహితా! అప్రమేయా! ఆనందరూపా! అనాథరక్షకా! కవిలోకరంజనా! కాళింగగర్వ భంజనా! సదానందా! సచ్చిదానందా! ముకుందా! గోవిందా! గజరాజవరదా! గరుడధ్వజా! దానవమర్దనా! జనార్దనా! ధర్మవర్ధనా! దీనజనశరణ్యా!

[మాణిక్యమ్మ గది గుమ్మంలోకి వస్తుంది. [illegible] ప్రాంతాల. అచ్చ[illegible], పట్టు[illegible]. [illegible] సుఖం వచ్చినా ఓపలేదు.

మాణిక్యమ్మ [గదిగుమ్మంలో నుంచి]. ఇంకా ఏం జపతపాలు కానేలే దండీ ?

లక్ష్మయ్య [వినుపించుకోకుండా]. గోవర్ధనోద్ధరణా! గోపికా వస్త్రాపహరణా! మునిజనవందితా! ముచికుందవందితా! ముక్తిప్రదాయకా! మురళీగానవినోదా! కనకమయవసనా! కంసవిధ్వంసనా! రాధామనోహరా! రాకేందువదనా! నీల మేఘశ్యామా! నిర్మలనామా!

మాణిక్యమ్మ [గదిగుమ్మంలో నుంచే]. మీకు పుణ్యం వుంటుంది! ఇవ్వాళైనా కాస్త తొరగా తెములుద్దురూ!

లక్ష్మయ్య [బిగ్గరగా]. సర్వేశ్వరా! సర్వతోముఖా! సర్వలోక పూజితా! సత్యసంకల్పా! సత్యపరాయణా! సత్యజనకా! సత్యనిలయా! సత్యాశ్రయా! సత్యనేత్రా! సత్యసంధా! సుజన ప్రియా! శాంతస్వభావా!

మాణిక్యమ్మ [గుమ్మం దాటివచ్చి]. ఏమండీ! మిమ్మల్నే!

లక్ష్మయ్య [మరింత బిగ్గరగా]. అర్జునసఖా! అభిమానరహితా! పాండవపక్షా! ద్రౌపదీ మానసంరక్షకా! దేవకీనందనా! యశోదా నందవర్ధనా! అనంతా! అచ్యుతా! అవాఙ్మానసగోచరా! అమోఘశాసనా! నరకాంతకా!

మాణిక్యమ్మ [రెండడుగులు ముందుకు వచ్చి]. అబ్బబ్బ! ఇక్కడ దీని ప్రాణంమీది కొస్తున్నా, మీ గోడు మీదే గదా!

లక్ష్మయ్య [కోపం సూచిస్తూ]. పరమేశ్వరా! నిర్గుణా! నిష్కళంకా! నిరుపద్రవా! నిరంజనా! నిరింద్రియా! నిర్వికల్పా! నిరాకారా! నిర్వికారా! పరమపురుషా!

మాణిక్యమ్మ [మరింత దగ్గరికి వచ్చి]. మీకు చెముడేమైనా వొచ్చిందా?

లక్ష్మయ్య [పొలికేకలు వేస్తున్నట్టు]. పరంజ్యోతిస్స్వరూపా! పరంధామా! పురుషోత్తమా! పుణ్యస్వరూపా! పుణ్యనిలయా! పుణ్యభావనా! దేవదేవోత్తమా! దేవతాసార్వభౌమా!

మాణిక్యమ్మ [నెత్తి కొట్టుకుంటూ]. నా ఖర్మిది!

లక్ష్మయ్య. స్వయంప్రకాశా! పరతత్త్వదీపా! పరిపూర్ణా! జ్ఞాన ప్రదా! యోగీశ్వరేశ్వరా! కుచేలవరదా! గుప్తవర్తనా! విశ్వ

నేత్రా! విమలచరిత్రా! హరేకృష్ణ! హరేకృష్ణ! పాహిమాం! పాహిమాం! పాహి! [ముమ్మారు నమస్కరించిన మీదట కళ్లు తెరచి] ఎందు కలా గొడ్డులా అరుస్తున్నావ్?

మాణిక్యమ్మ. గొడ్డులా అరిస్తేనే? కాకిలా గోల పెడితేనే? మీ తంతు మీరు మానారు గనుకనా? ఇలా ఒకసారి వొచ్చి అమ్మాయిని చూడండి. మరీ మైరాస పడుతున్నది.

లక్ష్మయ్య. ఇవ్వాళ అమావాస్య కదూ! మరి వెలా వుంటుంది? శేషాచార్యులుగారిచ్చిన మాత్ర వెయ్యలా?

మాణిక్యమ్మ. ఏం మాత్రో-నా పిండాకూడు! అ వేసిన కాడినుంచి ఎగశ్వాస ఎక్కువైంది. కాస్త వెళ్ళి, డాక్టర్ గార్ని పిలుచు కొద్దురూ?

లక్ష్మయ్య. సదమంత్రంగా పెడతాడులే. మన కొరక డాక్టరు! మామానాడు ఈః డాక్టర్లే వైద్యాలు చేశారేమిటి?

మాణిక్యమ్మ. ఎడ్డె మంటే తెడ్డెం. మనకి మొదట్నుంచీ వున్న దేగా!—ఇవ్వాళ కొత్తేమిటి?

లక్ష్మయ్య. చాల్లే! ఇక కట్టిపెట్టు. డాక్టరట డాక్టరు! ఆ బొట్టా డని వాడికి తూర్పు పడమరలైనా తిన్నగా తెలుసా? హాటూ బూటూ వేసుకుని, మెడలో ఇంత బారు గొట్టం మొకటి తగి లించుకుని, బొట్లరు ముక్కలు నాలుగు మాట్లాడే సరికే పెద్ద వైద్యుడై పోతాడూ? దాని కెంత శాస్త్రం తెలియాలి! ఎంత అనుభవం వుండాలి! బుద్ధిలేని వాళ్ళందరు "డాక్టరు, డాక్ట" రంటూ వాడికోసం యెగబడు తున్నారని నే నెగబడతానా?

మాణిక్యమ్మ. అంతే లెండి! ఎప్పుడు మీరు నా మాట సాగనిచ్చారు కాబట్టి, ఇప్పుడు సాగనిస్తారు? అబ్బాయొస్తే వాడైనా....

లక్ష్మయ్య [అద్దాన్ని అంగవస్త్రంతో తుడిచి, బొట్టుపెట్టెలో పెడుతూ]. వాడొచ్చి రోగాన్ని గిల్లేస్తాడేమిటి? ఎవరొచ్చినా చేసేదేమీ లేదు. ఎవరి ప్రారబ్ధాన్ని ఎవరు తప్పిస్తారు?

మాణిక్యమ్మ. ఎప్పటికప్పుడు ఈ మెట్ట వేదాంతమే నా కొంప తీస్తున్నది.

[విసురుగా గదిలోకి నడుస్తుంది.

లక్ష్మయ్య [వెనకనుంచి]. చాల్లే నోరు ముయ్! [బొట్టుపెట్టె సర్దడం పూర్తిచేసి] కమలం! [క్షణం ఆగి బిగ్గరగా] కమలం [ఇంకొక క్షణం ఆగి, మరింత బిగ్గరగా] కమలం!!

మాణిక్యమ్మ [గది గుమ్మంలోకి వచ్చి]. దేనికండీ అలా కేకలు? అది పెరట్లోకి వెళ్ళింది కామాలు! ఏం కావాలి?

లక్ష్మయ్య [కోపంగా]. ఏమీ వొద్దులే.

మాణిక్యమ్మ. మీకు పున్నెం వుంటుంది! కేకలూ, బొబ్బలూ సాలించండి. ఇక్కడిది తుళ్ళి పడుతున్నది.

[మాణిక్యమ్మ గదిలోకి నడుస్తుంది. లక్ష్మయ్య బొట్టు పెట్టె అలమరలో పెట్టి వెనక్కు తిరుగుతూవుండగా కృష్ణమూర్తి వస్తాడు. వయస్సు 25 సంవత్సరాలు. ఆకారంలో తండ్రిని, స్వభావంలో తల్లిని పోలినవాడు. బి. ఏ. ప్యాసై బస్తీలో వుద్యోగం చేస్తున్నాడు. పైన పంచె, కాలరు షర్టు, డబుల్ బ్రెస్ట్ కోటు.

కృష్ణమూర్తి. నాన్నా! అమ్మాయి కెలా వుంది?

లక్ష్మయ్య. చూస్తూ చూస్తూ అమావాస్యపూటొచ్చావేమిరా! రేపో, మాపో రాకపోయావా?

కృష్ణమూర్తి. అమ్మాయి కెలా వుంది, నాన్నా?

లక్ష్మయ్య. అమావాస్య కదూ? కొంచెం బరువుగానే వుంది.

మాణిక్యమ్మ [గదిలోనుంచి హుటాహుటిగా వచ్చి]. ఏం చెప్పను రా బాబూ!—దాని మాట? ఒంటల ఘోరం. మూసిన కన్ను తెరవడం లేదు. ఏమి నొప్పో. ఎక్కడ నొప్పో? "అః! అః!" అన్న నోటికి యిసుగే లేదు. యమ చెర యెళ్ళబోస్తున్నది.

కృష్ణమూర్తి [తన సూట్ కేస్, హోల్డాల్ లోపలికి తెచ్చిపెట్టిన బండివానికి బాడుగ యిచ్చి పంపివేస్తూ]. మరి డాక్టరుగారే మన్నారు?

మాణిక్యమ్మ. అసలు ఆయన్ని పిల్చుకొస్తేగా?

కృష్ణమూర్తి. లక్షణంగానే వుంది. అయితే వైద్య మెవరు?

లక్ష్మయ్య. శేషాచార్యులుగారు మందు వాడుతున్నారు. ఆయన హస్తవాసి మంచిది.

కృష్ణమూర్తి. వాకిట్లో డాక్టరుంటే ఈ కూరగాయ వైద్యాలు దేనికి? [తల్లితో] జానకి ఎక్కడమ్మా?

మాణిక్యమ్మ. ఇదిగో రా, బాబూ! ఈ గదిలో.

[మాణిక్యమ్మ గదిలోకి దారి తీస్తుంది. కృష్ణమూర్తి అనుసరిస్తాడు. బొట్టు పెట్టుకోడానికి తా నుపయోగించిన

నీళ్ళచెంబును లక్ష్మయ్య అందుకోబోతూ వుండగా కమల ప్రవేశిస్తుంది. ఆ పిల్ల చురుకైనది. ప్రతి విషయాన్నీ ఇట్టే ఆకళింపు చేసుకోగలదు. కాని, తేలికగా బయటపడదు. అన్న అంటేనూ, అక్క అంటేనూ చాలా ప్రేమ. బాల్యం పూర్తిగా వెళ్ళని, యవ్వనం పూర్తిగా రాని వయస్సు. తనకంటె పెద్దవారితో ఎక్కువ చనువుగానూ వుండలేదు; పూర్తిగా పైదొలగీ వుండలేదు.

కమల. నన్ను కే కేసి నట్టున్నావ్, నాన్నా!

లక్ష్మయ్య. ఔ నమ్మా!

కమల. దేనికి?

లక్ష్మయ్య. ఆఁ! ప రేమీ లేదులే........మీ అన్నయ్య వొచ్చాడమ్మా!

కమల. ఏడీ?

లక్ష్మయ్య. అదుగో! అక్కయ్యదగ్గ రున్నాడు.

కమల. వదినకూడా వచ్చిందా?

లక్ష్మయ్య. లేదమ్మా!

కమల. ఏమో?

లక్ష్మయ్య, రాసూ పోనూ రైలుఖర్చులు దండగ. మీ వదిన కూడా ఎందు కిప్పుడు?

కమల. వదిన్ని చూచి చాలా రోజు లైంది. వెంటపెట్టుకొస్తాడేమో ననుకున్నా. పోనీ, బేబీనైనా తీసుకొచ్చాడా?

లక్ష్మయ్య. ఆఁ ! వాళ్ళమ్మని వొదలిపెట్టి అది వుంటుందా. పెడు తుందా ? సరే గాని. శాస్త్రి ! ఈ బొట్టునీళ్లు తులసికోటలో పోసిరా !

[చెంబు అందిస్తాడు. దాన్ని అందుకొని సీసుల్లో పోస్తుంది.

కృష్ణమూర్తి [ముఖం చిట్లిస్తూ చావడిలోకి వచ్చి]. అదేమి టమ్మా ! ఆ గది అంత చెడ్డ కంపు కొడుతున్నది !

మాణిక్యమ్మ [వెనకనే వొస్తూ]. అక్కడికీ ముప్పొద్దులా సాంబ్రాణి పొగ వేస్తూనే వున్నారా, బాబూ !

కృష్ణమూర్తి. దాన్ని చీకటి కొట్టులా చెయ్యకపోతే. శాస్త్రి గారి వెలుతురూ రానివ్వరాద టమ్మా ?

మాణిక్యమ్మ. మంటల జొరంతో వున్నదానికి చల్లగాలి తగిల్తే శీతలం కమ్ముకు రా దట్రా !

కృష్ణమూర్తి. నీకు తెలియదులే అమ్మా ! మంచి వాళ్ళకైనా ఆ గబ్బుకు తప్పకుండా జబ్బు చేస్తుంది. అమ్మాయి పడక పెట్టి ఎన్ని రోజు లైంది ?

[అన్నయ్యను చూచి మాణిక్యాంబ గారి ... పరుగెత్తు వచ్చి పదమూడేండ్ల సుబ్బులు ...

మాణిక్యమ్మ. రేపటికి సరిగా వారం. మూసిన కన్ను తెరవకుండా పడున్న నా తల్లిని నాల్గురోజులనాడు జల్లకం వెక్కించి. మీ బావ తగిలేశాడురా, బాబూ !

కృష్ణమూర్తి. వాడు మనిషా ? పశువా ?

లక్ష్మయ్య. వాడినని లాభ మేమిటిలే ? అది మన ప్రారబ్ధం.

మాణిక్యమ్మ. దిక్కూ మొక్కూ లేకుండా ఎర్రటి ఎండని పడొచ్చిం దేమో, రోగం నెత్తి కెక్కిపోయింది రా, బాబూ! ఇప్పుడు దానికి మన సోరకమే లేదు. మా తల్లి మాలోకంలో వుంది.

లక్ష్మయ్య. ఇంతకూ పెద్దమ్మ వచ్చి నెత్తిని కూర్చుంది!

కృష్ణమూర్తి [తల్లితో]. జానకి పిచ్చిమాట లాడుతున్నది, ఎప్పటి నుంచి?

[తనను అన్నయ్య గమనించక పోవడాన్ని చూచి, ముఖం కొంచెం చిన్నబుచ్చుకుని, కమల లోపలికి వెళ్ళి పోతుంది.

మాణిక్యమ్మ. మొన్నటి నుంచీరా, బాబూ! అ దేమిటో కాని "నేనీ నింద మొయ్యలే" నంటూ ఒక్కటే పాట. కొట్టుకుని కొట్టుకుని కాసేపు కన్ను మూసినా అదే కలవరింత! ఏమి గాలో దూలో నని అక్కడికీ దిగదుడుపులూ, అవీ తీయిస్తూనే వున్నా. ఏడు కొండలవాడికి ముడుపుకూడా కట్టా. "ఈ గండ మెలాగైనా గడిపి, నా తల్లిని వొడ్డుని పడేశా వంటే నీకొండ కొచ్చి, నిలువు దోపి డిప్పిస్తా—వెంకటేశ్వర్లు తండ్రీ!" అని దణ్ణం పెట్టుకున్నా. మరి ఆ సామి దయ ఎలా వుందో!

కృష్ణమూర్తి. ఇంత ఉద్ధృతంగా వుందని ఆ వుత్తరంలో రాస్తే నిన్నే ఆఫీసుకు సెలవుపెట్టి వచ్చేవాణ్ణిగా!

లక్ష్మయ్య. నువ్వు ఆదుర్దా పడతావని రాయలేదులే. ఇంతకూ దాని రోజులు బాగా లేవు. ఎంత రాసిపెట్టి వుందో, అంతా అనుభవించి తీరాలి.

మాణిక్యమ్మ. డాక్టరుగార్ని పిలుచుకు రమ్మని నేను మొన్నటి నుంచీ మొత్తుకుంటూ వుంటే మీనాన్న ఊఁ మెట్ట వేదాంతమే....

లక్ష్మయ్య. అదుగో! ఆ మాట అనొద్దనే నీనోటి గట్టి పెట్టేది.

మాణిక్యమ్మ [కొడుకుతో]. చూశావా! బాబూ! ఇదీ వరస! నేను అటు దాని పని చూడలేక, ఇటు ఈయన పోరలు పడలేక ఛస్తున్నా నంటే నమ్ము.

కృష్ణమూర్తి. సర్లే! అమ్మా! నే వెళ్ళి డాక్టరుగార్ని పిలుచుకొస్తా గాని, నువ్వు ఆ గది కిటికీలు రెండూ తెరిచి, సాంబ్రాణి పొగ వెయ్యి.

లక్ష్మయ్య. శేషాచార్యులుగారు తక్కువవాడట్రా? ఆయన తండ్రి వైద్యుడు: తాత వైద్యుడు: ముత్తాత వైద్యుడు: వాళ్ళది వైద్యులవంశం. వాళ్ళ యింటవున్న లేహ్యాలు, గుళికలు, రస భస్మాదులు సామాన్యమైన వట్రా? ఆమధ్య నాకు కాళ్ళతీపు పుడితే, ఆయ నిచ్చిన కూష్మాండలేహ్యం వెంటనే గుణ మిచ్చింది.

కృష్ణమూర్తి. ఒకసారి డాక్టరుగార్ని పిలుచుకొచ్చి చూపించడం ఎందుకైనా మంచిది కాదూ, నాన్నా?

లక్ష్మయ్య. ఆఁ! మ రేమి లేదట్రా! అసలు దాన్ని నిక్కాకి వాళ్ళు. దానిమీద పైత్యం ప్రకోపించిందట. నాడీ నిదానంలో ఆయన చాలా గట్టివాడు. క్షణంలో ఏ జబ్బునైనా ఇట్టే కనిపెడుతాడు. మందు నడిపించడంలో ఆయన్ని మించిన వాడు లేడు. డాక్టర్లు వచ్చినకాడినుంచి సూదులనీ, సీసాలనీ

ఎంత తతంగం చేస్తారు! ఎంత డబ్బు గుంజుతారు! పిలుచుకు రాగానే సరేనా? ఇంతకూ రోగమైనా, నొప్పైనా దాని రోజొచ్చినప్పుడు తిరుగుతుంది కాని....

మాణిక్యమ్మ. మళ్ళీ మొదలు.

లక్ష్మయ్య. ఏమి టది?

మాణిక్యమ్మ. నానోట చెప్పించడం దేనికి? మీకు తెలవమూ?

లక్ష్మయ్య. అదుగో! ఆకూత కుయ్యొవద్దనే నీకు బుద్ధి చెప్పేది.

మాణిక్యమ్మ. చూశా వట్రా! ఇప్పుడు నే నేమన్నానని? సర్లే— ఇది నాకు రోజూ వుండే బాగోతమే కాని, నువ్వెళ్ళి డాక్టరు గార్ని పిలుచుకురా! ఇక్కడున్నట్టుగా రావాలి, బాబూ!

కృష్ణమూర్తి. మంచి దమ్మా!

[వెళతాడు.

లక్ష్మయ్య [గింజుకుంటూ]. మనం దొరలమా? దొరసానులమా? ఇంగ్లీషు వైద్యాలు మనకు దేనికి? అసలు ఆ పాడుమందులు మనకి పట్టివ్వవు. [క్షణం ఆగి] ఇంతకూ పిదప కాలం వచ్చి పడింది. మన మందులూ, మన వైద్యాలూ, మన ఆచారాలూ, మన కట్టుబాట్లూ—ఏవీ పనికి రావడం లేదు. [గోడనున్న విసనకర్ర తీసి విసురుకుంటూ] పెద్ద లన్నారుగా "కొత్తొక వింత, పాతొక రోత" అని. మంచీ చెడ్డా లేదు. కొత్త కనబడ్తే చాలు.—వేలంవెర్రిగా యెగబడ్డమే! మన మతం, మన ఆచారాలు, మన సంప్రదాయాలు ఇప్పుడు పుట్టాయా?—భూమి పుట్టినప్పుడే పుట్టాయి కాని!

[లక్ష్మయ్య ఈ మాటలు అంటూవుండగా మాణిక్యమ్మ నమస్కా— మాటికి విడిచి గదిలోకి వెళ్ళి, కిటికీ తలుపులు తోసి, నుశ్శి వాకిట్లోకి వస్తుంది.

మాణిక్యమ్మ [వడమటింటి గుమ్మంవద్దకు వెళ్ళి]. కమలం! కాస్త నిప్పు తేవే!

లక్ష్మయ్య [ఇంకా గుణుస్తూ]. అయినా మనిషికి రాక. మాను కొస్తుందా? రాత బాగుండక రోగం రొష్టూ వస్తే పూర్వం రెండు లంఖణాలు కట్టించేవారు. దాంతో ఎంత జబ్బయినా ఎగిరిపోయేది. ఇప్పుడేముంది? ముక్కున పడిశం పట్టినా, డాక్టర్లు గీక్టర్లు కట్టకట్టుకు రావాల్సిందే! అంత కంత గుంజ దానికి వాళ్ళసలు రోగాన్ని ఎక్కదోస్తారు.

[“నే చెప్పేదాంతా వింటున్నావా” అన్నట్టుగా మాణిక్యమ్మ వాలుగా చూసేలా నిలుస్తుంది.

లక్ష్మయ్య. ఆయుషు గట్టిదైతే మునిగే వైద్యైనా తేల్తుంది. మాయలో పడి. మందులనీ. మాకులనీ మన పీకులాటే కాని. లలాటలిఖితం తప్పదు.

[కినుకగా నుశ్శి పట్టం తీసుకొని గదిలోకి, అయ్యవారిలో నుంచి నల్లమందు పెట్టి తీసి, మాత్ర సిద్ధపరుస్తూ నుంటాడు.

కమల [గరిటెతో నిప్పు తెచ్చి]. ఇదుగో నమ్మా! నిప్పు!

మాణిక్యమ్మ. ఇలా తే, తల్లీ! [నిప్పుగరిటె అందుకుని] ఇంకా నీవంట చెపల్లేదమ్మా?

కమల. అన్నయ్య కోసమని ఇంకొక కూర చేస్తున్నానమ్మా!

మాణిక్యమ్మ. బండెడు చాకిరి పైబడి, ఇప్పటికే హూనంహూన మౌతున్నావ్. నువ్వు చెయ్యలేదని మీ అన్నయ్య అనుకుంటాడా? దేని కమ్మా, ఇప్పుడు కూరలూ నారలూ?

కమల. ఆఁ! మరేమీ లేదే! వంకాయవేపుడు వేస్తున్నా. చిటికలో అయిపోతుంది.

[మాణిక్యమ్మ గదిలోకి వెడుతుంది.

లక్ష్మయ్య [కమలతో]. నాకు నల్లమందు వేళ మించిపోతున్నది. రెండు మెతుకులు వడ్డిస్తావమ్మా?

కమల. అలాగే, నాన్నా! కాళ్ళు కడుక్కురా!

[కమల పడమటింటిలోకి వెడుతుంది.

లక్ష్మయ్య [నల్లమందు డబ్బీని అలమరలో పెట్టి, కట్టినమాత్ర వేసుకుని]. హరేకృష్ణ! హరేకృష్ణ! పాహిమాం! పాహిమాం! పాహి!

[పడమటింటిలోకి వెళ్ళబోతాడు.

మాణిక్యమ్మ [గదిలోనుంచి వచ్చి]. కాస్త ఆగుదురూ! భోజనానికి అంత తొందరేమిటి? [తలవాకిలివైపు చూచి] అదుగో! డాక్టరుగారొస్తున్నారు.

[గదిలోకి వెడుతుంది.

లక్ష్మయ్య. ఉహూఁ! తయారవుతున్నాడూ?

[డాక్టరు, కృష్ణమూర్తి గదిలోకి వెడతారు. లక్ష్మయ్య ధుమధుమలాడుతున్న ముఖంతో చావడిలో పచారు చేస్తుంటాడు.

కృష్ణమూర్తి [గదిలోనుంచి తిరిగి వచ్చి. వడమటింటి గుమ్మం వద్దకు వెళ్ళి]. కమలా! గ్లాసుతో కాసిని నీళ్ళు తీసుకురా! [క్షణం ఆగి] త్వరగా రా!

కమల [లోపలనుంచి]. వచ్చే! అన్నయ్యా! వచ్చే!

కృష్ణమూర్తి [ఇంకొక క్షణం తర్వాత, కొంచెం విసుగ్గా]. త్వరగా తెమ్మని నీకా చెప్పడం....

[అలాగని మాట పూర్తి కాకుండానే కమల నీళ్ళ గ్లాసుతో వస్తుంది. దాన్ని అందుకొని కృష్ణమూర్తి గదిలోకి వెడతాడు. కమల గదిగుమ్మందగ్గర నిల్చి, [illegible] నిలబడి లోపలికి చూస్తూ [illegible].

కృష్ణమూర్తి [గదిగుమ్మంలోకి వచ్చి కమలతో]. డాక్టరుగారు చేతులు కడుక్కోడానికి పెరటిగుమ్మంలో చెంబుతో నీళ్ళు. సబ్బు పెట్టు; తువాలుకూడా తే!

కమల [వెడుతూ]. అలాగే అన్నయ్యా!

కృష్ణమూర్తి తిరిగి గదిలోకి వెడతాడు. కమల [illegible] గుమ్మంలో నీళ్లు పెట్టి వెళ్ళి, [illegible] గదిలో నుంచి డాక్టరు బయటికి వస్తాడు. అతని మొహం చూడ గానే ఆ పిల్ల [illegible] గదిలోకి [illegible] ఉంటుంది. డాక్టరు [illegible] కృష్ణమూర్తి [illegible] లోకి దారితీస్తాడు.

కమల [వడమటింటి గుమ్మంలోకి వచ్చి]. అన్నయ్యా! ఇదుగో తువాలు.

[కృష్ణమూర్తి దాన్ని అందుకుని, చేతులు కడుక్కున్ని వస్తున్న డాక్టరుకు అందిస్తాడు.

డాక్టరు [చేతులు తుడుచుకుని తువాలు తిరిగి యిచ్చివేస్తూ]. నా... బ్యాగ్....

[గదివైపుకు ఒక అడుగు వేస్తాడు.

కృష్ణమూర్తి. నే తెస్తా నుండండి.

[కృష్ణమూర్తి గదిలోనుంచి మెడిసెన్ ఛెస్ట్ తెచ్చి, డాక్టరు ముందు నడవగా ఆయనవెంట వెడతాడు.

లక్ష్మయ్య [డాక్టరు గడప దాటినంతనే]. రావడమైంది; పోవడమైంది. కాసేపు కూర్చోడం, మంచీ చెడ్డా మాట్లాడ్డం— ఏమీ లేదు. పలుకే బంగారం. ఈ భాగ్యానికే డాక్టర్లూ, గీక్టర్లూ అని పడి చస్తారు.

కమల [వడమటింటి గుమ్మంలోనుంచి]. నాన్నా! మరి, అన్నాని కొస్తావా?

లక్ష్మయ్య [వినిపించుకోకుండా]. శేషాచార్యులుగారు వస్తే, కష్టసుఖాలు మాట్లాడుతూ పక్కా గంట కూర్చుంటారు. ఆయన మాట, ఆయన మర్యాద, ఆయన మన్నన—ఈ రాలుగాయలు వొంటి కాలిమీద తపస్సు చేస్తే మాత్రం వొస్తాయా?

కమల. నిన్నే నాన్నా! అన్నం వడ్డించమంటావా?

లక్ష్మయ్య. మించిన వేళ మించనే మించింది—అన్నయ్యని రానీ. ఇన్నిసార్లు వడ్డన దేనికి?—కలిసే భోం చేస్తాం.

మాణిక్యమ్మ [గదిలోనుంచి వచ్చి]. ఇంకా వాడి స్నానం పానం కాలేదు. వాడికోసం మీరు కనిపెట్టుకు కూచోడం దేనికి? మీకు

పెట్టి, చిన్నమ్మాయికూడా రెండు మెతుకులు తింటుంది. మిట్ట మజ్జాన్నందాకా అది మాడ్డం దేనికి?

కమల. అఁ! నా కేం తొందర? అన్నయ్యను రానివ్వవే!

మాణిక్యమ్మ. మందు తేవాలి కదమ్మా! ఆలిసిమౌతుందేమో?

లక్ష్మయ్య. రంగు నీళ్ళే కదూ! సీసాలో పోసివ్వడానికి ఏమంత ఆలస్య మౌతుంది?

మాణిక్యమ్మ. చాల్లెండి! ఎవరైనా వింటే నవ్విపోతారు.

లక్ష్మయ్య. నే నీ యిల్లుకట్టి పాతికే ళ్ళయింది. ఎన్నడైనా, ఏ డాక్టరైనా నా గడప తొక్కాడా? ఇవ్వాళ నువ్వూ, నీ కొడుకూ చేరి, వాణ్ణి రప్పించారు. డాక్టరు అడుగు పెట్టిన కొంప ఏది ముందు కొచ్చింది? కదిలితే బిల్లు, మెదిలితే బిల్లు—వాడు రేపటినుంచీ యిల్లు గుల్ల చెయ్యడూ? ఏ తృణమో, పణమో, మనకు తోచింది చేతిలో పెట్టినా, శేషాచార్యులుగారైతే రళ్ళ కద్దు కుంటారు. మొన్న నాకు మూడు నెలలు మందిస్తే, నే నేమిచ్చాను? పొలంలో పండిన మినుములు మూడు కుంచాలు కొలిస్తే ఆయన బ్రహ్మానంద పడ్డాడు. ఈ డాక్టరుగాళ్లు బిళ్ళ కుడుముల లాంటి రూపాయలు బల్ల మీద పెడితే తప్ప పలకరు, ఉలకరు.

మాణిక్యమ్మ. ఆప దొచ్చినప్పుడు కూడా అణా పైసల లెఖ్ఖ లేనా? అది బతికి బయటపడితే, నా కదే పది వేలు. వెదవ డబ్బు-ద బ్బేం చేసును?

లక్ష్మయ్య. కానివ్వండి, కానివ్వండి! చిప్ప పుచ్చుకుని అడుక్కుతిందురు గాని లెండి! చూడగా మీ కది రాసి పెట్టినట్టే వుంది. ఎవరి గీత నెవరు తప్పిస్తారు?

మాణిక్యమ్మ. మళ్ళీ మొదలు.

లక్ష్మయ. ఏమి టది ?

మాణిక్యమ్మ. ఏమిటా ? నా పిండాకూడు.

కృష్ణమూర్తి [తిరిగివస్తూ]. ఏమి టమ్మా అది ?

మాణిక్యమ్మ. మందు తెచ్చావా, బాబూ !

కృష్ణమూర్తి. ఆఁ !

లక్ష్మయ్య. మీ డాక్టరుగా రేమన్నారురా ?

కృష్ణమూర్తి [కోపంగా లక్ష్మయ్యతో]. ఆఁ ! ఏ మంటారు ? [అనునయిస్తూ మాణిక్యమ్మతో] సరిగాని, ఏమి టమ్మా నీ అవతారం ! ముందు నువ్వు పడక పెట్టేలా వున్నావ్. వెళ్ళి స్నానమైనా చేసిరా. నే నమ్మాయిని చూస్తూ వుంటా.

మాణిక్యమ్మ. ఆఁ ! నా కేమి తీపరంలేరా ?

కమల. నిన్నటినుంచీ అమ్మ నోట్లో పచ్చి నీళ్ళయినా పోసుకో లే దన్నయ్యా !

కృష్ణమూర్తి. ఏమి టమ్మా అది! నువ్వు మూలబడితే, ఇఖ జానకి ఆలనా పాలనా ఎవరు కనుక్కుంటారు ?

మాణిక్యమ్మ. ఏం చెప్పనురా, బాబూ ! నా మతి మతిలో లేదు. సరే ! ఆ మందిలా తే ! తాగిస్తా. మంచి నీళ్ళైనా తిన్నగా గుటక పడ్డం లేదు. ఏం తాగుతుందో !

కృష్ణమూర్తి. ఇదుగో నమ్మా ! ఈ గీతవరకు గాజు గ్లాసులో పో సివ్వు. ఇవిగో ! ఇవి ఆరు పొట్లాలు. అరు కిచ్చిన అర గంట కొాక పొట్లం చొప్పున నీళ్ళతో వెయ్యాలి.

[కృష్ణమూర్తి చేతిలోనుంచి మందుసీసా, పొట్లాలు తీసు కుని మాణిక్యమ్మ గదిలోకి వెళ్తుంది.

లక్ష్మయ్య [రెండు మూడుసార్లు పొడిదగ్గు దగ్గి]. డాక్టరేమి చెప్పాడేమిరా ?

కృష్ణమూర్తి. కాస్త నిదానించండి - మనవి చేస్తాగా ?

[కొంత సమయం నిశ్శబ్దం.

లక్ష్మయ్య. పొద్దున్నే శేషాచార్యులు గారొకసారి చెయ్యి చూచి వెళ్ళారు. నాడి కొంచెం మోతుడుగా వుంది కాని, భయ మేమీ లే దన్నారు. "ఇవ్వాళ అమావాస్య. దాని సమయం ఇంతో, అంతో కనబడకుండా వుంటుందా ?" అన్నారు. ఇవ్వాళొక్క రోజూ గడిస్తే రేపటికి జబ్బు తిరుగుముఖం పడుతుం దన్నారు. దేనికైనా గ్రహబలం బాగుండాలి.

మాణిక్యమ్మ [గదిలోనుంచి వస్తూ]. మందు తిన్నగా తాగ లేదురా, బాబూ ! సగానికి సగం కింద పోయింది.

కృష్ణమూర్తి. ఫరవా లేదులే. నువ్వు వెళ్ళమ్మా ! వెళ్ళి, స్నానం చేసిరా.

మాణిక్యమ్మ. దాన్ని ఒక కంట కనిపెట్టి చూస్తూవుండరా, బాబూ!

[పడమటింటికి గుమ్మంగుండా లోపలికి వెళ్తుంది.

కృష్ణమూర్తి [బెదరిన లేడిపలె చూస్తూ నిలుచున్న కమలతో]. కమలా ! అమ్మకు నీలూ పాలూ చూడరామా !

[కమల వెళ్ళిపోతుంది.

లక్ష్మయ్య. ఏ మన్నా రేమిరా డాక్టరుగారు ?

కృష్ణమూర్తి. ఏమన్నారా? రోగం ముదిరిపోయిం దన్నారు!
మరి ఏ క్షణాని కేమి జరుగుతుందో చెప్పలే మన్నారు!

లక్ష్మయ్య. ఆఁ! డబ్బు గుంజడానికి వాళ్లు అలాగే అంటారులే!

కృష్ణమూర్తి. పాడు డబ్బు ముఖం చూసుకునే దాని ప్రాణం మీదికి తెచ్చావ్.

లక్ష్మయ్య. డబ్బు డబ్బంటారు - డబ్బు విరజిమ్మితే పోయే ప్రాణాలు నిలుస్తాయటరా? మొన్న మన చంద్రయ్య పెళ్లాన్ని పట్నం దాకా తీసుకెళ్ళి అయిదారు వందలు వ్రయం చేశాడు. మరి అది బతకలేదే? కాలం, ఖర్మం కలిసొస్తే డాక్టర్లు ఆపగలరా? సర్లే - ఇంతకూ జబ్బేమి టంటాడు?

కృష్ణమూర్తి [బరువుగా]. అది టైఫాయిడ్ జ్వర మట. డబుల్ నిమోనియాతో ఊపిరితిత్తులు పూర్తిగా చెడిపోయాయట. ముందే ఆయన్ని పిలుచుకొస్తే, ఇంత ముంచుకొచ్చేది కాదు. నువ్వే చేతులారా దాని బ్రతుకు బుగ్గిచేశావ్!

లక్ష్మయ్య. ఆఁ! ఒకరు చేసిం దే ముంది? ఎవరి కెలా రాసి పెట్టివుంటే అలాగే జరుగుతుంది.

కృష్ణమూర్తి. చాల్ చాలు! ఈ వెర్రి మొర్రి వేదాంతంతోనే జానకి గొంతుకోశావ్! దాని వొళ్ళంతా పుచ్చిపోయింది. ఎందుకో తెలుసా?

లక్ష్మయ్య. ఆఁ! అది పైత్య ప్రకోప మటరా?

కృష్ణమూర్తి. దానికి కాదు; మనకు!

లక్ష్మయ్య. అయితే, అది ఏమి టంటావ్?

కృష్ణమూర్తి. ఏమిటా? నీ మేనల్లుడు అచ్చోసిన ఆబోతని నీకు తెలవదూ? వాడి వొళ్ళంతా కుళ్ళిందని నీకు తెలవదూ? నేను ఆనాడే అన్నా "ఛీ పాడు సంబంధం మనకు వద్దు మొర్రో" అని; నామాట విన్నావా? తోబుట్టువు ఇంటికొచ్చి అడుగుతున్నదనీ, తక్కువ కట్నంతో సరిపెట్టొచ్చుననీ బంగారంవంటి పిల్లని ఆ పోకిరీ వెధవ కిచ్చి ముడిపెట్టావ్.

లక్ష్మయ్య. చిన్నతనంలో అల్లరి చిల్లరగా తిరిగిన వాళ్ళయినా, ఒక ఇంటివాళ్ళయినాక లక్షణంగా బ్రతకరట్రా? నారాయణుడు రావైనా అంతే ననుకున్నా. అయినా, మన చేతిలో ఏమున్నది? అదంతా పూర్వజన్మ కర్మానుభవం.

కృష్ణమూర్తి. మన చేతులతో మనం గొంతు కొయ్యడం; అది వాళ్ళ పూర్వజన్మ కర్మానుభవ మనడం. ఎంత చక్కని సూత్రం కనిపెట్టారు! వాడు చదువు సంధ్యలు లేనివాడని నీకు తెలును. గుణం లేనివాడనీ నీకు తెలును. అయినా, వాడి ఆస్తిని చూచి, వాడికి పిల్ల నిచ్చి కడితే, ఆ తప్పు నీది కాదూ?

లక్ష్మయ్య. ఆఁ! ఎవరి గీతలో ఎలా వుంటే అలా జరుగుతుంది. మనం కేవలం నిమిత్తమాత్రులం.

కృష్ణమూర్తి. చేతులారా చేసిన పనికి చింతించేది పోయి, "దాని గీత", "దాని ఖర్మ" అనడానికి నీకు నోరెలా వొస్తున్నది, నాన్నా? వివాహ మనుకున్న తర్వాత జానకి ముఖంలో ఎన్నడైనా కళా కాంతీ చూశావా? ఛీ అయిదారేళ్ళనుంచీ అది చేసింది సంసారమా? నరకంలో నివాసం కదూ?

లక్ష్మయ్య. ఆఁ! కలిగినవాడి కిస్తే, సుఖ పడుతుం దనుకొన్నా గాని, ఇలా జరుగుతుందని నే నేమైనా కల గన్నానా? ఇంతకూ అది తిన బుట్ట లేదు.

కృష్ణమూర్తి. సుఖ పెట్టగోరిన వాడి వైతే దాన్ని వాడి కిచ్చి కట్టే వాడివా? పోనీ, కట్టింతర్వాత, వాడి కట్న మేదో వాడికి పారెయ్యక, లేనిపోని పేచీలకు దిగేవాడివా? వాడు మన జానకిని మరింత వేపుకు తినడానికీ, "ఇంకొక పెళ్ళి చేసుకుంటా!" నంటూ దాన్ని రాచి రంపాన పెట్టడానికీ నువ్వే కారణం కాదూ?

లక్ష్మయ్య. అంతా బ్రహ్మలిఖితం కాని, అ దంటే నాకు వ గటరా?

కృష్ణమూర్తి. ఆఁ! నేను వాడి మాట మర్చేపోయా! మన పాపాలన్నీ అంటగట్టడానికి వా డొక డున్నాడు! మంచి జరిగితే అది మన ప్రజ్ఞ; చెడు జరిగితే బ్రహ్మరాత.

మాణిక్యమ్మ [జుట్టు వేలు ముడి వేసుకుంటూ, చావడిలోకి తిరిగి వచ్చి]. బాబూ! అమ్మాయి కెలా వుందిరా?

కృష్ణమూర్తి. కొంచెం తగ్గే వున్నట్టున్న దమ్మా!

మాణిక్యమ్మ. నువ్వెళ్ళి స్నానం చెయ్యి, బాబూ! నేను దాన్ని చూస్తూ వుంటా!

కృష్ణమూర్తి. చేస్తాలే, అమ్మా! అంత తొంద రేమిటి?

మాణిక్యమ్మ. పొద్దెక్కి పోలే దట్రా! నీ కోసం మీ నాన్నా, కమలమూ కనిపెట్టుకు కూర్చున్నారు.

కృష్ణమూర్తి. నా కోసం కనిపెట్టుకు కూర్చోవడం దేనికి? ముందు నీ భోజనం కానివ్వు, నాన్నా! నేను తర్వాత చేస్తాలే.

మాణిక్యమ్మ. దూరాభారం పయాసం! ని న్నెప్పుడు భోంచేశావో. ఏమో? స్నానం చేసి, కాస్త ఎంగిలి పడరా, బాబూ!

కృష్ణమూర్తి. ఆఁ! సర్లే, అమ్మా!

మాణిక్యమ్మ. ప్రాణం కడదుతుందేమోరా, బాబూ!

[ఈమాట అంటూనే గిన్నెలోకి వడ్డిస్తుంది.

లక్ష్మయ్య [అర నిమిషం తర్వాత, ముందు పొడివగ్గు దగ్గి]. ఏమో రా? డాక్టరు మీ రంటే, నా కేమంత నమ్మకం....

కృష్ణమూర్తి. నీ కొక నమస్కారం. ఆ ప్రస్తావన తేవద్దు. అమ్మ వింటే ఆవిడగుండె బేజారౌతుంది.

లక్ష్మయ్య. సర్లే! కానున్నది కాకమానదు. [కళ్లు మూసుకుని] హరేకృష్ణ! హరేకృష్ణ! పాహిమాం! పాహిమాం! పాహి!

కమల [వడమటింటిలో నుంచి వచ్చి]. అన్నయ్యా! నీకు నీళ్ళు తోడనా?

కృష్ణమూర్తి. కొంచెం ఆగు - తోడుదువుగానిలే!

కమల. ఆలస్య మున్నదంటే, పోనీ వేన్నీళ్ళు పెడతా నన్నయ్యా!

కృష్ణమూర్తి. ఎందు కమ్మా ఈ ఎండలో వేన్నీళ్ళు?

కమల. వేన్నీళ్ళ స్నానం చేస్తే. ప్రయాణం బడలిక తీరుతుం దన్నయ్యా!

కృష్ణమూర్తి. అక్కర్లే వద్దు! చన్నీళ్ళే చాలు.

కమల. అన్నయ్యకు ఆలస్య మున్నదట, పోనీ, నువ్వైనా భోజనానికి రా, నాన్నా!

లక్ష్మయ్య. వేళ మించిపోయి, ఆకలి చచ్చిపోయిందమ్మా! ఇఖ ఎప్పుడైతే నేమిటి? నేనూ తర్వాతే భోం చేస్తాలే!

[నీరసంగా కమల పడమటింటిలోకి వెళ్ళిపోతుంది.

లక్ష్మయ్య [కృష్ణమూర్తితో]. ఏదీ - ఇలా దగ్గరికి రా! [కృష్ణమూర్తి దగ్గరికి వస్తాడు.] ఈ డాక్టర్లని, గీక్టర్లని నమ్మేంచెవరు గాని, ఆ శేషాచార్యులుగార్ని మళ్ళీ ఒకసారి పిలుచుకొచ్చి....

కృష్ణమూర్తి. చాలు! ఆయ నింతవరకు చేసిన వైద్యం చాల్లే!

లక్ష్మయ్య. అది కాదురా! ఆయన్ని మళ్ళీ సంప్రతిస్తే....

["అయ్యో! నా తల్లీ!" అని గదిలో మాణిక్యమ్మ రొమ్ము గుద్దుకుంటున్న చప్పుడు.

లక్ష్మయ్య. } ఒకేసారిగా { ఏమిటే, అది?
కృష్ణమూర్తి. } ఒకేసారిగా { ఏమి టమ్మా!

మాణిక్యమ్మ [గదిలోనుంచి వస్తూ]. అయ్యో నా తల్లీ! అయ్యో మా అమ్మా!

లక్ష్మయ్య. } ఒకేసారిగా { ఏమే, ఏమిటి?
కృష్ణమూర్తి. } ఒకేసారిగా { ఏ మమ్మా! ఏ మమ్మా!!

మాణిక్యమ్మ [ఈ ప్రశ్నలకు జవాబు చెప్పకుండా, నెత్తీ, నోరూ కొట్టుకుంటూ]. ఇఖ నే బతికి దేనికి? చచ్చి దేనికి? ఆ పాడు దేవుడు న న్నెత్తుకు పోరాదూ!

[మాణిక్యమ్మ ఇలా విలపిస్తూవుండగా లక్ష్మయ్య, కృష్ణమూర్తి, గబగబ గదిలోకి వెడతారు.

మాణిక్యమ్మ. అయ్యో! అయ్యో! నే నేం పాపం చేశాను! నే నేం పాపం చేశాను!! అయ్యో నా తల్లీ! అయ్యో మా అమ్మా!
లక్ష్మయ్య [గదిలోనుంచి కోపంగా వచ్చి]. నీ కేమైనా పోయే కాలం వచ్చిందా? దేనికే అలా యేడుస్తావ్?
మాణిక్యమ్మ. దేనికా? నా దెవసానికి!
లక్ష్మయ్య. సర్లే - నీ వెధవ వేషా లిక కట్టిపెట్టు. ఇందాకటి కంటె ఇప్పు డది తేటగా వుంటే ఈ ఏడుప్పు లేమిటి? పెడబొబ్బ లేమిటి? కొంపకు కీడు చుట్టుకోడానికా?
మాణిక్యమ్మ. మా తల్లి గొంతు నువ్వే కోశావ్. మా అమ్మని నువ్వే గంగలో దించావ్. నీ మెట్ట యేదాంతం మండిపోను!
లక్ష్మయ్య. ఛీ! నోరుముయ్! ఎవరి కర్మ కెవరు కర్తలు!
కృష్ణమూర్తి [గదిలోనుంచి వచ్చి]. ఏమి టమ్మా నీ గోల? మ రేమోనని నేను ఖంగారు పడ్డా.
మాణిక్యమ్మ. ఏం చెప్పను రా, బాబూ! నా తల్లికి ఎంత కష్ట మొచ్చింది! ఎంత కష్ట మొచ్చింది! అయ్యో! అయ్యో!!
కృష్ణమూర్తి. అసలు విషయ మేమి టమ్మా!
మాణిక్యమ్మ. "ఈ నింద మొయ్యలేను! ఈ నింద మొయ్య లేను!!" అంటూ మా అమ్మ అవజ్ఞాన పలవరిస్తూ వుంటే నే నేమిటో ననుకున్నా. ఆ మాట పడ్డాకే అది మంచ మెక్కిందికామోసు!
కృష్ణమూర్తి. ఏమి టమ్మా, నీ గొడవ? మా టేమిటి? నిం దేమిటి?
మాణిక్యమ్మ. నా నోటితో నే నెలా చెప్పనురా, బాబూ? మీ బావ - అయ్యో! అయ్యో! - దాన్ని పట్టుకుని, నువ్వే -

అవ్వఁ! - ఎక్కడ సంపాయించావో - వాడి దగ్గిరికే పో అన్నాట్ట!

కృష్ణమూర్తి. } ఒకేసారిగా { ఆఁ! రాస్కెల్! స్కౌండ్రల్!
లక్ష్మయ్య. } { అరి అప్రాచ్యుడా!

కృష్ణమూర్తి [పళ్లు నూరుతూ]. ఆ వెధవని నిలువునా చీల్చాలి.

మాణిక్యమ్మ. అయ్యో! అయ్యో!

లక్ష్మయ్య [ముక్కుపైన వేలు వేసుకుని]. ఔరా! ఎంత పాపాని కొడిగట్టాడు. [వెంటనే తిరిగి తన మెట్టవేదాంతం ధోరణిలోకి మారిపోయి] సరే - వాడి పాపాన వాడే పోతాడులే!

కృష్ణమూర్తి [వెటకారంగా]. వాడి పాపాన వాడే పోతాడూ?

లక్ష్మయ్య. అంతే మరి! పాపం చేసినవాడు ఈ జన్మలో కాక పోతే, మరో జన్మలోనైనా అంత కంత అనుభవిస్తాడు.

కృష్ణమూర్తి. ఇంకో జన్మ! ఎవరు చూచొచ్చారు?

లక్ష్మయ్య. ఇవి పెద్ద విషయాలు - నీకీ ధర్మసూక్ష్మాలు తెలియవు లేరా! కర్మనుబట్టే జన్మ వుంటుంది. పూర్వజన్మలో చేసిన కర్మను బట్టి ఈ జన్మ. ఈ జన్మలో....

మాణిక్యమ్మ. నీ మెట్ట వేదాంతం మండిందిలే! అయ్యో! అయ్యో!! నా తల్లి నెంత మాటన్నాడు!

కృష్ణమూర్తి, ఆ వెధవని కంటబడనీ - పాతేస్తాను.

మాణిక్యమ్మ. వాడొట్టి వెధవే! కాని, మన పిల్ల నిచ్చాక ఏమను కుంటే, ఏం లాభం? మన బిడ్డ ముఖం చూసైనా వాడి కడుపూ, కాళ్ళూ పట్టుకుని....

కృష్ణమూర్తి. ఛీ! ఛీ! ఆ వెధవ పేరైనా ఇఖ నావద్ద తలవొద్దు.

మాణిక్యమ్మ. కాదు, బాబూ! కాదు. నా మాటవిను. మనం కోసి వేసుకుందామనుకున్నా, తెగే సంబంధమా యిది? వాణ్ణి ఎలాగైనా బతిమలాడి....

కృష్ణమూర్తి. వాణ్ణా? బ్రతిమలాడ్డమా? ఆ పనివునే? చాల్లే అమ్మా!

మాణిక్యమ్మ. వాణ్ణి చూడందే మనపిల్ల మనకి దక్కదురా! నా తల్లి గుండెల్లో పెద్దరాయి పడింది. వాడు రావాలట. దాని కంట బడాలట. నీ తప్పేమీ లేదనాలట. నీకు పున్నె ముంటుంది - వాడి దగ్గరి కెళ్ళి....

కృష్ణమూర్తి. అదేమైనా సరే - నే వెళ్ళను: వెళ్ళను: వెళ్ళను.

లక్ష్మయ్య. మన అవసర మది. మనకు తప్పుతుందా?

కృష్ణమూర్తి. అవసరమని గాడిద కాళ్లు పట్టుకుంటామా?

లక్ష్మయ్య. మనం పట్టుకోవడం ఒక లెఖ్ఖా? అనాడు సాక్షాత్తు ఆ శ్రీవసుదేవుడే పట్టుకున్నాడు.

కృష్ణమూర్తి. అయితే, నే నంతటి మహానుభావుణ్ణి కాను. నాకు చీమూ, నెత్తురూ వుంది; మానాభిమానా లున్నాయి.

["అన్నయ్యా!" అంటూ పసిపాటింటినుంచి కేకలు వస్తుంది. చావడిలో వున్న ముగ్గురి నాలుకలన్నీ చటుక్కున తెగిపోయి, నమ్మకంలోనే ఆగిపోతుంది.

మాణిక్యమ్మ. మంచో, చెడ్డో వాడి కిచ్చి కట్టింతర్వాత దానికి మరి వాడే దిక్కు. దాని ముఖమైనా చూసి యెళ్ళరా, బాబూ!

కృష్ణమూర్తి. నీదంతా వెర్రి కాని, ఇంతవరకు పడని సుఖం ఇఖ వాడితో మన జానకి ఏం పడుతుందమ్మా! బుద్ధిలేని ఆ వెధవను వృథాగా దేబిరించడం దేనికి?

లక్ష్మయ్య. గుడ్డివాడైనా, కుంటివాడైనా, చివరికి కుష్ఠువాడైనా ఆడదానికి భర్తే దైవం.

కృష్ణమూర్తి. కాదు,—దెయ్యం.

మాణిక్యమ్మ. నా మాట విను, బాబూ? లేకపోతే మన పిల్ల మనకి దక్కదు.

కృష్ణమూర్తి. అ దేమైనా గాని, నేను వెళ్ళ నమ్మా!

లక్ష్మయ్య. అయితే! మరి నాకు తప్పుతుందా, నే వెడతాలే!

కృష్ణమూర్తి. నువ్వైనా వెళ్ళడానికి వీల్లేదు.

మాణిక్యమ్మ. అ దేమిటిరా, బాబూ! పోనీ ఆయనైనా వెళ్ళ రానియ్యి.

కృష్ణమూర్తి. వీ ల్లే దమ్మా!

మాణిక్యమ్మ. ఆఁ! వాడి మాటల కేం లెండి? మీ రున్నవా రున్నట్టుగా బయల్దేరండి.

కృష్ణమూర్తి. వద్దు, నాన్నా! వె ళ్ళొద్దు!

మాణిక్యమ్మ. నువ్వు పసివాడివి. నీకు తెలవదురా, బాబూ! నా మాట విను.

లక్ష్మయ్య [కటకుగా]. ఇందాకటినుంచి తమాయించుకు చూస్తున్నా! గుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్టు, ఏమిటిరా మాకు నీ అదు పాజ్ఞలు? సమయాన్నిబట్టి సర్దుకు పోవాలికాని, నీలిగితే పనులౌతాయా?

కృష్ణమూర్తి. అయితే, వాణ్ణి పిలుచుకొచ్చి, నెత్తిని పెట్టుకు పూజించండి. నా దారిని నే పోతా!

మాణిక్యమ్మ. నన్ను నట్టేట ముంచిపోతావా? వొద్దురా, బాబూ! ఎళ్ళొద్దు!

కృష్ణమూర్తి. లేదమ్మా! నే నీ పాముకొంపలో మరొక క్షణమైనా వుండలేను!

మాణిక్యమ్మ [దారికి అడ్డంగా వెళ్ళి]. ను వ్వెళ్ళితే నన్ను చంపుకు తిన్నట్టేరా, బాబూ!

[కళ్లు చెమ్మగిలగా కమల తీగ చెంగుతో తుడుచుకుంటుంది.

లక్ష్మయ్య. పోయేవాణ్ణి పోనివ్వ రాదటే! ఎవర్ని బెదిరిస్తాడు ఈ గుడ్డి బెదిరింపుల్తో.

[ఈ మాటతో కృష్ణమూర్తికి మరింత కోపం రాగా, మాణిక్యమ్మను తప్పించుకుని వీధిగుమ్మందాకా రెండు అడుగులు వేస్తాడు.

మాణిక్యమ్మ. } ఒకేసారిగా { అయ్యో! అయ్యో! బాబూ!
కమల. } { అన్నయ్యా! అన్నయ్యా!

[కృష్ణమూర్తి ఆగిపోయి కమలవైపు చూస్తాడు.

కమల. న న్నొంచేసి పోతా వన్నయ్యా!

కృష్ణమూర్తి. నీమాట మర్చే పోయా నమ్మా! ని న్నిక్కడ విడిచి వెళ్ళితే, అక్కయ్య గొంతుకోసినట్టు నీ గొంతూ కోస్తారు. నా వెంట రా——పోదాం!

[కమల కళ్ళను గిర్రున నీళ్లు తిరుగుతాయి. నవ్వు అభినయించి చూస్తూ జవాబు చెప్పదు.

కృష్ణమూర్తి. నీకు అశుభం శుభం తెలియదమ్మా! వీళ్లు కిరాతకులు. నీ అన్నను కామా? నామాట విను. రా! వెడదాం!

కమల [గాద్గదికంగా]. మనం వెళ్ళిపోతే, మరి అక్కయ్యో?

కృష్ణమూర్తి [మనిషి చప్పున తగ్గిపోయి]. ఔనమ్మా! పిచ్చి కోపంలో నేను దాని మాటే మర్చిపోయా! [నిట్టూరుస్తూ] ఔను! దాన్ని ఈ స్థితిలో విడిచి మన మెక్కడికి పోతాం?

మాణిక్యమ్మ. పోనీ లేరా దాని మొగమైనా చూసి ఆగిపోయావ్. నా కదే పది వేలు. వొంటిగా రొమ్మున నే నీ కుంపటి మొయ్యగల నట్రా ?

కృష్ణమూర్తి. సర్లే, అమ్మా! [చేతిగడియారాన్ని చూచి] అరుకిచ్చి అరగం తైంది. మరి పొట్లం వెయ్యొద్దూ?

మాణికమ్మ [పెద్దగా నిట్టూర్చి]. నాకు కాళ్ళూ, చేతులూ ఆడ్డం లేదు. నువ్వే కా స్తెయ్యరా, బాబూ !

[కృష్ణమూర్తి గదిలోకి వెడతాడు.

మాణిక్యమ్మ [లక్ష్మయ్యతో]. ఇంకా మీరు చూస్తారు దేనికి ? మీ రెళ్ళరండి.

లక్ష్మయ్య. రెండు ఝాము లైంది. వేళకాని వేళ. ఇప్పు డేమిటి? చల్లబడినాక వెడతాలే.

మాణిక్యమ్మ. ఎంత దూర మండీ ! రెండు కోసులైనా నిండా లేదు. నా మా టిని, నిలుచున్న పాళంగా యెళ్ళి రండి.

లక్ష్మయ్య. సర్లేవే! రెండు మెతుకులైనా తిననీ ! ఇంతలో ఏమీ ముంచుకు పోదు. కమలం ! నా కొడ్డించ వమ్మా !

కమల [ఇంకా తడి ఆరని కన్నీళ్ళను తుడుచుకుంటూ]. రా, నాన్నా !

మాణిక్యమ్మ. బోజనాని కే మొచ్చె. రోజూ చేసే బోజనమే ! ముం దెళ్ళి రద్దురూ! ఆలిసమైతే ఎక్కడేమి కొంప మునుగుతుందోనని నా గుండెలు కొట్టుకుంటున్నాయ్.

లక్ష్మయ్య. ఎందుకే ? పాడు భయం ! శివుడి ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదు.

మాణిక్యమ్మ. అబ్బ? వెళ్ళి రద్దురూ!

లక్ష్మయ్య. సరే - తగలడు! [విసురుగా రెండడుగులు వేస్తాడు]

కృష్ణమూర్తి [పొంగి పొరలివస్తున్న దుఃఖాన్ని అతి కష్టంమీద ఆపుకుంటూ గదిలోనుంచి వచ్చి]. నాన్నా! [లక్ష్మయ్య వెనక్కి తిరిగి చూస్తాడు] సు వ్వింక వెళ్ళనక్ఖర లేదులే!

[అర్థం తెలియక మాణిక్యమ్మ, కమల పిచ్చివాళ్ళవలె చూస్తుంటారు.

లక్ష్మయ్య. సరే - ఏం చేస్తాం? ప్రారబ్ధం!

[అనడానికి నోరురాని భయసంశయాలతో మాణిక్యమ్మ, కమల పిచ్చివాళ్ళవలె కృష్ణమూర్తి కోపాన్ని లక్ష్మయ్యను, లక్ష్మయ్య కోపంతో కృష్ణమూర్తిని ప్రశ్నార్థకంగా చూస్తూవుండగా—

తెర]



# పాత్రలు

చదువుకున్న భర్త

చదువురాని భార్య

[గమనిక : ఇతివృత్తం, పాత్రలు సుపరిచితమైనవాటిలో ఇది స్వతంత్ర రచన. టెక్నిక్ మాత్రం స్వీడిష్ రచయిత ఆగస్ట్ స్ట్రిండ్‌బర్గ్‌కు అనుసరణ. ఒక పాత్ర చేతనే మాట్లాడించి, రెండవదాన్ని మౌనంగా వుంచడం—ఈ పద్ధతిని "ది స్ట్రాంగర్" అనే నాటికలో ఆయన వినియోగించాడు. ఈ పద్ధతిమాత్రమే "దాంపత్యం"లో అనుసరించబడింది.]



# దాంపత్యం

అది వారి యింటిముందు వసారా. రాత్రి తొమ్మిదిన్నర ప్రాంతం, పడక కుర్చీలో వాలి, భర్త పత్రిక చదువుకుంటూ వుంటాడు. వయస్సు ముప్పై ప్రాంతాల. గూడకట్టు కట్టుకున్నాడు; ఆఘారం వేసుకున్నాడు. తమలపాకుల పళ్ళెంతో భార్య ప్రవేశిస్తుంది.

భార్య. ఏమండీ! ఈ పూటైనా తృప్తిగా భోజనం చెయ్యనే లేదు. విస్తరి ఇలా అలా కెలికి లేచొచ్చేశారు. చూడగా వండుకోవడం, వార్చుకోవడం నాకోసంలానే వుంది. అంత కంతకు చిక్కి సగమై పోతున్నారు. ఇలా చేస్తే, ఎలా చెప్పండి?

[కుర్చీ దగ్గర కూర్చుని తమలపాకుల ఈనెల్ని తీస్తూ వుంటుంది.

భార్య. పోనీ, మీకు హితవైన కూర లేవో మీరు తెచ్చుకుంటే వండిపెట్టనన్నానా? కాని, ససేమిరా మార్కెట్టుకు వెళ్ళనంటారు. పనిమనిషిని పంపిస్తే, అది సగం తిని, సగం తెస్తుంది. అబ్బబ్బ! అది వొట్టి దొంగ ముండ! ఇంటి వద్దకు మంచి కూర లేవీ రావడమే లేదు. ఎవడు తెచ్చినా

వంకాయలూ, బెండకాయలూ తెస్తున్నాడు. అవైనా అన్నీ చచ్చులూ, పుచ్చులూ. వాటినీ మందబెడుతున్నారు. ఇఖ నేనేం చచ్చేది — మీరే చెప్పండి ?

[తమలపాకులకు సున్నం రాస్తూ వూగుతుంది.

భార్య. అన్నం మానేసి పాడు కాఫీ హోటల్‌లో, పాడు కాఫీ తాగుతూ వుంటారు. ఆ కాఫీనీళ్ళతో ఏం కడుపు నిండుతుంది? ఏ పచ్చడి మెతుకులు తిన్నా అన్నం అన్నమే! మా తాత ముప్పొద్దులా తవ్వెడు బియ్యం అన్నం పెట్టించుకుని, చిక్కటి మజ్జిగ పోసుకుని, జుర్రున జూరతాడు. ఎనభై యేళ్ళొచ్చినా ఇంకా రాయిలా వున్నాడు. కంటి చూపైనా తగ్గలేదు. ఇప్ప టికీ సూదిలో దారం అలాగా గుచ్చుతాడు.

[పోకచెక్క — భర్తకు అందిస్తుంది.

భార్య. అబ్బ! చదవొచ్చు లెద్దురూ! పొద్దున్నే పోతారు; పొద్దోయి వస్తారు. "ఇదుగో వొస్తారు; అదుగో వొస్తారు" అంటూ ఎదురు చూసి చూసి, నా కళ్ళు కాయలు కాసిపో తున్నాయ్. ఆఫీసు పని అయిదు గంటలకే అయిపోయినా ఎనిమిది, తొమ్మిది గంటలదాకా ఏం చేస్తారో, ఏమో, మీకే తెలియాలి. అసలు గడప దాటగానే మీ రింటిమాటే మర్చి పోతారులెండి! ఇవ్వాళమట్టు కివ్వాళ "నా న్నొస్తాడు. మిఠాయి తెస్తా" డంటూ పెద్దపిల్ల దారి కాసి కాసి, మీ రొచ్చే ముందే చిటుక్కున నిద్ర రోయింది. చంటిదికూడా "నాన! నాన!" అంటూ - పాపం! - కలవరించింది. దాని కీ పూట

వాళ్లు కాస్త వెచ్చగా వుందంటే! నిద్రలో - పెద్రితల్లి - తుళ్ళి పడుతున్నది. దీపా లెట్టగానే గుప్పెడు మిరపకాయలు దిష్టి తీసి, పొయ్యిలో పోస్తే గొట్టే రాలేదు. బిడ్డమీద ఏ పీడాకారి ముండ కళ్ళు పడ్డాయో, ఏమో!

[భార్య అందించిన తమలపాకుల మడుపు అందుకుని, భర్త పత్రికలో మరింత గా దాక్కుంటాడు.

భార్య. ఎప్పుడూ పత్రిక చదువుతూ కూర్చుంటే, కళ్ళకు జబ్బు కూడా. పిండారబోసినట్టు వెన్నెల కాస్తున్నది. చల్లటి గాలి వేస్తున్నది కూడా. పెందలాడే యింటి కొచ్చి, వాకిట్లో కుర్చీ వేసుకు కూర్చుంటే హాయిగా వుండదంటే? ఇవ్వాళ వెన్నెల్ని చూసి పెద్దపిల్ల ఎంత సంబర పడిం దనుకున్నారు! "చంద మామ రావె!" అంటూ మీరు దాని కెప్పుడో పాట చెప్పా రట. దాన్ని చెప్పమని నన్ను తెగ వేధించింది! [ఒక క్షణం పాటు ఆగి] పాలు చల్లారిపోతున్నాయి. తో డేసొస్తా. [లేచి వెడుతూ] ఈ పూట మరీ పత్తెపు మెతుకులు తిన్నట్టు తిన్నారు. పాలయినా తాగరాదటండీ! [జవాబుకోసం అన్నట్టు ఒక్క క్షణం ఆగి] ఏఁ! తెమ్మంటారా?

[వద్దని భర్త తల ఊపుతాడు.

భార్య. పోనీ, కాసినన్నే తాగండి. ఒక అరకప్పు తెస్తా.

[వద్దని భర్త మరింత గట్టిగా తల ఊపుతాడు. భార్య లోపలికి వెడుతుంది. ఆమె వెళ్ళగానే అతడు పత్రి కను ఒక మూలకు గిరాటు కొట్టి, పడక కుర్చీలోనుంచి

లేచి, పక్కనే టేబులుమీదవున్న పుస్తకం తీసుకుని, దాన్ని చదువుతూ మళ్ళీ కుర్చీలో కూర్చుంటాడు.

భార్య [తిరిగి వచ్చి]. పత్రిక చదవడం అయిందనుకుంటే పుస్తకం మొదలెట్టారేటండీ? అదేం పాపమో నాతో ఒక్క మాటైనా మాటాడరు. ఇంటికి వచ్చినప్పటినుంచీ చదువు. చదువు—అంతూ పంతూ లేని చదువు. నే నేమైనా అంటే. "అదిగో! నా చదువు చెడగొడుతున్నా!" అంటారు. అదే స్నేహితు లెవరైనా వొస్తే. ఆ చదు వేమౌతుందో తెలదు. ఊరు మాటుమణిగేదాకా వాళ్ళతో నవ్వుతూ తేలుతూ కూర్చుంటారు. నాతో మాట మాట్లాడ్డ మంటేనే మొహ....

[భర్త చదువుతున్న పుస్తకం మూసి "[illegible]" అన్నట్లు ముఖం పెడతాడు.

భార్య [దైన్యంగా]. ఇప్పుడు నే నేమన్నానండీ మీరంత విసుక్కోడానికి! పిచ్చిదాన్ని కనక. ఎప్పుడు సాయంత్ర మౌతుందా. ఎప్పుడు మీ రొస్తారా అని గంటలు లెక్క పెట్టుకుంటూ కూర్చుంటాను. రాళ్ళ అలికిడైతే చాలు. మీ రేమోనని ఆలకిస్తాను. గేటు తీసిన చప్పుడైతే చాలు. మీ రేమోనని ఎదురుచూస్తాను. దానికి చూడబోతే రెండున్నరేళ్లు నిండా వున్నాయో, లేవో, ఆ అల్లరికూన "అమ్మా! నా న్నొస్తున్నాడే!" అంటూ చీటికీ మాటికి పరుగెత్తుకొస్తూ వుంటుంది. ఉత్తిదే అని తెలిసీ వుండబట్టలేక వాకిట్లోకి అదరాబాదరాగా లేచొస్తాను. లేచొచ్చి. "ఎక్కడే?" అంటే. పకపక నవ్వ

తుంది. [భర్త పెదవులపై చిరునవ్వు కనబడుతుంది]. పండిని కూడా "నాన్న ఎక్కడమ్మా?" అంటే, ముఖం ఇంత చేసుకుని, వేలెట్టి గేటువంక చూపిస్తుంది. నా పిల్లకి సందేహం కూడా తగిలింది. అజీర్తి చేసిందేమో అనుకోడానికి నిన్న ఆముదం పెట్టానమ్మో! ఇవ్వాళ పొద్దున కూడా మూలిగింది పిలోపన మైంది. వానసన్నా లేదు.

[భర్త ముఖం చిట్లించుకుని, [illegible]

భార్య: ఇంటికి రావడానికి మీ కొక టైము లేదు కాని. పక్కవాళ్ల టైము చూసుకోవడమే సరిపోతుంది. సంసారం మంచి చెడ్డలు చెప్పుకోడానికైనా మీకు తీరికా ఉండదు. పగలంతా మీ కోసం నేను ఎదురు చెస్తులు కాస్తుంటాను. కాని. నాతో మాట్లాడితేనే మీ నోటి ముత్యాలన్నీ రాలిపోతాయనుకుంటారు!

[illegible]

భార్య. మీరు ఏ మనబోతున్నారో నాకు తెలుసు లెండి. "నీతో ఏమి సంగతులు మాట్లాడమంటావ్? వండటం, వార్చటం తప్పితే నీ కేమొచ్చు? చీరలు, నగలు తప్పితే నీ కేం కావాలి?" అనేగా? మా అమ్మా, నాన్నా నాకు చదువు చెప్పించారు కాదు. నా ఖర్మమ. "ఏం! ఇప్పుడు మాత్రమేం! నే చెబుతా—చదువుకోరాదా?" అంటారు. "పోనీ, మీకంత ముచ్చటగా వుంటే చెప్పం"డని వచ్చి కూర్చుంటే. ఏ కాస్త తప్పొచ్చినా, చెడ్డ చిరాకుపడతారు గదా! "అబ్బబ్బ! ఎంత తల బద్దలు గొట్టుకున్నా, నీ కేమీ అర్థం కాదు. వొట్టి

మట్టి బుర్ర” అంటూ చిందులు తొక్కుతారు! ఔను! నాది మట్టి బుర్రే! లేకపోతే, మీ కెందు కింత లోకువౌతాను? “భూమి గుండ్రంగా వుంటే, అడుగుపక్క నున్నవాళ్లు తలకిందులుగా నడుస్తారా?” అన్నానని ఆ పూటంతా ఒక్కటే నవ్వు!

[భర్త ఆవలిస్తాడు.

భార్య. “ఏమండీ! కామ్రేడ్ అంటూ చాలామంది పేరుముందు వుంటుంది గదా? కామ్రేడు ఇంటిపేరువాళ్లు దేశంలో అంత తామరతంపరగా వున్నారటండీ?” అని ఒకనా డడిగినందుకు ఏమి హేళన చేశారు! ఏమి హేళన చేశారు!

[భర్త వొళ్లు విరుచుకుంటాడు.

భార్య [భర్త విసుగుదలను గమనించకుండానే]. మీలా అందరూ చదువుకున్నవాళ్ళే వుంటారా? నిజానికి - నాబొంద! - ఇంకా నా కేం చదువు? అప్పుడే ఒకరికిద్దరు బిడ్డ లయ్యారు. ఇటు నేను ఇంటిపనే చేసుకోనా? అటు వాళ్ళనే సంబాళించుకోనా? పగటి పూట ఇలా కాస్త కన్ను మూసే ప్రాప్తి లేదు. బద్ధకించి ఎప్పుడైనా కాసేపు నడుం వాలిస్తే, పిల్లలిద్దరూ పీకి పాకాన పెడతారు. మరీ నెల రోజుల్నుంచి చంటిపిల్ల రాత్రిపూటైనా కంటిమీద కునుకు పడనివ్వడం లేదు. పాలు చాలక “కుయ్యో. మొర్రో” అంటూ తెల్లవార్లూ ఒక్కటే గోల! వొట్టి రొమ్ము దాని నోట్లోపెట్టి పడుకుంటే, దవళ్ళు పీక్కు పోవడమే కాని కడుపు నిండుతుందా, పెడుతుందా?

[తలనొప్పి వచ్చినట్టు భర్త కణతలు నొక్కుకుంటాడు.

భార్య. ఏమండీ! తలనొప్పిగా వున్నదా? మరి ఆ మాట చెప్పారు కారేం? తలనొప్పిగా వుంటే అన్న మెలా సయిస్తుంది?

అందువల్లే ఈ పూట ఆ కాసిని మెతుకులైనా తిన్నారు కాదు. తలనొప్పిమందు రాయనా ?

[కణతలు నొక్కుకోడాన్ని అంటూనే మానేసి, మూసినా గిందమూ వద్దన్నట్టు భర్త సంజ్ఞ చేస్తాడు.

భార్య. అయితే, నా మాటలే మీకు తలనొప్పిగా వున్నాయంటారు. అంతే లెండి. నే నన్నా, నామాట అన్నా మీకు తలనొప్పి. మీకు పుస్తకాలు కావాలి; పత్రికలు కావాలి. దేశం సంగతులతో, ప్రపంచం సంగతులతో మీకు పొద్దుపోతుంది. నాకు నా యిల్లే దేశం; నా పిల్లలే ప్రపంచం...... పెళ్ళయినాక ఒక్క ఏడాదిపాటు నాతో ఏం తిన్నగా వున్నారో! ఆ తర్వాత నే నేం పాపం చేసుకున్నానో కాని, నా పొడైనా మీకు గిట్టడం లేదు. పిచ్చిదాన్ని కనక, మీరెంత తోసేస్తున్నా, మిమ్మల్నే పూసుకు తిరుగుతాను. మీరు సంతోషంగా ఒక్కమాట మాటాడితే, అదే పండగ గనుకుంటాను. కాని, నే నెదురుగా వస్తేనే మీకు చిరచిరలు, బురబురలు!

[పడక కుర్చీలోనుంచి గభాలున లేచి, భర్త వగాగు చేయి సాగించుస్తాడు.

భార్య. అయ్యో! కూర్చోండి - పాపం! - కూర్చోండి. నామూలాన మీకు లేనిపోని కాళ్ళ తిప్పటలాడా చేనికి లెండి!.... చదువురానిదాన్నని మీకు మొదటే తెలుసుగా! తెలిసికూడా న న్నెందుకు చేసుకున్నారు? ఆ కిరస్తానీదాన్నే కట్టుకోక పోయారూ? కిసకిసలాడుతూ మాట్లాడుతూ దాంతో హాయిగా....

[పళ్లు నూరుతూ, భర్త "హుం!" అంటూ హుంకరిస్తాడు.

భార్య [తెగించినట్టు]. జడిపించినంతకాలం జడిపించారు - ఇంకేమి జడిపిస్తారు లెండి. ఇదేనాటి ఈతమో! లేకపోతే అది ఇప్పుడీ వూరు బదిలీ ఎందుకు చేయించుకుంటుంది? "నాతోపాటు కాలేజీలో చదువుకుంది. ఇస్కూళ్ళ ఇనస్పెక్టరమ్మ" అంటూ దానికి నాచేత అడ్డమైన వూడిగం చేయించారు. కాఫీలు, ఫలహారాలు, భోజనాలు - ఓం! ఏం చేయించ లేదు?.... దాని కాళ్ళు పట్టించడ మొక్కటే మినహా. నల్లగా - కొరివిలా - కోతిముండ! ముట్టుకుంటే చేతికి ఎక్కడ మసి అవుతుందో అన్నట్టుగా వుంటుంది. మరి, దాని అందం ముందు నా అందం పట్టడం లేదు కాబోలు! ముఖానికి ఇంత బూడిద కొట్టుకుని, చేతికి సలుసంత గడియార మొకటి తగిలించుకుని, కాళ్ళకు గాడిద గిట్టల బూడ్సులు వేసుకుని, టిక్కుటక్కుమంటూ ఆ వొక్క పీసు గొచ్చి [వెక్కిరిస్తున్న గొంతుతో] "అలో" అనేసరికి ముఖం చేటంత అవుతుంది. ఇక దాంతో ఒక్కటే పకపకలు, యికయికలు! నే నెక్కడ వినిపోతానో అని ఇంగ్లీషులో తప్ప మాట్లాడరు. ఆ యింగిలిపీసు రాకపోతేమాత్రం నాకు కళ్ళు లేవూ మీ నాటకమంతా చూడ్డానికి. ఈమధ్య మరీ ఆ యింటినుంచి ఈ యింటికి, ఈ యింటినుంచి ఆ యింటికి నడిచే పుస్తకాలు పుస్తకాలు కావు; పత్రికలు పత్రికలు కావు. వాటితోపాటు ఎన్ని వుత్తరాలు నడుస్తున్నాయో! మీరు విడిచిన చొక్కా మొన్న చాకలికి వేస్తూ జేబు చూద్దును గదా, సినిమా టిక్కెట్లు రెండు కనబడ్డాయి. దాన్ని వెంటబెట్టుకు వెళ్లారు కాబోలు! లేకపోతే

రెం డెందు కుంటాయి? ఇంతకాతి కొచ్చాక ఇంకా చాటు దేనికి? వెరీదిగానే ఆ పోరిని తెచ్చి ఇంట్లో పెట్టుకోరాదూ?

[illegible]

భార్య. నేలని తన్నడం దేనికి! మీకు కాలు నొప్పిపుడుతాది! నన్నే తన్నండి. తన్ని తగిలేస్తే, మీకు పీడ విరగడై పోతుంది. [శాసడింపుగా] పాపం! ఆ పోరిది కష్టాలమారి బ్రతుకట. దానికి "నా" అన్న వాళ్ళెవ్వరూ లేరట. అమ్మా, నాన్నా చిన్నతనంలోనే పోయారట. ఎంత పెద్ద ఉద్యోగం చేస్తున్నా, ఎంత జీతం తెచ్చుకుంటున్నా దానికి సుఖమే లేదట. దాని ఉద్యోగానికీ, సంపాదనకీ ఆశపడి వచ్చేవాళ్ళని చూస్తే దానికి కంపరమట. దాని ఛాయా వాళ్ళెవ్వరూ దాన్ని వలచి రారట. అదంటే ఎంత జాలి! పోనీ, మీరే ఆ పిల్లని కట్టుకోరాదూ!

[illegible]

భార్య [ఇంకా విరగబడి]. అగిపోయారే! కొట్టండి. పిల్లలతల్లికి ఆ ముచ్చటే తక్కువగా వుంది. ఇంతకాలంనుంచి దిగమింగి వూరుకున్నా! ఏమైనా సరే, ఇక వూరుకునేది లేదు. అది వుండడమో, నేనుండడమో ఇవ్వాళ తేలిపోవాలి. మీకు వొండి పెట్టడానికి నేను కావాలే? మీకు పిల్లల్ని కనడానికి నేను కావాలే? మీతో మాట మాట్టాడ్డానికి మాత్రం నేను పనికి రాను! ఎంత చదువురాని మొద్దునైతే మాత్రం మీకు పూడిగంచేస్తూ మూల పడివుండాలని ఎక్కడున్న దేమిటి? పొట్టకూటికి నే నేమీ ముఖం వాచి లేను. కావాలంటే ఇంత

ముద్దపెట్టడానికి నాకు అమ్మా బాబూ వున్నారు. "ఆయన మనస్సు విరిగిపోయాక—ఛీ—ఇంకా నే నిక్కడ దేనికి?" కని ఆ పీడాకారి ముండ ఈ వూరొచ్చిన మూడు నెల్లనుంచీ నే ననుకోని రోజు లేదు. కాని, పిల్లలే తగలాటమై పోయారు. వాళ్ళ నొదిలిపెట్టి వెళ్ళలేక....

[తువ్వాలు పైన వేసుకుని భర్త వీధిలోకి దారితీస్తాడు.

భార్య. దాని దగ్గిరికేనా ప్రయాణం? వెళ్ళండి! వెళ్ళండి! నా కాపరం తియ్యడానికే అ దిక్కుడికి తగలడింది.

[వీధితలుపు గుభేలున వేసి భర్త వెళ్ళిపోతాడు.

భార్య. అనాకారి ముండ! నా ప్రాణానికి అ దెక్కడినుంచి దాపరించిందో? దాని శిరుసు పగల! దా నింట్లో పీనుగెళ్ళ! [ఒక క్షణం ఆగి] దాని కొంపకే వెళ్ళుండాలి. ఇంత రాత్రి వేళ ఇం కెక్కడికి వెడతారు? ఆఫీసు పనయ్యాక అక్కడే కూర్చొనొస్తూ వుండాలి. లేకపోతే, రోజూ ఎనిమిది, తొమ్మిది గంటలదాకా ఏమి పను లుంటాయ్! దిక్కుమాలిన ముండ! సిగ్గుమాలిన కుంక! దానికి బుద్ధిలేకపోతే ఈయనకైనా ఇదుం డొద్దూ? [వీధితలుపు తీసి, వీధివంక తేరిపారజూచి వచ్చి] దాని కొంప పడమరవీధిలో వుంటే, ఇలా తూర్పుకు వెళ్లారు దేనికో? ఆఁ! అదొక వేషం!....రెండు బజార్లు చుట్టి వెళ్ళి, దాని తలుపు కొడతారు. ఈసరికి అస లటు తిరిగే వుండాలి. మాయదారి ముండ! పండంటి నా కాపరానికి చిచ్చుపెట్టడానికే అ దిప్పుడు.... [చప్పున ఏదో జ్ఞాపకానికి వచ్చినట్లు] ఆఁ! అన్నట్టు, ఇస్కూళ్ళ తనిఖీకి వారంరోజులనాడే వెళ్ళిందనీ,

ఇప్పటిలా అది తిరిగి రాదనీ ఈః వారినిపోతూ నిన్న దాని బంట్రోతు చెప్పిపోయాడుగా? [పెద్ద తప్పు చేసినదానివలె నోరు నొక్కుకుంటూ] అయ్యో! అయ్యో!! ఎంత పాపిష్ఠి దాన్ని! ఉత్తపుణ్యానికి నోటి కొచ్చిన కారుకూత లన్నీ కూసి ఇంత రాత్రివేళ ఆయన్ని బయటికి తగిలేశాను. మబ్బు మూసుకొస్తున్నది. కొంపతీసి చినుకు పడుతుందేమో! తడిస్తే ఆయన కిట్టే జలుబు చేస్తుంది! నేనిప్పు డేం చెయ్యను? అయ్యో! నేనిప్పు డేం చెయ్యను? ఇరు వొకసారి ఏదో మాటా మాటా వచ్చి, ఇలాగే తెల్లవార్లూ వీధివెంట తిరిగి తిరిగి, తెల్లవారేసరికి పుట్టెడు జలుబుతో, జ్వరంతో యింటి కొచ్చారు! అప్పుడు వారం రోజులబగాని ఆయన కోలుకో లేదు. పాపిష్ఠిదాన్ని! ఇప్పు డాయన కేమి తెచ్చిపెట్టడాని కింత రాద్ధాంతం చేశానో గదా! [నెత్తీ నోరూ కొట్టుకుంటూ] నా బొంద పడ! నే నెంత పాపిష్ఠిదాన్ని! అయ్యో! అయ్యో!!

తెర]



# పాత్రలు

రామయ్య : ఒక పల్లెటూరి గృహస్థు

మహాలక్ష్మమ్మ : అతని భార్య

వెంకటరావు : అతని కుమారుడు

సీతాపతి : అతని పెరిగిపిన బావమరిది

## స్థలం

రామయ్యగారి ఇంటి చావడి

## కాలం

వర్తమానం



# శకునపక్షి

పల్లెటూరి ఆసామి ఇంటిచావడి. కుడివైపున సింహద్వారం; ఎడమవైపున పెరటిలోకి ద్వారం. ఈ రెండు ద్వారాలకు ఒక్కొక్క పార్శ్వంలో ఒక్కొక్క కిటికీ. ఎదురుగా మరి రెండు ద్వారాలు; మొదటిది పడకగదిలోకి, రెండవది పడమటింటిలోకి. ఈ రెండు ద్వారాలమధ్య పసుపు కుంకుమలతో ఇనపపెట్టె. దానిపైన గోడ కాన్చి ధనలక్ష్మి పటం. దానికి ముద్దబంతి పూలదండ. వీధితల గోడమూలకూ, పడకగది ద్వారానికీ మధ్యగా ఒక పెద్ద బీరువా. చావడిమధ్య ఒక పడకకుర్చీ; దానిచెంత ఒక బెంచీ.

రామయ్య పడకకుర్చీలో కూర్చుని, బెంచీపైవున్న దస్త్రంలోనుంచి వరసగా దస్తావేజులు తీసి, వాటి పేజీలు తిరగవేస్తూవుంటాడు. అతడు యాభయ్యోపడిలో పడినవాడు. కురచగా, బొద్దుగా, గుమ్మటాన్ని పోలినవాడు. గుండుముఖం, గుండ్రని పెద్దకళ్లు. నుదురు కూడా పెద్దదే. అంటకత్తిరించిన క్రాఫు. మీసం గడ్డాలు లేవు. కొంచెం బొంగురు గొంతు. మాటతీరులో "స్వసహర్తను సుమీ!" అనే భేషజం కనబడుతూ వుంటుంది. నీర్కావిధోవతి కట్టి, తెల్ల లాల్చీ వేసుకున్నాడు.

మహాలక్ష్మమ్మ చాపమీదనే ఒక పక్కగా కూర్చుని, కందిపప్పు చేట ముందు పెట్టుకుని, రాళ్లు యేరివేస్తూ వుంటుంది. వయస్సు నలభై ప్రాంతం. అశుభం శుభం ఎరుగని పల్లెటూరి యిల్లాలు.

ముక్కుపైకి జారిన కళ్ళజోడును సరిగా తోసి, కొత్త దస్తావేజును అందుకోబోతూ, "కాసిని మంచినీళ్లు తేవే!" అని రామయ్య అంటాడు. పప్పు చేట చాపమీదనే వదిలిపెట్టి, మహాలక్ష్మమ్మ పడమటింటి గుమ్మంగుండా లోపలికి వెళుతుంది.

ఇంతలో సీతాపతి వస్తాడు. వయస్సు నల్భై లోపు. [illegible], కాయలాంటి శరీరంతో, [illegible]లాంటివాడు. సంస్కారం లేని వొత్తు క్రాపు; మాసిన గడ్డం; [illegible]. [illegible] బాగులవాడినట్టే కనబడినా, [illegible] మించినవాడు. నీర్కావి ధోవతికట్టి, నీర్కావి ఉత్తరీయం వేసుకున్నాడు. భుజాన్న తుండుగుడ్డ, చేతిలో [illegible].

రామయ్య [అలికిడి కాకుండా వచ్చిన సీతాపతిని చూడగానే].
ఏం సీతాపతీ! ఇంతపొద్దు పోయాక ఇలా వొచ్చావ్?

సీతాపతి [తెచ్చి పెట్టుకొన్న నవ్వుతో]. "పొద్దున్నే వచ్చిన వాన, పొద్దోయి వచ్చిన చుట్టం పోయేది లే"దని మా రామయ్య బావయ్యకు అప్పుడే దిగులు పుట్టించేమిటి?

రామయ్య. నీ సామెతల కేమిలే! అయినదానికీ, కానిదానికీ ఒక సామెత విసురుతూ వుంటావ్. ఇప్పు డెందు కిలా ఊడి పడ్డట్టు?

సీతాపతి. ఆఁ! ఏమీ లేదు, పూరికేనే.

రామయ్య. ను వ్వూరికే రావేఁ!

సీతాపతి. నీ కొాకరి అంటూ సొంటూ గిట్టదు. "నన్ను ముట్టుకోకు నా మాలకాకి" అంటావ్. మరి అందరం అలా వుండ గలమా ?

రామయ్య. సర్లే! ఇంతకూ ను వ్వొచ్చిన పనేమిటో చెప్పరాదూ? దాపరికం దేనికి ?

సీతాపతి. "చల్ల కొచ్చి ముంత దాస్తున్నా"ననే! నీ దంతా చోద్యం, రామయ్య బావా !

రామయ్య. నువ్వు వెయ్యి చెప్పు; లక్ష చెప్పు. వూరికేనే వచ్చా వంటే నేను నమ్మలేను.

సీతాపతి [నవ్వుతూనే బెంచీపై కూర్చుంటూ]. "లాభంలేని సెట్టి వరదను పోడంటావ్"—అంతేనా ? ఇఖ ఒక చుట్టం, పక్కం, రావడం, పోవడం, మంచీ, చెడ్డా ఏమీ లేదన్న మాటే !

రామయ్య. మాటలు నేర్చావులే ! ఇంతకూ ఏమిటీ సంగతి ?

సీతాపతి. ఆఁ ! మరేమీ లేదు. మా లక్షువమ్మకు సుస్తీ చేసినట్టు విని, వుండబట్టలేక చూచిపోదా మనొచ్చా ! "వలచి వస్తే మేనమామ కూతురు వరస కా"దనే రకం నీది. నువ్వు నన్నెంత పరాయివాణ్ణిగా చూసినా, అది నాకు వే లిడిచిన చెల్లెలు. [పడమటింటి గుమ్మంగుండా మంచినీళ్ళ గ్లాసుతో మహాలక్ష్మమ్మ వస్తుంది.] నీ మాటే అంటున్నా నమ్మా! నీకు నూరేళ్ళాయిస్సు. ఏ మమ్మా?—కొంచె మేమో సుస్తీ చేసిందట !

మహాలక్ష్మమ్మ. ఔ నన్నయ్యా! అసలే కొంప ఊపిరివాన్ని. ఈ గాడ్పులకు ప్రాణం మరింత బేజారై పోతున్నది.

[ఈ మాటల్ని అంటూ గ్లాసు నుంచి నీళ్లు ఒంపింది, తను తెచ్చిన పస్సు చేటుముంచు తిరిగి సర్దుకుంటుంది.

సీతాపతి. రామా, మరి? "రోహిణీ కార్తెలో రోళ్లు బద్దలౌతా" యని ఊరికే అన్నారూ? ఈ యేడు మరీ నిప్పుల్ని చెరుగుతున్నది. ఈ వడమటి గాడ్పులకి మా పిల్లలు అవిటిల్లి పోతున్నారు. చల్లబొట్టుకూడా లేదేమో. ఎండి వాటగై పోతున్నా రంటే నమ్మ.

[సంగి కాసిన కంచుపస్సు తీసి నోట్లో వేసుకుంటాడు.

మహాలక్ష్మమ్మ. మీ కిప్పుడు పాడి లేదేమి, అన్నయ్యా?

సీతాపతి. లేదమ్మా! నల్లవట్టి ఎండిపోయింది: ఎర్ర గేదేమో ఎత్తడి పోయింది; బోడావు పాలు ఊడకే చాలడం లేదు. "పాడిలేని యిల్లు పాతాళలోకం". ఒక్కనీళ్ళయినా లేక నానా శెరా పడుతున్నాం.

మహాలక్ష్మమ్మ. పోనీ, ఎక్కడైనా అణా పెరుగు వారిక పెట్టుకోకపోయారా, అన్నయ్యా?

సీతాపతి. ఏమో నమ్మా! "అమ్మబోతే అడివి; కొనబోతే కొరివి." అణా పెరుగన్న పేరేకాని, యిల్లు గడుస్తుందా, పెడుతుందా? అక్కడికీ ఈ మధ్య మా చిన్నల్లుడు పండక్కి వచ్చాడని ఆ ముసిలిముండ లేదూ?—కాపు వీధి రామమ్మ—దానిదగ్గిర వారం రోజులు పెరుగు పోయించుకుంటే, లోట

లోట నీళ్ళు పోసింది. అయితే అమ్మాయ్! మన పాలెం పడ్డ
ఈనిందటగా ?

మహాలక్ష్మమ్మ. ఈనింది. కాని, ఏం లాభం? నిన్న దూడ నిడుస్తూ
వుంటే, ఆ పాడుముండ - చెరువుగట్టు శేషమ్మ - కన్ను
పడింది. దాంతో ఇఖ ఒఖ్ఖ జీరైనా రాలిస్తే వొట్టు.

సీతాపతి. ఆ మాయదారిముండ మన కెక్కడ దాపరించిం దమ్మా!
"నరుడికంట నల్లరాయి పగుల్తుంది." పాటిమీది సాయబును
పిలిపించి దిష్టితాడు వేయించక పోయావా ?

మహాలక్ష్మమ్మ. మా చిన్న పాలేర్ని వెళ్ళిరమ్మంటే, ఆ వెధవ
తలాయించాడు.

సీతాపతి. "తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు." ఈ పిదప
కాలంలో పాలేళ్ళు తిన్నగా మాట వింటారుగా(! వాళ్ళ కళ్ళు
నెత్తికొచ్చాయ్. "పత్తిగింజలు తింటావా బసవన్నా అంటే,
ఆహా అన్నాడట; గంత కట్టనా బసవన్నా అంటే, ఊఁహూ
అన్నాడట." అలా వుంది వాళ్ళ పనిప్పుడు. రేపు నే నెళ్ళి
ఆ సాయబును పిలుచు కొస్తాలే! ఇబ్బందో, సబ్బందో నువ్వు
రోజూ కాసిని మజ్జిగనీళ్ళు పంపించకపోతే మేం బతకడం
కష్టం.

రామయ్య. [అప్పటివరకు పడకకుర్చీలో వాలి, దస్తావేజుల్ని
చూచుకుంటున్నవాడు చప్పున నిటారుగా కూర్చుని]. అదీ
వరస! నేను ముందే అన్నాగా? ఏదో పని పడకపోతే నువ్వు
రాకే!

సీతాపతి. వినవమ్మా, విను - మహాత్మగారి మాటలు: "అయిన వాళ్ళకు ఆకుల్లోను; కానివాళ్ళకు కంచాల్లోను." మొన్న రెవిన్యూ ఇనస్పెక్టరుగా వొస్తే, పెద్దదన్నా నెయ్యి సమర్ప యామీ చేశాడు. కాని, కాసిని మండికపిగిన సీళ్ళు నే నడిగితే, ఎన్ని చదువుతున్నాడో!

రామయ్య. నాకు తెలుసులే నీ సంగతి! కాలికి వేస్తే మెడకి, మెడకి వేస్తే కాలికి. ఇంతకీ మాటలు నేర్చావ్. మగ్గికోసం వచ్చినవాడివి ముందే ఆమాట చెప్పరాదూ? పరామర్శ, గిరామర్శ అంటూ ఈ నాటకమంతా దేనికి?

సీతాపతి. వెనకటి కెవడో "కడుపులో లేంది కావిలించుకుంటే వొస్తుందా?" అన్నాట్ట. నీకు నావాళ్ళన్న మాటే లేనప్పుడు నే నెందుకోస మొచ్చినా. ఏదో దాముకోడాని కొచ్చినట్టు వుంటుంది. అసలు నీ చెల్లెలుకూడా "మా వొదినకు సుస్తీగా వుందట, చూసొద్దా" మంటూ బయల్దేరింది. కాని, "పొద్దు పోయిందిలేవే. ఇప్పు డేమొస్తావ్?" అని నే నొక్కర్తినే చక్కా వొచ్చా.

మహాలక్ష్మమ్మ. ఔ నన్నయ్యా! పొద్దు పోయింది. [భర్తతో] ఏమండీ! అబ్బాయి ఇంకా భోజనానికి రాలేదు. పొద్దున్నెప్పుడో రెండు మెతుకులు తినెళ్ళాడు. లైబ్రీలో వున్నాడేమో అటొక అడుగేసి రండి.

రామయ్య. వాడేమి చిన్నవాడా? చితకవాడా? వాడికి ఆకలైతే వాడే వొస్తాడు. సంసారం సంగతి సుతరామూ పట్టించుకోకుండా

వాడు ఊరుమీద బలాదూర్ తిరుగుతూవుంటే పాత్వెనోళ్ళన్నేను పరుగులెత్తలేను.

సీతాపతి. "సముద్రం ఈదవచ్చుగాని, సంసారం ఈదరాదు." ఈ కాలపు నాగమ్మల కేం తెలుస్తాయ్, సంసారంలోని సాధక బాధకాలు? అన్నదమ్ముల్లో పంచుకున్నది నాలు గెకరాల కొండ్ర, దాన్ని నీ ప్రయోజకత్వంవల్ల నలభై యెకరాల కండ్రిక చేశావ్.

రామయ్య [పొగడ్తకు లోలోపల సంతోషిస్తూ, పైకి మాత్రం]. ఆఁ! మన ప్రయోజకత్వ మే మున్నదిలే!

సీతాపతి. నీ ప్రయోజకత్వం కాకపోతే మరేమిటి, రామయ్య బావా? పట్టిందల్లా బంగారం చేస్తావ్. వ్యవహారాన్ని నడిపించడంలో కొమ్ములు తిరిగిన ప్లీడరైనా నీ తర్వాతే! నువ్వు కాబట్టి అన్ని కోర్టులూ తిరిగి, ఆ వారసత్వం వ్యాజ్యంలో నెగ్గుకొచ్చావు గాని, మరొకడైతే పేడకడిలా చతికిలబడేవాడు కామా?

రామయ్య. నువ్వైనా సామాన్యుడివా? ఐదుగురు ఆడపిల్లల్ని విరగడచేశావ్; అప్పూ సప్పూ లేకుండా గుట్టుగా సంసారం చేస్తున్నావ్.

సీతాపతి. ఆఁ! చెప్పుకోక, చెప్పుకోక నా మాటే చెప్పుకోవాలీ! "వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు తులాభారం తూగితే; కరెడ్ల కామమ్మ వంకాయలభారం తూగిందట. నీకంటె నాలు గెకరా లెక్కువే పంచుకున్నా. కాని, "నానాటికి తీసికట్టు నాగంభొట్టు" అన్నట్టుగా వుంది నాపని. చివరికి పుగాకు

పాయకైనా తికానా లేదు. వెనకటికి నాబోటి వా డెవడో "దశా దశా రమ్మంటే, దరిద్రాన్ని పిలవమన్న"దట. దశంటే నీదే దశ! ఏదీ, రామయ్య బావా! ఒక పుగాకుకా డిలా పారెయ్!

రామయ్య. ఇస్తాలే - కాస్త ఆగు [భార్యతో]. అయితే, ఏమే! పడమటిపొలం క్రయందస్తావేజు కనబడదేం?

మహాలక్ష్మమ్మ. ఏమో, నాకేం తెలుసు?—నేను వాటి జోలికీ సొంటికీ పోతాను గనకనా!

రామయ్య [చావడిలోని బీరువా వద్దకు లేచివెళ్ళి, దాని తలుపులు తెరచి, లోపలవున్న రికార్డులను ఒక నిమిషం ఇటూ అటూ తిప్పి]. ఈ బీరువాలోనే పెట్టిన జ్ఞాపకం. [మరొక క్షణం వెదకి]. ఊహుఁ! ఇక్కడ లేదు. గదిలో పెట్టలేదుగదా?

మహాలక్ష్మమ్మ. ఎక్కడ పెట్టుకున్నారో, ఏమో?—మీకే తెలియాలి! మీ కాగితాల కిల్లంతా చాల్దం లేదు.

రామయ్య. చాల్లే!—ఇఖ కట్టిపెట్టు! ఆ కాగితాల విలువ నీ కేం తెలుసు. కొంపను నిలబెట్టినా, కూల్చినా వాటికే చెల్లు!

[ఈ మాటలు అంటూనే పడకగదిలోకి వెడతాడు.

సీతాపతి. మా బావయ్యకు కాగితాలుంటే చాలు - కడుపు నిండుతుంది [చారెడు పప్పు తీసుకుంటూ]. సరిగాని, అమ్మాయ్! కాస్త మాట దక్కిస్తావుగా?

మహాలక్ష్మమ్మ. మజ్జిగ మాటేనా? నువ్వింత యిదిగా అడుగుతూ వుంటే కాదనగలనా, అన్నయ్యా?

సీతాపతి. కాదన్నమాట నీనోట రావడమే! "కన్నుచూసి కాటిక; పిర్రచూసి పీట" వ్యవహారం కాదు నీది. కలవారైనా, లేనివారైనా, చుట్టపక్కాలందర్నీ ఒక్క మాదిరిగా చూసుకుంటావ్. నువ్వు అడుగుపెట్టిన వేళావిశేషంవల్లనే ఈ యింటి కింత అయిశ్వర్య మబ్బింది.

మహాలక్ష్మమ్మ. ఆఁ! నా దే మున్నదిలే! అది మా అబ్బాయి అదృష్టం. వాడు కడుపున పడ్డాకే మాకు కలిసొచ్చింది.

సీతాపతి. ఔనమ్మా! "బిడ్డ పుట్టినవేళ; గొడ్డు వచ్చినవేళ" అన్నారు. వాడి దసలు సిరిగల ముఖం. వాడికంటె తెలివిగలవాడు ఈ వూళ్ళో వున్నాడా? వాణ్ణి మించి చదువుకున్నవాడున్నాడా? వాడి మాట, వాడి మంచి, వాడి మర్యాద—వాడికి వాడే తగు!

మహాలక్ష్మమ్మ. ఔ నన్నయ్యా! ఊళ్ళో వాళ్ళందరు వాణ్ణి నెత్తి నెట్టుకుంటారు. కాని, మీ బావయ్యకుమాత్రం వాడి పొడయినా గిట్టదు. అది మరి వాడి ఖర్మమో, నా ఖర్మమో!

సీతాపతి. ఆఁ! మా బావయ్య మాటల కేమిలే? "నా యింటికి నేనే పెద్దను, పిల్లికి పెట్టరా పంగనామాలు" అంటాడు. ఆయన మాటల్ని నువ్వు పట్టించుకో వద్దమ్మా! మన వెంకట్రావు కేఁ? నిక్షేపంలాంటి వాడు. "తల్లికి తగిన బిడ్డ; ఇంటికి తగిన పందిరి" అన్నారు. వాడి వన్నీ అచ్చంగా నీ పోలికలే! కట్టుకున్న పెళ్ళాం మంచితనం మా బావయ్యకు తెలిసింది కనకనా, కన్నకొడుకు మంచితనం తెలియడానికి? పెద్దలన్నారుగా "చూడగా, చూడగా గుఱ్ఱం గాడిదై౦"దని.

మహాలక్ష్మమ్మ. నువ్వు నిజం పలుకుతా వన్నయ్యా! వాడికి వడ సారం యిరవై యేళ్ళయినా లేవు. అభం శుభం యెరగని పిచ్చి సన్నాసి. ఇప్పణ్ణుంచీ వాణ్ణి సంసారం తీర్చి దిద్ద మంటాడు మీ బావయ్య.

సీతాపతి [తిరిగి కందిపప్పు అందుకోబోగా, మహాలక్ష్మమ్మ తానే చారెడు తీసి, అతని చేతిలో పోస్తుంది]. తనలా అందరూ నమలకుండా మింగా లంటాడు. ఇప్పు దే మంత పట్టించుకో కోకుండా తిరిగినా, నాలుగేళ్లు పైబడితే, అంతా వాడే దిద్దుకు పోడూ? "తుళ్ళే యెద్దే గోనె మోసేది."

మహాలక్ష్మమ్మ. ఇప్పుడైనా ఏవో మీటింగులు. గీటింగులైతే వెళ్ళడం తప్ప, వాడైనా ఏమీ అల్లరి చిల్లరిగా తిరగడం లేదు.

సీతాపతి. అల్లరి చిల్లరగా తిరగడానికి వాడు దద్దమ్మ టమ్మా? చిన్నతనంనుంచీ చక్కగా చదువుకున్నాడు. మా దేభ్యాన్ని చూడు! మూడేళ్ళనుంచీ ఇంకా మూడోక్లాసులోనే మిటక రిస్తున్నాడు. "అన్నం చొరవే కాని, అక్షరం చొరవ లేదు." ఆఁ! అమ్మాయ్! అన్నమంటే చప్పున జ్ఞాపక మొచ్చింది. ఈ మండు టెండాకాలంలో కూరా నారా లేక ఏమి యిబ్బంది పడుతున్నా మనుకున్నావ్!

మహాలక్ష్మమ్మ. ఔ నన్నయ్యా! అందరికీ చెడ్డ యిబ్బందిగానే వుంది.

సీతాపతి. నిజమే నమ్మా! ఇంతో అంతో అందరికీ యిబ్బందిగానే వుంది. కాని, మాకు మరీనీ! ముతక సామెత చెబుతారు చూచావ్: "మొగుడు లేకపోతే అప్ప మొగుడు; కూర

లేకపోతే పప్పుకూర"—అలా వుంది మా పని. సాంబారు కారం, మామిడికాయ పచ్చడీ పూటపూటా మొదానవేసి కొట్టు కుంటున్నాం. నోరు చవి చచ్చిపోయిందంటే నమ్మ. అయితే, అమ్మాయ్! మా బావ వామిదొడ్డిలో కందా పెండలం పండించా డటగా? నీకు పుణ్య ముంటుంది - మాకు కాస్త పంపిద్దూ!

మహాలక్ష్మమ్మ. ఆc! దాని కేమి భాగ్యం! రేపో మాపో అలాగే పంపిస్తాలే, అన్నయ్యా!

సీతాపతి. తోడబుట్టిందైనా అంత మాట మా మంగినోట వొచ్చింది కాదు. "మాటలు తేటలు మాయింటను; మాపటిభోజనం మీ యింటను" అంటుం దది. సరిగాని అమ్మాయ్! నే నెళ్ళి మన వెంకట్రావును కూకేసిరానా?

రామయ్య [దస్తావేజుతో చావడిలోకి తిరిగి వస్తూ]. వొద్దులే! వాడి కేం తీపరమా? వాడి కడుపు కాల్తే వాడే వస్తాడు.

మహాలక్ష్మమ్మ. మీదంతా అడివిగోల! కాస్త వెళ్ళి పిలుచుకు రానిద్దురూ! వాడికోసం నేను కనిపెట్టుకు కూర్చున్నా.

రామయ్య [తిరిగి పడకకుర్చీలో కూర్చుంటూ]. వాడు పెత్తనాలు చేస్తుంటే, వాడికోసం నువ్వెగరడం దేనికి? నువ్వెళ్ళి భోంచెయ్యి.

మహాలక్ష్మమ్మ. నా మాట కే మొచ్చె? భోంచేస్తా లెండి.

రామయ్య. వాడికోసం కనిపెట్టుకు కూర్చుంటూ వేళకూ, పాళకూ తిండి తినకపోతేనే ఈకాడి కొచ్చావ్. నువ్వు మూలబడితే ఇంటిచాకిరి నీ సవితి ఎవ తొచ్చి చేస్తుంది?

మహాలక్ష్మమ్మ. నువ్వు నిజం పలుకుతా వన్నయ్యా! వాడికి వడ సారం యిరవై యేళ్ళయినా లేవు. అభం శుభం యెరగని పిచ్చి సన్నాసి. ఇప్పణ్ణుంచీ వాణ్ణి సంసారం తీర్చి దిద్ద మంటాడు మీ బావయ్య.

సీతాపతి [తిరిగి కందిపప్పు అందుకోబోగా, మహాలక్ష్మమ్మ తానే చారెడు తీసి, అతని చేతిలో పోస్తుంది]. తనలా అందరూ నమలకుండా మింగా లంటాడు. ఇప్పు డే మంత పట్టించుకో కోకుండా తిరిగినా, నాలుగేళ్లు పైబడితే, అంతా వాడే దిద్దుకు పోడూ? "తుళ్ళే యెద్దే గోనె మోసేది."

మహాలక్ష్మమ్మ. ఇప్పుడైనా ఏవో మీటింగులు. గీటింగులైతే వెళ్ళడం తప్ప, వాడైనా ఏమీ అల్లరి చిల్లరిగా తిరగడం లేదు.

సీతాపతి. అల్లరి చిల్లరగా తిరగడానికి వాడు దద్దమ్మ టమ్మా? చిన్నతనంనుంచీ చక్కగా చదువుకున్నాడు. మా దేభ్యాన్ని చూడు! మూడేళ్ళనుంచీ ఇంకా మూడోక్లాసులోనే మిటక రిస్తున్నాడు. "అన్నం చొరవే కాని, అక్షరం చొరవ లేదు." ఆఁ! అమ్మాయ్! అన్నమంటే చప్పున జ్ఞాపక మొచ్చింది. ఈ మండు టెండాకాలంలో కూరా నారా లేక ఏమి యిబ్బంది పడుతున్నా మనుకున్నావ్!

మహాలక్ష్మమ్మ. ఔ నన్నయ్యా! అందరికీ చెడ్డ యిబ్బందిగానే వుంది.

సీతాపతి. నిజమే నమ్మా! ఇంతో అంతో అందరికీ యిబ్బందిగానే వుంది. కాని, మాకు మరీనీ! ముతక సామెత చెబుతారు చూచావ్: "మొగుడు లేకపోతే అప్ప మొగుడు; కూర

సీతాపతి. "చదువుకున్న వాడికంటె చాకలివాడు మేలు." ఏమిటో ఈ కాలం చదువులు! వానాకాలం చదువులు! బియ్యే, గియ్యే సతికా పుంటారుగాని, చివరికి చూడబోతే నోటుమీద వసూ లెయ్యడమైనా చేతకాదు.

రామయ్య. ఏం చదువులో చట్టుబండలు! మొన్న ప్లీడరుగారి దగ్గరి కెళ్ళి, దావా వాయిదా వేయించుకు రారా అంటే, తెడ్డే మిరా కదిలాడు కాదు.

సీతాపతి. "మాటలు కోటలు దాటతాయి; కాలు గడప దాటదు."

రామయ్య. అబ్బే! అదీ లేదు. ఇంటి పనికైతే మొండి కాని, ఊళ్ళో పనికైతే యెగిరి గంతేస్తాడు. అడ్డమైన పనికీ, అడ్డమైన వాడితో, అడ్డమైన చోటుకూ తిరిగి, కొంపకేమి చేటుతెస్తాడో నని బెంగపడి ఛస్తున్నా.

సీతాపతి. నిజమే రామయ్య బావా! "పోరాని చోట్లకు పోతే, రారాని మాటలు రాక మానవు". తన కేమి తక్కువ? మహా రాజులా అనుభవిస్తూ ఇంటిపట్టున కూర్చోక, లేని పోని గొడవలన్నీ మనవాడి కెందుకో? "కాలిది తీసి, నెత్తికి రాసు కోవడ" మంటారు దీన్నే.

రామయ్య. అబ్బబ్బబ్బే; ఇంటిపట్టున కూర్చుంటే యెలా? అయితే, మరి సభ లెవరు తీరుస్తారు? ఉపన్యాసా లెవ రిస్తారు?

సీతాపతి. "పగటి మాటలు పనికిచేటు; రాత్రి మాటలు నిద్రచేటు." ఎందుకొచ్చినట్టు ఈ సభలూ, గిభలూ. [రామయ్య తుమ్ము తాడు] చూచావ్, నామాట నిజం! "తుమ్ము తమ్ముడై చెబు

తుంది". సరిగాని, రామయ్య బావా! నా అకుమడి బొత్తిగా అంటనే లేదు. "దరిద్రుడు తలగడగబోతే, వడగండ్లవాన వెంబడే వచ్చిం"దట. పదిపోగుల అకు తక్కువ పడితే, నువ్వు ఎలాగైనా కాస్త మాట దక్కించాలి.

రామయ్య. తడు పందక మా అకుమడీ అంతంత మాత్రంగానే వుంది. మీ తమ్ముడు లక్ష్మయ్య నడగరాదూ? ఎకరం మడి పోశాడట.

సీతాపతి. "నంబీ! నంబీ! నాపెళ్ళి కేమి సాయం చేస్తావంటే, నే నెదురు రాకపోవడమే సాయమన్నా"డట. అబ్బే! వాడి నడిగితే మాట పోతుంది. కాస్త రాలిస్తే నువ్వే రాల్చాలి.

రామయ్య. సరే! వీలునుబట్టి చూస్తాలే!....ఏమైనా పొలంపనీ, ఇంటిపనీ, కోర్టుపనీ - అన్నీ నేనే చూచుకోవాలి. వా డేమీ పట్టించుకోడుగదా? ఇటు వ్యవసాయానికీ, అటు ఉద్యోగానికీ కాకుండా చెడిపోయాడు. తాలూకా సభలనీ, జిల్లా సభలనీ చిటికీ మాటికీ బస్సెక్కి బస్తీలకు పరిగెత్తడం ప్రారంభించాడు కూడా.

[తనకోసం రామయ్య తీసి పెట్టుకున్న పొగాకు తునక కుర్చీపక్కకు జారి పడుతుంది. అతడు దాన్ని గమనించడు.

సీతాపతి [రామయ్యదగ్గరికి జరిగి, జారిపడిన పొగాకు తునకను కాజేస్తూ]. "చెబితే సిగ్గు, దాస్తే దుఃఖం." వా డున్నాడే - వాడు, రామయ్య బావా! - కొత్తపేట కోటయ్యగారి రెండో వాడు - వాడి పే రేదో యేడ్చింది! - ఆ వెధవ జతపట్టి మన

వాడు మరీ విధం చెడుతున్నాడు. "మింగబోతే మెతుకు లేదు, మీసాలకు సంపెంగ నూనె" అన్నట్టుగా వాడి నీటు, వాడి గోటు ను వ్వెప్పుడైనా చూశావా ?

రామయ్య. వాడా ? వాడి పేరు గుర్నాథం కాదూ?

సీతాపతి. ఆఁ ! వాడే ! "కన్నేల పోయెనోయి కనకలింగమా అంటే, చేసుకున్న ఖర్మమోయి శంభులింగమా" అన్నాట్ట. ఆ పొంటికంటి వెధవ జతపట్టాకే మనవా డిలా తయారయ్యాడు.

రామయ్య. మన కొక అంటా, సొంటా ? వాడితో వీడికి జత తేమిటో ?

సీతాపతి. అంటూ, సొంటూ కాకపోవడ మేమిటి? "వాడి తండ్రీ, వీడి తండ్రీ సయానా మగవాళ్లు" కారూ ?

రామయ్య. అప్పులపాలై వాడు కొంపా గోడూ తెగనమ్ముకున్నాడు. వాడితో....

సీతాపతి. కొంపా గోడూ లేకపోతే మాత్ర మేఁ ? పొద్దస్తమానం చేతిలో సం చొకటి వుంటుందిగా ? "ఇల్లు కాలింది జంగమయ్యా అంటే, నా జోలే, కప్పెరా నావద్దే వున్న"వన్నాట్ట.

రామయ్య. ఆ గుర్నాథం తాడూ బొంగరం లేని సన్నాసి. సభలనీ, సంఘాలనీ రెండు, మూడు దఫాలు జెయిలుక్కూడా వెళ్ళాడు! వాడికేఁ ? వా డెన్ని వేషాలైనా వేస్తాడు.

సీతాపతి. ఔను ! "కోటివిద్యలు కూటికొరకే." వాడికేఁ? వా డన్నింటికీ తెగించి కూర్చున్నాడు. ఆ గుర్నాథంగాడు "నాడువుంటే నవాబుసాయబు, అన్నంవుంటే అమీరు

సాయబు, బీదపడితే పకీరుసాయబు; చస్తే పీరుసాయబు." ఏం జరిగినా, వాడికి పోయే దేదీ లేదు.

రామయ్య [మనస్సు ఎక్కడో వున్నట్టు]. ఔనౌను.

సీతాపతి. దేశసేవ, గీశసేవ అంటూ ఆ సన్నాసి ఏమేమో పేలుతూ వుంటాడనుకో! కాని, " చెప్పేవాడికి సిగ్గు లేకపోతే, వినేవాడికైనా వివేకం వుండొద్దూ". పైగా, తనే బ్రహ్మాండ నాయకుడైనట్టు వాడు ఊళ్ళో వాళ్ళందరికీ పేర్లు పెడుతూ వుంటాడు. సామెత చెబుతారు చూచావ్—"కురూపి యేమి చేస్తున్నా డంటే, సురూపాలన్నీ లెక్కపెడుతున్నా" డన్నట్టు వాడికి మరొక పనే లేదు.

రామయ్య [నిట్టూరుస్తూ]. ఊఁ! ఆ బికారితో సమానంగా తిరిగితే ఇఖ మావాడు ముందు కొచ్చినట్టే! చూడగా నా బ్రతుకంతా బుగ్గయిపోయేలా వుంది. వాడికోసం కాకపోతే, ఈ దేవులాటంతా నాకు దేనికి ?

సీతాపతి. ఎవరైనా రేపన్న రోజున్నదని కానాలి. "రూకలేనివాడు పోక చెయ్యడు." పోనీ, మంచో చెడ్డో తనకోసం తను ఖర్చు పెట్టుకుంటున్నాడు సరే! కాని, వాడికోసంకూడా మనవాడు ఖర్చు పెట్టడం దేనికి? అంతో, ఇంతో ముట్టినంత వరకు వాడు బాగానే అంట కాగుతాడు. వెనకటికి "ఎక్కడికి పోతావు విధవమ్మా?" అంటే, "వెంటనే వస్తాను పదవమ్మా" అనిందట. వాడితో ఊతం చేస్తే మన వెంకట్రావు....

[వెంకటరావు ప్రవేశిస్తాడు. ఇరవై యేళ్ళ వాడు. తల్లి పోలికలకంటె తండ్రి పోలికలే యెక్కువ. ఖద్దరు ధోవతి కట్టుకుని, రౌండ్ కాలర్ ఆఫారం వేసుకున్నాడు.

వెంకటరావు. సీతాపతి మామయ్యా! నా ప్రశంస చేస్తున్నా వేమిటి?

సీతాపతి. ఆఁ! ఏం లేదురా, బాబూ!

వెంకటరావు. ఏమీ లేకపోవడ మేమిటి? ఇప్పుడే ఏమిటో అంటున్నావుగా?

సీతాపతి. అబ్బే! మరేమీ లేదు. నువ్వింకా అన్నానికి రాలేదని మీ అమ్మంటే మాటెంట మా టొచ్చింది.

వెంకటరావు. ఏమైనా నావూసు నీకు దేనికి?

సీతాపతి. "దూడా బర్రే పుండగా గుంజ అరిచిం"దన్నట్టు, నీవూసు నాకు దేనికిరా, బాబూ! ఇంత పొద్దుపోయింది, ఇంకా అన్నానికి రాలేదని మీ అమ్మంటే....

మహాలక్ష్మమ్మ [పడమటింటిలోనుంచి వచ్చి]. ఔనురా, నాయనా! ఇంత పొద్దోయేదాకా పుండకపోతే, వేళ కొచ్చి రెండు మెతుకులు తిని వెళ్ళరాదూ?

వెంకటరావు. ఏమంత పొద్దు పోయిం దమ్మా?—నీ దంతా చోద్యంకాని! ఇంకా తొమ్మిదైనా కొట్టలేదు.

రామయ్య. ఊహుఁ! పొద్దు పోనేలేదు. మరి కాసేపు పెత్తనాలు మిడికిరా!

మహాలక్ష్మమ్మ. సర్లే మీ రూరుకుందురూ! వా డింటి కొచ్చేసరికి కసురుకుంటారు. [కొడుకుతో] రా, నాయనా! నువ్వు రా! కాళ్లు కడుక్కో! అన్నం పెడ్తా.

[మహాలక్ష్మమ్మ పడమటింటిలోకి నెడుతుంది; వెంకటరావు అనుసరిస్తాడు.

రామయ్య. చూశావా, వాడి వాలకం! నిజానికి దాని అలుసు చూసుకునే వా డింత నెత్తి కెక్కాడు. పనిపాటులు లేక

పోయినా, వేళకు భోజనం చెయ్యడానికైనా తీరుబాటు కావడం లేదు.

సీతాపతి. "కుక్కకు పనీ లేదు ! తీరుబాటూ లేదు" అని వెన కటికి నీబోటి పెద్దవా డెవడో సామెత చెప్పలేదూ, రామయ్య బావా ?

వెంకటరావు [పడమటింటిలోనుంచి చరాలున తిరిగి వచ్చి]. ఏమి టది ? పిచ్చిపిచ్చిగా వాగుతున్నావ్ !

సీతాపతి. "మనుష లుండరు గాని, మాట లుంటా" యని పెద్ద లన్నారు. కాస్త పెద్దంతరం, చిన్నంతరం చూసి మాట్లాడు.

వెంకటరావు. "మంచి మనిషికొక మాట ; మంచి గొడ్డుకొక దెబ్బ" అని కూడా పెద్ద లన్నారు. మా గడప తొక్కొద్దని నీ కెన్నిసార్లు చెప్పలేదు ? మళ్ళీ ఎందు కొచ్చావ్ ?

సీతాపతి. "మాటకు మాట తెగులు; నీటికి నాచు తెగులు." నీతో నాకు మాట లెందుకులే ?

వెంకటరావు. నీ సామెతలు, గీమెతలు కట్టిపెట్టు. ఆ పప్పులు నాదగ్గి రుడకవ్. జాగ్రత్తగా మసులుకోకపోతే....

[సీతాపతి పైకి ఉరకబోతాడు.

రామయ్య. సర్లే ! ఇఖ ఆగు ! సంతోషించాం !

సీతాపతి. కాగే కాగే పాలు, రామయ్య బావా ! "పిల్లకాకి కేమి తెలుసు వుండేలు దెబ్బ."

వెంకటరావు [ఆగిపోయి]. ఛీ ! నోరుముయ్ !

రామయ్య [కోపంతో గద్దిస్తూ]. ఆఁ !

మహాలక్ష్మమ్మ [కేక విని లోపలినుంచి అడుగులో వచ్చి]. నాకు వొక్కగాను వొక్క కొడుకు. వాడింటి కొచ్చేసరికి ఏదో ఒక రభస ప్రారంభం !

సీతాపతి. "ఒక కన్ను కన్నూ కాదు; ఒక కొడుకు కొడుకూ కాదు."

రామయ్య. } ఒకే { ఛా ఛా! అశుభం మాట!
మహాలక్ష్మమ్మ. } సారిగా { ఛీ ఛీ! వంకరకూత!

సీతాపతి. "పడ్డవారు చెడ్డవారు కాదు." సరే! అనం డనండి! "వోరిస్తే వోరుగల్లే పట్న మౌతుంది."

రామయ్య [తమాయించుకుని]. అంటే నీకు కోపంతాని నువ్వన్న మా టేమిటి, సీతాపతీ?

వెంకటరావు. "శుభం పలకరా మంకెన్నా అంటే, పెళ్ళికూతురు ముం డేదన్నాడట" ఈ సామెత నీకు రా దేమిటి?—సీతాపతి మామయ్యా!

సీతాపతి [దీన్ని వినిపించుకోకుండా]. ఏదో నోటు జారిందిలే, రామయ్య బావా!

వెంకటరావు [విడిచిపెట్టకుండా]. కాని, సీతాపతి మామయ్యా! "కాలు జారితే తీసుకోగలం కాని; నోరు జారితే తీసుకోగలమా?"

సీతాపతి [దీన్నికూడా విననట్టే]. రామయ్యబావా! "బ్రహ్మకైనా పుండు రిమ్మతెగు" అన్నారు. నే నన్నది పొరపాటే. నువ్వు దాన్ని మనసులో పెట్టుకోబోకు. మరి నే నెళ్ళొస్తాగాని, నారు మాట మర్చిపోబోకు సుమీ.

రామయ్య. అబ్బే! వీల్లేదు సీతాపతీ! మాది మాకే చాలదు.

సీతాపతి. "దంచి నమ్మకు బొక్కిందే కూలి." సర్లే! ఇంకొక పుగాకు తునకైనా ఇలా పారెయ్.

రామయ్య. ఇందాక చెయ్యి జారింది చాల్లే.

సీతాపతి. నాకు తెలుసుగా నీ సంగతి: "ఎక్కడైనా బావగాని, వంగతోటదగ్గిర మాత్రం బావ కాదు." మరి నే నెళ్ళొస్తాగాని, లక్షువమ్మా! నీ వాళ్లు కాపాడుకో! అసలే ఒక్కప్రాణం. రేపొద్దున్నుంచి మజ్జిగనీళ్ళకు పిల్లవాణ్ణి పంపుతా మమ్మా!

మహాలక్ష్మమ్మ. ఒక్క గేదె పాడి. అబ్బే! మాకే తిన్నగా యిల్లు గడవడం లేదు.

సీతాపతి. పోనీ లేవమ్మా! వీలు లేనప్పుడు నువ్వేమి చేస్తావు గాని, కొత్త కందా పెండలమైనా పంపిస్తావుగా?

మహాలక్ష్మమ్మ. ఊఁ! కందా పెండలం మే మిక్కడ అంటబెట్టుకు కూర్చోలేదు!

[వెంకటరావు పకపక నవ్వుతాడు.

సీతాపతి. నవ్వకు, బాబూ! నవ్వకు. "నవ్వు నాలుగు విధాల చేటు." [దారిని పడుతూ] ఇలా నవ్వినవాళ్ళను చాలామందిని చూశాం. "నడమంత్రపు సిరి నరాలమీది కురుపు."

| | | | |
|---|---|---|---|
| వెంకటరావు. | | | నీ బొంద! |
| రామయ్య. | } | ఒకేసారిగా | అరి భడవా! |
| మహాలక్ష్మమ్మ. | | | నీ తల పగల! |

తెర]



## పాత్రలు

వెంకయ్య : సన్నకారు రైతు
రత్తమ్మ : అతని భార్య
గోపాలరావు : అతని కొడుకు
నరసమ్మ : అతని తల్లి

## స్థలం

వెంకయ్యగారి యింటివసారా

## కాలం

వర్తమానం

గమనిక : ఈ నాటిక ఈ సంపుటిలోని తక్కిన అన్నింటి వలె స్వతంత్ర రచన. ఇది దేనికీ అనువాదం కాదు; అనుసరణైనా కాదు. కాని, దీనిలో హెరాల్డ్ ఛాపిన్ వ్రాసిన "ది డంబ్ అండ్ ది బ్లయిండ్" అనే ఏకాంక నాటిక "ఇన్‌ఫ్లుయెన్స్" కనబడుతుంది. దాన్ని చదివి వుండకపోతే, దీని రచన బహుశా జరిగివుండేది కాదు.



# వెలుగునీడలు

అది వెంకయ్యగారి యింటివసారా. రాత్రి ఏడుగంటల ప్రాంతం. వసారాలో కుడివైపున వాల్చి వున్న కుక్కి నులకమంచం; ఎడమవైపున లవుడుమూట, ఉలవలబస్తా, పట్టసంచులు వగైరా. వసారా మధ్యగా [ప్రేక్షకులకు ఎదురుగానున్న గోడ నడిమిని] లోపలి యింటి ద్వారం. ఈ ద్వారబంధానికి ఎడమపక్కగా గోడకెత్తి పెట్టివున్న మరొక నులకమంచం. ఇంటిలోపలికి వెళ్ళే ద్వారానికి కాస్త కుడిపక్కగా పాతకాలపు దీపస్తంభంపై కిరసనాయిల్ దీపం బుడ్డి.

వాల్చివున్న నులకమంచం నడిమిని నరసమ్మ చిరుగుపట్టిన జంఖానా పక్కగా వేసుకొని కూర్చునివుంటుంది. వయస్సు డెబ్బై ప్రాంతాలగాని, అరవై మించినట్లు ఒప్పుకోదు. వయస్సు పూర్తిగా మళ్ళినదైనా ఓపిక ఉడగ లేదు; చూపుకూడా ఏమంత తగ్గలేదు.

దీపపు బుడ్డివద్ద పుస్తకాలు చుట్టూ పరుచుకుని, గోపాలరావు — ఈ అబ్బాయి ముద్దుపేరు "గోపి" — పాఠాలు చదువుతూ వుంటాడు. ఏ డెనిమిదేళ్ళవాడు. నాయనమ్మ శిక్షణకారణంగా ముదిమాటలు మాట్లాడ్డం కద్దు.

రత్తమ్మ గయ్యాళివలె పైకి కనబడినా, మనస్సు మెత్తనిదే. సంస్కారం శూన్యం. దానికి లేమి తోడైంది. కోడికూతతో లేచినా రాత్రి ఎనిమిది, తొమ్మిది గంటలవరకు తెములని పని. అంతూ పంతూలేని పనివల్లనే చెడ్డ విసుగ్గా వుంటుంది. వయస్సు ముప్పై అయిదుకు మించదుగాని, నలభై నిండినట్టు కనబడుతుంది. లేకలేక ఒక పిల్ల, ఒక పిల్లవాడు కలిగారు.

వెంకయ్య నలభై ఏళ్ళవాడు. రెండు, మూడెకరాల ఆసామి. చిన్న పాలేరైనా లేకుండా సొంతంగా వ్యవసాయం చేసుకుంటున్నవాడు. వ్యవసాయపు పనులు లేనిరోజులలో కిరాయి ఆడతాడు. పొద్దస్తమానం నడుములు విరిగేలా పాటుపడేవాడు కాబట్టే, చిర్రు బుర్రు లాడుతూ వుంటాడు.

తెర లేస్తుందనగానే ఎక్కాలు చదువుతున్న గోపి పొలికేకలు, మంచం నడిమిని కూర్చుని గాలితోనైనా పోట్లాడగల నాసమ్మ సణుగుడు ప్రారంభమౌతుంది.

గోపి [తాపీగా]. ఒక ఏడు ఏడు; రెండేళ్ళు పధ్నాలుగు; [గబగబ] మూడేళ్లు ఇరవై ఒకటి; నాలుగేళ్లు ఇరవై ఎనిమిది; అయిదేళ్లు ముప్పైయేడు [తనకే సందేహం తోచగా, కళ్ళు తెరిచి, ఎక్కాల పుస్తకం చూచి, తప్పు దిద్దుకుంటూ] అయిదేళ్ళు ముప్పై అయిదు; ఆరేళ్ళు నలభై రెండు; ఏడేళ్ళు నలభై తొమ్మిది; ఏడేళ్ళు నలభై తొమ్మిది; ఎనిమిదేళ్లు....ఎనిమిదేళ్లు ....ఆఁ!....ఎనిమిదేళ్లు....ఊఁ!....ఎనిమిదేళ్లు [కళ్లు మరింత గట్టిగా మూసుకుని] ఆఁ!....ఊఁ!....ఎనిమిదేళ్లు [తుపాకి పేల్చినట్లు] యాభై ఆరు; తొమ్మిదేళ్ళు అరవై మూడు [గమ్మ

స్థానాన్ని చేరేటప్పుడు కలిగే సంతృప్తిని ధ్వనిస్తున్నట్టుగా] పదేళ్లు డెబ్బై [దీపం బుడ్డిపైకి వంగి] పదకొండేళ్ళు....

నరసమ్మ. జుట్టు కాలేను. తిన్నగా కూర్చోరా, బాబూ!

గోపి [విసుగ్గా]. ఏమిటే నాయనమ్మా? చెవికింద నీ రొద నేను చదువుకుంటావుంటే....

నరసమ్మ. సదువూ, సట్టుబండలూ! దీపంమీదికి వొంగబడతావు దేనికిరా? కాస్త అవతలికి జరుగు. నీకు పున్నె ముంటుంది!

గోపి. అబ్బ! సరేలేవే! [మళ్ళీ తన ధోరణిలో పడి] పదేళ్ళు డెబ్బై; పదకొండేళ్ళు డెబ్బైయేడు [పట్టు విడుస్తున్నట్లు] పన్నెండేళ్ళు ఎనభైనాల్గు.

[గోపి వెనుకకు వెళ్ళి ఎక్కం వల్లిస్తుంటాడు. నరసమ్మ తనలో తనేమో గొణుక్కుంటూ వుంటుంది. ఇంతలో లోపలినుంచి చంటిపిల్ల ఏడ్పు ప్రారంభమౌతుంది.

గోపి [ఎక్కం వల్లించడం చాలించి]. అమ్మా! అన్నం పెట్టవే!

రత్తమ్మ [లోపలినుంచి]. ఆగరా! కాస్త ఆగు! చెయ్యారికే లేదు. పెడతాలే.

గోపి. నా కాక లేస్తున్నదే, అమ్మా!

రత్తమ్మ [లోపలినుంచే]. ఆగమనేది నిన్ను కాదట్రా!

గోపి [మారాం చేస్తున్నవాడివలె]. ఉహుఁ! ఇప్పుడే పెట్టాలి!

నరసమ్మ. ఆడి కడుపు సచ్చిపోతున్నది. ఆడికి రెండు మెతుకు లెట్టరాదటే, రత్తమ్మా!

రత్తమ్మ [చరచర వసారాలోకి వచ్చి]. నీకేం? మంచం నడిమిని కూర్చుని ఎన్నైనా చెబుతావ్! ఇక్కడ ఈ మాయదారి పిల్ల కుయ్యో, మొర్రో మని యేడుస్తుంటే, ఎట్టా పెట్టమంటావ్?

నరసమ్మ. దాని కడుపుకి ఆమదం పెట్టకపోతే....

రత్తమ్మ. పెట్టకేం! పొద్దున్నేగా పండబెట్టింది.

నరసమ్మ. దాని కింతా ఏడాదైనా యెళ్ళలేదు. వారాని కొకసారి ఆమదం పెట్టుకుంటారశేం? మా కాలంలో....

రత్తమ్మ [వెటకారంగా]. ఊఁ! మీ కాలంలో?

నరసమ్మ. నాకు దేనికిలే తల్లీ? నే నేమన్నా నీకు రంపరంగానే వుంటుంది.

గోపి. అబ్బ! అన్నమే అమ్మా!

రత్తమ్మ. ఏమంత పొద్దుపోయిందని? ఇప్పుడేగా దీపా లెట్టించి! ఆ సతుకుడేమిటో మరి కాసేపు సతుకు.

గోపి. ఇవ్వాల్టికి పాఠాలన్నీ చదివేశానే.

రత్తమ్మ. రెండు పొలికేక లెట్టేసరికి ఇవ్వాల్టికి చదువై పోయిందన్నమాట. మొన్న పరిచ్చలో అన్నీ గుండు సున్నా లొచ్చాయి. సదువంటే నీకు గొంతు పట్టుకుంటుంది, తినమంటే తింటావ్ ఒక బొచ్చెడైతే.

గోపి. ఉహుఁ! నే నిక చదవను.

రత్తమ్మ. ఇఖ చదవ్వేం? ఏదీ పుస్తకం పట్టు! పడతావా, ఈ చెంపా, ఆ చెంపా వాయించమంటావా?

గోపి. ఉహుం!

రత్తమ్మ [చెయ్యెత్తి]. పట్టు! పుస్తకం పట్టు!

గోపి [ఏడుపు ముఖంపెట్టి]. ఊఁ! ఊఁ! ఊఁ!

నరసమ్మ. ఆడిపైన సేయి సేసుకుంటా వెందుకే? ఆడి కాకలై ఆడు కొట్టుకొంటూంటే....

రత్తమ్మ [పిల్లవాడి వైపునుంచి అత్తవైపు తిరిగి]. సర్లే! గారాం చేసి నువ్వే వాణ్ణి నగం చెడగొడుతున్నావ్!

నరసమ్మ. మేమూ కన్నాం పెంచాం కాని, ఇంత యిడ్డూరం ఎక్కడా యెరగ మమ్మా!

రత్తమ్మ. నేనూ చాలామంది అత్తముండల్ని యెరుగున్నాకాని....

నరసమ్మ. అయ్యొ! అయ్యొ! ఎంతమాట! పెద్దదాన్ని నన్ను పట్టుకుని ముండంటావటేఁ?

రత్తమ్మ. ఆ మాట నే నన్నానా?

నరసమ్మ. అనలా? అని లేదంటావు దేనికి?

రత్తమ్మ. ఒట్టు వేసుకుంటావ్ ఆమాట నే నన్నానని?

నరసమ్మ. ఎదురు ఒట్టుకూడా దేనికిలేఁ! ఇంతకూ నాకు సావు రావడం లేదు. ఆ మారాజుండగానే, నేను పట్టి కలిసిపోతే అందరిచేతా ఈ మాటలుపడే ఖర్మ నా కెందుకు పట్టేది? కాలూ, సెయ్యీ ఆడుతుండగానే తను దాటుకుని, నన్ను ఈ ముళ్ళ కంపలో పెట్టిపోయాడు.

[ఇలాగే నరసమ్మ ఏమేమో గొణుగుతూనే వుంటుంది. మధ్య మధ్య ముక్కు చీదివేస్తూ వుంటుంది.

రత్తమ్మ [తిరిగి చెయ్యెత్తి]. చదువుతావా? రెండొడ్డించ మంటావురా?

గోపి [వాచకం తీసి గొణుగుడుగా]. ఒక పట్టణమున దనవంతుడగు వైస్యు డొకడుండెను. అతని....

రత్తమ్మ. ఏం! అంకిళ్ళు నొక్కుకు పోయాయా? గొంతే లేవడం లేదు!

గోపి [బిగ్గరగా, కాని, గాద్గదికంగా]. బిడ్డ లొక్కచో జేరి యాడుకొనుచుండగా, నొక కాకిపిల్ల వారి సమీపమున బడెను. దానిని సంతోసమున....

రత్తమ్మ. అంతేలే! నీకు చదువుపేరు చెప్తేనే వలవల యేడుపొస్తుంది.

గోపి [ఏడుపు దిగమింగడానికి ప్రయత్నిస్తూ]. దానిని సంతోసమున దీసుకొని, యా బిడ్డలు దినదినము తమ యెంగిళ్ళు పెట్టి దానిం బెంచిరి. అదియు మిక్కిలి కొవ్వి, గర్వించి....

రత్తమ్మ [లోపల పిల్ల ఏడ్పు ఎక్కువకాగా]. ఆసి దీని పీక పిసక! ఏమి యేడుస్తున్నది! ఏమి యేడుస్తున్నది!!

[రత్తమ్మ లోపలికి వెళ్ళిపోతుంది.

గోపి [మధ్య ఒక క్షణంపాటు ఆపిన చదువును తిరిగి సాగిస్తూ]. అదియు మిక్కిలి కొవ్వి, గర్వించి, ప్రపంచమున దానిసాటి పచ్చులు లేవనియు, బ్రమ్మదేవుడు స్రుష్టించిన సమస్త పచ్చులకు దాను సార్వబౌముడనియు బావించి, యెవ్వరిని సరకు సేయకుండెను. అటులుండ నొకనాడు అంసలు కొన్ని

సముద్రతీరమున వాలియుండ వైశ్యపుత్రులు కాకికి అంచల జూపి యిట్లనిరి : "ఓ పక్షిరాజా ! పక్షులకన్నింటికీ నీవు చక్రవర్తివి. నీవలె వాడగల పక్షి లేదు. నీవంటి యందమైన పులుగు లేదు. నీలాగున నెగిరి పటుగెత్తగల విహంగము లేదు. ఈ అంచల జూడుము...."

[లోపల పిల్ల యేడుపుతోపాటు రత్తమ్మ విసుగుదల, రత్తమ్మ విసుగుదలతోపాటు పిల్ల యేడుపు ఎక్కు- వౌతూ వుంటాయి. బుజ్జగింపుల మధ్య "నీ తల్లి కొర !", "నీ కడుపుడక !", "నా ప్రాణానికి నువ్వొక్క-దానివి దాప రించావే !" మొదలైన దీవనలు వినబడుతూ వుంటాయి. తల్లి వేరే ధ్యాసలో వున్నది కదా అని గోపాలరావు చదువు మానివేసి వాచకం విసిరి కొడతాడు.

నరసమ్మ [రహస్యం చెబుతున్నట్టు]. దెబ్బ లెందుకు పడతావురా, బాబూ ! సదువుకో ! మరి కాసేపు సదువుకో !

గోపి. ఉహుఁ !

నరసమ్మ [అంకిలి నొక్కు-కుంటూ]. అదొచ్చిందంటే....మళ్ళీ యిరుసుకు పడుతుందిరా ! సదువుకో ! నా మాటిని సదువుకో !

రత్తమ్మ [లోపలినుంచి వచ్చి]. వీపు దెబ్బల కేడుస్తున్న దేమిరా? మళ్ళీ మానేసి కూర్చున్నావ్ ?

గోపి [చేతికందిన పుస్తకం చప్పున తీసి, మధ్యలో విప్పి]. మొండె మందలి వెన్నెముక, వెన్నుపూస లనబడు ముప్పది మూడు చిన్న యెముకలచే కూర్పబడి యున్నది. [రత్తమ్మ

లోపలికి వెళ్ళిపోతుంది.] ఎడమబాగమందు ఏడు, రొమ్ము బాగమందు పండెండు, నడ్డిబాగమందు ఐదు, తుంటిబాగమందు అయిదు, తోకబాగమందు నాలుగు....

నరసమ్మ. తుం టేమిటి? తో కేమిటి? ఏమి సదువుర్రా యిది? మాకాలంలో మే మిలాంటి వెరగం. ఏదో బారతమనీ, బాగోతమనీ, రామాయనమనీ - అంతేగాని మేమి సోద్యా లెరగం. ముసలిముండని, నేనుకూడా కాస్త యింటా. వద్దెమేదైనా సదవరాదటరా, బాబూ!

గోపి. ఉఁ! పోవే. నా కాకలై నే చస్తూవుంటే....

నరసమ్మ. నిజమేరా, బాబూ! సదువుకునే వాళ్ళ కసలు యేడి తల కెక్కుతుంది. ఏళకూ పాళకూ ఆళ్ళకు తిండీ తిప్పలూ లేకపోతే, మెదడు కరిగిపోతుంది. మా కాలంలో....సర్లే! ఎందుకొచ్చిందికాని మరి కూసేపు సదువుకో, బాబూ! నా నాన్నవుగా! నేనూ యింటా! ఏదీ?....ఒక పద్దెం సదువు.

గోపి. ఏం పద్దెం సదవను?

నరసమ్మ. ఏదో వొకటి - నీ కొచ్చింది.

గోపి. ఎలుక తోలుతెచ్చి ఎందాక నుతికినా
నలుపు నలుపెగాని, తెలుపు కాదు;
కొయ్యబొమ్మ తెచ్చి కొట్టిన పలుకునా
విస్వదాబిరామ వినురవేమ.

నరసమ్మ. తుంటీ తోకా ఐందీ - ఎలికీ, పిల్లీ, కుక్కా, నక్కా అని మొదలెట్టావ్! రామా, కిష్టా అనే ముక్క చెవినేసుకుందామంటే, అది యినపడనే యినపడదుగదా!

గోపి. "విస్వదాబిరామ వినురవేమ"లో "రామా" లేదటే?

నరసమ్మ. రామాయనంలో ఎలికీ, పిల్లీ ఎందుకొస్తాయిరా?

గోపి. ఊం! పోవే నీ మొగం! నీకేం తెలుసునని!

[సర్వం రనకే తెలుసునన్న దర్పంతో పద్యాన్ని వల్లె వేయడం ప్రారంభిస్తాడు.

నరసమ్మ [తనలో తను]. చిన్నాళ్ళ మొదలు, పెద్దాళ్ళ దాకా అందరూ సన్నిదిలించి పారేశేవాళ్ళే! కాలం మారిపోయింది. మా కాలంలో - ఆ రోజు లిప్పు డెందుకొస్తాయి? అప్పుడు పెద్దాళ్ళకు నచ్చినా ఎదురు సెప్పేవారా? సెబితే బతక నిచ్చేవారా? మా అత్తముండమానానికి మా అత్తముండ కూసుంటే ఒక మొట్టికాయ, నుల్చుంటే ఒక మొట్టికా యేసేది. ఇఖ మా మామగున్న పున్నాడంటే, "సొబ్బన్న" అని పేరు సెబితే సాలు, కాకులు నీళ్ళు రాగేవి కావు. ఆ రోజులూ పోయాయి. ఆ మడుసులూ పోయారు. [ఒకటి రెండు క్షణాలపాటు ఆగి] తెకతెక లాడిపోతోంది. వాన కురుస్తుందేమో! కురిసేది, బాగా కురిసినా బాగుండును; రెండు ఉబ్బ సినుకులు పడిపోతున్నది. పని సెరుపు తప్ప మ రేమీ లేదు. మా కాలంలో ఆసాడ మాస మొచ్చేసరికి కుండలతో దిమ్మరించేది. శావణ మొచ్చినా, ఇప్పుడు సరిగా వానే లేదు. కాలం మారినట్టే, అదీ మారింది [ఒక క్షణం ఆగి] బొన్నిగారిసత్తి కూతురిసేత శావణ సుక్రారం నోము నోయించింది కామాలు. అప్పయ్యగారి కోడలు పప్పు లిచ్చుకుని, ఊరెంట తైతక్కమంటున్నది. అమ్మో! అ దెక్కడ! అది గజ్జలగుఱ్ఱం! దాన్ని పట్ట పగ్గాలు

లేకండా వున్నాయి. "ఏమేఁ కూతరా !" అని పలకరిత్తే, యినిపించుకోకండా సక్కాపోయింది. ఏమి సూసుకునో అంత పొంగు! [ఇంకొక క్షణం ఆగి] అదుగో! సినుకు మొదలైంది. మా యెంకయ్య పొలంనుంచి రానే లేదు. ఖర్మం! వానలో తడుస్తాడో, ఏమో! నాల్గు రోజుల్నుంచి తీస్తున్నా కలుపు కాకండానే వొచ్చింది. రోజుకు బిళ్ళకుడుంలా రూపా యిస్తున్నా, యిప్పు డసలు కూలోడు పలుకుతున్నాడూ? మా కాలంలో అణా, బేడా యిస్తే....చంటిది సందేశనుంచి తెగేడుత్తా వుంది. పిచ్చిముండ! దడుసుకున్నదో, యేమో! దానికి వారాని కొకసారైనా దిష్టి తీస్తేగాఁ! [ఒక క్షణం మళ్ళీ ఆగి] జల్లు పెద్దదైంది. మా యెంకయ్య.... [వెంకయ్య వస్తాడు.] ఏరా! అబ్బాయ్! ఇవ్వాళ మరీ ఇంత పొద్దోయిందేఁ? వానకి తడవలేదుగందా? [వెంకయ్య జవాబు చెప్పడు. పై పంచెతో తల తుడుచుకుంటూ వుంటాడు] ఊహూఁ! నాతో ఎందుకు పలుకుతాడు! ఏదో ముసిలిముండ దాని వాగు దవి వాగుతుందని....

వెంకయ్య. ఊఁ! నీ చాదస్తం కాస్త కట్టిపెట్టవే! [పైపంచె వడ్లబస్తాలమీద ఆరవేయడానికి వెడుతూ, రత్తమ్మ నుద్దేశించి] ఒసేయ్! పొంతని వేన్నీళ్ల యేమైనా వున్నాయా?

రత్తమ్మ [వసారాలోకి వస్తూ]. ఆఁ! వున్నాయ్!

వెంకయ్య [కునికిపాట్లు పడుతున్న గోపితో]. భడవా! చదువు పేరు చెబితేనే నీకు కళ్ళు కూరుకొస్తాయ్! పోనీ నిద్దరోయే

వాడివి తిన్నగా పోక, గంటంలా దీపం పెట్టి, దానిముందు కునికిపాట్లు పడ్డం దేనికి ?

గోపి. అమ్మ నా కింకా అన్నం పెట్టలేదు, నాన్నా !

రత్తమ్మ. పిల్లది పోరుపెట్టి యేడుస్తుంటే, దాన్ని కాస్త దగ్గిరికి తీసే దిక్కైనా వుంటేనా ! ఎలా పెట్టను ?

నరసమ్మ. కూసుంటే లేవలేను; లేస్తే కూసోలేను. నా మొగం దాన్ని నే నెత్తుకోగలనా, పెట్టగలనా ? కాలూ సెయ్యీ ఆడుతున్నంతవరకూ సెయ్యలేదూ ? వాళ్ళు దానుకున్నానా ? నేను సతమతం కాందే ఈ కొంప ఒక దిక్కు కొచ్చిందీ ?

వెంకయ్య [రత్తమ్మతో]. సర్లే! ఆ పొంతలో నీళ్ళలా తగలెయ్యి!

రత్తమ్మ. దూడ నింకా యిడవలేదు.

వెంకయ్య. ఏఁ ? నే నేయేళ కొచ్చినా, నాకోసం ఆ పని అట్టే పెట్టాలాఁ ?

రత్తమ్మ. నాకైనా పదికాళ్ళూ, ఇరవై చేతులూ లేవు. అన్ని పన్లకీ నే నొక్కదాన్నే ఎక్కడ చచ్చేది !

వెంకయ్య. చాల్లే ! చెంబిలా తగలెయ్ !

[రత్తమ్మ విసురుగా చెంబు తెస్తుండగా ఠంగుమని గడప తగుల్తుంది.

వెంకయ్య. ఏఁ ! అంత దూకుడు ! చెంబు పగిల్తే నీ అబ్బగా డెవడు తెస్తాడు? [రత్తమ్మ చేతిలోనుంచి చెంబు గుంజుకుని, గోపాలరావుతో] ఒరే! గోపీ! రారా! కాస్త దూడని పట్టుకుందువుగాని.

గోపి. వాన కురుస్తున్నది నాన్నా!

వెంకయ్య [గద్దిస్తూ]. ముక్క మొలిచిపోవులే! రా!!

గోపి. ఉహుఁ. చీక టంటే నాకు బయం.

వెంకయ్య. వస్తావా? రెం డుతకమంటావా?

[గోపాలరావు యిష్టంలేకుండా కదులుతాడు. వెంకయ్యా కూడా పశువుల చావడిలోకి వెళతాడు.

రత్తమ్మ [పిల్లదాని ఏడ్పు మరింత ఎక్కువకాగా]. ఆసి దీని దుంప తెగ! దీని కడు పుడక! సుయ్యి ఏనిపించి నన్ను చుక్కల్లో పెడుతున్నది.

[లోపలికి వెళుతుంది.

నరసమ్మ. నిన్నటి ముండనా, మొన్నటి ముండనా! అప్పుడే అరవై యేళ్లొచ్చినై. నూపైనా తిన్నగా ఆనడంలేదు. ఇంకా నేను సేసిపెట్టడంలేదని సాదింపులు. ఒకళ్ళసేత సేయించు కోకండావుంటే, నేను సేసినంత పలం. [పిల్లను రత్తమ్మ రెండు చరుస్తుంది; పిల్ల గుక్కపట్టి ఏడుస్తుంది] మొగుడి మీద కోపం ఆ పసిదానిమీద సూపించడం దేనికో? నోరూ వాయీ లేని సిన్నముండ! అదేం పాపం సేసింది? మా కాలంలో మే మిట్టాంటి పెరగ మమ్మా! ఆ దిక్కుమాలిన దేముడు ఒక మగబిడ్డని, ఇద్ద రాడపిల్లల్నే మిగిల్చాడు కాని, నేనూ ఆరుగుర్ని కన్నా, పెంచా! ఎవళ్ల నెప్పుడూ ఒక దెబ్బే పెరగను. ఇప్పు డొచ్చింది ఈ మాయదారికాలం.... ఇది పిదప కాలం కాకపోతే, ఆడు - పెదకిట్టప్పగారి సిన్నోడు - ఆడంత మిడిసిపడతాడూ? ఆడి కున్నది ఇరవయ్యేకరాలు. పెద్దకూతు

రికి రెండెకరా లిచ్చి, మూడేలు పోశాడట. ఇంకా ముగ్గు రున్నారు కూతుళ్లు. అందర్నీ ఈ లెక్క నిరగడ సేస్తాడూ? సేస్తే, కొడుకుల కేం మిగులుస్తాడు? సిప్ప సేతికిస్తాడా?.... సినుకు మరి కాస్త పెద్దదైంది. సినుకులో సిన్న సన్నాసి తడుస్తున్నాడేమో! రేత్రి రెండుజాములైనా ఆడి కింత ముద్దే పెట్టదయ్యే! నేనూ సంసారమీదా కాని....[రెండు కునికిపాట్లు పడి] "ఖుయ్యిఁ"మంటూ పాడు దోమలు! తెగ పీక్కు తింటున్నాయి. తెల్లార్లూ జాగారమై పోతావుంటే! కంటిమీద నాకు కునుకే పడకపోయినా - నే నంట! - తెగ గుర కెడుతున్నా నంట! నే నెంత సెమిటి ముండనైనా అంత గుర కెడితే నాకు కూస్తైనా యినబడదూ? నే నంటేనే అంతా ఒంటికాలి మీ దొస్తారు!....

[తిరిగి కునికిపాట్లు పడుతుంది.

గోపి [పరుగెత్తుకొస్తూ]. అమ్మోయ్! నాన్న నే....

నరసమ్మ. ఏమిట్రా బాబూ!

గోపి. అమ్మోయ్!

రత్తమ్మ [చప్పున బైటికి వస్తూ]. ఏరా! ఏమిటి?

గోపి. నాన్న నే....

రత్తమ్మ. ఏమిట్రా?

గోపి. ఆవు గట్టిగా తన్నిందమ్మా!

నరసమ్మ. అయ్యో నా బిడ్డా!

రత్తమ్మ. ఆఁ! ఆఁ!

గోపి. ఎదురొమ్ముమీద తన్నిందే! ఎల్లికిలగా పడిపోయాడు!

[రత్తమ్మ గొడ్లచావడిలోకి పరుగున వెడుతుంది. గోపాలరావు అనుసరించబోతాడు. ఎక్కడలేని ఓపికతో నరసమ్మ మంచంమీదనుంచి లేస్తుంది.

నరసమ్మ. దీపం తేరా, బాబూ! దీపం తే! సీకటి మేళాంలో కన్నొడుసుకున్నా కనబడ్డం లేదు. పద! పద!

[గోపాలరావు దీపం పట్టుకుంటాడు. నరసమ్మ రెం డడుగులు వేసేసరికి, రత్తమ్మ భుజంపై చెయ్యి వేసుకొని వెంకయ్య లోపలికి వస్తాడు.

నరసమ్మ. అడుగో! నా బాబే వొస్తున్నాడు! అయ్యొ నా బిడ్డా! పొద్దున్నే ఎవడి మొగం సూశావురా!

వెంకయ్య. ఆఁ! మీదంతా వొత్తి ఖంగారు, తాపు మోపుగా తగల్లేదు; దూసుకుపోయింది.

రత్తమ్మ [దీపంపెట్టి చూస్తూ]. ఇంత కమిలిపోతే, దూసుకుపోవడ మేమిటి? [ఆగి] అక్కడక్కడ బారుగా గీరుకుపోయింది. [ఇంకా పరీక్షచేస్తూ] రెండు చోట్ల నెత్తురు చిమిర్చింది. [వేలితో గుండ్రంగా గీసి చూపుతూ] ఇంత లెక్క నల్లగా కమిలిపోయింది. మోపుగా తగలకపోతే ఇం తెందుకు కమిలిపోతుందీ?

[దీపంబుడ్డి కింద పెట్టి, పైటచెంగుతో నెత్తురు చిమిర్చిన చోట అద్దుతుంది.

నరసమ్మ [గాద్గదికంగా]. అయ్యొ! నా బిడ్డా! నా బిడ్డా!!

వెంకయ్య. ఆఁ! దాని మాటల కేమిలే? గట్టిగా తగల్లే దమ్మా!

రత్తమ్మ. అత్తయ్యా! ఈయనగార్ని కాస్త రెక్కట్టుకో! నేను మంచం వాలుస్తా.

వెంకయ్య. రెక్కట్టుకోడమా నీ మొఖమా! చాల్లే యిఖ!

నరసమ్మ [దీన్ని వినిపించుకోకుండా, రెక్క పట్టుకుని]. ఇంకా నయం! లేసినేళ బాగుంది. బిడ్డవు దక్కావ్!

వెంకయ్య. ఊఁ! కూస్తంత గంపెడంత చేస్తున్నారు!

రత్తమ్మ [గోపితో]. బాబూ! ఆ దీపం అక్కడెట్టి దిండు తే. [మంచం వాల్చిన తర్వాత, వెంకయ్య రెక్క ఊతంగా పట్టుకుని] రండి! పడుకోండి! కాస్త ఆమదంతో కాపైనా కాస్తా!

నరసమ్మ. ఆమదం కాపుకంటె కోడిగుడ్డు పట్టు నయమేఁ—అద్దైతే తెల్లారేసరికి నెప్పిని లాగేస్తుంది.

వెంకయ్య. [మంచంపై నడుం వాలుస్తూ]. అఁ! ఎందుకేఁ కాపులూ, పట్టులూ? అదే పోతుంది.

నరసమ్మ. సున్నం, బెల్లం, చింతపండూ నూరి పట్టేసుకున్నా, వాపు తొరగా తగ్గుతుందిరా, బాబూ!

వెంకయ్య. ఎందు కమ్మా! లేని పోని ఖంగారు? ఏమంత దెబ్బ తగిలిందని?

రత్తమ్మ. పాడుదాన్ని! కాస్త నేనే ఉసులు చేసుకుని దూడ నిడుచుకుంటే, ఈ ఖర్మెందుకొచ్చేది?

నరసమ్మ. నీ తప్పేముంది లేవే! ఒంటిదానివి. అన్నీ ఎక్కడ దిద్దుకుంటావ్! అది నాసేతిలో నిలవదుగాని, ఆ పిల్లదాన్ని నేను సమదాయిస్తే, నువ్వు దూడ నిడుసుకొనే దానివిగాఁ?

రత్తమ్మ. ఆఁ! పెద్దతన మొచ్చింది. ఇంకా నువ్వేమి దేవుళ్లాడ తావులే! నిన్ను కూర్చోబెట్టి నీకు చేసేదిపోయి, ఇంకా నీచేత చేయించుకోవడమా?

నరసమ్మ. ఇంకా కాలూ సెయ్యీ ఆడుతున్నయిగాఁ! పెద్దపనులు కదలవనుకో! అయినా సిన్నపనికీ, సితకపనికీ నేను నిల బడితే, నీకు కూస్తి తెరిపిగా వుంటుంది.

రత్తమ్మ. నువ్వగనక ఇంకా నీ పనులన్నీ నువ్వే చేసుకుంటు న్నావుగాని, నీ వయసొస్తే మేము మంచాన పడతాం.

వెంకయ్య. పసి దేడుస్తున్నది.

రత్తమ్మ. పాపం! అదింకా గోలపెడుతూనే వుంది. దాన్ని కాస్త తీసుకో, అత్తయ్యా!

నరసమ్మా. అట్టాగే నమ్మా! [వెడుతూ] నా బిడ్డకు లేచినేళ మంచిదైంది. గణ్ణం తప్పింది.

[వెడుతుంది.

గోపి [దిండుతో వచ్చి]. ఇదుగో నాన్నా! దిం దేసుకో!

వెంకయ్య. ఆఁ! దేనికిరా, బాబూ?

[ఇలా అంటూనే తల యెత్తుతాడు. గోపాలరావు దిండును తలకిందికి తోస్తాడు.

రత్తమ్మ [దిండు అంచు పట్టుకుని]. ఏదీ! కాస్త తలెత్తండి! దిండు సరిగా లేదు.

వెంకయ్య [తలెత్తుతూ, బాధాసూచకంగా]. అమ్మ!

రత్తమ్మ. [దిండు సరిచేస్తూ] ఏఁ! కదిత్తే నెప్పిగా వుందా?

వెంకయ్య. అబ్బే! లేదే!

రత్తమ్మ. లేకపోవడ మేమిటి?—ఒక పక్కని మూలుగుతూ! ఎందుకైనా మంచిది; నా మాటిని తవుడు కాపైనా కాయించుకోండి. పొయ్యిలో కాస్త నిప్పేసొస్తా!

వెంకయ్య. ఆఁ! అంతగా అయితే తెల్లారిపొద్దున చూసుకోవచ్చులేవేఁ!

రత్తమ్మ. తెల్లారేసరికి బరువు చేస్తేనో!

వెంకయ్య. ఊఁ! నీమొఖం కాదూ? అదే పోతుంది.

రత్తమ్మ. సరే! ఇఖ మీ యిష్టం!

వెంకయ్య [దిండును మరింతగా తలకిందికి తోసుకుంటూ]. నాయనమ్మ వెళ్లి యెత్తుకునేసరికి చంటిది యేడుపు చాలించింది.

రత్తమ్మ. అవును, వెర్రితల్లి! ఆలనా పాలనా ససిగా లేక, చిక్కిసగమైపోయింది. నా చెయ్యేడ! దాన్ని యెడా పెడా బాదాను. ఏడ్చేడ్చి పిచ్చితల్లి చిటుక్కున నిద్దరోయింది.

వెంకయ్య [గోపాలరావును దగ్గరకు తీసి తల నిమురుతూ]. చూడవేఁ! ఈ పిచ్చి సన్నాసి తల తడిసింది. కాస్త తుడువు. జలుబు చేసేను!

గోపి [కౌగిలినుంచి తప్పించుకుంటూ]. ఆఁ! లేదు, నాన్నా!

వెంకయ్య [దగ్గరికి లాక్కుని, తన పంచె చెరగుతోనే తల తుడుస్తూ]. చూడవేఁ! పాపం! పొట్ట వెన్నుకు అతుక్కుపోయింది.

రత్తమ్మ. పాపిష్ఠిదాన్ని! వాడి కింకా తిండీ తిప్పలైనా పెట్టాను కాను.

గోపి. ఆనికి తింటా—ఇప్పు డాకలి లేదమ్మా!

రత్తమ్మ [నవ్వుతూ]. ఇప్పుడేగా ఆక లాకలని మారాం చేశావ్?

గోపి. ఉత్తినేనే అమ్మా!

వెంకయ్య [కొడుకును గుండెకు హత్తుకుంటూ]. పిచ్చి సన్నాసి!

రత్తమ్మ [కొడుకువీపు నిమురుతూ]. బంగారు తండ్రి!

తెర]



# కొత్త గడ్డ

[ఏకాంక నాటిక]

## పాత్రలు

పల్లెటూరి రైతు

అతని భార్య

అతని కొడుకు

అతని మనుమడు

## స్థలం

రైతు యింటి చావడి

## కాలం

వర్తమానం

రాత్రి ఎనిమిదిగంటల ప్రాంతాల



# కొత్తగడ్డ

తెర లేచేసరికి అప్పుడే భోజనం చేసి వచ్చిన రైతు తన యింటిచావడిలో మంచంపై కూర్చుని చుట్ట కాల్చుకుంటూ వుంటాడు. అతని వయస్సు యాభైకి పైగా, అరవైకి లోపు. బాగా పొడగరి; చేవ తేలిన వొళ్లు. పెద్ద నుదురుతో, పెద్ద కళ్ళతో, అక్కడక్కడ కొంచెం నెరసిన గుబురు మీసాలతో కళగల మొహం. నీర్కావి పంచె కట్టుకుని, నీర్కావి పైపంచె కప్పుకున్నాడు.

చావడికి నాలుగు ద్వారాలు కనబడుతూ వుంటాయి. కుడివైపున సింహాద్వారం; ఎడమవైపున పెరటిగుమ్మం; ఎదుటి రెండింటిలో ఒకటి పడకగది గుమ్మం, రెండవది పడమటింటి గుమ్మం. ఈ రెండింటిమధ్య పడకగదిలోకి కిటికీ. పడమటింటి గుమ్మందగ్గరగా చావడిలో ఒక ముక్కాలుపీటపై హరికేన్ లాంతరు వెలుగుతూ వుంటుంది. రైతు కూర్చున్న మంచం కాక, మరొకటి పెరటి గుమ్మంవైపు గోడకాన్చి నిలబెట్టి వుంటుంది. ఇతర సామగ్రి యేమీ లేకుండా చావడి అద్దంవలె వుంటుంది. రైతు గొడ్ల చావడి తలవాకిలివైపున, యింటికి యెడమ పక్కగా వుంటుంది.

తెర లేచిన కొన్ని క్షణాలకు పడమటింటిలోనుంచి మనుమడు పరుగు పరుగున వచ్చి, తాత వొడిలో గారాబంగా వొరుగుతాడు. నాలుగేళ్ళవాడు, చాలా చురుకైనవాడు.

మనుమడు. నాకేఁ—మరే!—కత సెప్పు, తాతా!

రైతు [మనుమని ముఖాన్ని రెండుచేతులలోకి తీసుకుని, నుదురును ముద్దు పెట్టుకుంటూ]. కథ లొద్దు; కాకరకాయ లొద్దు. పద్యం చెబుతా; నేర్చుకోరా బాబూ! [మనుమని యెత్తుకుని వొడిలో కూర్చోబెట్టుకుని] "శ్రీరాముని దయచేతను...."

మనుమడు. "చీలాము...."

రైతు. "చీ" కాదురా, తండ్రీ! "శ్రీ"

మనుమడు. అట్టాగే అన్నాను తాతా!

రైతు. ఏదీ? మళ్ళీ అను; "శ్రీరాముని దయచేతను...."

మనుమడు. "చీలాముని...."

రైతు. అదుగో! మళ్ళీ తప్పే అంటున్నావ్!

మనుమడు. నాకు లావడం లేదు, తాతా!

రైతు. అదే వస్తుంది. ఏదీ అను! "శ్రీరాముని దయచేతను...."

మనుమడు. "చీలామునిదయ...."

రైతు [మరింత స్ఫుటంగా ఉచ్చరిస్తూ] "శ్రీ"

[మనుమడు సిగ్గుపడి, కళ్లు చేతితో కప్పుకుని ముసి ముసి నవ్వులు నవ్వుతాడు.

రైతు. సరే, నాయనా! నీ కొచ్చినట్టే అనులే! "శ్రీరాముని దయచేతను...."

మనుమడు. చీలాముని దయసేతను...."

రైతు. "లాముని" కాదు; రాముని.

మనుమడు. ఊఁ! పో – తాతా!

రైతు. సరే! "నారూఢిగ సకలజనులు నౌరా యనగా...."

మనుమడు. "నాలూడిగ చకల...."

రైతు ["ఢి"ని నొక్కుతూ]. "నారూఢిగ...."

మనుమడు. "నా లూడిగ...."

రైతు [మరి లాభం లేదనుకొని]. "సకల జనులు నౌరా యనగా...."

మనుమడు. "చకల జనులు నౌలా యనగా...."

రైతు. "ధారాళమైన నీతులు...."

మనుమడు. "దాలాళమైన నీతులు...."

రైతు. "నోరూరగ జవులుపుట్ట నుడివెద సుమతీ"

మనుమడు. "నోలూలగ చెవులుపుట్ట...."

రైతు [నవ్వుతూ]. చెవులు కాదురా!—"జవులు"

మనుమడు [తాత నవ్వు వల్ల మాట అసలే తెలియక]. "జలుబు"

రైతు [మరింత బిగ్గరగా నవ్వుతూ]. జలుబట—జలుబు! జలుబెవరికిరా, బాబూ? [నవ్వు ఆపుకుంటూ] "జవులు" రా!—"జవులు"

మనుమడు [మూతి బిగించుకుని]. నే నను!

రైతు. ఏం బాబూ?

మనుమడు. నువ్వు నవ్వుతున్నావుగా, అమ్మా!

రైతు. నవ్వనులే, బాబూ! మరి నవ్వనుగాఁ! ఏదీ?—అను! "జవులు"

మనుమడు. "జవులు"

రైతు. "పుట్ట"

మనుమడు. "పుట్ట"

రైతు. "నుడివెద సుమతీ"

మనుమడు. "నుడివెద చుమతీ"

రైతు. "శ్రీరాముని దయచేతను...."

మనుమడు. ఊం! నా కిదొద్దు తాతా!

రైతు. పోనీ, వేరే పద్య మేదైనా చెబుతా లేరా, బాబూ! "అక్కరకు రాని చుట్టము...."

మనుమడు. నాకు పద్దా లొద్దు. కాకి కత సెప్పు.

రైతు. కథలంటే చెవి కోసుకొంటావ్. ఎందుకొచ్చిన కథలు! కూటికా? గుడ్డకా? చక్కటి పద్యాలు నేర్చుకోరా, నాయనా!

మనుమడు. ఉహుం! నాకు కతలే కావాలి.

రైతు. సర్లే! నువ్వు పడుకో—అట్టాగే చెబుతాలే [మనుమని యెత్తి, మంచంపై పడుకోబెడతాడు.]

మనుమడు. ఊం! చెప్పు మరి.

రైతు. కాస్త నిదానించరా, బాబూ! ఏదీ దుప్పటి కప్పుకో.

మనుమడు. ఉహుం! నాకొద్దు.

[కప్పుతున్న దుప్పటిని తీసివేయబోతాడు.

రైతు. చ లేస్తున్నది. నా బాబు కాదూ? కప్పుకో!

[దుప్పటిని చక్కగా కప్పుతాడు.

మనుమడు. ఏం తాతా, కత సెప్పవే?

రైతు. ఎంత ఆరాటంరా నీకు కథలంటే! సర్లే! ఏం కథ చెప్పను?

మనుమడు. కాకి కత.

తాత. రోజూ అదేనా? వినడానికి నీకు విసుగు లేకపోతే, చెప్పడానికి నాకు విసుగు కాదట్రా? కొత్తది—కోతికథ—చెబుతాలే. అనగా అనగా ఒక కోతి....

మనుమడు. నాకు కోతి కతొద్దు: కాకి కతే కావాలి.

రైతు. నీపంతమే నెగ్గాలంటావ్. సరే! నీ యిష్టం వచ్చినట్టే కానివ్వు. అనగా అనగా ఒక కాకి....

మనుమడు. ఉఁ

రైతు. ఆ కాకికి ఒక మాంసంముక్క దొరికింది....

మనుమడు. ఎక్కడ దొరికింది తాతా?

రైతు, కటికవాడి కొట్టుదగ్గిర.

మనుమడు. కటికవాడంటే?

రైతు. మొన్న చెప్పాగదట్రా!

మనుమడు. నాకు గ్యాపకం లేదు. మళ్ళీ చెప్పు.

రైతు. మేకల్ని గొర్రెల్ని కోసి అమ్ముతాడేఁ!—వాణ్ణి కటికవాడంటారు

మనుమడు. అవి ఏడవ్వా? తాతా! వాటిని కోస్తే?

రైతు. పాపం! ఏడవ్వా మరీ?

మనుమడు. వాటికి తాత లేడూ?

రైతు [నవ్వుతూ]. లేకేం! ఉన్నాడు.

మనుమడు. ఉంటే—మరేఁ—మానాన్న నన్ను కొట్టొస్తే నువ్వడ్డ మొస్తావే!—అట్టా—మరి—వాటి తాత అడ్డంలాడూ?

రైతు [మరింతగా నవ్వుకుంటూ, మనుమని చెక్కిలి ముద్దు పెట్టుకుని]. ఎక్కడినుంచి పుట్టుకొస్తాయిరా నీ కీ మాటలు! సరే! కథ విను! మాంసంముక్క తెచ్చుకుని....

మనుమడు. ఊఁ!

రైతు. ఆ కాకి ఒక చెట్టుమీద కూర్చుంది....

మనుమడు. ఏ చెట్టుమీద తాతా?

రైతు. మన చెరువుగట్టున లేదూ?—పెద్ద మఱ్ఱిచెట్టు. దాని మీద కూర్చుంది. కూర్చుంటే ఒక నక్కొచ్చింది.

మనుమడు. ఆ చెట్టుకింద తాతయ్యలు కూచుంటాలుగాఁ!

రైతు. ఔను, కూర్చుంటారు.

మనుమడు. అయితే, నక్క అక్కడి కెట్టా వొచ్చింది?

రైతు. రాత్రిపూట ఎవ్వరూ లేనప్పుడు వచ్చిందిలేఁ.

మనుమడు. చీకట్లో కాకులు తిలగవుగా, తాతా!

రైతు [నవ్వుతూ]. ఎంత గడుగ్గాయివిరా నువ్వు! తాతను బోల్తా కొట్టించావు. ఔను, బాబూ! నక్కలు పగటిపూట ఊళ్ళోకి రావు; కాకులు రాత్రిపూట గూట్లోనుంచి కదలవు. ఈ కథ పట్టపగలే ఊరుబయట జరిగింది. కాకి మాంసం ముక్క తెచ్చుకుని....

మనుమడు. ఊఁ!

రైతు. ఊరుబయట ఒక చెట్టు మీద కూర్చుంటే....

మనుమడు [ఆవలిస్తూ]. ఊఁ!

రైతు. నక్క అక్కడి కొచ్చి....

మనుమడు. ఊఁ!

రైతు. "కాకిబావా! కాకిబావా!...."

మనుమడు. ఊఁ!

రైతు. "నువ్వు ఎంత అందంగా వున్నావ్! నీ అందంకంటె కూడా నీ పాట మరీ బాగుంటుందట! ఏదీ! ఒక పాట పాడు! వింటా" ననిందట....

మనుమడు [నిద్రమైకంలోనుంచి]. ఊఁ!

రైతు. అనే సరికి....

[మనుమడు ఊఁ కొట్టడు.

రైతు. అనేసరికి ఆ కాకి "కాఁ కాఁ" అని కూసిందట. [మనుమడు నిద్రపోయిన సంగతి కానక] కూసేసరికి కాకి నోట్లో నుంచి మాంసంముక్క........[మనుమడు నిద్రపోయినట్టు తెలుసుకుని] ఏరా, బాబూ! నిద్దరోయావా? [మనుమని వీపు నిమురుతూ] పసివాళ్ళు మాట్లాడుతూ, మాట్లాడుతూనే చిటుక్కున నిద్దరోతారు. వాళ్ళకు చీకా, చింతా? కల్లా కపటం యెరగని వాళ్ళ బ్రతుకే బ్రతుకు. వాళ్ళు సాక్షాత్తు ఆ పరబ్రహ్మ స్వరూపులే! సంసార లంపటంలో పడిపోయినవాళ్ళకు ఇటు మసలి, అటు మసలి, చివరి కెప్పుడో పడక కుదిరితేనే తప్ప

కంటిమీద రెప్పపడదు. ఈ సంసారం—ఈ మమకారం—అంతా ఆ శ్రీ రఘురాముని చిద్విలాసం [కళ్లు మూసుకుని నమస్కారం చేస్తూ]

శ్రీ రఘురామ, చారుతులసీదళదామ, శమక్షమాదిశృంగారగుణాభిరామ, త్రిజగన్నుత శౌర్యరమాలలామ ! దుర్వార కబంధరాక్షస విరామ, జగజ్జనకల్మషార్ణవోత్తారకనామ, భద్రగిరి, దాశరథీ కరుణాపయోనిధీ !
రాముడు, ఘోరపాతక విరాముడు, సద్గుణకల్పవల్లికారాముడు, షడ్వికార జయరాముడు, సాధుజనావనవ్రతోద్దాముడు, రాముడే పరమదైవము మాకని,మీయడుంగు గెందామరలే భజించెదను, దాశరథీ కరుణాపయోనిధీ !

[ఆవలిస్తూ, చిటికెలు వేస్తూ, రైతు రామసంకీర్తన చేస్తూ వుండగా భార్య ప్రవేశిస్తుంది. ఆమె వయస్సు దాదాపు యాభై సంవత్సరాలు. కాని, అరవై నిండిన దానివలె కనబడుతుంది. పొట్టిగా, బొద్దుగా వుంటుంది. గుండ్రని ముఖం. ముడతలు పడి కొంచెం దిగజారిన బుగ్గలు. ముప్పాతిక నెరసిన జుట్టు; మధ్య పాపట, కొప్పు ముడి. పెద్ద కుంకుమబొట్టు.

భార్య. దాని ముందేసిన మేత యేసినట్టుగా వుంది. అదేమో కాని మన పెద్దగేదె ఒక్క పరకైనా కొరకడం లేదు.

రైతు. కొంపతీసి గాల్లు తగల్లేదుగదా ? ఊరంతా ఇప్పు డీ పాడు జబ్బే. కిష్టప్పగారి దొడ్డిని ఊడ్చేసిందని ఇందాక చెట్టుకాడ

చెప్పుకుంటున్నారు. రేపు పొద్దున్నే కామయ్య నొకసారి పిలుచుకొచ్చి చూపిద్దాంలేఁ! ఎడ్లముందు మే తున్నదా?

భార్య. ఆఁ!

రైతు. ఎగదోసి, మరొక జనప కట్టేసి రాకపోయావూ?

భార్య. ఎలిసిమీ దుంది. నా కందుతుందా, పెడుతుందా?

రైతు. అబ్బాయి అత్తారింటి కెళ్ళిన ఈ అయిదారు రోజుల్నించీ వాటికి తిన్నగా నీళ్ళూ మేతా లేవు. వా డుంటే అడుగడుక్కీ వాటి అజా పజా కనుక్కుంటూ వుంటాడు.

భార్య. ఆ డెళ్ళి రేపటికి సరిగా వారం. ఈ వారం రోజుల్నించీ మనదొడ్డికి అదు పేదీ? ఊరు మందంతా వొచ్చిపడి, ఆ యేసిన నాలుగు పరకలు మేసిపోతున్నాయ్. ఆళ్ళ కేం పోగాలమో, మరీ ఆ రత్తయ్యగారి గుంపు పలుపు లిప్పి ఊరుమీది కెగదోలేస్తున్నారు.

రైతు. ఊరు మాటుమణిగాక వాళ్ళ గొడ్డుగోదలు అస లెన్నడైనా కట్టుగొయ్యల నుంటేగాఁ! దొంగ రత్తయ్యగారి సంపదని వాళ్ళకి మరి వూరికే పేరొచ్చిందీ?

భార్య. ఆళ్ళ తాడు తెంచారుగాని, ఇదుగో వొస్తానని మన అబ్బాయి రానే లేదేమో? కోడలు తేలిగ్గానే పురుడు పోసుకుందాయె! దాని కెదురుగుండా ఈ డెందుకు కూకున్నాడు!

రైతు. సంక్రాంతి రేపు సోమవారంనాడేగా? పండగముందు వాళ్ళు రానివ్వొద్దూ?

భార్య. ఆఁ! పండగనీ, అల్లుడనీ ఆళ్ళ కిదే పట్టింది! ఏడెనిమిదేళ్ళనాడు పెళ్ళి పీటలమీద కట్టబెట్టిన ఆ వొక్క పంచెలచాపు

తర్వాత, ఆడు మళ్ళీ ఎప్పుడైనా ఒక గుడ్డపీలికైనా ఎరు గున్నాడూ ? మన కివ్వాల్సిన కట్నం డబ్బు మనకు పారెయ్యా డానికి చేతులు రాకేఁ "ఇదుగో, అదుగో" అంటూ ఆళ్ల రోజులు గడుపుతున్నారు. నే నొద్దన్నకొద్దీ ఈ పాడు సుట్టరికం నువ్వే తెస్తివిగా !

రైతు [బయట చప్పుడుకాగా ఆలకించి]. ఏమి టది ? మన గొడ్ల చావిడిలో అలికిడౌతున్నది.

భార్య. ఆ దొంగ రత్తయ్యగారి మాయదారిమంద మళ్లీ వొచ్చి పడిందేమో ?

రైతు. ఆరి వీటిని మాదిగాడికి తోల !—ఇవి మన కెక్కడ పంపకమైనై. [ఈ మాట అంటూనే మంచంపైనుంచి దిగ్గున లేచి, మూలనున్న కోలుపుకర్ర తీసుకుని వెలుపలికి వెడుతూ]. జిర్రొఁ, జిర్రొఁ !

[వెలుపలినుంచి కొడుకు గొంతు : "నేను నాన్నా !"

భార్య. నువ్వటరా ! బాబూ !

[రైతు గొంతు : "నువ్వెప్పు డొచ్చావురా ?"

కొడుకు [ప్రవేశిస్తూ]. ఇప్పుడే ! వస్తూ వస్తూ, గొడ్లముందు మే తెగదోసొద్దామని చొప్పరంలో కెళ్ళాను.

[వయస్సు ముప్పై సంవత్సరాలు. ఆ ప్రాయంనాటి రైతును ఊహించుకుంటే కొడుకు రూపును వేరే వర్ణించ నవసరం లేదు.

భార్య. పొద్దోయి, పోరటోయి ఇప్పు డొచ్చా వేమిరా ?

రైతు. [తిరిగి వచ్చి, కోలుపు కఱ్ఱను దాని తావులో పెట్టివేస్తూ]. ఇంత చిమ్మచీకటిని పడి రాకపోతే, తెల్లారినా కొస్తే కాదట్రా ? దస్తుకూడా వెంటున్న దేమో !

భార్య, తల్లీ బిడ్డా బాగున్నారట్రా ?

కొడుకు. ఆఁ !

భార్య. పిల్లవా డెవరి పోలిక ?

కొడుకు. ఏమో ?

భార్య. ఎరుపా ? నలుపా ?

రైతు [వెళ్ళి, మళ్ళీ తన మంచంపై కూర్చుంటూ]. ఆఁ ! పదిహేనురోజుల గుడ్డు. వాడు తిన్నగా చూశాడో లేదో ! నువ్విన్ని వైనా లడిగితే వాడేం చెబుతాడు ?

భార్య. సర్లే ! మగబిడ్డ - ఎట్టావుంటే యేంగాని, సరిసి బాగుం దట్రా ? నన్ను తలుస్తున్నదా ?

కొడుకు. ఆఁ ! నాయనమ్మ దగ్గిరికి వచ్చేస్తానంటూ మారం చేసింది. కాళ్ళను చుట్టేసి కదలనివ్వలేదు. బతిమలాడి, బామ లాడి ఎలాగో సముదాయించొచ్చా.

భార్య. తీసుకురాక పోయావట్రా ? - నాతల్లి నాదగ్గిరుండేదేమో? దాన్ని చూసి ఏళ్ళూ పూళ్ళూ అయినట్టుగా వుంది. ఎంద రున్నా అది లేకపోతే యింట్లో సందడే వుండదు. నా యావంతా దానిమీదే వుంది.

రైతు. సర్లే ! నీ సోది కేమి కాని, ముందు వాడికి అన్న మొడ్డించు.

భార్య. పొద్దున్నెప్పుడు తిండి తిన్నావో! రారా! - కాళ్ళు కడుక్కురా!

కొడుకు. సందేళ భోంచేసే బయల్దేరా నమ్మా.

భార్య. ఇందా కెప్పుడో రెండు మెతుకులు తింటే, అంతదూరం నుంచి,ఇంతదూరం నడిసొచ్చేసరికి అరిగిపోకుండా మీ అత్తారు అంత పెట్టు పెట్టారేమిటి? రారా! రా! - వొడ్డిస్తా!

కొడుకు. అబ్బే! ఎందుకు?—ఆకలి లేందే!

[ఈ మాట అంటూ షర్టు విప్పి, దాన్ని పడకగదిలో వుంచి, తిరిగి చావడిలోకి వస్తాడు.

రైతు. నువ్వింకా రాలేదని వాడు ధూంధాములు చేస్తున్నాడురా!

భార్య. అవునురా! ఉడుగుడు గొచ్చి పోతున్నాడు. సందేళకూడా ఆడొచ్చి నానా కూతలు కూస్తే "రేపో మాపో వొస్తాడులేవే, బూసయ్య బావా! ఎళ్ళినాడు రాకండా అక్కడే కూకుంటా డేమిటి?" అని సర్దిసెప్పి పంపించా.

రైతు. ఎల్లుండికి నోటు లిమిటేషను పట్టి పోతుందట్రా! "చూడగా మీ అబ్బాయి కావాలనే ముఖం చాటేసినట్టున్నాడు. చాల్ చాల్ లేవయ్యా! ఇదేనా మీ మర్యాద! ప్లెయింటు ఫడేస్తా!" నంటూ వాడు వీధిని పడుతున్నాడు.

భార్య. ఆడినోటికి శుద్దీ బద్దీ వుంటేగా? నోటి కెంత కూతొస్తే అంతా వూడేస్తాడు.

రైతు. మరి మీ మా మేమన్నాడు? కట్నంబాపతు కొదవ పైక మిచ్చాడా? భూషయ్య బాకీ తీర్మానం చెయ్యకపోతే, పరువు దక్కేటట్టులేదు.

కొడుకు. ఆ ఊళ్ళో పొలా లిప్పుడు బాగా పండుతున్నాయి.
నాన్నా! ఈ యేడు పుట్టి ముప్పందుంకాడికి రాలింది.

రైతు. అఁ! పండినేడు పండుతుంది; పోయినేడు పోతుంది.
అది పాడు గరువునేల. అక్కడి పంటలమాట కేమిలే?
ఇక్కడ భూషయ్య....

కొడుకు. లేదు, నాన్నా! ఇప్పుడు మురుగుకాల్వ పడిందికాదూ?
ముల కెయ్యడంలేదు. బంగారం పండుతున్నది,

భార్య. మా యిియ్యపురాలు వాకిట్లో పురులు కట్టేసిం దేమిటి?
అయితే, ఆమెగారి ముందు నే నిఖ అసలే నిలవలేను.

కొడుకు. రెండో పంటకింద జనుం వేశారు, నాన్నా! ఏమి
యేపుగా పెరిగిందనుకున్నావ్! చేలో దిగితే మనిషి కనబడ్డం
లేదు. అక్కడా భూముల ధరలు రోజు కొక రకంగా పెరిగి
పోతున్నాయి. నిరుటికీ, ఈయేటికే ఎకరానికి మూడొందలు
పెరిగింది. అయిదారేళ్ళనాడు వందకీ, వందంబాతిక్కీ
మూజూడనిదాన్నే ఇప్పు డయిదారు వందలదాకా అడుగు
తున్నారు. ముందు ముందు ధర లింకా....

రైతు. ఆ చవిటిపర్రలమాట నాకు చెప్పకురా! ఏమైనా నల్లగడ్డ
నల్లగడ్డే! ఊఁ! సరే కాని, పైకం పట్టుకొచ్చావా?

కొడుకు. ఉహుఁ!

భార్య. ఇం కెన్నిసార్లు తిప్పించుకుంటారు? ఏడేళ్ళనుంచి దగ్గి
రెట్టుకున్నారు చాలదూ? [భర్తతో] నేను అనాడే అనలా?
"ఒక పొలి కే కేయిస్తే మనకి నిండిందా? ఇలాంటి సదివిం
పులు చాలా చూశాం! ఆ మూడు ముళ్ళు పడకముందే రొఖం
పోస్తేనే సరి" అని నే నంటే ను వ్వినావా?

రైతు. మరి, ఘాషయ్య ఆగుతాడట్రా? నోటు తిరగ రాసిస్తా మన్నా రాయించుకునే ధోరణిలో లేడు. ఈమాట మీ మామతో చెబితే పైక మిచ్చే వాడేమో?

భార్య. ఆఁ! ఇచ్చే వాళ్ళయితే ఎప్పుడో యిచ్చేవాళ్లు. ముప్పై మూడు మాట్లు తిప్పించుకుని, మూడేళ్ళనాడిచ్చిన అయిదా రొందలే మన కేం ముట్టినా! మిగతాది గుణ్ణాన పడిపోయి నట్టే!

కొడుకు. ఎందు కొచ్చిన మాట లమ్మా, యివి? కావాలంటే, వడ్డీతోసహా పట్టుకుపొమ్మని వాళ్ళన్నారు. తొందర లేదని నేనే చక్కా వచ్చా.

భార్య. తొందర లేకపోవడ మేమిటిరా?

రైతు. సరే కానియ్యి! ఊళ్ళో టపు కేయించి, కొంపా గోడూ అప్పులవాడు వేలం వేయించుకు పోతాడులే!!

భార్య. ఆ బూసయ్య అంత పనీ సేయించడనా? ఆ దెంతకైనా తగు!

రైతు. వేలం, జప్తులు నే నెన్న డెరగను. ఇంత బ్రతుకూ బ్రతికి, ఇంటి వెనకాల చచ్చినట్టు, ఇన్నేళ్లొచ్చాక ఇప్పుడు కోర్టుకు లాగించుకుంటానా? నీ పెళ్లాం తెచ్చేమూట నువ్వు భద్రం చేసుకో! సెంటో కుంటో తెగనమ్మి వాడిబాకీ వాడికి రేపీపాటికి పారేస్తా!

కొడుకు. ఆ డబ్బేనా నాది? ఈ కొంప్ర నాది కాదూ? ఎప్పటి కప్పుడు ఇలా అప్పులై పోతూవుంటే చివరి కేమి నిలుస్తుందనే నా యేడుపు!

రైతు. నే నేమి జుర్రుకుంటున్నానా? సంసార మన్నాక అప్పూ సప్పూ కాకుండా వుంటుందా?

భార్య. నే నెవ్వరికీ ఏమీ దోసిపెట్టడం లేదు. ఇద్దరు ఆడపిల్ల లున్నారంటే వాళ్ళు ఫండక్కీ పబ్బానికీ ఆకులో ఇంత కుంక మైనా యెరగరు. పెద్దపిల్ల తొలుసూరిదానికి మొన్న పెళ్ళి సేసుకుంటే, "గాజులు తొడిగించుకోవే" అని పెళ్ళికూతురు సేతిలో పెట్టడానికి రూపాయి డబ్బులైనా నాకు గతిలేకపాయె! అమ్మమ్మకని అది దణ్ణం పెట్టొస్తే నలుగురిలో నా కెంత సిగ్గేసింది?

కొడుకు. నాకుకాకుండా మీ రందరికీ దోచిపెడుతున్నారని నే నన్నాన టమ్మా? రెక్కలు విరుచుకోవడమే కనబడుతున్నది కాని, ఎవ్వరు బాముకుంటున్నదీ ఏమీ లేదు. మన రెండెకరాల మీద మనకొచ్చే అయివే జెంతో నాకు తెలవదూ?

రైతు. మరి అన్నీ తెలిసినవాడివేనా, ఇంత లక్షణంగా వ్యవహారం చేసుకొచ్చావ్?

కొడుకు. నే నొకటి అడుగుతాను, నాన్నా! మనం రాత్రింబగళ్లు పాటుబడుతున్నామా? వొళ్ళు దాచుకుంటున్నామా?

రైతు [వెటకారంగా]. అఁ! నా దేమున్నదిలే! అంత పాటూ నీదే.

కొడుకు. నే నొక్కణ్ణే పాటుపడుతున్నానని నే నన్నానా? అయినా, వయస్సులో వున్నవాణ్ణి; ఇప్పుడు కాకపోతే మ

రెప్పుడు పాటుపడతాను ? కాని నలభై, యాభై యేళ్ళనుంచి రెక్కలకష్టం చేసినా ఈ నాటికైనా నీడపట్టున కూర్చునే యోగ్యత నీకు లేదయ్యె ! ఎం డనక, వా ననక, పొద్దస్తమానం దేవులాడినా మన కేం మిగులుతున్నది ? మూడేళ్ళ కిందట పేరుకున్న అయిదారొందల అప్పు నెట్టాగో యెత్తి పార వేశామనుకుంటే, మళ్ళీ అప్పుడే నాలుగొందల అప్పు కనబడుతున్నది. ఇంతేనా ?

భార్య. కలిసిరావడం లేదు - ఏం చేస్తాంరా?

కొడుకు. కలిసిరావడం, గిలిసిరావడం కా దమ్మా ! మన కిప్పుడు వస్తున్న ఆదాయంతో మన కుటుంబం గడవదు. అప్పుకాక మరేమౌతుంది.

భార్య. కొద్ది సంసారంలో తవ్వుకోవడం, పూడ్చుకోవడం అంద రికీ వుంటుంది. ఒఖ్ఖ మనకేనా ?

కొడుకు. ఊఁ ! నీకు తెలియదులే. అమ్మా! మా ముత్తాత డెబ్భై ఎకరాల ఆసామట. మా తాతలు పదేసి ఎకరాలవాళ్ళు. మా నాన్నల దగ్గిరికి వచ్చేసరికి తలొక రెండెకరాలు అయింది. ఇఖ, నాకాడి కొచ్చేసరికి నేను రేపు కుంటా సెంటూ పంచి పెట్టాలి. అదైనా ఈకాస్తా ఈలోగా ఋణాలకింద హరించి పోకుండా మిగిల్తేనే. ఇప్పటి లెఖ్ఖని చూస్తే, అస లేమీ మిగ లనే మిగలదు.

రైతు. అయితే, అప్పుడు నీపెళ్ళాం తెచ్చే ఆరొందలు నిన్ను....

కొడుకు. అవి నన్ను ఉద్ధరించవులేఁ!

భార్య. మ రేమిటిరా నీ గొడవ?

కొడుకు. మన కుటుంబం ఖర్చుకు సరిపడ రాబడి యేర్పరుచుకోవా లంటున్నాను.

రైతు. లేని రాబడి రమ్మంటే, ఎలా వస్తుంది? నారుపోసిన వాడు నీరు పొయ్యడూ? అన్నిటికీ ఆ శ్రీరామచంద్రుడే వున్నాడు.

కొడుకు. దేవుడిమీద భారంవేసి వూరుకుంటే సరిపోతుందా, నాన్నా? మన దేవులాటకూడా వుండాలి.

రైతు. అయితే నువ్విప్పు డేం చేస్తానంటావురా?

కొడుకు. మన రెండెకరాలు బేరం పెడితే....

రైతు. తాత ముత్తాతలనాటిగడ్డ అమ్ముకుంటావట్రా?

కొడుకు. ఎకరానికి మూడు వేలచొప్పున ఆరువే లొస్తాయి. చేలో చేను కలుస్తుందని ఆ ధర పెట్టడానికి భూషయ్యే తయ్యారుగా వున్నాడు. మన యిల్లూ, దొడ్డీకూడా అమ్ముకుంటే....

భార్య [నోరు నొక్కుకుంటూ]. అవ్వ! పెద్దలు కట్టిన కొంపా తెగనమ్ముకుంటావట్రా?

కొడుకు. పాటిమట్టి వున్నది కాబట్టి, కనీసం మరొక రెండున్నర వేలయినా అలాగ్గానే రావచ్చు. ఇక్కడున్న ఋణం తీర్చుకుని, మిగతా డబ్బు పెట్టుకుంటే, ఆ వూళ్ళో....

రైతు. అలా చెప్పు! అత్తవారి పంచకు చేరా లనుకుంటున్నా వన్నమాట!

భార్య. మాయదారిమూక! ఆళ్ళే నూరిపోసి పంపించారు.

కొడుకు. ఈ మాట ఎక్కడొస్తుందోననే యిన్నాళ్ళూ తటపటాయించా. సరే! రావలసినమాట రానే వచ్చింది కనక, మరి బరిలో పడతాను. ఏఁ! ఇక్కడి రెండెకరా లమ్ముకుని అక్కడ ఇరవై ఎకరాలు కొనుక్కోడం చేదా?

భార్య. ఉన్నవూ రొదిలిపెట్టుకు పోతారట్రా?

కొడుకు. ఏఁ! ఊరు బువ్వ పెడుతుందా?

భార్య. అదీ ఒక ఊరేనా! ఈగలు, దోమలు మొగంనిండా ముసురుకుంటూ అడివూరు.

కొడుకు. అక్కడున్నవాళ్ళూ మనుషులే.

భార్య. ఏం మడుసులురా ఆళ్ళు? వొట్టి అడివి మడుసులు! పని సుట్రం తెలుసా? మాట సుట్రం తెలుసా? అసలు ఆ ఊరు మొత్తంమీద తీరైన కొంప ఒక్కటైనా మండిందీ? అన్నీ చుట్టు గుడిసెలే!

కొడుకు. అయితే మనదేనా ఆరామడ పట్నం?

భార్య. మంచీ చెడ్డా తెలిసినా డెవడైనా అలిగి అత్తారింటికి, చెడి చెల్లెలింటికి పోతాడట్రా?

కొడుకు. ఇప్పుడు ఎవరిమీద ఎవరు అలుగుతున్నా రమ్మా?

రైతు. సర్లే! ఇల్లరికం వెళ్ళడం నీకు ముచ్చటగావుంటే, నువ్వు ఆ వూరు చేరు!

కొడుకు. నన్నిల్లటం చేసుకోడానికి వాళ్ళ కేం ఖర్మ? వాళ్ళకే వున్నారు ఆరుగు రబ్బాయిలు. చిన్నవా ళ్ళిద్దరు బస్తీ కెళ్ళి చదువుకొంటూ వుంటే, పెద్దవాళ్లు నలుగురూ దిట్టంగా యవసాయం చేస్తున్నారు. మనస్సు తెంపు చేసుకుని, ఇక్కడున్న కాస్తా అమ్ముకుని, అక్కడి కెళ్ళాకే వాళ్ళకు అయిదేళ్ళా నోట్లో కెళ్ళుతున్నాయి. ఆయేటి కా యేడు వాళ్ళకు బాగా కలిసొస్తున్నది. మనమళ్ళు, మనమరాళ్ళు పుట్టుకొస్తున్నా, సంతుతోపాటు ఖర్చులు పెరిగిపోతున్నా, ఏడాదికి అయిదెకరాలకు తక్కువ కాకుండా వాళ్ళు కొనుక్కుంటున్నారు. ఈ లెక్కని మరి నాలుగేళ్ళు గిర్రున తిరిగొచ్చేసరికి వాళ్ళు నూ రెకరాల ఆసాము లౌతారు. మూడు జతల యెద్లు, ఎనిమిది ఆవులు, అయిదు కోడెదూడలు, పది, పన్నెండు పాడిగేదెలు—వాళ్ళ దొడ్లో లక్ష్మి కళకళ లాడుతున్నది. దానిలో కెళ్ళితే, నాకు తిరిగి రా బుద్ధి కాలేదు.

రైతు. అయితే, అక్కడే వుండక పోయావూ?

కొడుకు. అక్కడుంటే అది నా దౌతుందా? నా మామ కుంటే నా మామే తింటాడు; నా కెందుకు పెడతాడు?

రైతు. ఎందుకులే ఈ మాటలన్నీ? నీ చూపంతా మామగారి వూరుమీదే వుంది. అక్కడికే జెండా పీక్కుపో!

కొడుకు. ఆ ఊళ్ళో కాకపోతే, ఆ చుట్టుపక్కల మరెక్కడైనా చేతినిండా కొంత్ర సంపాయించుకో గూడదేమిటి?

రైతు. చేసుకునే సత్తా వుండాలేకాని, ఇక్కడ లేదా కట్టుబడి కెంత పొలమైనా?

కొడుకు. వాడి పొలం, వీడి పొలం కట్టుబడిచేస్తే మనకు నిండుతుందా? మూడేళ్ళు పడరాని పాట్లుపడి, పాటిమట్టి తోలి, పెంట కట్టించి, దేవుడీనాం బలం చేస్తే, అది తీరా మన కక్కుర కొచ్చేసరికి, దాన్ని పాటకు పెట్టించి, ట్రస్టీ తన బావమరిది పేర కొట్టేయించుకోలా? పిచ్చిభూమో, యెచ్చిభూమో, అది మనదైతేనే మనం చెమటోడ్చినా, చెమటోడ్చిన ఫలం. అందుకనే ఎక్కడికైనా వెళ్ళి, మరొక చారెడు నేల సంపాయించుకుందామని నా ఆరాటం. ఇక్కడ ఈ పడేకష్టమే అక్కడ పడితే, అది గనిగడ్డ కాదూ?

రైతు. మా కేమీ వద్దులే! అచ్చొచ్చిన భూమి అడిగిడే చాలు.

కొడుకు. ఏమి అచ్చిరావడం? ఎంత రెక్కలు విరుచుకున్నా కడుపు నిండక పోవడమేనా?

రైతు. ఏమైనా అత్తారిపంచని చేరతావట్రా? అది మగసిరి పనేనా? అంతకంటె అడుక్కుతినడం మేలు!

భార్య. ఇంతకీ ఆళ్ళ మాయమాటల్లో పడిపోయాడు.

కొడుకు. మాయమాట లేమీ కాదు; మంచిమాటలే! వాళ్ళు రమ్మన్నప్పుడే వెళ్ళితే, ఏ నూరెకరాలో కట్టుకునే పని. అప్పుడక్కడ ఈ పాటిగానైనా రైతు వొత్తిడి లేదు. ముందుగానే జాగ్రత్త పడ్డవాళ్ళందరు ఇప్పు డెంతో బాగుపడ్డారు. అన్ని వనరు లేర్పడుతున్నాయి; అన్ని పంటలు పండుతున్నాయి; అందరూ పచ్చగా వున్నారు.

రైతు. ఇప్పుడైనా మించుకుపోయింది లేదులే! కావాలంటే నీది నువ్వు పంచుకుపో! ఈ కళ్ళకు ఈ రెప్పలు దూరం కాక

పోతే, అక్కడ నీకు ఏం గతి పట్టేదీ చూడకపోతానూ? పో! నీ సగం నువ్వు పంచుకు పో! [మనుమని చూపిస్తూ] వాడే నాకు కొడుకూ, మనమడూ అనుకుంటా! వాడైనా వుంటాడు నా గడ్డమీద.

కొడుకు. ఆమాట కొస్తే వాడిని నే నిక్కడొదిలేసి పోతానా?

రైతు. ఏం! నేను చచ్చింతర్వాత నా యింట్లో దీపం పెట్టేవా డుండగూడదనా?

కొడుకు. సొంత ఊరునుంచి లేచిపోవడమంటే నీకేనా బాధ? నాకు లేదూ? అయినా ఇక్కడొక యెకర మమ్మి, అక్కడ నాలుగెకరాలు కొనాలనే ఈ తాపత్రయం నాకు దేనికి? మన రెక్కల కష్టం [కుర్రవాడిని వేలితో చూపిస్తూ] వాడికి దక్కాలని కాదూ? వాడి బాగెరిగిన వాడివైతే నువ్వు వూరు పట్టుకుని ఊగులాడతా నంటావా? ఏది మనకు కడుపునిండా కూడు పెడుతుందో అదే మన వూరు; అదే మన గడ్డ. ఉసులుబాటు లేకపోయినా, ఉక్కిరిబిక్కిరౌతున్నా, ఊరు నంటిపెట్టుకోవడం దేనికి? కొత్తగడ్డకు పోతే, కొత్త రోజులు కనబడతాయేమో!

రైతు [పట్టరాని కోపంతో]. సర్లే! నువ్వే నాకు కానప్పుడు వాడు నా కౌతాడా? తీసుకు పో! వాణ్ణికూడా వెంట తీసుకు పో! పోయి ఏట్లో కలువ్!!

భార్య. ఉం! చాల్లే! ఏమిటా కీడు మాటలు? ఎవరైనా యింటే నవ్విపోతారు.

రైతు. నవ్వకేం? నవ్వుతారు? పైగా ఒక్కనోటితోనేనా నవ్వేది? కాలాన్నిబట్టి బళ్లు ఓడ లౌతాయి; ఓడలు బళ్లు అవుతాయి. అలాగని జెండా పీక్కుని, ఊళ్ళవెంట అడుక్కు తినబోతారా? ఎకరాలేనా ముఖ్యం? మంచీ చెడ్డా లేదూ? మర్యాదా, మన్ననా లేవూ? మా తాత ముత్తాతలు ఈ ఊరు పెత్తందారులు. సత్రాలమీదా, చెరువులమీదా ఇప్పటికీ పెత్తనం మాదే. ఏ పంచాయితీ వచ్చినా, ఈనాటికీ మమ్మల్నే పిలుస్తారు. సీతా రామ కల్యాణంలో పీటలమీద కూర్చునేది మేమే. అమ్మ వారి సంబరం జరిగితే, తొలేట మాదే. ఎకరానికి నాలుగెకరా లొస్తాయని చూసుకుంటే సరేనా? వంశమర్యాద నిలబెట్టుకో వద్దూ? కూడులేక చచ్చిపోతా రేమిటి? చచ్చినా, ఎవడి పంచని వాడు చస్తే, అ దొక తీరూ దారీ. లేకపోతే, కాలు పుచ్చుకుని కుక్కనీడ్చినట్టు, అవతలి కీడుస్తారు. ఎక్కడైనా తాగిన రొమ్మునే గుద్దుతారా? కన్నతల్లివంటి ఊరును కాల దన్నిపోతారా? పోరా! పో!! కావాలంటే నువ్వు పో!!!

[రైతు కేకలకు మనుమడు తుళ్ళిపడి లేచి, ఏడుపు ప్రారంభిస్తాడు.

భార్య. చాల్లే! ఏమిటా గొంతు చించుకోవడం? పిల్లాడు తుళ్ళి పడి లేచాడు. [దగ్గరికి వెళ్ళి, కుర్రవాడి వీపు నిమురుతూ] మా బాబుగా ఊరుకో! ఊరుకో!! [కుర్రవాడు ఏడుపు మానడు] బజ్జోరా, నాన్నా! బజ్జో!

మనుమడు [తాతవైపు చేతులుజాచి ఏడుస్తూ]. తాతా! ఊఁ! ఊఁ!

[తాత దగ్గరకి తీయడు. అతి కష్టంమీద ముఖం తిప్పేసు కుంటాడు.

భార్య. నాన్నవుగా! పడుకో! పడుకోరా బాబూ!

మనుమడు [ఇంకా యేడుస్తూనే]. తాతా! తాతా! ఊః(! ఊః(!

భార్య. దగ్గిరికి తియ్యవే(—ఆడంత గోలెడుతూ వుంటే?

మనుమడు. ఊః(! ఊః(! తాతా!

భార్య. నే నున్నాగాదురా! బజ్జో, బాబూ!

మనుమడు. ఊః(! ఊః(! నాకు తాతే కావాలి....ఊః(! తాతా!.... ఊః(!

రైతు [గాద్గదికంగా]. నీ తాత లేడురా, బాబూ! నీ తాత చచ్చి పోయాడు.

భార్య. ఇంతకీ నాకొచ్చిపడింది ఈ ఖర్మ!

మనుమడు [ఏడుపు పెద్దదిచేసి]. ఆ(! ఆ(! తాతా! ఊః(! ఊః(!!

భార్య. అబ్బ! ఎత్తుకున్నదాన్ని నేను మడిసిని కాద్రటా? ఊరుకో!

కొడుకు. వెధవని రెండు చరిస్తే సరి! గారాం మరీ ఎక్కువై పోయింది!

మనుమడు [భయదైన్యాలతో నిండిన కళ్ళతో రెండుచేతులు చాచి, తాత వైపు విరగబడుతూ]. తాతా! తాతా!!

[రైతు మరి వుండబట్టలేక మనుమని యెత్తుకుంటాడు. కప్ప వలె కరుచుకుని, భుజంపై తల పొదువుకుని, మనుమడు ఇట్టే తిరిగి నిద్రపోతాడు.

రైతు [రెండు, మూడుసార్లు చావడిలో పచారుచేసి, కొడుకుతో]. నీపట్టు నీదేనట్రా?

కొడుకు. నే నేమి ఏడ్చేడ్చినా నాకోసం కాదు. అదుగో! అక్కడ ఆ పుట్టినవాడికోసం; ఇదుగో! ఇక్కడ ఈ పెరుగుతున్న వాడికోసం. వీళ్ళిద్దరుకాక విరగడ చెయ్యవలసింది మరొక ఆడపిల్లకూడా వుంది. ఈ ముగ్గురికి మరొక ముగ్గురైతే మన పని "అమ్మా బువ్వ—అయ్యా బువ్వ" అవుతుంది.

భార్య. ఆఁ! చెట్టుకు కాయలు బరువటరా?

కొడుకు. అసలు చెట్టొకటి మిగిల్తేనా? మనం ఆరోజుకారోజు చేవ దేల్తున్నామా? నీళ్ళు కారుతున్నామా? మనకేఁ? కష్టమో, సుఖమో మన బ్రతుకులు ఎలాగో వెళ్ళమారిపోతాయి. రేపు వాళ్ళ మా టేమిటి? వాళ్ళు పాలేరుతనానికి నిలబడవలసిందేనా?

రైతు. నువ్వేమన్నా ఆదికాలంనుంచీ ఇది మన ఊరురా! ఊరు మొత్తంమీద ఒకప్పుడు మనదే పెద్దకుండ. కష్ట మొచ్చినా, సుఖ మొచ్చినా - చల్లనితల్లి - ఈవూరే మనల్ని కడుపులో పెట్టుకు కాపాడింది. దీన్ని విడిచిపెట్టక తప్పదట్రా? [కొడుకు మాటాడకపోగా, దీర్ఘంగా నిట్టూర్చి] ఈ గడ్డమీద పుట్టాను; ఇక్కడే పెరిగాను; ఇక్కడే మట్టికూడా అయిపోదామనుకున్నా. కొత్తగడ్డమీద అడు గెట్టాల్సొస్తుందని కలలోనైనా అనుకోలేదు. [మరి రెండు, మూడుసార్లు పచారు చేసి] నాగలి పట్టిననాటినుంచీ నేను దున్నుకుంటున్న చేలో మరొకడు పాదం పెడితే నాగుండె తరుక్కుపోదట్రా? [కొడుకు మనస్సు మారుతుందేమోనని, ఒక్కక్షణం పాటు ఆగి, మరి లాభం లేదనుకుని] ఇంతవరకు నన్నెవ్వరు లొంగదీయలేదు. ఈనాడు [మనుమని వీపు చేతితోతటుతూ]

ఈ పసికందు లొంగదీస్తున్నాడు. [ఒక త్రుటిపాటు ఆగి, ప్రారబ్ధానికి తల వొగ్గుతున్నట్టుగా] సరే! రేపు భూషయ్యకు బేర మివ్వు!

[కొడుకు పెదవులపై విజయసూచకంగా చిరునవ్వు మొలక లెత్తుతుండగా—

తెర]



## పాత్రలు

| | |
|---|---|
| గిరి<br>మూర్తి<br>శాస్త్రి<br>రావ్<br>ప్రసాద్ | లా కాలేజి విద్యార్థులు |

## స్థలం

స్టూడెంట్స్ లాడ్జిలో గది

## కాలం

వర్తమానం



# ద్రోహం

మద్రాస్ లింగిచెట్టివీధిలో ఒక గది. దానిలో మూర్తి, శాస్త్రి వుంటున్నారు. ఒక్కొక్కరికి ఒక టేబుల్, ఒక చెయిర్, ఒక బుక్ షెల్ఫ్, ఒక క్యాంప్ కాట్. మూర్తిది ఒక లెదర్ సూట్ కేస్; శాస్త్రివి రెండు స్టీల్ ట్రంకులు. మూర్తి టేబుల్ మీద ఒక టెన్నిస్ రాకెట్, చిక్కుచొక్కురుగా కొన్ని పుస్తకాలు, ఉపయోగించి అలక్ష్యంగా విడిచిపెట్టిన షేవింగ్ సెట్ వగైరా. శాస్త్రి టేబుల్ మీద ఒక పెద్ద అద్దం, ఒక అలారం టైమ్‌పీస్, చక్కగా సర్ది పెట్టుకున్న పుస్తకాలు మొదలైనవి.

తెర లేచేసరికి శాస్త్రి డ్రెస్సింగ్ పూర్తిచేసుకుని, అద్దం ముందు నిలబడి తల దువ్వుకుంటూ వుంటాడు. ఒక నిమిషం తర్వాత ఎడమ వైపునున్న గది గుమ్మంగుండా మూర్తి చాలా అలసటగా వస్తాడు. అతని అడుగుల అలికిడికి శాస్త్రి వెనక్కి తిరిగి చూస్తాడు.

**శాస్త్రి.** ఏరా, మూర్తీ! చౌదరికి....

[మూర్తి కొరకొర చూపులకు బెదరిపోయి, మాట మధ్యలో శాస్త్రి ఆగిపోతాడు. మూర్తి తన క్యాంప్ కాట్‌ను చేరి, దానిపై చతికిలబడి, ముందుకు వాలి, గుండె బరువుగా వున్నవాడివలె ముఖాన్ని అరచేతులతో కప్పుకుంటాడు. దీన్ని చూచి శాస్త్రి తెల్లబోతాడు.

శాస్త్రి [బెదురుగా]. చౌదరి కండిషన్ ఎలా వున్నదేమిరా ?

మూర్తి [విదిలించి వేస్తున్నట్టుగా]. ఉఁ ! ఎలా వుంటే నీకు దేనికిలే !

శాస్త్రి. నాలుగైదు రోజుల్నుంచి చూస్తున్నా—నేనంటే నీ వెందుకో చెడ్డ చికాకుగా వుంటున్నావు. నే నేం చేశానని నీ కింత కోపం ? పోనీలే, ఎలా వున్నాడు చౌదరి ?

మూర్తి. ఎలా వున్నాడా ? రాత్రినుంచి డెలిరియం ప్రారంభమైంది.

శాస్త్రి. అయితే కొంచెం సీరియస్‌గానే వుందన్నమాట.

మూర్తి. ఆరి ఫూల్ !

శాస్త్రి. ఏమిటిరా ఆ తిట్లు ?—నే నిప్పుడేమన్నానని !

మూర్తి. రాత్రినుంచి డెలిరియంలో వున్నాడంటే, ఏ కొంచమో సీరియస్‌గా వున్నదనేనా దాని తాత్పర్యం ? నిన్ను ఫూల్ కాదు; ఫూలున్నర అనాలి.

శాస్త్రి. ఫూల్, గీలని ఇప్పుడంటే అన్నావుగాని, ఈ సారి అంటే మాత్రం నే నూరుకోను.

మూర్తి. పోనీలేరా ! వేరే పేరుపెట్టి పిలుస్తాలే. నీకు అతికే పేర్లు చాలా వున్నాయ్.

శాస్త్రి. హుఁ ! చాలా వున్నాయేఁ !

మూర్తి. ఆఁ ! చాలా లేకేమిరా ? డన్స్, యాస్, స్టుపిడ్, ఇడియెట్, డండర్ హెడ్, మీన్ మైజర్లీ రెచ్ - ఓఁ ! వీటికి అంతేమిటి ?

శాస్త్రి. అన్నింటికీ తెగించి కూర్చున్నావ్; అంటావ్! నీవనకేఁ ? నీ మాటలకు వాల్యూ యేమిటి ? నీ నోటికి హద్దూ పద్దూ లేదని ఒకనాడు చౌదరి నాతో....

మూర్తి. షటప్ !

గిరి [ప్రవేశిస్తూ]. ఏమిటిరా ? అప్పుడే మీ కిద్దరికీ మళ్ళీ మొదలైందీ లడాయి ?

మూర్తి. లేకపోతే, ఈ సిల్లీ ఫూల్ చూడు; నర్సింగ్‌హోంనుంచి తిరిగి వచ్చానో, లేదో....

శాస్త్రి. అది కాదోయ్, గిరీ ; చౌదరి రాత్రినుంచి డెలిరియంలో వున్నాడని....

గిరి [డెలిరియం అనే ముక్క తర్వాత మాటను తెంచివేస్తూ]. ఏరా మూర్తీ ; నిజమే ?

మూర్తి [బరువుగా]. ఆఁ! జుట్టు పీక్కోవడం, వొళ్ళు రక్కుకోవడం — చాలా అవలక్షణాలు ప్రారంభమైనాయ్. బెడ్ మీద నిలవడం లేదు. పట్టుకోలేకుండా వున్నాం. చేతులు మంచానికి కట్టేశారు.

గిరి [దైన్యంగా]. పూర్ ఫెలో ! చూస్తూ చూస్తూ వుండగానే ఎంత ముంచుకొచ్చిందిరా !

మూర్తి. మొన్నే మనం అతన్ని వాళ్ళ వూరు పంపించేస్తే బాగుండేదేమోరా ?

గిరి. ఆఁ ! వాళ్ళది కుగ్రామమట. అక్కడ మెడికల్ ఎయిడ్ ఏముంటుంది ? పైగా, ఈ స్థితిలో రైలు ప్రయాణం డేంజరస్ అని డాక్టర్ అన్నాడు కూడాగా.

శాస్త్రి. అయినా, మన బాధ్యత తప్పేది.

మూర్తి. ఔను! ముఖ్యంగా నీ బాధ్యత తప్పేది! ఇప్పు డతని బరువంతా నువ్వే మోస్తున్నావ్.

శాస్త్రి. ఏమోయ్ గిరీ! చూశావా?—నేనంటే వొంటికాలిమీద ఎలా వస్తున్నాడో!

మూర్తి. రెండుకాళ్ళ మీ దొచ్చినా, మొండి శిఖండివి; నీ కేమి సిగ్గా, శెరమా? షేమ్‌లెస్ యాస్!

గిరి [విసుగ్గా]. అబ్బబ్బ! సమయం లేదు; సందర్భం లేదు. క్యాట్స్ అండ్ డాగ్స్‌లా మీ కిద్దరికీ ఎప్పుడూ ఒక్కటే కాట్లాట! చెడ్డ న్యూసెన్స్ అయిపోతున్నారు.

మూర్తి. లేకపోతే ఏమిటి?—ఈ డామ్ ఫూల్ మాటలు! చౌదరి ఫీవర్‌తో మన లాడ్జిలో వుండగా, అది తన కెక్కడ అంటు కుంటుందోనని తప్పుకు తప్పుకు తిరిగాడు. అతను నర్సింగ్ హోంలో అడ్మిట్ అయ్యాక ఒక్కసారైనా విజిట్ చేశాడు కాదు. ఇంకా ఏమిటో - వీడి తలకాయ - తన బాధ్యతట! బాధ్యత!!

గిరి. సర్లేరా మూర్తీ! ఇప్పు డెందుకులే. ఈ లేనిపోని రగడ. అయితే ఇప్పు డక్కడ ప్రసాదుగా రున్నారా?

మూర్తి. ఉహుఁ!

గిరి. ఆయన్ని వెళ్ళమని చెప్పానే! రానే లేదా?

మూర్తి. రాకేఁ? వచ్చాడు. కాని, గ్లూకోజ్ రాత్రే అయి పోయింది. అంచేత కొనుక్కురమ్మని ఆయన్ని పంపించి, స్నానంచేసి పోదామని నే నిలా వచ్చా.

గిరి. మరి, అక్క డెవ్వరూ అటెండ్‌కావడం లేదన్నమాట! నేనైనా పోతా.

మూర్తి. ప్రసాద్ తిరిగి వచ్చేదాకా సిస్టర్‌నే జాగ్రత్తగా—చూస్తూ వుండమన్నాలేఁ. అయితే సెంట్రల్‌కి ఎవరినైనా పంపించావా?

గిరి. ఓ యస్! మన రావ్ వెళ్ళాడు.

మూర్తి. ఆమె ఈ పూట మెయిల్‌కే వస్తే బాగుండును.

శాస్త్రి. ఆ మెవరు?

మూర్తి. ఎవరైతే నీ కెందుకురా?

గిరి [శాస్త్రితో]. మన చౌదరి తల్లి. వెంటనే బయల్దేరి రమ్మని ఆవిడకు నిన్న టెలిగ్రాం పంపించాం. [మూర్తివైపు తిరిగి] మూర్తీ! అది ఎక్స్‌ప్రెస్ టెలిగ్రామ్ కాదూ? ["ఔ"నన్నట్టు మూర్తి తల పంకిస్తాడు] మెసెంజర్‌కని మైలేజీకూడా కట్టా మయ్యే. బహుశా నిన్న మధ్యాహ్నానికే అందివుంటుంది. ఆమె ఈ పూట మెయిల్‌లోనే రావచ్చు.

శాస్త్రి. నైన్‌థర్టీ అయింది. లేట్ కాకపోతే మెయిల్ ఈసరికి వచ్చేవుండాలి,

గిరి. నీకు ఈ మూర్తి పోరైనా తప్పేది; రావుకు తోడుగా కాస్త రైలు స్టేషన్‌కైనా వెళ్ళకపోయావా, శాస్త్రీ?

శాస్త్రి. ఆఁ! ఈ భాగ్యానికి తోడుకూడా కావాలా?

మూర్తి. తోడు వెళ్ళడంలో నీకు ఆల్ అఫ్ ఎ సడెన్ నమ్మకం పోయిందేమిరా? చౌదరి కాఫీహోటల్‌కి వెళ్ళినా, సినిమాకు వెళ్ళినా, తప్పనిసరిగా తోడు వెళ్ళేవాడివిగాఁ!

గిరి. అబ్బబ్బ ! నువ్వూరుకోరా, మూర్తీ !! నీకు బొత్తిగా మతి పోతున్నది.

మూర్తి. నీవేమైనా అనుగాని, వీణ్ణిచూస్తే నాకు అరికాలిమంట నెత్తి కెక్కుతున్నది. ఇదివరకైనా వీడిసంగతి నేను కొంత కనిపెట్టక పోలేదుగాని, వీడు మరీ ఇంతటి మీన్, సెల్ఫిష్, స్టుపిడ్, కవర్డ్లీ, డర్టీ యాస్ అనుకోలేదు.

శాస్త్రి [మూర్తి వాక్యం పూర్తికాకముందే అందుకుని]. చూడ వోయ్ ! ఎంత రెచ్చెడ్‌గా తిడుతున్నాడో !

గిరి. చాల్లేరా, మూర్తీ ! నీకు సమయాసమయాలు బొత్తిగా తెలి యవ్ ! [శాస్త్రితో] శాస్త్రీ ! నువ్వీక కాలేజీకి పోరాదటోయ్!

శాస్త్రి. ఆఁ ! టైం కావొస్తున్నది, పోవా లిక.

[పుస్తకాలు పుచ్చుకుని బయల్దేరతాడు.

గిరి. అన్నట్టు, శాస్త్రీ! మాకు అటెండెన్స్ కాస్త ప్రాక్సీ చెబుతా వటోయ్.

శాస్త్రి. నా కది బొత్తిగా అలవాటులేని పని. మన నాయుణ్ణి చెప్ప మంటాలే.

మూర్తి. ఉద్ధరిస్తావ్. వీడు మరీ ఇంత అంట్లవెధవని ఇంతకు ముందు నాకు తెలియదు సుమీ !

గిరి. మంచిదోయ్, శాస్త్రీ ! వీడిమాటల కేమిలే? నువ్వు వెళ్లు.

[శాస్త్రి వెడతాడు.

మూ_ర్తి. ఇదివరకైతే వీడికి బ్రెయినే లేదనుకున్నాగాని, కారెక్టర్ కూడా లేదు.

గిరి. మరీ నాలుగైదు రోజుల్నుంచి శాస్త్రి నీకు పెద్ద అబ్సెషన్ అయిపోయాడురా. అతని ప్రవర్తన నాకైనా అసహ్యంగానే వుంది కాని, మనం నోరు పారవేసుకుంటే లాభ మేమిటి? "ఇట్ టేక్స్ ఆల్ సార్ట్స టు మేక్ ఎ వరల్డ్" అన్నారు. మనం ఎలాగో సర్దుకుపోవాలి.

మూ_ర్తి. శాస్త్రిగాడివంటి పశువుతో కూడానా ?

గిరి. ఆహా! అలాంటి వాళ్ళతోనే మరీ ముఖ్యంగా.

మూ_ర్తి. ఇలాంటి పశువులనుకూడా కలుపుకు పోవాలంటే మనం కూడా నాలుగు కాళ్ళమీద నడవవలసి వస్తుందేమో!

గిరి. సర్లే! ఈ చర్చ మరొకసారి చేద్దాముగాని, చౌదరికి క్లోరోమైసిటిన్ ఇంజెక్షనిస్తే మంచిదని నిన్న సాయంత్రం డాక్ట రన్నాడు. నీవద్ద పైక మేమైనా వున్నదట్రా ?

మూ_ర్తి. మంతెండ్ కాదూ? అయిపోయింది! చిల్లర మల్లర మాత్రం మిగిలింది. కాని, ఏం?—చౌదరివద్ద పైక మేమీ లేదూ ?

గిరి. ఉహుఁ! నర్సింగ్‌హోమ్‌లో అడ్మిషన్‌కే అతనివద్ద ఏమీ లేకపోయింది. నేనే పే జేశా.

మూ_ర్తి. మంత్ బిగినింగ్‌లో వచ్చిన నూటయాభై కాక, వారం రోజులనాడు అతనికి మరొక వంద మనియార్డర్ రాలా ?

గిరి. ఆఁ! ఎంత వస్తేనేం? రెండోనాటికి కానీ మిగల్చడు. అత నెంత శ్రీమంతుడైనా మరీ ఇంత ఖర్చు తగదు.

మూర్తి. అయితే, ఇప్పు డేమి చేస్తాం?

గిరి. అదే తోచడంలేదు. అప్పిచ్చేవాడైనా కనబడడు. అక్కడికీ మొన్న మన నాయుడువద్ద పాతిక రూపాయలుంటే పుచ్చుకుని చౌదరికిందే ఖర్చు పెట్టేశాను.

మూర్తి. ప్రసాద్ పర్సుకూడా ఖాళీయే. గ్లూకోజ్ టిన్నుకు తన వద్ద టూ రుపీస్ లేక, నన్నడిగి పట్టుకువెళ్ళాడు. మన రావ్‌ని అడిగిచూశావా?

గిరి. ఆఁ! రావ్ చాలా బీదవాడు. పాపం! అతని పని కటకటగా వుంటున్నది. చివరివరకు చదువు సాగుతుందో, లేదో అని ఆందోళన పడుతున్నాడు. గుంభనగల మనిషి కాబట్టి, బయట పడడుగాని, కాలేజీ జీతానికైనా డబ్బుండడం లేదు. మందు కొనడానికి ఇప్పు డేమి చెయ్యాలో - ఏమిటో - నా కేమీ పాలుబోవడం లేదు.

మూర్తి. అన్నట్టు, చౌదరి మదర్ కాసేపటిలో వస్తున్నదిగా! ఆమెకు డబ్బు కేం తక్కువ? ఆమె నడిగితే సరి.

గిరి. కాని, ఆమె ముక్కూ, ముఖమైనా మన మెరగం. రైలు దిగీ దిగడంతోటే పైక మడిగితే, ఆమె ఏమనుకుంటుందో?

మూర్తి. ఔనురా! అదీ నిజమే. ఆఁ! అన్నట్టు, శాస్త్రిగాడి దగ్గర డబ్బు పుష్కలంగా వుంది. ఫైవర్స్, టెన్నర్స్ మొన్నొకనాడు ఆ వెధవ చేతిలో పెద్ద బొత్తిక కనబడింది.

గిరి. అయ్యో! చేబదులైనా చేయడానికి అతను కాలేజీకి వెళ్ళిపోయాడేఁ!

మూర్తి. వెళ్ళితేనేం? ఫ్రెండ్స్‌కోసం ఎక్కడ ఏ బిల్లు పే జెయ్యవల సొస్తుందో నని అణా, బేడా మనీపర్సులో వేసుకుని వాడు బయటికి బయల్దేరతాడు. వాడి దాపరికం - అదుగో - ఆ పెద్ద స్టీల్ ట్రంకులో, ఎలాగైనా దాని తాళం పగలగొడితే.... [ఆశ్చర్యంగా] హెవెన్స్ ! ఏమిటీ చిత్రం ! ఇవ్వాళ పెట్టెకు తాళం బిగించడం మర్చేపోయాడు !

[గబగబ మూర్తి ట్రంకుల వద్దకు వెడతాడు.

గిరి. నోనో ! దట్స్ బ్యాడ్ ! అతను లేనప్పుడు అతని పెట్టె తెరవడం తప్పు.

మూర్తి [పైనున్న చిన్న ట్రంక్‌ను దించి, అడుగునున్న పెద్ద దాన్ని తెరుస్తూ]. నీకు తెలవదులేరా ! ముందు ఈ ప్రాణావసరం గడిస్తే, తప్పొప్పులమాట తర్వాత కన్సిడర్ చెయ్యొచ్చు. [బట్టల అడుగునుంచి నోట్లపొత్తిక తీసి, లెక్కపెడుతూ] చూడరా ! వెధవదగ్గర....[ట్రంక్‌వద్దనుంచి, గిరి వైపుకు నడిచి వెడుతూ, ముందు కొంతసేవు నోట్లోనే లెక్కపెట్టి, తర్వాత పైకి అంటూ] టూ ఫార్టీ - ఫార్టీ ఫైవ్ - ఫిఫ్టీ - ఫిఫ్టీఫైవ్ - సిక్స్‌టీ - సిక్స్‌టీ టూ - సిక్స్‌టీ ఫోర్ - సిక్స్‌టీ ఫైవ్ - సిక్స్‌టీ సిక్స్ - సిక్స్‌టీ సెవెన్.... టూ సిక్స్‌టీ సెవెన్ రూపీస్ వున్నాయ్ !

గిరి. మూర్తీ! నువ్వు ఏం చేసినా, చెడ్డ ఇంపల్సివ్‌గా చేస్తావురా! ఇప్పుడు శాస్త్రి వచ్చాడంటే, మనకి దొంగరికం కడతాడు !

మూర్తి. ఆఁ! వాడిమొఖం కాదూ? నోరు మెదిపాడంటేనా? నా సంగతి తెలియదూ? ఆ టెన్నిస్ రాకెట్ వాడి వీపుమీద విరిగిందన్నమాటే!

గిరి. అత నొకవేళ ఏదైనా మాట తూలినప్పటికీ నువ్వు తొందర పడబోకు! ఏవీ, ఒక యాభై రూపాయలిలా తే! [వాటిని అందుకుని] వీలుపడితే, అతని పైకం సాయంత్రం లోగానే రీప్లేస్ చేద్దాం. లేకపోతే, లైఫ్ అండ్ డెత్ కొశ్చన్ కనక, నేనే పెట్టె తెరిచి, ఒక యాభై మాత్రం పట్టుకెళ్ళానని చెప్పు.

మూర్తి. ఏఁ! నేనే తీశానంటే తలకొట్టి మొలవేస్తాడా?

గిరి. నాన్‌సెన్స్, నీకు తెలియదురా! - నేను చెప్పమన్నట్టే చెప్పు. నువ్వు వాణ్ణి రెచ్చగొడితే, ఎటుపోయి యెటు వస్తుందో! ఇప్పుడు తప్పు మనమీద వున్నదయ్యె! అన్ని రోజులూ మనవి కావు. డోన్ట్ బి హేస్టీ. ఉఁ! నే వెళ్ళొస్తా గాని, ఆ మిగతా డబ్బు మళ్ళీ భద్రంగా వాడి పెట్టెలో వుంచెయ్.

[మిగిలిన డబ్బును మూర్తి తిరిగి శాస్త్రి ట్రంకులో పెట్టి వేస్తాడు. క్రిందకు దించిన చిన్నపెట్టెను పెద్దదానిపైకి యెక్కిస్తాడుకూడా. గిరి తన చేతిలోని నోట్లను మనీ పర్సులో పెట్టుకుంటూ, గుమ్మం వైపుకు రెండడుగులు వేస్తాడు. ఇంతలో పెద్దగా నిట్టూరుస్తూ రావ్ ప్రవేశిస్తాడు.

రావ్ [కుర్చీలో బరువుగా చతికిలబడి]. అబ్బ!

మూర్తి [భయాందోళనలతో]. ఏరా? ఏమిటి?

రావ్. చౌదరి తల్లి....

గిరి. ఏఁ! ఆవిడ ఈ బంపికి రానేలేదా?

రావ్. రాకేఁ? వచ్చింది. కాని, ఏం చెప్పను?

గిరి. ఏమిటోయ్? అసలు విషయ మేమిటి?

మూర్తి. అబ్బ! చంపక చెప్పరా!

రావ్. మన చౌదరి....

మూర్తి. ఏఁ! సింక్ అయిపోతున్నా డేమిటి?

రావ్. అబ్బే! లేదు! ఉదయాన వున్నట్టే వున్నాడు.

గిరి. అయితే మ రేమిటి?

రావ్. చౌదరి మహాభాగ్యవంతుడని కాదూ మీ అభిప్రాయం?

మూర్తి. యస్! ఏఁ?

గిరి. ఇప్పు డతని స్థితిగతుల మాట దేనికి?

రావ్. ఆఁ! ఏమీ లేదు. నేనూ మీలానే పొరబడ్డాను.

మూర్తి. ఏమిటిరా? నువ్వు స్ట్రేంజిగా మాట్లాడుతున్నావ్.

రావ్ [కుర్చీపైనుంచి అశాంతిగా లేస్తూ]. పాపం! ఆ తల్లిని చూస్తే నువ్విలా అనేవాడివి కాదురా? చింపిరితల—చీరికల గుడ్డలు - ప్చ్ - ఏం చెప్పను ఆమె అవతారం! వొట్టి ఎముకలగూడు! కళ్ళలో వున్నదేమో కాస్త కొనూపిరి. మహా యిల్లాలు! ఉన్నపూట తిని, లేనిపూట పస్తుండి కొడుకు చదువుకు డబ్బు పంపించేదట.

గిరి. } ఒకేసారిగా { రియెల్లీ!
మూర్తి. } { అబ్సర్డ్!

రావ్. ఈ సంగతి ఆమె నోటినుంచికాక, మరెవరి ద్వారానైనా విని వుంటే నేనూ మీలానే నమ్మలేకపోయేవాణ్ణే!

మూర్తి. ఇంత ఘోరమా?

గిరి. ఎంత దారుణం!

రావ్. వాళ్ళకి ఆరెకరాల మాగాణి వుండేదట. అతను బి. ఏ. పూర్తిచేసేసరికి దానిలో సగం అప్పులకింద పోయిందట. పోతే, ఇప్పుడు ఈ లా కాలేజీ చదువుకోసమని నిరుడు మిగతా మూడెకరాలు అమ్మేశారట. ఈ యేటికి లోగిలి తాకట్టు పెట్టి, దొడ్లో పాటిమట్టి అమ్మించి—పాపం!—ఆమె డబ్బు పంపిస్తున్నదట.

మూర్తి. మై గాడ్!

రావ్. డబ్బుచాలక పిల్లవాడు ఎక్కడేమి యిబ్బందిపడతాడోనని పాలూ, పెరుగూ అమ్మి, పట్నం పంపించేదట. పిడకలు చేసేదట; ఏకులు వడికేదట; కూలికి దంపుకూడా దంచేదట. ఈ మాట చెవిని పడితే కొడుకు మనస్సు చివుక్కుమంటుందేమోనని కడుపులో పెట్టుకునేదట. తాను కష్టపడ్డా, కడుపు కట్టుకున్నా, ఇంకెంత కాలంలే అనుకొంటూ వుండగానే ఈ ఆపద వచ్చిపడిందని ఆవురుమంటున్నది.

మూర్తి [నమ్మలేక]. ఏమోయ్ రావ్! ఈ సంగతులన్నీ ఆమె ఇప్పుడు నీ కెందుకు చెప్పింది?

రావ్. ఉహుఁ! నన్నూ, నిన్నూ వినమని ఆ మేమీ చెప్పలేదు. కొడుకుని చూచుకుని - పాపం ! - ఆ తల్లి గుండె పగిలేలా యేడుస్తున్నది. ఆ యేడుపుమధ్య ఇంకా చాలా విషయాలు బయటపెట్టింది.

గిరి. ఏమి టవి ?

రావ్. ఎన్నని చెప్పమంటావోయ్! శోకం పట్టలేక తన సొదంతా వెళ్ళబోసుకుంటున్నది. "మనకు ఒక్కగాను ఒక మగబిడ్డ. వాడు పెద్ద చదువు చదివి, పెద్ద ఉద్యోగం చేస్తే, మన వంశానికే గౌరవమే. ఆస్తి వుంటుందీ, పోతుందీ అని వెనకా ముందూ ఆడకుండా, ఎంత డబ్బైనా సరే, వాడికి చదువు చెప్పించవే" అని వాళ్ళ ఆయన చెప్పిపోయాడట. తనూ అంతే ననుకుని బిడ్డను దొరలా పెంచుకున్నదట. చదువు పూర్తిచేసి, కొడుకు ఏ జిల్లా జడ్జీయో అయితే, చూచి ముచ్చటపడ్డానికి ఆయన లేడుగదా అని విచారించేదట. చదువుకున్న పిల్లని చేసుకుని, కొడుకూ, కోడలూ చిలకా, గోరంకల్లా కాపరం చేస్తూవుంటే, వాళ్ళచేతులమీదగా తను దాటిపోదామనుకున్నదట. దుఃఖం పట్టలేక ఇలాగే ఏమేమో చాలా వెళ్ళబోసుకుంటున్నది.

గిరి. చౌదరి సిన్సియర్ మ్యాన్ అనుకున్నా. నావద్ద అతడికి రహస్య మనేదే లేదనుకున్నా! కాని, ఎంత నటన చేశాడు ? తన స్థితిగతుల సంగతి పొరపాటుగానైనా ఎన్నడూ నాతో అన్నాడు కాదు.

మూర్తి. ఉహుఁ! నాతోనూ అనలేదు.

రావ్. నిజమే! ఎవ్వరితోనూ అనలేదు.

గిరి. కాని, ఎంత స్టయిలిష్‌గా వుండేవాడు! ఫక్తు ట్వీడ్ సూట్స్ వేశేవాడు. కాస్టలీ స్నోస్, సెంట్స్, పొమేడ్స్, హెయిర్ ఆయిల్స్ వాడేవాడు. ఆ మధ్య పి. ఆర్. అండ్ సన్స్‌లో ఎనభై రూపాయలుపెట్టి సిల్వర్ హెయర్ బ్రష్ కొన్నాడు.

మూర్తి. నీకు అంతే తెలుసునన్నమాట! పోయిననెలలో రెండు వందల యాభై రూపాయలకు స్పెన్సర్స్‌లో బాండ్‌స్ట్రీట్ రెయిన్‌కోటు కొన్నాడు.

గిరి. తనకోసం తనే తగలేసుకుంటే, అక్కడి కది కొంత నయమే! సినిమాకి వెళ్ళినా, కాఫీహోటల్‌కి వెళ్ళినా, అందరి బిల్సు పట్టుపట్టి తనే చెల్లించేవాడుగా!

రావ్. డబ్బు నీళ్ళలా వాడుతూ ఇంకా చాలా చాలా చేశేవాడు లెండి.

మూర్తి. అతని ఖర్చుచూచి లక్షాధికారి అనుకున్నా.

గిరి. నేనైతే జమీందారే అనుకున్నా.

మూర్తి. ఎంత చిత్రం!

గిరి. కాదు, విడ్డూరం!

మూర్తి. తల్లి నిన్ని కష్టాలుపెట్టి, చౌదరి ఎందు కిలా ప్రవర్తించాడో? నాకేమీ అర్థంకావడం లేదు.

గిరి. నాకూ అయోమయంగానే వుంది.

రావ్. నా కతని ప్రవర్తన కొంతవరకు అర్థమౌతుందనుకుంటాను. అత డిలా నేనూ పేదవాడినే; నేనూ పల్లెటూరివాడినే. లా కాలేజీలో చేరడానికని ఈ మద్రాసుకు వచ్చిన కొత్తలో

ఇక్కడి సిరీ, ఇక్కడి సంపత్తీ నన్నూ, నా పేదరికాన్నీ వెక్కిరిస్తున్నట్టే అనిపించింది. కొంత సిగ్గు, కొండంత బిడియం, అర్థంలేని అసూయ, అకారణమైన ఆవేదన—అప్పటి నా మనస్థితినిగురించి చెప్పడం కష్టమే. మొత్తంపై నే నంటే, నా బ్రతుకంటే నాకే అసహ్యం పుట్టింది. మా పల్లెటూరు, మా పూరి కొంప, మా ముతకగుడ్డలు, మా మోటు తిండి; అ దొక నరకంలానే తోచింది. దానినుంచి ఎంత దూరంగా పారిపోతే, నాగరికతకు అంత దగ్గరగా వస్తాననుకున్నా. పస్తు లుండి, పడరాని పాట్లుపడి, ఎప్పు డడిగితే అప్పుడు— ఎం తడిగితే అంత—పైకం పంపడానికి చౌదరిలా నాకూ ఎవరైనా వుంటే, నేనూ అతడిలానే తయారయ్యేవాడినేమో! చీకటిలోనుంచి ఒక్కసారిగా వెలుగులోకి వస్తే కళ్లు చిరత లాడినట్టుగానే వుంటుంది జీవితమంతా ఏ కుగ్రామంలోనో, ఏ చిన్న బస్తీలోనో గడిపి, మొదటిసారిగా ఈ మద్రాసును పోలిన మహానగరానికి వస్తే.

గిరి. ఏమైనా చౌదరి చేసినపని అతిఘోరం!

మూర్తి. నా ఒపీనియన్ నన్ను చెప్పమంటావా? దిస్ ఈజ్ సింప్లీ మాన్‌స్ట్రస్.

రావ్. సరే! ఇప్పు డేమనుకుంటే ఏం లాభంలేరా? అత డిప్పు డెలాగైనా వొడ్డున పడితే అదే పదివేలు. లేకపోతే, ఆ తల్లిచేసిన త్యాగమంతా బూడిదలో పోసిన పన్నీరౌతుంది. ఆవిడ కోసమైనా అతడు బ్రతకాలి. ఏమోయ్, గిరీ! డాక్టరు నీతో ఏదో మందు మాట చెప్పాడట.

గిరి [బరువుగా]. ఔనోయ్! "అప్పా అండ్ కో"లో కొనుక్కు-
పోవాలి. ఏం? నువ్వుకూడా రారాదూ?

రావ్. నామనస్సు చెడ్డ కలతగా వుంది. నే నిప్పుడు రానులే.
కాసేపైనాక సరాసరి తిరిగి నర్సింగ్ హోంకే వస్తా.

గిరి. మంచిది. ఇప్పటికే ఆలస్యమైందేమో! మరి, నే వెడతా!
కన్నతల్లి నింతగా కష్టాల పాలుచేసి, చౌదరి లోకానికి
మంచివా డయ్యాడన్నమాట!

రావ్. ఆం! ఇది ఆలోచించి చేసిన పనే అంటావా? కాదు;
కేవలం అనాలోచిత ప్రవర్తన.

గిరి [వెళ్ళిపోతూ]. ఏదో ఒక ప్రవర్తన! ఏదైతేనేం?-కన్నతల్లి
కింత ఘోరాన్యాయం చేసింతర్వాత!

[గిరి వెడతాడు.

మూర్తి. పూర్ మదర్! కొడుకుకోసం ఎంత శాక్రిఫైస్
చేసిందిరా! ఆవిడ మా అమ్మే అయితేనా?....మా అమ్మ నా
చిన్నతనంలోనే పోయింది. మా కున్నది నన్నూ, నా యిద్దరు
చెల్లెళ్ళనూ కాల్చుకుతినే సవతి తల్లే....చౌదరి హార్ట్‌లెస్‌గా
ప్రవర్తించాడు గాని, ఆవిడ మా అమ్మే అయితేనా, పువ్వుల్లో
పెట్టి పూజించేవాణ్ణి.

రావ్. పాపం! కొడుకుమీద కొండంత ఆశ పెట్టుకున్నదిరా!
మ్చ్! ఏమి కానున్నదో! తమకు చదువు సంధ్యలు లేక
పోయాయే అన్న విచారం వాళ్ళకి తెలియకుండానే వాళ్ళని
బాధిస్తుంది కాబోలు. అందువల్లే కొందరు పల్లెటూరివాళ్ళు

తమ బిడ్డల చదువులకోసం ఎన్ని కష్టనష్టాలైనా సంతోషంగా పడతారు. బస్తీలకు పోయి, వేలకు వేలు గుమ్మరిస్తేనే తప్ప పూర్తికాని ఈ చదువులకు వాళ్ళు బలి అయిపోతూవుంటారు. త్యాగమంటే నిజంగా వాళ్ళదే త్యాగం.

[శాస్త్రి ప్రవేశిస్తాడు.

శాస్త్రి. ఎవరిదండీ త్యాగం ?

మూర్తి [అవహేళనగా]. నీదేరా ! నీ ప్రశంసే మన రావుగారు చేస్తున్నారు. నువ్వు గొప్ప త్యాగమూర్తివట ! సరిగాని, నువ్వు కాలేజీకి వెళ్ళలేదేమిరా ?

శాస్త్రి. వెళ్ళకేం ? వెళ్లా. తీరా లెక్చర్ రూమ్‌లోకి వెళ్ళేసరికి ఏదో మాట జ్ఞాపకం రాగా వెనక్కి చక్కా వచ్చా.

మూర్తి [తీక్ష్ణంగా చూస్తూ]. ఏమి టది ?

శాస్త్రి. మరేమీ లేదురా. ట్రంక్ లాక్ చేసుకోవడం మర్చిపోయా.

మూర్తి. వెంటనే తిరిగిరాకపోతే, నీ పెట్టె నేను కొల్లగొట్టేస్తా ననుకున్నావా ?

శాస్త్రి. అబ్బే ! లేదురా ! కాని....

మూర్తి. కానీ, గీనీ—ఏమిటది ?

రావ్. మూర్తీ ! నువ్వు మరీరా ! శాస్త్రిగారిమీదికి కయ్యానికి కాలు దువ్వుతావ్.

మూర్తి. లేకపోతే ఏమి టిది ? ఈ రూంలో వుంటున్నది వీడూ, నేనూ. అయితే, ఇఖ వీడి భయ మేమిటి ? పెట్టెకి తాళం

లేకపోతే, వీడి ముల్లె నేను కాజేస్తాననేనా ?

శాస్త్రి. ఏమండీ రావుగారూ ! ఆ మాట నే నన్నానా ?

మూర్తి. అంటేనా ? డొక్క చీరేస్తాను !

[శాస్త్రిమీదకు కొట్టబోయినట్టు మూర్తి వెడతాడు. అతడిని రావ్ వారిస్తాడు. ఇంతలో ప్రసాద్ వస్తాడు.

ప్రసాద్ [ఆందోళనగా]. గిరి లేడూ ?

రావ్. లేడేఁ ! దేనికండీ, ప్రసాద్ గారూ ?

మూర్తి. ఇప్పుడే వెళ్ళాడురా మందుకోసమని. నీకు దారిలో యెదురుపడవలసిందేనే !

రావ్. ఏమిటండీ సంగతి ? మరేమీ తొందరలేదుగదా ?

ప్రసాద్ [బరువుగా]. చౌదరి కొలాప్స్ అవుతున్నాడు.

మూర్తి. }
రావ్. } ఒకేసారిగా { ఆఁ !
శాస్త్రి. } { పాపం !
{ అయ్యో !

ప్రసాద్ [నిట్టూరుస్తూ]. ఈ సరికి అయిపోయిందేమో కూడా !

రావ్. ఆ తల్లి ఆశలన్నీ—పాపం !—మంటగలిసిపోయాయి.

ప్రసాద్. అసలు ఆవిడ దుఃఖాన్ని చూడలేకే సగం నే నిటు పరిగెత్తుకొచ్చా.

మూర్తి. బ్రతికీ, చచ్చికూడా ఆ తల్లికి ద్రోహం చేశాడన్నమాటః

రావ్. ఆఁ ! అంతేరా!

ప్రసాద్. ఔ నంతే ! మహాద్రోహం చేశాడు.

రావ్. మరి దేనికి ? పోదాం పదండి. మన మెవ్వరం కూడా లేక పోతే - పాపం - ఆవిడ గతి ఏంకాను ?

[రావ్, ప్రసాద్‌లు కదులుతారు. శాస్త్రి ఏమి చేస్తాడో అన్నట్టుగా మూర్తి అతని వంక చూస్తూ వుంటాడు. శాస్త్రి వెళ్ళి, తన కుర్చీలో కూర్చోబోతాడు.

మూర్తి. ఏరా ! నువ్వు రావడంలా ?

శాస్త్రి. ఊహుఁ! నాకు కాళ్లాడ్డం లేదు.

మూర్తి. చౌదరి డబ్బు విరజిమ్ముకు పోతూవుంటే, వాటిని యేరుకోడానికి బాగానే కాళ్లాడేవేఁ !

రావ్ [వెడుతున్నవాడు వెనక్కి వచ్చి]. నువ్వు రారా! ఇదేనా తగవులకు సమయం ?

మూర్తి. ఈ రాస్కెల్‌ను నిలువునా చీల్చినా పాపం లేదు. అంత కన్నూ, మిన్నూ కానకుండా చౌదరి ప్రవర్తించడానికి సగం వీడే కారణం.

[కొట్టడానికి శాస్త్రిపైకి దూకుతాడు. ఇంతలో రావ్, ప్రసాద్ అడ్డుపడతారు.

రావ్ [మూర్తిని అవతలకి తోసి]. నీకు పిచ్చెక్కుతున్నదేమిరా ! చాల్లే—కాస్త నిదానించు. [శాస్త్రితో] రావోయి, శాస్త్రీ ! నువ్వుకూడా రా ! నువ్విప్పుడు ముఖం చాటువెయ్యడం బాగుండదు. సరే — పదండి. పాపం ! దిక్కులేని ఆ తల్లి ఏమౌతున్నదో ?

ప్రసాద్. ఆవిడవద్ద డబ్బేమీ లేనట్టున్నది. ఏ పెద్ద డాక్టరు కాళ్ళో పట్టుకుని బిడ్డను దక్కించుకోడానికి డబ్బైనా తెచ్చుకున్నాను కాదని ఆవిడ గోల పెడుతున్నది. గిరే ఎక్కడైనా సాధించాలిప్పుడు.

మూర్తి. ఆఁ! వెధవ డబ్బు! డబ్బు కేమిలే! మీరు పదండి! ఐ విల్ గెట్ ఇట్!

[రావ్, ప్రసాద్, శాస్త్రి నెడతారు. మొదటి వారిద్దరు సాగిపోయినా, శాస్త్రి కావాలని వెనుకబడతాడు. మూర్తి దీన్ని గమనించకుండానే చటుక్కున శాస్త్రి ట్రంకుల వద్దకు వెళ్ళి, పైదాన్ని ఒక పక్కకు విసిరి పారవేసి, అడుగు దానిలోనుంచి డబ్బు తీస్తాడు. శాస్త్రి "ఆఁ! ఆఁ!" అంటూ నోరు తెరిచి, తెల్లమొహం వేసి నిలిచివుండగా—

తెర]



# ఏ కా భి ప్రా య ం

[గ్రామీణ రాజకీయాలు]

## పాత్రలు

ఈశ్వరరావు
రామబ్రహ్మం
వెంకటాద్రి
సుబ్బన్న
ప్రసాదరావు
జానకిరామయ్య
బిల్లు కలెక్టరు

## స్థలం

ఈశ్వరరావు యింటి చావడి

## కాలం

వర్తమానం



# ఏకాభిప్రాయం

ఈశ్వరరావు యింటిచావడి. కుడివైపున సింహద్వారం; ఎదురుగా రెండు గదులలోకి రెండు ద్వారాలు; ఎడమవైపున పెరటిలోకి ద్వారం. చావడిలో గదులగోడ సరసను ఒక టేబిల్; నడిమిని ఒక పడకకుర్చీ, రెండు, మూడు మామూలు కుర్చీలు, ఒక బెంచీ, గోడలకు కొన్ని కాలెండర్లు, ఫొటోలు, వెండితో చేయబడిన లక్ష్మి, సరస్వతి పటాలు.

తెర లేచేసరికి ఈశ్వరరావు పడకకుర్చీలో పడుకుని, ఒక ఇంగ్లీషు దినపత్రిక చదువుతూ వుంటాడు. అతని వయస్సు ఇంచుమించు ముప్ఫైరెండు సంవత్సరాలు. పట్టణంలో ఉద్యోగం చేసుకుంటున్న వాడు గనక, వేషభాషలలో పట్టణసంస్కారం కొంత కనబడుతూ వుంటుంది.

తెర లేచిన కొన్ని క్షణాలకు రామబ్రహ్మం, వెంకటాద్రి ప్రవేశిస్తారు. వారిద్దరు అచ్చమైన పల్లెటూరివారు.

రామబ్రహ్మం, వెంకటాద్రి కాళ్ళ అలికిడి విన్న ఈశ్వరరావు పత్రిక పుటలలోనుంచి తలెత్తకముందే వారిద్దరు ఎడా పెడా కొట్టే తుపానువలె సంభాషణకు అందుకుంటారు.

**రామబ్రహ్మం.** దొరికాడయ్యా, మిడతంభొట్లు! దొరికిపోయాడు!!

**వెంకటాద్రి.** కొట్టాడయ్యా! డింకీ కొట్టాడు!!

రామబ్రహ్మం. ఆఁ! బొమ్మిఖ దిగాల్సిందే!
వెంకటాద్రి. ఆహా! బొర్డిఖ తిప్పాల్సిందే!
ఈశ్వరరావు. ఎవరు? ఏమిటి?
రామబ్రహ్మం. ఇంకా ఎవరంటా వేమిటి? అయిపోయా డయ్యా, ఈ దెబ్బతో చిత్తయిపోయాడు.
వెంకటాద్రి. ఇఖ పత్తా అయినా వుండదులే!
రామబ్రహ్మం. మరి సోదిలోకైనా రాడులే!
ఈశ్వరరావు. ఏమి టయ్యా మీ గొడవ?
రామబ్రహ్మం. ఊరంతా గుప్పుమంటే నువ్వింకా వినలాఁ?
వెంకటాద్రి. గుంపు చింపులుపడి ఊరంతా చెప్పుకుంటున్నా నువ్వు వినకపోవడమేమిటి?
రామబ్రహ్మం. చోద్యమే నువ్వు వినలేదంటే!
వెంకటాద్రి. చోద్యమంటే చోద్యమా!
ఈశ్వరరావు [విసుగ్గా]. చాల్లే! ఊరికే చంపక, ఎవరో, ఏమిటో సరిగా చెప్పరాద టయ్యా?
రామబ్రహ్మం. మీవాడే నయ్యా! మీ జానకిరామయ్య!
వెంకటాద్రి. మీ ప్రాణస్నేహితు డయ్యా!
రామబ్రహ్మం. మీ పంచాయతీబోర్డు ప్రెసిడెంటు!
వెంకటాద్రి. మీ షాహుకారు!
రామబ్రహ్మం. మీ షోకుదారు!
వెంకటాద్రి. మీ పెత్తందారు!
రామబ్రహ్మం. మీ మేయరుగారు!
ఈశ్వరరావు [మరింత విసుగుదలతో]. ఆఁ! అయితే?

రామబ్రహ్మం. దెబ్బ తీశాంలే!

వెంకటాద్రి. నషాళాని కంటింది.

రామబ్రహ్మం. పిల్లిమంతరం వేసినట్టే.

వెంకటాద్రి. మట్టి కరిచినట్టే.

రామబ్రహ్మం. అయిపోయిందిలే బడాయ్!

వెంకటాద్రి. తేలిపోయిందిగా సరుకు!

రామబ్రహ్మం. నాపాటివాడు లే డన్నాడు.

వెంకటాద్రి. రొమ్ము విరుచుకు తిరిగాడు.

రామబ్రహ్మం. అసలు నేలమీద నడిస్తేనా?

వెంకటాద్రి. చుక్కల్లోకి చూశాడు!

రామబ్రహ్మం. గద్దెక్కి కూర్చున్న తర్వాత వాడికి ఈ రామబ్రహ్మం అన లొకడు కనబడితేనా?

వెంకటాద్రి. పట్టం కట్టుకున్న తర్వాత ఈ వెంకటాద్రి వాడి కంట దూరనే లేదు.

ఈశ్వరరావు [కోపంగా]. అబ్బ! చాలించండి మీ వెధవ సోది! అసలు విషయ మేమిటో తేల్చకుండా, ఏమి టయ్యా, మీ వెర్రివేషాలు?

రామబ్రహ్మం. [తగ్గి, వెంకటాద్రితో]. మన ఈశ్వరరావుకు కోప మొచ్చిందిరా!

వెంకటాద్రి. మన మే మన్నాం అంత కోపానికి?

రామబ్రహ్మం. నువ్వు మాట చొరనిస్తేనా?

వెంకటాద్రి. నేనా? నువ్వా?

రామబ్రహ్మం. నువ్వే!

వెంకటాద్రి. నువ్వే!

రామబ్రహ్మం. నువ్వేనంటే!

వెంకటాద్రి. అహాఁ! నువ్వే.

ఈశ్వరరావు [మందహాసం చేస్తూ]. సరే! ఇప్పుడు మీమధ్య లేనిపోని తగవులాట దేనికి కాని, ఏమి జరిగిం దేమిటి?

రామబ్రహ్మం. అబ్బో! చాలా కథ వుందిలే!

వెంకటాద్రి. అదొక పెద్ద రామాయణం!

ఈశ్వరరావు. దానిలో మీ రిద్దరు వాలి, సుగ్రీవులుగాని, ఇంతకూ అసలు విషయం తేల్చారు కారు.

రామబ్రహ్మం. సరే, వినవయ్యా! మొన్నపోయిన పున్నం రేపు కద్దనగా....

వెంకటాద్రి. కాదు! పున్నంనాడే.

రామబ్రహ్మం. నీకు తెలవదులేరా! ను వ్వూరుకో!

వెంకటాద్రి. మహలావ్! నీకేనా తెలిసింది?

ఈశ్వరరావు. సరే! ఒకరోజు ఇటో, అటో దానికేమి లెండి.

రామబ్రహ్మం. కాలవగట్టుమీది చెట్లు....

వెంకటాద్రి. గాలివానకు పడిపోయినవాటిని....

రామబ్రహ్మం. డి. పి. డబ్లీవాళ్లు వేలం వెయ్యమంటే, పాట పెట్టకుండానే జక్కాయి బుక్కాయి పేర కొట్టేసినట్టు బినామీగా రాసి పారేసి, రివెన్యూ ఇనస్పెక్టరు కొకటి....

వెంకటాద్రి. ఓర్సీరు కొకటి....

రామబ్రహ్మం. పోలీసు యినస్పెక్టరు కొకటి....

వెంకటాద్రి. లాకు సూపర్నెంటు కొకటి....

రామబ్రహ్మం. సు వ్వాగరా! నన్ను చెప్పనీ!

వెంకటాద్రి. ఏఁ! నే నెందుకు చెప్పగూడదు?

ఈశ్వరరావు. ఎవరు చెబితే నేమిటిలేఁ! వెంకటాద్రీ! ఊరుకో వయ్యా సువ్వొక క్షణం.

రామబ్రహ్మం. పంచాయితీబోర్డు వైసు ప్రెసిడెంటు కొకటి, గుమాస్తా కొకటి, బిల్లుకలెక్టరు కొకటి—వీళ్ళందరి నోళ్ళు కట్టెయ్యడానికి తలొకరికి తలొకటి పంచిపెట్టి, తనైతే ఒక నాలుగు పెద్ద చెట్లు....

వెంకటాద్రి. నాలుగు ఖర్మ మేమిటి? అయిదో, ఆరో!

రామబ్రహ్మం. ఆఁ! నీ మొఖంకాదూ? నాలుగే!

వెంకటాద్రి. నా కళ్ళతో నేను చూస్తే! ఆరింటికి తక్కువ లేవు. అన్నీ పెద్ద పెద్ద మానులు! కొండలా వాములదొడ్డిలో పేర్చి పెట్టుకున్నాడు. ఒక లక్ష యిటికామ అలాగ్గా కాల్తుంది.

రామబ్రహ్మం. సరిగాని, వేలాని కొచ్చినవి మొత్త మెన్ని చెట్లంటావ్?

వెంకటాద్రి. ఏమో, ఆ తబ్సీలు నాకు తెలవదు.

రామబ్రహ్మం. అయితే, మరి నోరుమూసు కూరుకో!

వెంకటాద్రి. ఏం పందెం కడతావ్? జానకిరామయ్య తోలించు కున్నవి ఆరేడు చెట్లని నేను....

రామబ్రహ్మం. నేను కాదంటూ వుంటే....

వెంకటాద్రి. నే నౌనంటూ వుంటే....

రామబ్రహ్మం. కాదు! కాదు! ముమ్మాటికీ, కాదు.

వెంకటాద్రి. ఔను! ఔను! ముమ్మాటికీ, ఔను!

రామబ్రహ్మం. నువ్వేమన్నా, అవి నాలుగే!

వెంకటాద్రి. నువ్వు కాదన్నా, అవి ఆరు!

ఈశ్వరరావు. ఎన్నో వొకన్ని పోనిద్దురూ! ఆఁ! అయితే ఏమి జరిగింది?

రామబ్రహ్మం. జరగాల్సిందే జరిగింది.

వెంకటాద్రి. చురక అంటించాగా!

రామబ్రహ్మం. తిక్క కుదిరింది!

వెంకటాద్రి. నెత్తి అణిచేశాలే!

రామబ్రహ్మం. నవనాళ్ళూ కుంగినవి.

వెంకటాద్రి. కాలికింద పెట్టి రాచేశా!

రామబ్రహ్మం. ఏరోయ్! అంతా నువ్వే చేసినట్టుగా మాట్లాడుతున్నావ్!

వెంకటాద్రి. నేనుగాక నువ్వా? అటునుంచి నరుక్కొచ్చిందెవరోయ్? పంచాయితీ ఆఫీసరు దగ్గిరికి నిన్న పిటిషను పట్టుకెళ్ళి యిచ్చింది నేను కాదూ?

రామబ్రహ్మం. పిటిష నివ్వడానికేఁ? పోస్టు బంట్రోతుకూడా యిస్తాడు, అది రాసిం దెవరోయ్? ముందు ఆ మాట చెప్పు!

వెంకటాద్రి. మహలావ్! నువ్వే రాశావులే, సుబ్బన్న రాయింపిస్తే!

రామబ్రహ్మం. కావాలంటే నేనే రాయలేనేమిటి? ఇలాంటివి లక్ష తొంభై రాశాను.

వెంకటాద్రి. ఇంత పెద్ద రాతగాడివేనా మొన్న సుబ్బన్న వూళ్లో లేకపోయేసరికి ఏకుసాలు కౌలుకబోలియతులు రాయలేక గుడ్లెళ్ళబెట్టావ్.

రామబ్రహ్మం. నువ్వంటే నాకిందుకే వొళ్లుమంట! నా రాతకోత లంటేనే నీ కళ్ళల్లో కారం పోసుకుంటావ్!

వెంకటాద్రి. రాతసంగతి నీ కేం తెలుసు లేరా! రాత బలిగోరు తుంది!

రామబ్రహ్మం. పొట్ట పొడిచినా అక్షరంముక్క లేనివాడివి, నువ్వు కూడా నన్ను....

వెంకటాద్రి. బయల్దేరా డయ్యా, ఈయనే కొమ్ములు తిరిగిన పండితుడు!

ఈశ్వరరావు. మీ రిద్దరూ మహామేధావులే.

వెంకటాద్రి. అంటే?

ఈశ్వరరావు [నవ్వుతూ]. పండిత పుత్రు లన్నమాట.

రామబ్రహ్మం. వీడి మొఖం! వీ డేం పండితపుత్రుడు? ఆ పేరు నాకే తగు. మా నాన్న ఆంజనేయదండకం రాశాడు.

ఈశ్వరరావు [మరింతగా నవ్వుతూ]. చెప్పావ్‌కాదూ? ఆంజ నేయ వరప్రసాదంవల్ల జన్మించిన సుపుత్రుడ వన్న మాట! [నవ్వు ఆపుకుని] సర్లే—మీరు పిటిషన్ పెడితే ఏమైంది?

వెంకటాద్రి. పంచాయితీ ఆఫీసరు తనిఖీకొస్తా నన్నాడు.

రామబ్రహ్మం. ఇవ్వాళే వొస్తాడు.

వెంకటాద్రి. ఈపాటికి అసలు బయల్దేరాడేమో!

ఈశ్వరరావు. సరే! వస్తాడయ్యా! వస్తే జానకిరామయ్య కొచ్చిన భయ మేమిటి? బోర్డులో మెజారిటీ వాడిదే నయ్యె! ఊళ్ళో ఉద్యోగస్థులందరు వాడి పక్షమే నయ్యె!

రామబ్రహ్మం. నీకు తెలియదులే వయ్యా! దానిలో ఒక కిటు కుంది.

వెంకటాద్రి. కీలెరిగే పెట్టాంలే వాత!

రామబ్రహ్మం. ఆయువుపట్టునే కొట్టాలిలే దెబ్బ.

వెంకటాద్రి. ఇఖ గిలగిల తన్నుకుంటాడు.

రామబ్రహ్మం. వలవల యేడుస్తాడు.

వెంకటాద్రి. ఈ దెబ్బతో కుర్చీ దిగాలి.

రామబ్రహ్మం. అసలు గోదావరిస్తానమే చేస్తాడేమో!

ఈశ్వరరావు. ఇంతకూ ఆ కిటు కేమిటి?

వెంకటాద్రి. దానిలో చాలా తిరుగు డుందిలే!

ఈశ్వరరావు. ఏమి టది? కాస్త విడమర్చి చెప్పరాదూ?

వెంకటాద్రి. చెట్లను పబ్లీకుగా పాటపెట్టందే పెట్టానని దొంగ రాతలు రాశాడు గాదటయ్యా!

రామబ్రహ్మం. నీ మొఖం! అది కాదు పాయింటు. చెట్లని సేలు చేశాక, దాన్ని అప్రూవుచెయ్యడానికి బోర్డుమీటింగు పెట్టాలి. ఈలోగా సొత్తును దాని స్తానంనుంచి కదిలించగూడదు. కదిలిస్తే కేసౌతుంది.

ఈశ్వరరావు. అయితే, ఇంకా మీటింగు జరగలే దేమిటి?

రామబ్రహ్మం. ఉహుఁ! మీటింగు రేపటికి వేశాడు.

వెంకటాద్రి. ఈలోగా పంచాయితీ ఆఫీసరు రానే వొస్తున్నాడు.

ఈశ్వరరావు. ఓహో! అదా సంగతి!

రామబ్రహ్మం. ఇప్పు డాయ నొచ్చి సొత్తు చూపించమంటే నీళ్ళు నమలాలి!

వెంకటాద్రి. గుడ్లెళ్ళబెట్టాలి.

రామబ్రహ్మం. చెమటలు పోస్తాయిలే!

వెంకటాద్రి. చచ్చినంత పనవుతుంది.

రామబ్రహ్మం. అసలు శాస్త్రిలైనా వుంటేగా? దుంగలకింద అప్పుడో కోయించేసుకున్నాడు.

ఈశ్వరరావు. అయితే, గట్టి చిక్కేనన్నమాట!

వెంకటాద్రి. చిక్కంటే చిక్కా? యమచిక్కు.

రామబ్రహ్మం. పీకమీద కత్తే!

వెంకటాద్రి. మెడకి ఉచ్చే!

రామబ్రహ్మం. వదిలిపోతాయిలే జలుబు నీళ్లు!

వెంకటాద్రి. కరుగుతుందిలే కండకావరం!

రామబ్రహ్మం. దిగుతుందిలే కళ్ల పొగరు!

వెంకటాద్రి. ఎంత పొగరు లేకపోతే పెంటపోగు పిసరంత వీధిలో కొచ్చిందని నాపైన న్యూసెన్సుకేసు పెడతానంటాడు! సంసారి అన్నాక పెంటపోగు కాస్త ఇటూ అటూ రాకండానే వుంటుందా?

రామబ్రహ్మం. నాకుమట్టుకు నోటీ సెట్టలేదూ? ములుగు మూడు రోజుల్లో తీసెయ్యకపోతే ప్రాసిక్యూషను చేయిస్తాట్ట! ఆసామి అన్నాక కాస్త వెనకా, ముందూ వుండదూ? ఆ రెండు మోపుల చెత్తకే చెరువునీళ్ళన్నీ చెడిపోతాయీ?

వెంకటాద్రి. నా వామిదొడ్డిలో కలిసే పోరంబోక రెండుసెంట్లు కలపరా అని కాళ్లకు బలపాలు కట్టుకుని ఎన్నాళ్ళు తిరిగినా ససేమిరా అన్నాడు.

రామబ్రహ్మం. చెరువులపాటలో దండగ పడ్డానని ఎంత మొత్తు కున్నా, అయినవా ళ్లందరిచేతా చెప్పించినా, చిల్లిగవ్వకూడా తోసెయ్య నన్నాడు.

ఈశ్వరరావు. అయితే, ఊరుసొమ్ము తిననివ్వలే దనేనా, ప్రెసి డెంటుపైన మీ కింత కక్ష ?

వెంకట్రాది. ఏం ! వాడు తినడంలా ?

రామబ్రహ్మం. వాడు బాగానే నొల్లుతున్నాడు.

వెంకటాద్రి. ఊరు కాల్వగట్లని వాడి గొడ్లు ఊరికే మెయ్యడంలాం?

రామబ్రహ్మం. తూర్పు వీధిలో సగాన్ని వాడు తన వియ్యంకుడికి కలపలాం?

వెంకటాద్రి. ఇంతకీ వాడికి కాళ్ళుతెచ్చింది మనమే !

రామబ్రహ్మం. పోనీలే, అయినవాడని నేను మా కుదుటివాళ్ళ వోట్లన్నీ వేయించకపోతే, ఈ ముండమోపి అసలు మెంబ రైనా అయ్యేవాడేనా ?

వెంకటాద్రి. చాల్లే ! ఇలాంటి మాటలు నా దగ్గిర చెప్పకు! చెయ్యి తడి అయిందేమో, వోట్లు వేయించావేమో !

రామబ్రహ్మం. ఛీ ఛీ ! వాడి పాపిష్ఠిసొమ్ము తిన్నవా డెవడు ? ఏమైనా కతికితే, నువ్వే కతికుండాలి,

ఈశ్వరరావు. మిమ్మల్నిచూస్తే ఒకందుకు మాత్రం నాకు చాలా ముచ్చ టేస్తున్నది. మీకు ఒకరి పొడ ఒకరి కెంతమాత్రం గిట్టకపోయినా, జానకిరామయ్యమీద కలిసే కత్తి కడు తున్నారు.

రామబ్రహ్మం. పేనుకు పెత్తనమిస్తే తలంతా తెగ కొరికినట్టు, మరి వాడు చేసే పనులేమి టయ్యా ?

వెంకటాద్రి. ఇప్పుడే గనక వాణ్ణి నొక్కకపోతే, మరి పట్ట పగ్గా లుంటాయా ?

రామబ్రహ్మం. వాడి అంతు ఇప్పుడే కనుక్కోవాలి.

వెంకటాద్రి. వాణ్ణి ఇప్పుడే పుటమెయ్యాలి.

రామబ్రహ్మం. వాడి పెళ్ళి యిప్పుడే చెయ్యాలి.

వెంకటాద్రి. వాడి భరత మిప్పుడే పట్టాలి.

ఈశ్వరరావు. కోరితే లంకాదహనం చేయగల సమర్థులు. మీకు ఎదు రేమిటి కాని, సుబ్బన్న యింటివద్ద లేడూ ?

వెంకటాద్రి. లేకేఁ ! వున్నా డయ్యా !

రామబ్రహ్మం. మేము అక్కడినుంచేగా వస్తున్నాం.

వెంకటాద్రి. నీ కబు రందింది.

రామబ్రహ్మం. మీ పాలే రొచ్చి....

వెంకటాద్రి. సుబ్బన్నతో ....

రామబ్రహ్మం. మాదొర ఒకమాటు....

వెంకటాద్రి. రమ్మంటున్నాడని....

రామబ్రహ్మం. నీ కిదే తెగులు ! పెద్దమనిషితో మాట్లాడుతూ వుంటే మాటమాటకూ అడ్డొస్తావ్ !

వెంకటాద్రి. అసలు నీవెంట రావడం నాదే బుద్ధితక్కువ ! [చెంపలు వేసుకుంటూ] నిన్ననే పనేమిటి ? తప్పు నాదేలే !

రామబ్రహ్మం [తనుకూడా లెంపలు వేసుకుంటూ]. కాదు, కాదు! తప్పు నాదే !

వెంకటాద్రి. మ్చ్! నాదే!

రామబ్రహ్మం. ఉహుఁ! నాదే

[ఈశ్వరరావు నవ్వుతాడు.

రామబ్రహ్మం. చూశావా? ఆ పెద్దమనిషి నిన్ను చూసి ఎలా నవ్వుతున్నాడో!

వెంకటాద్రి. నన్ను చూసి కాదు; నిన్ను చూసే!

[ఈశ్వరరావు ఇంకా బిగ్గరగా నవ్వుతాడు.

వెంకటాద్రి. నువ్వు నిజం చెప్పవయ్యా? ఎవర్ని చూసి?

రామబ్రహ్మం. ఈ పెద్దమ్మను చూసి కాదూ?

వెంకటాద్రి. ఈ దద్దమ్మను చూసి కాదూ?

[ఈశ్వరరావు కడుపు చెక్కలయ్యేటట్లు విరగబడుతుండగా సుబ్బన్న ప్రవేశిస్తాడు. అతడు ఈశ్వరరావు కంటె రెండు, మూడేళ్లు పెద్ద. ఊళ్ళో ఒక పార్టీ నాయకుడు, ఆరితేరిన వ్యవహర్త.

ఈశ్వరరావు. రారా! సుబ్బన్నా! రా! పరమానందయ్యశిష్యుల్ని చేర్చి వ్యవహారం చాలా ముదరబెట్టావేఁ!

సుబ్బన్న. మీ రిక్కడ పోగైనారూ? వొత్తి సోదిరాముళ్ళు! మీతో పనులై నట్టే! రామబ్రహ్మం! ప్రెసిడెంటు తన పార్టీ మెంబర్లందర్నీ యింటికి పిలిపించుకున్నాడు. ఏమి గూడుపుఠాణీ చేస్తున్నారో కాస్త ఆరా తీసి రా!

రామబ్రహ్మం. ఆఁ! చెయ్యడాని కేముంది? తలపట్లు పట్టుకుంటున్నారు!

[వెడతాడు.

సుబ్బన్న. వెంకటాద్రీ! నువ్వెళ్ళి మన ప్రసాదరావుని ఒకసారి పిలుచుకురా! నే నిక్కడే వుంటా—చప్పున వెళ్ళిరా!

వెంకటాద్రి. పొద్దు నొకసారి వెళ్ళితే, పొల మెళ్ళా డన్నారు. తిరి గొచ్చాడో, లేదో!

[వెడతాడు.

సుబ్బన్న [వెంకటాద్రి అవతలికి వెళ్ళిన తర్వాత, ఈశ్వర రావుతో]. విన్నావా, ఊళ్ళో విశేషా లన్నీ?

ఈశ్వరరావు. విన్నాలే! కాని, మీ పగలు మీరు సాధించుకుంటూ రాజీ చెయ్యడానికి నన్ను రమ్మనడం దేనికిరా?

సుబ్బన్న. ఆఁ! నీ కేం తెలుసులేరా రాజీ మాట లొచ్చాక వా డెంతగా నోరు పారేసుకున్నాడో!

ఈశ్వరరావు. వాడికి కొంచెం నోటి దురుసుతన మున్నమాట నిజమే. కాని, ఇప్పుడు మీరు వాణ్ణి ప్రాసిక్యూషన్ చేయిస్తే కక్షలు మరింత పెరిగిపోయి, ఊరు ధ్వంసధూళి కాదూ?

సుబ్బన్న. చూస్తూవుంటే మేస్తూ పోయిందని, మేము ఊరు కున్నకొద్దీ వాడు మరీ తెగబడుతున్నాడయ్యో! దీని కేం చెబుతావ్?

ఈశ్వరరావు. జానకిరామయ్య నీ కిప్పుడు దుష్టు డయ్యాడు గాని, నిన్న మొన్నటివరకు మీ రిద్దరు ప్రాణస్నేహితులేగా? వీరభద్రయ్యను కలిసే పడగొట్టారయ్యో!

సుబ్బన్న. ఆఁ! జానకిరాము డిప్పుడు వెనకటి మనిషి కాడులేఁ!

ఈశ్వరరావు. నిన్నుగురించీ వాడు బహుశా ఇదే మా టంటాడు. పదవులకోసం పాకులాటే తప్ప ఊరు కుపకారం లేదని ఒకప్పుడు మనం పెద్దవాళ్ళని విమర్శించేవాళ్ళం—నీకు

జ్ఞాపకం లేదట్రా ? ఉద్యోగమై నేను పట్నవాసానికి వెళ్ళి పోడానికిముందు గ్రామసేవాసంఘ మంటూ మన మందరమూ చేరి స్థాపించాం కూడాగా ? దానికి ప్రెసిడెంటువు నువ్వైతే, జానకిరామయ్య సెక్రటరీ. ముసలీ, ముతకా పెత్తందార్లు స్వలాభంకోసం స్పర్ధలు పెంచుతున్నారనీ, స్వప్రయోజనాలకు సమష్టిక్షేమాన్ని బలిపెడుతున్నారనీ ఆనాటి మన ఉపన్యాసాలు, మన తీర్మానాలు - అన్నీ మరిచిపోయావా ?

సుబ్బన్న. ఆ రోజులలో ఏమేమో చాలా చాలా అనుకున్నాంలే ! కాని, సాగొద్దూ ?

ఈశ్వరరావు. ఎందుకు సాగవు?—ఈ కక్షల సాధింపు పట్టుదలలో పదోవంతైనా వుండాలే కాని ! ఇప్పటికి మీ పార్టీ కెంత ఖరైంది ?

సుబ్బన్న. చాలాదాకా అయిందిలే.

ఈశ్వరరావు. ఆ మొత్త మెంతో చెప్పరామూ ?

సుబ్బన్న. ఆఁ ! తాడో పేడో తేలేసరికి రెండు, మూడు వంచులైనా కావూ ?

ఈశ్వరరావు. మీకు రెండు, మూడు వేలైతే, జానకిరామయ్య పార్టీవాళ్ళకు కనీసం మరంతైనా కాక తప్పదుగా ?

సుబ్బన్న. ఆఁ ! వాళ్ళు యింట్లో సొమ్ము తెచ్చిపెడుతున్నారేమిటి ? పవరు చేతిలో వుందిగా ! చెరువుల పాటల్లోను, కాలవగట్ల పాటల్లోను మిగిల్చి, పార్టీ ఫండు కూడబెడుతున్నారు.

ఈశ్వరరావు. ఏమైనా ఊరు సొమ్ము దండగ కావడమే గదరా? ఈ మొత్తం ఆ జిల్లాబోర్డువాళ్ల కిస్తే గరల్స్‌స్కూలుకి ఒక బిల్డింగ్ పడేది కాదూ? స్థలం వుండనే వున్నదయ్యె. దాన్ని ధరంతుకూడా చేశారయ్యె. జిల్లేళ్ళూ పల్లేళ్ళూ మొలిచి, అది పాడుపడి పోవలసిందేనా?

సుబ్బన్న. నీ దంతా పిచ్చి కాని, స్కూలుకోసమంటే డబ్బిచ్చే వా డెవడురా?

ఈశ్వరరావు. ఎందు కివ్వరు? — మనం అందరినీ సరిగా కూడ గట్టుకు రావాలే గాని! పంచవర్ష ప్రణాళికల కింద గ్రామాలకు ప్రభుత్వ మిప్పుడు విరివిగా సహాయం చేస్తున్నదిగా! కలిసి పనిచేసుకుంటే ఒక గరల్స్ స్కూలే అన్న మాటేమిటి? ఆసుపత్రి తెచ్చుకోవచ్చు: ఎలక్ట్రిసిటీ తెచ్చుకోవచ్చు; ఏమైనా తెచ్చుకోవచ్చు.

సుబ్బన్న. బస్తీలో కూర్చున్నావ్!—పల్లెటూరు వ్యవహారాల సంగతి నీ కేం తెలుసులేరా? ఇక్కడుండి అన్నీ పడుతుండే మాకే ఆకళింపుకావు వాటి లోతుపాతులు! నువ్వు పుస్తకాల్లో చదువుకున్నట్టు జరగమంటే జరుగుతుందా?

ఈశ్వరరావు. ఇంతకూ నా కేమీ తెలియదంటావ్? అయితే, నన్ను రాజీచెయ్యడానికి రమ్మనడం దేనికి?

సుబ్బన్న. ఇం కేం రాజీరా? వ్యవహారం నా చెయ్యికూడా దాటిపోయింది. నేను ఆపాలన్నా, ఇఖ ప్రాసిక్యూషను ఆపలేను. వాడి కళ్లు ఎంత కప్పుకు పోకపోతే....

[రొజుకుంటూ రామబ్రహ్మం ప్రవేశిస్తాడు.

రామబ్రహ్మం [డొక్కలు ఎగరవేస్తూ]. పోయాడు!
సుబ్బన్న [ముఖమే ప్రశ్నార్థకం కాగా]. ఆఁ?
రామబ్రహ్మం. [ఇంకా సొలి పడుతూనే]. పోయాడు! ఇంకే ముంది? పోయాడు!
సుబ్బన్న. ఎవడు పోయాడు? ఎక్కడికి పోయాడు? ఏ మొచ్చి పోయాడు?
రామబ్రహ్మం [ఇంకా గుక్కతిప్పుకో లేక]. వాడే?
సుబ్బన్న. ఎవడు?
రామబ్రహ్మం [కాస్త తెప్పరిల్లి]. వాడే! జానకిరామయ్య!
సుబ్బన్న. తప్పించుకు ఎక్కడికి పోయాడంటావ్?
రామబ్రహ్మం. బోర్డుమీటింగు మొన్నే జరిగినట్టు రాసిపారేశాడు!
సుబ్బన్న [ఆశ్చర్యంగా]. ఆఁ!

[ఈశ్వరరావు చిరునవ్వు నవ్వుతాడు.

రామబ్రహ్మం. మెంబర్ల సంతకాలుకూడా చేయించేసుకున్నాడు!
సుబ్బన్న. ఓహో!

[అతని ముఖంలో తీవ్రాలోచన కనబడుతుంది.

రామబ్రహ్మం. తెచ్చి వాములదొడ్డిలో పెట్టుకున్న మానులన్నీ పాలేళ్ళతో పగలేయించి, బళ్ళమీద వాళ్ళకీ వీళ్ళకీ తోలించేశాడు. మరి కాసేపటికి అక్కడ చితుకు పుల్లయినా మిగలదు.
సుబ్బన్న. ఉహుఁ! అలాగేఁ?
ఈశ్వరరావు. మీటింగు అయిపోయిందా? ఇంకా జరుగుతున్నదా?

రామబ్రహ్మం. ఇంకా జరగడమేమి టయ్యా? మొన్నే జరిగి నట్టు రాయడమూ అయింది; ఎవడి దారిని వాడు లేచి పోవడమూ అయింది.

ఈశ్వరరావు. అయితే, దొడ్లో వేయించుకున్న మానులు కూడా అక్కడిప్పుడు లేవన్న మాట.

రామబ్రహ్మం. వాటినీ దాటేయించేశాడు. మొన్న మొన్నటిదాకా మొద్దు రాచ్చిప్పలా వుండేవాడు. చూస్తూ చూస్తూ వుండగానే జానకిరాము డెంత తెలివి మీరాడు! ఎత్తు, పైయెత్తులకు మా సుబ్బన్నే అనుకుంటే, సుబ్బన్న తలదన్నుతున్నాడు.

ఈశ్వరరావు. ఏరా! సుబ్బన్నా! మ రిప్పు డేం చేస్తావ్?

సుబ్బన్న. [విజయసూచకమైన చిరునవ్వుతో తల పంకిస్తూ] నే నేమీ చేయనక్ఖరలేదు. తన చేత్తోనే తన మెడకి ఉచ్చు మరింత బిగించుకున్నాడు!

ఈశ్వరరావు. అ దేమిటిరా?

సుబ్బన్న. ఏమిటో చెబుతాలే! [రామబ్రహ్మంతో] ఆ వెంకటాద్రి అదే పోకడ పోయా డేమిటి? కాస్త వెళ్ళి ప్రసాదరావుని ఇక్కడున్నట్టు పిలుచుకురా! మర్చిపోక, మీటింగు యెజెండా తెమ్మన్నానని ప్రసాదరావుతో చెప్పు! చూస్తావేం! త్వరగా ఈ పని చేసుకురా!

రామబ్రహ్మం. ఇంకేం చెప్పడం? ఇంకేం చూడ్డం? పోయాడు; చిక్కినట్టే చిక్కి, గుప్పిటిలోనుంచి చిటుక్కున తప్పించుకు పోయాడు!

సుబ్బన్న. ఆఁ! ఎక్కడికి పోతాడు? — ఏట్లోకి! నీళ్లు నము లుతూ నిలుచోకుండా నువ్వెళ్ళి చెప్పినపని చేసుకురా! నేను నడిపిస్తాగా వ్యవహారం! — నీ కెందుకు?

[రామబ్రహ్మం వెడతాడు.

ఈశ్వరరావు. సుబ్బన్నా! ఏమి కొత్త యెత్తు యెత్తుతున్నావురా?

సుబ్బన్న. మీటింగు రేపని యెజండా పంపించలేదట్రా! దాన్ని బట్టే కాలవగట్టు చెట్లపాట బోర్డు మీటింగులో ఇంకా అప్రూవు కాలేదని మాకు తెలిసింది. మా పార్టీ మెంబర్లు నలుగురిలో ముగ్గురు వూళ్లో లేకపోయినా, ప్రసాదరావుకు యెజెండా అందింది. ఇప్పు డీక ఆ యెజెండాయే చాలు, మన జానకిరాముణ్ణి జెయిలుకు పంపించడానికి!

ఈశ్వరరావు. గట్టి చిక్కే తెచ్చుకున్నాడేఁ!

సుబ్బన్న. గట్టి చిక్కేనని నెమ్మదిగా అంటున్నా వేమిటి? ఇది కొరివి పెట్టి తల గోక్కోవడమే!

[రామబ్రహ్మం, వెంకటాద్రి, ప్రసాదరావు ప్రవేశిస్తారు. ప్రసాదరావు దాదాపు సల్లై యేళ్ళవాడు. చిరు బొజ్జతో నిండైన విగ్రహం. కాని, ఆలోచన తక్కువ.

రామబ్రహ్మం. ఇదుగో! సుబ్బన్నా! నాకు వాకిట్లోనే ఎదు రయ్యారు.

ప్రసాదరావు. వ్యవహారం బెడిసిపోయినట్టేనా?

రామబ్రహ్మం. ఏఁ సుబ్బన్నా! ఇప్పు డెలా చక్కదోస్తావ్?

వెంకటాద్రి. ఏదో ఒక దారి నువ్వే చూడాలి, సుబ్బన్నా!

సుబ్బన్న [ప్రసాదరావుతో]. ఏదీ ఆ యెజెండా ?

ప్రసాదరావు. ఎజెండా యేమిటి ?

సుబ్బన్న. కొంపతీసి పారేశావేమిటి ?

ప్రసాదరావు. అబ్బే! కాగితం గిరాకీ అయ్యాక తలొక మీటింగు నోటీసు, యెజెండా పంపించడం లేదుగా ? అంతా ఒకే కాగితంమీద రాసి, దానిమీదే అందరు మెంబర్ల సంతకాలు పెట్టించుకు పోతున్నారు.

సుబ్బన్న [తెల్లబోయి]. ఈ సంగతి నేను కానలేదే !

[ఈశ్వరరావు మందహాసం చేస్తాడు.

ప్రసాదరావు. పాత యెజెండా చించి పారేసి, కొత్తది సృష్టించా డంటావా ?

సుబ్బన్న. ఔను ! కొత్తది సృష్టించీ వుండాలి; దానిమీద పాత తారీ కేసి తన పార్టీ మెంబర్ల సంతకాలు చేయించుకునీ వుండాలి.

ప్రసాదరావు. మరి నా సంతకం వుండదుగా ?

సుబ్బన్న. హాజరులేవని రిమార్కు రాసేస్తాడు.

ఈశ్వరరావు. సుబ్బన్నా ! మరి నీ ఆట కట్టినట్టేనా ?

[సుబ్బన్న జవాబు చెప్పడు. తిరిగి ఆలోచనలో పడ్డట్టు కనబడతాడు.

రామబ్రహ్మం. వలలో పడ్డట్టే పడి, చేప జర్రున జారిపోయింది.

వెంకటాద్రి. చేతిలో చిక్కినట్టే చిక్కి, పిట్ట తుర్రున పారి పోయింది !

రామబ్రహ్మం. ఇఖ చూడు వాడి ప్రతాపం !

వెంకటాద్రి. మరి వాడు ఆడించే ఆట.

రామబ్రహ్మం. పాడించే పాట.

వెంకటాద్రి. రేపటినుంచి మరీ మండిస్తాడు!

రామబ్రహ్మం. అమ్మ! వాడి యెత్తులు మరెవరి కొస్తాయి!

వెంకటాద్రి. వాడు నక్కను చంపి పుట్టాడు.

రామబ్రహ్మం. ఆవలిస్తే పేగులు లెఖ్ఖెడతాడు.

వెంకటాద్రి. ఏట్లో పారేసినా ఎదు రీదుకొస్తాడు.

రామబ్రహ్మం. కాటిమీద పెట్టినా లేచొస్తాడు.

వెంకటాద్రి. వాడు అఖండుడని నేను ఆదీకాలంనాడే చెప్పలా?

రామబ్రహ్మం. వాడు మా కుదుటివాడు. వాడి జిత్తులు నాకంటె నీకే యెక్కువ తెలుసా?

వెంకటాద్రి. కాడిగట్టు వాళ్ళం. వాడితో నే నెన్ని పేచీలు పడి వున్నానో నీకేం తెలుసు!

రామబ్రహ్మం. అమ్మ పుట్టిల్లు మేనమామ దగ్గిర....

సుబ్బన్న. అబ్బబ్బ! మీరు కాసేపు ఊరుకోండి! ఆఁ! ప్రసాద రావ్! ఈ పూట మీటింగు జరిగింది ప్రెసిడెంటు యింట్లో నేగా?

ప్రసాదరావు. ఔను!

సుబ్బన్న. అయితే, మినిట్సుబుక్కు యింటికి పట్టించుకు వెళ్ళా డన్నమాట! దాన్ని ఆఫీసులోనుంచి కదిలించగూడదు.

ప్రసాదరావు. ఔనౌను!

సుబ్బన్న. సరే! పంచాయితీ ఆఫీసరు వచ్చేలోపల దాన్ని మళ్ళీ ఆఫీసులోకి చేర్చనివ్వకుండా చేస్తే సరి! అప్పుడు బయట పడుతుంది వాడి బడాయ్!

ప్రసాదరావు. ఆ పని చేస్తేనా, పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్టే.

సుబ్బన్న. రామబ్రహ్మం! వెంకటాద్రీ! చూస్తారేం? మన వాళ్లందరినీ పోగుజేసుకు రండి! బోర్డు ఆఫీసు చాయలకైనా ఆ పార్టీమనిషిని అడుగు పెట్టనివ్వరాదు—అ దేమైనా సరే!

రామబ్రహ్మం. అడుగుపెడితే బడితపూజే!

వెంకటాద్రి. బుర్ర రామకీర్తన పాడిందన్న మాటే!

రామబ్రహ్మం. అటువైపుకు తొంగైనా చూస్తే, రక్తం కళ్లజూడం!

వెంకటాద్రి. అక్కడే పాతిపెట్టం!

రామబ్రహ్మం. అక్కడే గోరీ కట్టం!

వెంకటాద్రి. ఎవడికి కలేజా వుంది అటు రావడానికి!

రామబ్రహ్మం. ఎన్ని గుండె లుండాలి అక్క డడుగెట్టాలంటే!

వెంకటాద్రి. ఇంటిదగ్గిర చెప్పుకు రావాలి.

రామబ్రహ్మం. మంటిలో కలవడానికి రావాలి.

వెంకటాద్రి. ఉరుకుతాం బరిలోకి!

రామబ్రహ్మం. తీస్తాం దెబ్బ!

వెంకటాద్రి. వేస్తాం వీరంగం!

రామబ్రహ్మం. చూపిస్తాం మా తడాఖా!

వెంకటాద్రి. ఇవ్వాళ పుచ్చె లెగరాల్సిందే!

రామబ్రహ్మం. పీనుగులు నడవాల్సిందే!

సుబ్బన్న. మాటలు కాదు, చేతలు కావా లిప్పుడు. పదండి త్వరగా! ప్రసాదరావ్! నువ్వూ పద!—నేనూ మీ వెనకాతే వస్తున్నా.

[రామబ్రహ్మం, వెంకటాద్రి, ప్రసాదరావు వెళతారు.

సుబ్బన్న [వాళ్ళు గడప దాటి వెళ్ళేవరకు ఆగి, ఈశ్వరరావుతో]. ఆట ఇంకా కట్టలేదు!

ఈశ్వరరావు. ఎందుకు కడుతుంది? కొట్లాటకు దిగబోతున్నావుగా? ఎందుకైనా మంచిది - లాఠీలు, బరిసెలు, గండ్రగొడ్డళ్ళు జాగ్రత్త పెట్టించు.

సుబ్బన్న. వాడు చేస్తున్న పనులు నీకు బాగున్నాయేం?

ఈశ్వరరావు. ఎవరు చేస్తున్న పనులూ బాగుండలేదు. ఈ కోపాలు, ఈ తాపాలు, ఈ కక్షలు, ఈ కలహాలు....

["ఈశ్వరరావుగారూ!" అని సింహద్వారంలోనుంచి కేక

ఈశ్వరరావు. ఎవ రది?

సుబ్బన్న. ఆఁ! బిల్లు కలెక్టరులే!

ఈశ్వరరావు. ఏమోయ్! దేనికి?

బిల్లు కలెక్టరు [బయటనుంచే]. మీ రున్నారేమో మా ప్రెసిడెంటుగారు సూడమన్నారండీ!

ఈశ్వరరావు. ఏడీ ఆయన?

బిల్లు కలెక్టరు [బయటినుంచే]. మీ దగ్గిరికే వొస్తున్నారు.

ఈశ్వరరావు. సరే! రమ్మను.

సుబ్బన్న. మరి నేను పోతున్నారా?

ఈశ్వరరావు. ఏం?

సుబ్బన్న. వాణ్ణి రమ్మన్నావుగాఁ!

ఈశ్వరరావు. వాడొస్తే నువ్వు వెళ్ళాలా? మీ వుభయులకు నేను కావలసినవాడినేగాఁ?

సుబ్బన్న. ఆఁ! నే నుంటే వాడు రాడులే! నువ్వు వొంటరిగా వున్నావేమో చూచి రమ్మనే బిల్లు కలెక్టర్ని పంపించాడు.

ఈశ్వరరావు. మరి నే నేమి చెప్పి లాభం లేదన్నమాట!

సుబ్బన్న. నీకు తెలియవులేరా పల్లెటూరి వ్యవహారాలు!

[సుబ్బన్న నిష్క్రమిస్తాడు. ఈశ్వరరావు తిరిగి పత్రిక తీసి, దేనిపైనా దృష్టి సరిగా లగ్నం కానందున పేజీలు ఊరికేనే తిరగవేస్తూ వుంటాడు. ఇంతలో జానకిరామయ్య ప్రవేశిస్తాడు. అతడు ఈశ్వరరావు ఈడువాడే. వేషంలో కొంత దర్పం కానవస్తుంది. ఆ దర్పం ప్రవృత్తిలోకూడా లేకపోలేదు.

జానకిరామయ్య. చూశావుగా సుబ్బన్న నడిపిస్తున్న తతంగం?

ఈశ్వరరావు. ఒక్క అదేనన్న మాటేమిటి? సర్వం చూస్తున్నా.

జానకిరామయ్య. కట్టెపుల్లలకు కరువుగా వుందని ఊళ్ళో ఉద్యోగస్థులు మొహమోట పెడితే, వాళ్ళకు సప్లయి చేసినందుకు నా పీకమీదికి తెచ్చాడు.

ఈశ్వరరావు. నువ్వేమీ తోలించుకో లేదా?

జానకిరామయ్య. ఈ ముష్టి మూడుబళ్ళ పుల్లలులేకపోతే, నాకు గడవదట్రా? నేను ఊళ్ళో లేనప్పుడు పంచాయితీబోర్డు గుమాస్తా చేయించాడు ఈ పాడు పని.

ఈశ్వరరావు. నీకు తెలియకుండా జరిగితే వాటి నెందుకు అట్టే పెట్టుకున్నావ్?

జానకిరామయ్య. అది తప్పే! ఆ మాట నాకు తోచలేదు.

ఈశ్వరరావు. మరి ఇవ్వాళ ఈ మీటింగు మా టేమిటి ?

జానకిరామయ్య. నా ప్రాణంమీదికి తెస్తే, మరి నన్ను చావ మంటావా ? ఏదో ఒక విధంగా తప్పుకోవద్దూ ?

ఈశ్వరరావు. సరేగాని నువ్వు రాజీ ప్రయత్నం చెయ్యమంటేనేగా నే నివ్వాళ పనికట్టు కొచ్చింది ? నన్ను రమ్మని చెప్పినవాడివి ఊళ్ళోకొచ్చి సుబ్బన్నను తిట్టడం తగునా ?

జానకిరామయ్య. ఆఁ! పుండాఖోర్ ! నేను తిట్టానని చెప్పాడూ ?

ఈశ్వరరావు. ఒక పక్కని పుండాఖోర్ అంటూనే తిట్టలేదంటా వేమిరా ?

జానకిరామయ్య. ఆ వెధవ ఆడే అబద్ధాలు చూస్తే, ఎవడికి వొళ్లు మండుకురాదూ ? వా డొక్కి దరిద్రుడు.

ఈశ్వరరావు. ఊరికే ఇప్పుడు నోరు పారేసుకోవడం దేనికి కాని, "రెండేళ్ల నుంచి ప్రెసిడెంటుగా వున్నానుగదా ! ఊరుకు ఏమి ఉపకారం చేశా ?" నని ఎన్నడైనా ఆలోచించుకున్నావూ ?

జానకిరామయ్య. ఎవడైనా చేసే దేమున్నదిరా ? పంచాయితీ బోర్డు ఆదాయం వడసారం ఆరు వేలు ! దానిలో సగమైనా జీతాలకు, ఎస్టాబ్లిష్మెంటుకు పోతుంది. మిగతాదాంతో ఏం పను లౌతాయి ? పోనీ, ఏమైనా చేయిద్దామంటే, ఖర్చు నూరు రూపాయలు మించితే చాలు, దానికి సవాలక్ష ఎస్టిమేట్సు, అప్రూవల్సు కావాలి. దీనిలో ఎక్కడ ఏ కాస్త పొరపాటు జరిగినా, సర్ఛార్జీలు తప్పవు. ఇదే పంచాయతీబోర్డు ప్రెసి డెంటుగిరీ బండారం !

ఈశ్వరరావు. అయితే, రాజీనామా పెట్టరాదూ !

జానకిరామయ్య. పెడితేనే బాగుండును. కాని, పరువుకోసం పట్టుకు పాకులాడుతున్నా. ఇది కత్తిమీద సాములా వుంది. ఇవ్వాళ చూశావుగా ఎంత గట్టి దెబ్బ తట్టుకోవాల్సొచ్చిందో !

ఈశ్వరరావు. చూడ కేమిరా? ఎత్తుకు పైయెత్తు ఇంద్రజాలపు ఎత్తు లెత్తారు. సామ్రాజ్యచక్రాన్ని తిప్పే తెలివితేట లున్నాయి. కాని, ఏమి లాభం? ఒకరిపై ఒకరు కక్షలు సాధించుకోడానికే తప్ప, ఊరి కుపయోగించడం లేదు.

జానకిరామయ్య. ఒకడు పదవిలో వుంటే, వాణ్ణి ఎలా పడ గొట్టాలని తప్పితే మనకు వేరే ఆలోచనే వుండదయ్యో. ఇక, మన మేం ముందు కొస్తామురా?

ఈశ్వరరావు. ఆ మాటా నిజమే! వీరభద్రయ్యను రిమూవ్ చేయించేగా నువ్వు మొదటిసారి ప్రెసిడెంట్ అయింది!

జానకిరామయ్య. అప్పుడు ఈ సుబ్బన్నే నా మెడలు విరిచాడు. ఈ మహాపదవి నాకు కావాలని నే నేడ్చానా? తనే బల వంతాన నన్ను ఈ కుర్చీ యెక్కించాడు. ఎలాగైనా న న్నిప్పుడు దించి, తానే దానిలో కూర్చోవాలని చూస్తున్నాడు. వీర భద్రయ్యను పడగొట్టడానికి వీడికి నా వత్తాసు కావల్సివచ్చింది. ఇప్పుడు నన్ను పడగొట్టడానికి ఆ వీరభద్రయ్యతో ఏక మయ్యాడు. నాకు తెలుసులే వీడి యెత్తులన్నీ. వీరభద్రయ్యకు పెద్ద ఖాతా నడుస్తున్నది; నా కేమో పెద్దలు సంపాయించి యిచ్చిపోయిన కొంప్ర వున్నది. కాస్త పచ్చగా వున్న మా యిద్దరి జుట్లూ ముడివేసి, మమ్మల నిద్దరినీ గాడిదల్ని చేసి, తాను గద్దెక్కాలని చూస్తున్నాడు. వా డిప్పుడు పాత సుబ్బన్న కాడు. ఆస్తి పాస్తులు లేకపోయినా, ఊరూ నాడూ యేలా లంటున్నాడు.

ఈశ్వరరావు. నా మాట విని, ను వ్విప్పుడు కాస్త తగ్గరాదూ? ఉభయ పార్టీలకు అనుకూలమైనవాణ్ణి ప్రెసిడెంటుగా చేద్దాం. లేకపోతే, ఇప్పుడు రైటింగ్‌లవరకు పోతుందేమో! నువ్వు మినిట్స్‌బుక్ ఆఫీసుకు చేర్పించబోతే, అంత పనీ తప్పదు.

సుబ్బన్న తన వాళ్ళందర్నీ పోగుజేసుకు వెళ్ళాడు. పంచాయితీ ఆఫీసరు వచ్చేలోగా బోర్డు ఆఫీసు చాయలకు ఎవడైనా వస్తే, నలిపివేస్తా మంటున్నారు. ఇప్పుడు దొమ్మీ జరగవలసిందేనా?

జానకిరామయ్య. ఆ(! ఏడ్చారులే! ముందే ఆలోచించి అందుకు తగిన కట్టుదిట్టం చేశా. పోలీసు సబ్‌యినస్పెక్టర్ తను దగ్గిరుండి దాన్ని లోపలికి చేర్పిస్తానన్నాడులే! ఆయన వద్ద వీళ్ళ పప్పు ఉడకవ్. ఎవడైనా అడ్డొస్తే బొక్కలో తోయిస్తాడు.

ఈశ్వరరావు. కావచ్చులేరా! ఈనాడు నీదే పైచెయ్యి కావచ్చు; ఈ వ్యవహారంలో నువ్వే నెగ్గవచ్చు. కాని, ఇలా కక్షలు పెంచుకుంటే ఊరు ముందు కొస్తుందా?

జానకిరామయ్య. ఆ! నీకు తెలియవులేరా, పల్లెటూరి వ్యవహారాలు!

ఈశ్వరరావు. సుబ్బన్నకూడా సరిగా ఇదే మాట అనిపోయాడు సుమీ! మీ కిద్దరికీ అన్నీ భేదాభిప్రాయాలే అయినప్పటికీ, ఒక్క విషయంలో మాత్రం ఏకాభిప్రాయం వున్నట్టుంది.

జానకిరామయ్య. ఏ విషయంలో?

ఈశ్వరరావు. వొర్తి శుంఠకింద నన్ను లెఖ్ఖ కట్టడంలో!

తెర]



# భంగపాటు

[లైట్ కామెడీ]

## పాత్రలు

| | |
|---|---|
| వెంకట్రామయ్య : | పల్లెటూరి రైతు |
| రాజేశ్వరి : | అతని కుమార్తె |
| సత్యనారాయణ : | అతని అల్లుడు |
| నాగేశ్వరరావు : | అతని మేనల్లుడు |
| చింతాలు : | అతని పాలేరు |
| భీమన్న : | ఒంటెద్దు బండివాడు |

## స్థలం

వెంకట్రామయ్యగారి యింటి చావడి

## కాలం

వర్తమానం



# భంగపాటు

వెంకట్రామయ్యగారి యింటి చావడి. ఎడమవైపున సింహద్వారం, కుడివైపున పెరటిలోకి ద్వారం. ఈ రెండు ద్వారాలకు ఒక్కొక్క పార్శ్వంలో ఒక్కొక్క కిటికీ. ఎదురుగా మరి రెండు ద్వారాలు; ఒకటి పడకగదిలోకి, రెండవది వడమటింటిలోకి. చావడిలో వీధిగోడ చెంతగా యెత్తిపెట్టివున్న రెండు నవారు మంచాలు. చావడి గోడలకు లక్ష్మి, సరస్వతి, మోహిని, మేనక-విశ్వామిత్రుడు, శ్రీరామ పట్టాభిషేకం, గోపికా వస్త్రాపహరణం మొదలైన పటాలు (సన్ లైట్, వినోలియా వైట్ రోజ్ సబ్బుల అడ్వర్ టైజ్ మెంట్స్ తో సహా)

తెర లేచినప్పుడు చావడి ఖాళీగా వుంటుంది. వీధి తలుపును ఎవరో తట్టినచప్పుడు కాగా, "ఎవ రది?" అంటూ వడమటింటిలో నుంచి రాజేశ్వరి చావడిలోకి వస్తుంది. ఆమె ముద్దుపేరు చిట్టెమ్మ. వయస్సు పదిహేడు, పద్ధెనిమిది సంవత్సరాలు. చామనచాయ. కళకళలాడుతున్న కోలముఖం. కాంతివంతమైన చేరడేసి కళ్లు. తిరిగి తలుపు తట్టిన చప్పుడు కాగా "వచ్చే" అంటూ ఆమె త్వరగా అడుగు వేస్తుంది.

**రాజేశ్వరి** [తలుపు తీసి]. ఓహో! మీరా!

**సత్యనారాయణ** [దర్పాన్ని నటిస్తూ, చావడిలోకి వచ్చి]. ఔను! మేమే!

రాజేశ్వరి. అయితే, దయచెయ్యండి, మరి.

సత్యనారాయణ. బయటికేనా ?

రాజేశ్వరి [చిరునవ్వుతో]. మీ చిలిపిమాటలు పోనిచ్చారు కారు. [పడమటింటిలోకి వెడుతూ] అమ్మా ! వా రొచ్చారే !

[సత్యనారాయణ చావడిమధ్యకు వస్తాడు. అతడు పాత్రికేళ్ల వాడు. పొడుగ్గా, పలచగా, నాజూకైనవాడు. బిళ్ళగోచి పంచెతో, వొదులు లాల్చీతో, వల్లెవాటు ఉత్తరీయంతో బెంగాలీ వేషం. ఉత్తరీయాన్ని తీసి, ఎక్కడ తగిలించాలా అన్నట్టు అతడు చావడిని కలయజూస్తూ వుండగా సామానుతో, థెర్మస్ ఫ్లాస్కుతో బండి భీమన్న వస్తాడు.

బండి భీమన్న [సామాను చావడిలో పెడుతూ]. సామాను సరిగ్గా సూసుకోండి, బాబయ్యా! ఇదో! ఇది పెట్టి; ఇది పరుపు సుట్ట; ఇది - మరిగత్తే - ఏంటో గొట్టం. ఇది పూలబుట్ట. మొత్తం నాల్గు సాత్తీలు. లెక్క సూసుకోండి బాబయ్యా !

సత్యనారాయణ. సరి లేవోయ్ ! బాడు గెంత ?

బండి భీమన్న. మీ సిత్తం బాబయ్యా !

సత్యనారాయణ [పర్సు తీసి, రూపాయి యిస్తూ]. మంచిది. పోవోయ్ !

బండి భీమన్న [రూపాయి అందుకుని దణ్ణం పెడుతూ]. ఈనాం దయసేయించండి, బాబయ్యా !

సత్యనారాయణ [పర్సు జేబులో పెట్టివేసుకుంటూ]. ఈనాములు, అగ్రహారాలు యివ్వడానికి నే నేమీ మహారాజును కాదోయ్!

బండి భీమన్న. పెబువులు—మీకేం లోటు? మీరు సల్లగా సూడకపోతే పేదా బిక్కీ బతికే దెలా, బాబయ్యా?

రాజేశ్వరి [కాళ్లు కడుక్కోడానికి చెంబుతో నీళ్లు తెచ్చి]. ఏం, భీమన్నా! ఏమి టది?

సత్యనారాయణ. రూపా యిచ్చినా, ఇంకా ఈనాం తెమ్మంటున్నాడు!

రాజేశ్వరి. రూపాయి పుచ్చుకున్నాడూ? స్టేషన్‌నుంచి వూళ్ళోకి అర్ధరూపాయే మామూలు. ఏం భీమన్నా? కొత్తవార్ని చేసి, ఇలా గుంజుతున్నావ్! వుండు, మా నాన్నతో చెబుతా!

బండి భీమన్న. నీకు దణ్ణం పెడతా! వొద్దమ్మా, వొద్దు!

సత్యనారాయణ. ఏమోయ్! చెబితే యేఁ?

బండి భీమన్న. ఎంకట్రామయ్య బాబయ్యతోటే! అబ్బో! ఆయన కరకట్టు మనిషి. మాట తబాబొస్తే నిలువునా పాతేస్తాడు,

సత్యనారాయణ. ఆఁ! ఆయ నంత కరకట్టుగా వుంటాడూ?

బండి భీమన్న. ఆయనసంగతి మీకేం తెల్సు, బాబయ్యా? బలే నికార్సు మనిషి. అయితే, సిట్టెమ్మొగోరూ! ఈ రూపాయి తీసేసుకుని; అర్ధే యిప్పించం డమ్మా!

సత్యనారాయణ. సరి లేవోయ్! నువ్వు పో!

బండి భీమన్న. సిత్తం! బాబయ్యా! సామాన్ల లెక్క సరిగ్గా సూసుకోండి.

[దణ్ణంపెట్టి వెళ్ళిపోతాడు.

రాజేశ్వరి. [నీళ్ళచెంబు అందిస్తూ]. కాళ్ళు కడుక్కోండి.

సత్యనారాయణ. నా కాళ్ళకేఁ? పరిశుభ్రంగానే వున్నాయ్!

రాజేశ్వరి [చిరునవ్వుతో]. తమరు బస్తీవారు కాబోలు! మేము పల్లెటూరివాళ్ళం; మోటువాళ్ళం; మా మోటు ఆచారాలివి. మోటువాళ్ల మధ్య—ఇష్టమైనా, కష్టమైనా— వాళ్ల మోటు ఆచారాలు పాటించక తప్పదు.

[చెంబు అందిస్తుంది.

సత్యనారాయణ [ఉత్తరీయాన్ని రాజేశ్వరి చేతి కిస్తూ]. అబ్బే! మోటువాళ్లు కాదు; మాటకార్లు!

[కాళ్లు కడుక్కోడానికి సత్యనారాయణ పెరటి గుమ్మం గుండా వెడతాడు. రాజేశ్వరి ఉత్తరీయాన్ని ఒక పటం మేకుకు తగిలిస్తుంది. ఒక నవారు మంచాన్ని వాల్చి, దానిపై జంఖానా పరిచి, తలవైపున దిండు వేస్తుంది. ఈలోపల కాళ్ళు కడుక్కువస్తున్న సత్యనారాయణకు యెదురుగా వెళ్ళి, తువాలిచ్చి, చెంబు తీసుకుని, పడమటింటిలోకి వెడుతుంది. సత్యనారాయణ మంచంపై కూర్చుంటాడు,

బండి భీమన్న [బయటనుంచి]. బాబయ్యా!

సత్యనారాయణ. ఎవరది?

బండి భీమన్న [చావడిలోకి వస్తూ]. నేనే బాబయ్యా!

సత్యనారాయణ [బుర్ర గోక్కుంటూ, ఎదురుగా వచ్చి నిలిచిన భీమన్నతో]. దేనికోయ్?

బండి భీమన్న. ఏం లేదు బాబయ్యా! మరిగత్తే మీరు మళ్లీ పట్నం మెప్పు డెడతారు, బాబయ్యా?

సత్యనారాయణ [చికాకుగా]. నీ కెందుకోయ్ ఈ ఆరాలన్నీ? నే నెప్పుడు వెళ్ళితే నీకేం?

బండి భీమన్న. ఏం లేదు. బాబయ్యా! మరిగత్తే....
సత్యనారాయణ. ఏమిటోయ్ ఆ గత్తీలూ, కత్తీలూ?
బండి భీమన్న. అది కాదు. బాబయ్యా! మళ్ళీ బం డెప్పుడు తోలుకు రమ్మంటారు?
సత్యనారాయణ. ఓహో! అదా సంగతి! ఎల్లుండి పొద్దున్నే మెయిల్ వేళకు తోలుకురా!
రాజేశ్వరి [పడమటింటిలోనుంచి వస్తూ]. మళ్ళీ ఎల్లుండే ప్రయాణ మటండీ? ఏమంత తొందర? వీల్లేదు.
బండి భీమన్న. అయితే, మరెప్పుడు రమ్మంటారు, బాబయ్యా!
సత్యనారాయణ. ఎల్లుండి పొద్దునని నీకు చెప్పలా?
బండి భీమన్న. ఎల్లుండి ఈల్లేదని మా సిట్టెమ్మగా రన్నారు గదండీ?
సత్యనారాయణ. మీ సిట్టెమ్మగారు, పొట్టెమ్మగారు అలాగే అంటారులే! నువ్వు మాత్రం నే చెప్పినట్టుగానే ఎల్లుండి పొద్దున్నే రా! సరేనా?
బండి భీమన్న. సిత్తం సిత్తం! దణ్ణం, బాబయ్యా?

[పోబోతాడు.

రాజేశ్వరి. ఇదుగో! భీమన్నా! రామాలయందగ్గిర మా నాన్న వుంటే, పట్నం అల్లుడుగా రొచ్చారని కాస్త చెప్పిపో!
బండి భీమన్న. సిత్త మమ్మా! సిత్తం!

[వెళ్ళిపోతాడు.

రాజేశ్వరి [చిన్నమొహం చేసుకుని]. అంత తొందరేమండీ? ఎల్లుండే తిరిగి వెళ్లాలా? వారం రోజులపాటైనా మీకు సెలవు దొరక దేమండీ?

సత్యనారాయణ. ఒక్క వారంరోజుల ఖర్మేమిటి? అసలే సెలవు దొరికింది!

రాజేశ్వరి [ఆశ్చర్యంగా]. అదేమిటండీ?

సత్యనారాయణ. ఏమిటా? ఉద్యోగం వూడింది.

రాజేశ్వరి [నమ్మలేక]. నిజమే?

సత్యనారాయణ [బండి భీమన్న గొంతుతో]. సిత్తం! సిత్తం!

రాజేశ్వరి. ఆఁ! పోదురూ! మీరు వేళాకోళ మాడుతున్నారు.

సత్యనారాయణ. నిజం చెప్పినా నువ్వు నమ్మకపోతే, మరి నేను చేసే దేమిటి?

రాజేశ్వరి. అదేమిటండీ? ఏడాదిపాటు ప్రయత్నం చేసి ఉద్యోగం సంపాయించడమూ, నెలైనా గిర్రున తిరక్కముందే అది పోవడమూనా!

సత్యనారాయణ [సిగరెట్టు తీసి ముట్టిస్తూ]. మన అదృష్టం అలా వుందన్న మాట. ఆ పత్రిక కట్టేశారు.

రాజేశ్వరి. మొన్నే కదండీ దాన్ని ప్రారంభించింది?

సత్యనారాయణ. నిజమే! కాని, కనీసం అయిదు లక్షలైనా పెట్టుబడి లేకుండా ప్రారంభిస్తే, దినపత్రిక సవ్యంగా నడుస్తుందా?

రాజేశ్వరి. మరి మీ వుద్యోగం పోతే, ఎల్లుండే జరూరుగా తిరిగి వెళ్ళాలంటా రేమిటి?

సత్యనారాయణ. మా క్లబ్బు నాటకంలో రాజు వేషం వొప్పుకున్నాలేఁ!

రాజేశ్వరి. అలాగేఁ! అయితే రాణిగా రెవరో?

సత్యనారాయణ [రాజేశ్వరిని వేలితో చూపుతూ]. వీరే రాణిగారు! తమ నామధేయమే రాజేశ్వరిగారయ్యె!

రాజేశ్వరి. నాపని నాటకంగానే వుంది. నే నొకటి అనుకుంటే, మరొకటి జరిగింది.

సత్యనారాయణ [సిగరెట్టుపొగ రాజేశ్వరిముఖంలోకి "ఉఫ్"మని ఊది]. నీ వేమనుకున్నా వేమిటి ?

రాజేశ్వరి [పొగకు ఉక్కిరి బిక్కిరై దగ్గుతూ]. ఊఁ! పోదురూ! ఏమి టది ? మోటు సరసం !

సత్యనారాయణ. పోనా ?

[మంచంపైనుంచి లేస్తాడు.

రాజేశ్వరి [భర్త భుజాలమీద చేతులు వేసి నొక్కుతూ]. మహ బాగుంది ! కూర్చోండి; కూర్చోండి.

సత్యనారాయణ [నిలబడే]. నీ వేమనుకున్నావో చెబితే తప్ప కూర్చోను.

రాజేశ్వరి. చెబుతా గదండీ ! ముందు కూర్చోండి.

సత్యనారాయణ. అన్నట్టు, కూర్చోకపోతే [రాజేశ్వరి గొంతు పెట్టి] "ఉండు, మా నాన్నతో చెబుతా !" అస్త్ర మిప్పుడు నా పైనే సంధిస్తావు కాబోలు !

రాజేశ్వరి [నవ్వుతూ]. అబ్బ ! కూర్చుందురూ !

సత్యనారాయణ [కూర్చుంటూ]. సరే ! అదేమిటో చెప్పు మరి ?

రాజేశ్వరి. మరే....మరే....[నవ్వుతూ] ఎలా చెప్పనండీ ?

సత్యనారాయణ. అందమైన ఆ చిన్ని నోటితో; విందు కూర్చే ఆ తేనె కంఠంతో.

రాజేశ్వరి. ఉహూఁ! నేర్చారు నాటకాల్లో మాటలు !

సత్యనారాయణ. ఇంతకూ అదేమిటో చెప్పావ్ కాదు.

రాజేశ్వరి. మరే....మరే....మీకు ఉద్యోగమైంది గనక, ఇక నన్ను పట్నం కాపరానికి తీసికెడతారని....

సత్యనారాయణ [నవ్వుతూ]. ఓహో! అదా సంగతి!

రాజేశ్వరి. మీకేం! మీకు నవ్వులాటగానే వుంటుంది. నా కిక్కడేమీ తోచడం లేదు. మిమ్మల్ని వొదిలి నేనిక్కడిక మరి వుండేదే లేదు. ఉద్యోగం, సద్యోగం మాట నాకు తెలవదు. మీరు పట్నం వెళ్ళితే, ఈసారి నేనూ మీ వెంట రావాల్సిందే!

సత్యనారాయణ. భేష్! ఉద్యోగం లేకుండా మద్రాసులో కాపరం పెట్టడ మెలా?

రాజేశ్వరి. ఉద్యోగం లేకపోయినా, మీ రక్కడ వుంటం లేదా?

సత్యనారాయణ. నా దారి వేరు. ఒంటిగావుంటే నా తిప్ప లేవో నేను పడతా.

రాజేశ్వరి. జంటగావుంటే ఆ తిప్ప లేవో మనం చెరిసగం పంచుకో వచ్చుగాం?

సత్యనారాయణ. ఆస్తిలో ఆడవాళ్లకు సగ భాగమంటూ ఈ మధ్య శాసనం వచ్చిందనుకో! తిప్పలలోకూడా సగం పంచిపెట్టాలంటూ ఇంకా శాసనం రాలేదు.

రాజేశ్వరి [ముఖం చిన్నబుచ్చుకుని]. పోనీ లెండి, మీకు నేనంత భారమైతే.

సత్యనారాయణ [అనునయిస్తూ]. ఇంతలోనే అలకా?

రాజేశ్వరి. నాకు తోడు అలకూడా!

సత్యనారాయణ. రాజేశ్వరీ! ఏదీ, ఇలా నా వంక చూడు! [చూడదు] ఇలా నావంక చూడమంటూ వుంటే? [ఆమె

ముఖం తనవైపుకు తిప్పుకుని] పిచ్చిదానా! నిన్ను విడిచి వుండడం నాకు మాత్రం కష్టంగా లేదనుకున్నావా? వెర్రిబాగుల దానివి కాబట్టి, నువ్వు తేలిగ్గా బయటపడ్డావు; నేను పడలేదు. అంతే భేదం.

రాజేశ్వరి [సత్యనారాయణ కళ్ళలోకి చూస్తూ]. పోనీ, మనం పట్నం కాపరం పెట్టడానికి మా నాన్నని డబ్బివ్వమని అడిగితేనో?

సత్యనారాయణ. అడగడం తేలికే! కాని, ఆ కరకట్టు మనిషి యివ్వొద్దూ?

రాజేశ్వరి. చిన్నదాన్ని - మా నాన్న నా కన్యాయం చేస్తా డేమిటి? కాపరానికి మా అక్కయ్యలు ముగ్గురూ వెడుతూవుంటే, వాళ్ళకి అయిదేసి వే లివ్వలేదూ?

సత్యనారాయణ, నిజం?

రాజేశ్వరి. నిజమేనండీ!

సత్యనారాయణ. ప్రయాణమై వెడుతూవుంటే వాళ్ళ అడక్కుండానే యిచ్చాడా?

రాజేశ్వరి. పెద్దక్కాయి కాపరాని కెళ్ళడం నాకు బాగా గుర్తు లేదు గాని, రెండో అక్కాయికీ, మూడో అక్కాయికీ వాళ్ళు ప్రయాణమైనాక పసుపూ కుంకంలో పెట్టి మా పెదనాన్నచేత యిప్పించాడండీ!

సత్యనారాయణ. అయితే, నువ్వు ప్రయాణమైతే నీకూ....

[బయటినుంచి "చిట్టెమ్మా!" అంటూ వెంకట్రామయ్య గొంతు.

రాజేశ్వరి. అడుగో! మానాన్న!

సత్యనారాయణ. భేష్! నువ్వు లోపలికి పో!

రాజేశ్వరి. దేని కండీ?

సత్యనారాయణ. మన మిప్పుడు నడిపించవలసిన నాటక మున్నదిలే. తమరు అంతఃపురంలోకి వేం చెయ్యండి.

[ఆశ్చర్యంతో వెనక్కి వెనక్కి తిరిగిచూస్తూ, రాజేశ్వరి పడమటింటిలోకి వెడుతుంది. వెంకట్రామయ్య పుగాకు తునక పాయతీస్తూ లోపలికి వస్తాడు. ఆయన వయస్సు దాదాపు యాభై సంవత్సరాలు. ఆరడుగులకు పైగా పొడవు; పొడవుకు తగిన లావు. పెద్ద నుదురు, చేరడేసి కళ్లు, గండుమీసం. చూచీ చూడ్డంతోటే హుందాగలవాడిలా కనబడతాడు.

వెంకట్రామయ్య. ఏం నాయనా! ఎప్పుడూ రావడం?

సత్యనారాయణ. ఇంతకు ముందేనండీ.

వెంకట్రామయ్య. క్షేమమా?

సత్యనారాయణ. ఆఁ!

వెంకట్రామయ్య. మద్రాసునుంచేనా?

సత్యనారాయణ. ఔనండీ.

వెంకట్రామయ్య. ఏమిటీ విశేషాలు?

సత్యనారాయణ, ఏమీ లేవుగాని....

వెంకట్రామయ్య. ఏమి టది, నాయనా?

సత్యనారాయణ [కొత్త సిగరెట్టు తీసి ముట్టిస్తూ]. మీ అనుమతైతే రాజేశ్వరిని మద్రాసు తీసుకువెళ్లాలని....

వెంకట్రామయ్య. ఇందుకు నా అనుమతి దేనికి?

సత్యనారాయణ. అదేమన్న మాటండీ? మీ సమ్మతి లేకుండా....

వెంకట్రామయ్య, మంచిది, నాయనా! ఎప్పుడూ ప్రయాణం?

సత్యనారాయణ. ఇవ్వాళ రాత్రికే.

వెంకట్రామయ్య. సరి సరి! దాని కొాక వారం, వర్జ్యం, మంచీ చెడ్డా లేదన్నమాట! ఎప్పుడు తలుచుకుంటే అప్పుడేనా?

సత్యనారాయణ. నేను మంచిరోజు విచారించే వచ్చానండీ! దక్షిణదిశ ప్రయాణానికి దివ్యమైన రోజు. వర్జ్యం ఉదయమే వెళ్ళిపోయింది.

వెంకట్రామయ్య. కాని, మధ్యాహ్నం రావడమూ, రాత్రికే ప్రయాణమూనా! పిల్లని కొత్తగా కాపరానికి పంపించడ మంటే మాటలా? పోనీ, రెండు, మూడు రోజులతర్వాత వెళ్ళగూడదూ?

సత్యనారాయణ. కొత్త ఆఫీసు గదండీ?—సెలవు దొరకదు!

వెంకట్రామయ్య. ఎంత కొత్త ఆఫీసైతే మాత్రం ఆపాటి సెలవు దొరకదూ?

సత్యనారాయణ. అసలు ఈ ఒక్క రోజు సెలవు దొరకడమే గగనమైంది. ఇద్దరు, ముగ్గురు వెంట వెంటనే సెలవు పెట్టారు. రేపే మళ్ళీ డ్యూటీలో జాయిన్ కావాలని మా ఎడిటర్ గట్టిగా చెప్పాడు.

వెంకట్రామయ్య. అయితే, ఫలానానాటికి అమ్మాయిని పట్నం తీసుకువెళ్ళడానికి వస్తున్నానంటూ ముందే ఒక ఉత్తరం ముక్క రాయకపోయావూ?—ప్రయాణ సన్నాహాలన్నీ పూర్తి చేసుకునే వాళ్ళంగా!

సత్యనారాయణ. పొరపాటు సుమండీ! ఆ మాట నాకు తోచనే లేదు.

వెంకట్రామయ్య. ఎంత చదువుకుంటే మాత్రమేం? మీకు లోకానుభవం తక్కువ, నాయనా! అందువల్లే వచ్చిన మెడం లేకుండా ప్రయాణం సాగించా లంటున్నావ్. రెండు, మూడు రోజుల తర్వాత చూద్దాంలే!

సత్యనారాయణ. మళ్ళీ మొదటికి వస్తున్నారు మీరు.

వెంకట్రామయ్య [పుగాకు తునక లాల్చీ జేబులో పెట్టి, మంచంపై కూర్చుంటూ]. కన్నకడుపు - చూడు! పైగా, అది మా కడ సారి బిడ్డ. ఎన్నడూ మమ్మల్ని విడిచివుం డెరగదు. ఒకరి చేతిలో పెట్టింతర్వాత పంపించమన్నప్పుడు పంపించి తీరా లనుకో. అయితే, మన ఊరూ నాడూ కాని చెన్నపట్నంలో కాపరం. ఒక ఇరుగా, పొరుగా? నువ్వేమో పగలంతా ఆఫీసులో వుంటావ్. బిక్కుబిక్కుమంటూ ఒక్కతే అది యింట్లో వుండాలి. బెంగ పెట్టుకుంటుందేమోనని మా భయం.

సత్యనారాయణ. లేనిపోని భయాలండీ మీవి. మా ఆఫీసుదగ్గర్నే యిల్లు మాట్లాడాను. ఇరుగుపొరుగున నాలుగైదు తెలుగు కుటుంబా లున్నాయి కూడా.

వెంకట్రామయ్య. ఇల్లుకూడా మాట్లాడావ్! [నవ్వుతూ] మరి నా సమ్మతికోసం నువ్వు వేచివున్న దెక్కడ? ఏమైనా బస్తీదారి వేరు. ఒకరి సంగతి మరొకరు పట్టించుకోరు. పైగా, తొలిగా కాపరానికి వెళ్ళడం - ఏమి నిర్వాకం చేస్తుందో మా వెర్రి బాగుల్ది.

సత్యనారాయణ [లౌక్యంగా]. పోనీ, మీరూ, మా అత్తగారూ రెండు, మూడు నెల్లపాటు మాతో వుండిరాకూడదూ ?

వెంకట్రామయ్య. మాసూలు యెద్దడిలో క్షణమైనా తీరదం లేదు. ఇప్పుడు వూరు కదిలితే పొలంలో పంట పొలంలో మట్టి కావల్సిందే! లేకపోతే రావడానికేం? పోనీ, మరి రెండు, మూడు నెల్లపాటు అమ్మాయిని....

సత్యనారాయణ. ఏమో, అది ఇహ మీ యిష్టం; మీ అమ్మాయి యిష్టం.

వెంకట్రామయ్య. నా యిష్టానికేమిలే! నీ యిష్టం, దాని యిష్టం ముఖ్యం.

సత్యనారాయణ. అదేమన్న మాట ? మీరు గట్టిగా కాదంటే, మీ మాటకు మేము వ్యతిరేకంగా వెడతామా ?

వెంకట్రామయ్య. నేను గట్టిగా కాదనడం తగునా, నాయనా? మరి, అమ్మాయి ఏమంటున్నది ?

సత్యనారాయణ. నే నడగ లేదు; మీ రడిగి చూడండి.

వెంకట్రామయ్య. సరి సరి! [బిగ్గరగా] అమ్మా ! చిట్టెమ్మా !

[రాజేశ్వరి వచ్చి పడమటింటి గుమ్మంలో నిలబడుతుంది. చావడిలో జరుగుతున్న సంభాషణను చాటునుంచి వింటున్నందువల్ల సిగ్గు బిడియాలతో తల కొద్దిగా వంచుకుంటుంది.

వెంకట్రామయ్య. అమ్మా! ఇవ్వాళే ప్రయాణం చేయించమంటున్నాడు, సత్యనారాయణ. మరి, నీ యిష్ట మేమిటి ?

రాజేశ్వరి [పైట అంచును రెండు చేతులతోనూ పట్టుకుని, దాన్ని వేళ్ళకు చుట్టుకుంటూ, వంచిన తల యెత్తకుండానే]. ఏమో, మీ యిష్టం; వారి యిష్టం.

వెంకట్రామయ్య [చిరునవ్వుతూ]. మా యిష్టం మాట కేమిలే! నీ యిష్ట మేమిటో చెప్పు, తల్లీ!

[రాజేశ్వరి జవాబు చెప్పదు. సత్యనారాయణ వంక భావపూర్వకంగా చూచి, చిరునవ్వు నవ్వుతూ లోపలికి వెళ్ళిపోతుంది.

వెంకట్రామయ్య. సరే, నాయనా! మీ వుభయుల యిష్టమూ అయినతర్వాత మరి మధ్య నా అభ్యంతరం దేనికి? కాని, నీ ఉద్యోగం ఖాయమేనా?

సత్యనారాయణ. ఆఁ!

వెంకట్రామయ్య. ఏమి జీత మేర్పాటు చేశారు?

సత్యనారాయణ. అలవెన్సులతో చేరి నెలకు నూటముప్ఫై రూపాయలు.

వెంకట్రామయ్య. సరి సరి! బి. ఏ. చదివినా ఇంతేనా జీతం?

సత్యనారాయణ. తెలుగు పత్రికల్లో జీతా లంతేలెండి.

వెంకట్రామయ్య. ఏం గొడవో! వేలకువేలు చదువుకు పోస్తే చివరికి వడ్డీ డబ్బులైనా గిట్టవ్. సరేగాని ఈ కరువు కాలంలో ఈ నూటముప్ఫై రూపాయలతో మీ సంసార మెలా గడుస్తుంది?

సత్యనారాయణ. వ్యాసాలు వ్రాసి, పైన ఏమైనా సంపాయిస్తాలెండి.

వెంకట్రామయ్య. వ్యాసాని కేమాత్ర మిస్తా రేమిటి?

సత్యనారాయణ. పదిహేను రూపాయలు.

వెంకట్రామయ్య. సరి సరి! అదీ అంతంతమాత్రమే నన్నమాట!
నెల కెన్ని వ్యాసాలు రాయొచ్చు?

సత్యనారాయణ. మూడో, నాలుగో.

వెంకట్రామయ్య. మూ డనుకో! అంటే, మూడు పదిహేన్లు, నలభై అయిదు. అదొక నూటముప్ఫై, ఇదొక నలభై అయిదు, మొత్తం నూటడెబ్భై అయిదు. బస్తీ సంసారానికి ఇదైనా ఏం సరిపోతుంది?

సత్యనారాయణ. మ రేమైనాకూడా గడిస్తాలెండి.

వెంకట్రామయ్య. మ రేమైనా అంటే, ఏ విధంగా?

సత్యనారాయణ [కొంచెం చికాగ్గా]. ముందుగానే ఎలాగండీ చెప్పడం?—వీలునుబట్టి ఏదో చూసుకోవాలి కాని!

వెంకట్రామయ్య. మీకు లోకానుభవం తక్కువ, నాయనా! మంచి చెడ్డల్ని ముందుగానే విచారించుకోకపోతే, చివరికి చిక్కు పడతారు. నూటడెబ్భై అయిదు రూపాయల సంపాదనతో ఈ గడ్డు రోజులలో చెన్నపట్నం సంసార మెలా గడుస్తుంది? ఏదీ లెఖ్ఖేసి చెప్పు! ఇంటి బాడు గెంత?

సత్యనారాయణ. యాభై రూపాయలు.

వెంకట్రామయ్య. యాభై రూపాయలే! పాతిక తక్కువ రెండు వందల రూపాయల సంపాదనలో యాభై ఇంటద్దెకిందే పోతే, ఇంకేం తింటారు?

[సత్యనారాయణ చికాకు పడి, ఇంకొక సిగరెట్టు తీసి ముట్టిస్తాడు.

వెంకట్రామయ్య. ఇప్పుడేగాం, నాయనా! ఒక సిగరెట్టు కాల్చావ్, అప్పుడే ఇది రెండోది! ఈ లెఖ్ఖని రోజు కెన్ని అవుతాయ్?

సత్యనారాయణ [మరింత చికాకుగా]. ఇక్కడ మీవూళ్ళో ఉబుసు పోక ఇన్ని కాలుస్తున్నా గాని, రోజూ ఇన్ని కాలుస్తానటండీ?

వెంకట్రామయ్య, పోనీ మీ చెన్నపట్నంలో అయితే, ఎన్ని కాలుస్తా వేమిటి?

సత్యనారాయణ [ఎన్ని చెబుదామా అని కొంచెం సంకోచించి, లెక్క బాగా తగ్గించి]. రోజు కొక ప్యాకెట్ మాత్రం.

వెంకట్రామయ్య. దాని ఖరీ దెంత?

సత్యనారాయణ. పదణాలు.

వెంకట్రామయ్య [ముక్కుపై వేలువేసుకుని]. పదాణాలే! అయితే, నెలకి ఇరవై రూపాయలు సిగరెట్లకే చెల్లిపోతుంది. నెలకి యాభై రూపాయల యింటిబాడుగ, ఇరవై రూపాయల సిగరెట్లు, ఇక నూరురాళ్ళతో ఇద్ద రెలా బ్రతకడం?

సత్యనారాయణ [కోపంగా మంచంపైనుంచి చరాలున లేచి]. మీకంత యిష్టం లేకపోతే, మీ అమ్మాయిని పంపించడం మానెయ్యండి! ఈ ప్రశ్న లన్నీ దేనికి?

[అప్పుడే ముట్టించిన సిగరెట్టును గోడమూలకు విసిరి పారేస్తాడు.

వెంకట్రామయ్య [ధోరణి మార్చి]. అదికాదు, నాయనా! పెద్దవాణ్ణి, కావలసినవాణ్ణి. నేను గాకపోతే మీ యోగక్షేమాలు మ రెవరు విచారిస్తారు? నీకింత కోపం వస్తున్నప్పుడు నే నిఖ....

సత్యనారాయణ [తెప్పరిల్లి, తనుకూడా ధోరణిమార్చి]. అబ్బే! నాకు కోప మేమిటండీ ?

వెంకట్రామయ్య. సర్లే, నాయనా! ఇంతకూ మీ రిద్దరూ సుఖంగా వుండడమే నాకు కావల్సింది. పెద్ద పిల్లలు ముగ్గురూ కాపరానికి వెళ్ళేటప్పుడు అయిదేసి వేల రూపాయ లిచ్చి పంపించాం. కట్నా లనుకున్నా, కానుక లనుకున్నా, ఇంతే మే మివ్వ డివ్వగలిగింది. మాకున్నదేమో నలభై అయిదెకరాల కొంచ్ర. దానిలో పదెకరాలు హైకోర్టు వ్యాజ్యంలో వుంది. ఆ వ్యాజ్యం మన పక్షమైతే, మా తదనంతరం నలుగురు కూతుళ్ళకు తలొక....

సత్యనారాయణ. దేనికండీ ఇప్పు డీ పంపిణీలు ?

వెంకట్రామయ్య. ఈ కాలపు వాళ్ళతో కాపరంలోని కష్ట సుఖాల్ని చెప్పుకోవడం కూడా తప్పే! మే మేమి తిప్పలుపడ్డా, అది మీకోసం....[సత్యనారాయణ ఇంకొక సిగరెట్టును తియ్య బోవడాన్ని చూచి] మళ్ళీ అప్పుడే ఇంకొక సిగరెట్టా ?

సత్యనారాయణ [తప్పుచేస్తూ పట్టుపడినవానివలె ప్యాకెట్ జేబులో పెట్టివేసుకుంటూ]. ఆc! లేదులెండి.

వెంకట్రామయ్య. మానడం దేనికి? కాల్చు, నాయనా! కాల్చు. ఆరోగ్యం చెడిపోతుందేమోననే నా భయం. అన్నట్టు, మీ అత్తకు ప్రయాణం మాట తెలుసో, లేదో ?—చెప్పొస్తా !

[వెంకట్రామయ్య పడమటింటిలోకి వెడతాడు. సత్య నారాయణ విజయగర్వంతో సిగరెట్టు ముట్టించి,

గట్టిగా దమ్ములాగుతూ వుండగా, చిట్టిగారెలు, పంచదార, నేతిగిన్నె పుచ్చుకుని రాజేశ్వరి వస్తుంది.

రాజేశ్వరి. ఫలహారం తెస్తుంటే ఇంతలోనే మళ్ళీ సిగరెట్టు ముట్టించా రేమండీ ?

సత్యనారాయణ. చూశావ్ ! నాటక మెంత రక్తిగా నడిపించానో!

రాజేశ్వరి. ఏమైం దప్పుడే ? ఇంకా మొదటి అంకంలోనే వున్నారుగా !

సత్యనారాయణ. భరతవాక్యంవరకు ఇంత రక్తిగానూ మనం నడిపించగలంలే !

రాజేశ్వరి [నవ్వుతూ ఫలహారాన్ని మంచంపై పెట్టి]. నవ్వులాటలకేమిగాని, నా కెందుకో భయంగా వుందండీ !

సత్యనారాయణ. పిచ్చిదానా ! భయం దేనికి ?

రాజేశ్వరి [భర్త సరసను కూర్చుంటూ]. మీ కుద్యోగం పోయిన సంగతి మా నాన్నకు తెలిస్తేనో ?

సత్యనారాయణ. అందుకనేగా ఇవ్వాళ రాత్రికే ప్రయాణమని పథకం వేసింది. చీకటి పడకముందే ఉడాయిస్తాం; తెల్లవారేసరికి మూడువందల మైళ్ళ దూరాన వుంటాం.

రాజేశ్వరి, అయినా, నాకేమో భయం....

సత్యనారాయణ [కాస్త చికాకుగా]. ఏమిటి అర్థంలేని భయం !

రాజేశ్వరి. తర్వాతనైనా మా నాన్నకి మీ కుద్యోగం పోయినమాట తెలిస్తే, ఏమంత బాగుంటుంది ?—మీరే చెప్పండి ! ఆయన కానివాడు గనకనా? దాపరికం లేకుండా వున్నమాట చెప్పి....

సత్యనారాయణ. మహ మంచిమాట చెప్పావులే!—నా కుద్యోగం పోయినమాట తెలిస్తే మీ నాన్న నిన్ను మద్రాస్ పంపుతాడనే?

రాజేశ్వరి. పంప కేం చేస్తాడేమిటి? ఎల్లకాలం యింట్లో పెట్టుకు కూచుంటాడా?

సత్యనారాయణ. అయితే, నువ్వనే దేమిటి? "నా కుద్యోగం లేదు, సద్యోగం లేదు. నా పెళ్ళాన్ని పెట్టుకుని మద్రాసులో వూరేగాలనుకొంటున్నా. తే తేవయ్యా! డబ్బు తే!" అని అడగమనేనా?

రాజేశ్వరి. చాల్లెద్దురూ! ఒక్క మనకే యిస్తున్నా డేమిటి? తక్కిన తన ముగ్గురు కూతుళ్ళ కిచ్చుకోలా?

సత్యనారాయణ. నువ్వు వెయ్యి చెప్పు; లక్ష చెప్పు. డబ్బివ్వ మంటూ ఆయన్ని నా నోటితో నే నడగను. ఆయనకు లోకువ కావడం నా కిష్టం లేదు.

రాజేశ్వరి. అబ్బో! ఎంత బెట్టుసరండీ!

సత్యనారాయణ. కాక? కాలు చచ్చి వున్నా మనుకున్నావా?

రాజేశ్వరి. ఇస్తే పుచ్చుకుంటారట గాని, యివ్వమనడం లోకువట! ఏం చోద్య మండీ? పోనీ, మీ రడగడం దేనికి? నే నడుగుతా!

సత్యనారాయణ. చాల్లే! నా పరువు తియ్యకు! "ఉద్యోగం ఖాయ మేనా? జీత మెంత? అదేం సరిపోతుంది? ఎన్ని సిగరెట్లు కాలుస్తావ్? ఎంత కాఫీ తాగుతావ్? ఎన్ని సినిమాలు చూస్తావ్?"—ఈ లాయర్ ప్రశ్నలన్నీ అయ్యాక, ఉద్యోగం పోయిందని చెబుతావుగా! ఇహ నే నేమైనా తలెత్తుకు తిరగాలా!

రాజేశ్వరి. ఏమిండీ! ఆయనేమో పరాయివాడన్నట్టు....

[వెంకట్రామయ్య పడమటింటిలోనుంచి వస్తూ తన రాకను సూచించడానికి పొడిదగ్గు దగ్గుతాడు. మాట సగంలో మింగివేసి, మంచంపై నుంచి రాజేశ్వరి దిగ్గున లేస్తుంది.

వెంకట్రామయ్య [చావడిలోకి వచ్చి]. చిట్టెమ్మా! చింతా లెక్కడమ్మా?

రాజేశ్వరి. గొడ్ల చావిడిలో వున్నట్టున్నాడు, నాన్నా!

వెంకట్రామయ్య. వెళ్ళి, కాస్త పిలు వమ్మా!

[రాజేశ్వరి పెరటి గుమ్మంగుండా వెడుతుంది.

వెంకట్రామయ్య [సిగరెట్టు కాల్చుతున్న సత్యనారాయణను చూచి, తల పంకిస్తూ]. ముందు ఫలహారం పుచ్చుకో, నాయనా!

[కాల్చుతున్న సిగరెట్టును చప్పున నోట్లోనుంచి తీసి, దాన్ని కాస్త వెనగ్గా పెట్టి, సత్యనారాయణ ఫలహారం చెయ్యడం ప్రారంభిస్తాడు.

వెంకట్రామయ్య [రెండవ నవారు మంచాన్ని వాల్చుకుని దానిపై కూర్చుంటూ]. ఇంత తొందర ప్రయాణ మేమిటని మీ అత్త చాలా నొచ్చుకుంటున్నది. కడసారి కూతురు - దానికైనా అచ్చట్లూ, ముచ్చట్లూ తీరొద్దూ? కాని, "వాళ్లుభయులూ ప్రయాణానికి ఉబలాట పడుతూ వుంటే, మనకు దేనికే?" అని సర్ది చెప్పాం! మేము పాతకాలపువాళ్ళం, మాకు....

చింతాలు [పెరటి గుమ్మంగుండా వచ్చి]. ఏమయ్యగోరూ!

వెంకట్రామయ్య. చూడు, చింతాలూ! మన చిట్టెమ్మ కాపరానికి వెడుతున్నది. మరి నువ్వు....

చింతాలు. ఎప్పు డయ్యగోరూ?

వెంకట్రామయ్య. ఇవ్వాళ రాత్రి బండికేరా!

చింతాలు. అదేమి టయ్యగోరూ! అంత యవదానం లేకుండానే!

వెంకట్రామయ్య. ఔనురా! ఈ కాలపువాళ్ళు మన మాటల్ని వింటారా. పెడతారా? సరిగాని....

[ఇంతలో చావడిలోకి వచ్చిన రాజేశ్వరిని చూచి వెంకట్రామయ్య మాటకు చింతాలు అడ్డువస్తాడు.

చింతాలు. సిట్టెమ్మగోరూ! మీ రెల్లిపోతే, మే మేం గావాలమ్మా?

రాజేశ్వరి [చిరునవ్వుతూ]. అదేమిటి, చింతాలూ! మిమ్ముల నందర్నీ నేనే పోషిస్తున్నా నేమిటి?

చింతాలు. అది కా దమ్మగోరూ! మీ రెల్లిపోత్తే, యిల్లు సిన్న బోదూ? మీరు కంటి కాపడకపోతే. మన సిన్నావు....

రాజేశ్వరి. ఔను, నాన్నా! మన చిన్నావు....

సత్యనారాయణ. చిన్నా వేమిటి?

చింతాలు. సిట్టెమ్మగోరు కంటి కాపడకపోత్తే, సిన్నావు నీలూ మేతా ముట్టుకుంటుందనే? దాని పాణాలన్నీ ఆ తల్లిమీదే.

సత్యనారాయణ. అయితే, నువ్వు ఆ ఆవును మావెంట పట్నంతోలుకు రావోయ్.

చింతాలు. సత్తెం, బాబూ! తోలుకు రానా?

వెంకట్రామయ్య. పిచ్చి వెధవ్వి! ఆయన నవ్వులాట కంటున్నాడు.

చింతాలు. అదేటో అయ్యగోరూ! నా కేమీ తోసడం లేదు. సిట్టెమ్మగోరు లచ్చిలా తిరుగుతూ వుంటే యిల్లూ వాకిలీ కళకళలాడుడూ వుంటుంది. ఆమెగోరు ఎల్లిపోతే అంతా బావురుమందండీ?

వెంకట్రామయ్య. నిజమేరా! కాని, తప్పుతుందా? సరిగాని, తొందర ప్రయాణం. లక్ష పను లున్నాయ్. నువ్వెళ్ళి, మీ అమ్మగారు చెప్పినట్టు, బియ్యం, పప్పులూ సంచుల కెత్తి, మూతులు కుట్టు; కారం, పసుపు వగైరాలన్నీ గుడ్డ మూటలు కట్టు. అటకమీదినుంచి అమ్మాయి పెళ్ళినాడు చదివించిన సామానంతా కిందికి దించు. కుర్చీపీటలు, భోజనం పీటలు వగైరా కొయ్యసామాన్లు ఆ మూల గదిలో వున్నాయ్. వాటిని బయట పెట్టించి, దుమ్మూ, దుట్రా దులిపి....

సత్యనారాయణ. ఇప్పు డెందుకండీ మా కీ సామానులన్నీ?

వెంకట్రామయ్య. ఏం! మీ బస్తీ కాపరానికి మా పల్లెటూరి సామాను లేవీ పనికి రావేమిటి?

సత్యనారాయణ. అద్దెకు పుచ్చుకున్నది చాలా చిన్న యిల్లు. దానిలో ఈ సరంజామంతా....

[మాట పూర్తి కాకుండానే ఆపివేస్తాడు.

చింతాలు. లంకంత యిల్లు—ఇదే మా సిట్టెమ్మగారికి సాలడం లేదు. ఆ కూస్తి యింటికి మా బుల్లి దొరసాని న్నెట్టా తీసి కెడతావ్, బాబయ్యా!

వెంకట్రామయ్య. కాస్త యిల్లో, కూస్త యిల్లో! అద్దె కొంపైనా అది వాళ్ళది; ఇది కాదు!

రాజేశ్వరి. ఊఁ! చాల్లే నాన్నా.

వెంకట్రామయ్య. సర్లేరా! చింతాలూ! మన బసివిగాణ్ణి పంపి, బండి భీమన్నని పెందరాళే పిలిపించు. స్టేషన్‌దాకా సామాన్లు తీసుకు వెళ్ళడానికి మన బండీ కావాలి. జల్లి వేసి, మన వెంకాయిని ఒక బండి సిద్ధంగా వుంచమను. పనులన్నీ త్వరగా తెమలాలి సుమీ!

చింతాలు [నీరసంగా]. సరే, అయ్యగోరూ!

[పోబోతాడు.

వెంకట్రామయ్య. ఆఁ! అన్నట్టు, మొన్న వాళ్ళపిల్ల అన్నప్రాశనానికి సుబ్బక్కగా రబ్బాయి - నాగేశ్వరరావ్ - మన వెండి సామాను పట్టుకుపోయాడు గాని, దాన్ని తిరిగి పంపించమన్నానని చెప్పిరా! నువ్వు చములు కాళ్లవాడి వని నాకు తెలుసుగాని, తేమాణం చెయ్యకు!

చింతాలు. ఏమో, అయ్యగోరూ! నాకు కాళ్ళూ సేతులూ ఆడ్డం లేదు.

[వెడతాడు.

వెంకట్రామయ్య. నిజమే! ఇక యిల్లంతా బావురు మంటుంది. [సత్యనారాయణకు వెక్కిళ్ళు వస్తాయి. అంతట వెంకట్రామయ్య కుమార్తె నుద్దేశించి] మంచినీళ్ళు పెట్టలేదేమి, తల్లీ?

రాజేశ్వరి. మర్చిపోయా, నాన్నా! ఇదుగో, చిటికలో తెస్తా!

[చకచక పడమటింటిలోకి వెడుతుంది.

వెంకట్రామయ్య. పెర్రిబాగుల్ది! ప్రయాణం సంతోషంలో దానికి పనే తోచడంలేదు. కంటాం; పెంచుతాం; ప్రాణాలన్నీ వాళ్ళ మీదే పెట్టుకుంటాం. అయినా, వయస్సొచ్చేసరికి రెక్కలు కట్టుకు యెగిరిపోతారు. మాకు మిగిలేది వొఠ్ఠిగూడు. ఆడ పిల్లల్ని కన్నవారి బ్రతు కింతే!

[రాజేశ్వరి మంచినీళ్ళతో, కాఫీతో తిరిగి వస్తుంది.

వెంకట్రామయ్య [కొత్తగా ఏదో జ్ఞాపకానికి వచ్చినట్టు]. చింతాలూ!

చింతాలు [లోపలినుంచే]. వొచ్చే, అయ్యగోరూ! వొచ్చే!

వెంకట్రామయ్య [రాజేశ్వరితో]. వెళ్ళమ్మా, వెళ్ళు! నువ్వుకూడా కాస్త పలహారం చేసిరా.

రాజేశ్వరి. నువ్వుకూడా రా, నాన్నా!

వెంకట్రామయ్య. నే నొస్తాలే - నువ్వు వెళ్ళు తల్లీ! ఇక మా బ్రతుకు దేనికి? తిండికేగా?

| | | |
|---|---|---|
| రాజేశ్వరి. | ఒకేసారిగా | ఏం మాట లవి, నాన్నా! |
| సత్యనారాయణ. | | ఏమి టండీ అది! |

వెంకట్రామయ్య. పసివాళ్లు - మా కడుపు తీపి మీకేం తెలుస్తుంది? సర్లే, తల్లీ! నువ్వు వెళ్లు.

[రాజేశ్వరి పడమటింటిలోకి వెడుతుంది.

చింతాలు [పడమటింటి గుమ్మంగుండా వచ్చి]. ఏమయ్యాగోరూ?

వెంకట్రామయ్య. అరే! చూడు! అటొక అడుగేసి, కొట్టప్పయ్యను ధోవతులు, ఉత్తరీయాలు, చీరలు - మొదటి రకం సరుకు చూచి - మనింటికి పది, పదిహేను జతలు పంపించ మను. కావల్సినవాటి నుంచుకుని, మిగతావి వాపసుచేస్తామని చెప్పేం! వెళ్ళు - ముందు ఆ పని చూడు!

చింతాలు. సరే నయ్యాగోరూ!

[సింహద్వారంగుండా వెడతాడు.

వెంకట్రామయ్య. కాస్త ఉత్తరం ముక్కైనా రాశావుకాదు; అన్ని యేర్పాట్లూ ముందుగా చేసుకునే వాళ్ళం. [సత్యనారాయణ జవాబు చెప్పడు] ఏమో, నాయనా! అంతా హడావుడి ప్రయాణమైపోతున్నది.

రాజేశ్వరి [పడమటింటిలోనుంచి వచ్చి]. నాన్నా! నిన్నొకసారి అమ్మ రమ్మంటున్నది.

వెంకట్రామయ్య. దేని కిప్పుడు?

రాజేశ్వరి. పచ్చళ్ళు పెట్టడానికి జాడీలు చాలలేదట. పెదనాన్నగారింటినుంచి రెండింటిని తెప్పించాలట.

వెంకట్రామయ్య. అలాగే, తల్లీ!

సత్యనారాయణ. ఇంత దూరాభారం-ఎందుకండీ ఇప్పుడు పచ్చళ్లు, గిచ్చళ్లు?

రాజేశ్వరి. నేనూ ఆమాటే అంటూ వుంటే వినడం లేదండీ!

వెంకట్రామయ్య. వెఱ్ఱిబాగులవాళ్ళు! మీ రిద్దరు ఏమి నిర్వాకం చేస్తారో గదా!

సత్యనారాయణ. } ఒకేసారిగా { మీదంతా వింత!
రాజేశ్వరి. } ఒకేసారిగా { చాల్లే, నాన్నా!

వెంకట్రామయ్య [దైన్యంగా చిరునవ్వు నవ్వుతూ]. నలుగురు బిడ్డల్ని యెత్తితే మీకూ తెలిసొస్తుంది లెండి....మరి, నే వెళ్ళి, పెద్దవాడు - మా అన్నగారితో ప్రయాణంమాట చెప్పి, ఆయన్ని తోడుకొస్తా. అలాగే జాడీలుకూడా పట్టించుకొస్తాలేఁ! తల్లీ! నువ్వు జాగుచెయ్యక మరి చప్పున ప్రయాణం కాఁ!

[సింహద్వారంగుండా వెడతాడు.

రాజేశ్వరి. ఏమోనండి - నా కెంతో భయంగా వుంది.

సత్యనారాయణ. మీ నాన్న కట్టి పంపుతున్న ఈ సామానంతా ఎక్కడ పెట్టుకోగలమనేనా?

రాజేశ్వరి. ఆ! అంతా మీకు హాస్యమే!

సత్యనారాయణ. [వెంకట్రామయ్య గొంతుతో] సరి సరి! [తన మామూలు గొంతుతో] నే నింత నాటకం నడిపించిన తర్వాత వెనక్కితీసి భంగపాటు చెయ్యవుగదా?

రాజేశ్వరి. అబ్బ! వస్తాలెండి. కాని....

సత్యనారాయణ. కానీ, అర్థణా - ఏమి టది?

రాజేశ్వరి. మా అమ్మ, మా నాన్న....

సత్యనారాయణ. మంచిది! వాళ్ళనే అంటి పెట్టుకుండు. నా దారిని నే పోతా.

రాజేశ్వరి. అబ్బ! అది కాదండీ!

సత్యనారాయణ. అయితే, మరి చిన్నావుమాటా?

రాజేశ్వరి. చాల్లెద్దురూ! నేను రానూ లేను; ఉండనూ లేను. మీకేం తెలుస్తుంది నా బాధ?

సత్యనారాయణ. ఏడ్చినట్టే వుంది!

[“చిట్టెమ్మా” అని పిలుస్తూ, సింహద్వారంగుండా వెంకట్రామయ్య తిరిగి ప్రవేశిస్తాడు.

రాజేశ్వరి. ఏఁ నాన్నా! వెళ్ళలా?

వెంకట్రామయ్య. లేదమ్మా! అడుగు పడనేలేదు. మన వాకిట్లోనే సుబ్బక్కగారి చిన్నాడు, వా డెదురు పడితే, వాడికి చెప్పి పంపించా.

[వీధిలోనుంచి “సత్యనారాయణా!” అని పిలుపు.

వెంకట్రామయ్య. ఎవరది?

రాజేశ్వరి. నాగేశ్వరరావు బావయ్యలా వున్నాడు.

[ఫలహారం పాత్రల్ని తీసుకుని రాజేశ్వరి లోపలికి వెళ్ళిపోతుంది.

నాగేశ్వరరావు [చావడిలోకి వస్తూ]. ఏం, సత్యనారాయణా! ఎప్పుడు రావడం?

సత్యనారాయణ. ఇంతకుముందే.

వెంకట్రామయ్య. కూర్చోరా, అబ్బాయ్, కూర్చో!

నాగేశ్వరరావు [సత్యనారాయణ కూర్చునివున్న మంచంపైనే కూర్చుంటూ]. ఏమిటీ చెన్నపట్నం విశేషాలు?

సత్యనారాయణ. ఆఁ, విశేషాల కేమున్నవి ?

నాగేశ్వరరావు. ఏమిటీ అవ్వవధి ప్రయాణం ? చిట్టెమ్మను తీసుకుని ఇవ్వాళ రాత్రికే తిరిగి వెడుతున్నావట !

వెంకట్రామయ్య. నేనూ ఆ మాటే ఎంతో దూరం చెప్పి చూశారా. కాని, వెళ్ళితీరా లంటున్నాడు !

సత్యనారాయణ. వెళ్ళాలి, మరి !....కొత్త ఆఫీసుగదూ ! సెలవు దొరకదు.

నాగేశ్వరరావు. సెలవు దొరక్కపోవడ మేమిటి ? అప్పుడే మీ పత్రికను....

సత్యనారాయణ [మాటకు చటుక్కున అడ్డంవచ్చి]. మీ తమ్ముడు ఇప్పుడు బి. ఏ. జూనియరా ? సీనియరా ?

నాగేశ్వరరావు. అబ్బే ! వాడింకా ఇంటరైనా ప్యాస్‌కాలేదు.

సత్యనారాయణ. అన్నట్టు, ఇంకొకపార్టు మిగిలిపోయింది కాబోలు !

నాగేశ్వరరావు. పార్టూ లేదు; గీర్టూ లేదు. చదువూ, సంధ్యా లేకుండా అడ్డగాడిదలా ఊరుపట్టుకు తిరిగాడేమో సెలెక్షన్ లోనే డిటెయిన్ చేశారు, వాడి మాటకేమి కాని....

సత్యనారాయణ. మాసూలు పూర్తిచేశావా ?

నాగేశ్వరరావు. వ్యవసాయ మెత్తివేసి, పొలమంతా మూడేళ్ళ నాడే కట్టుబడి కిచ్చేశాగాఁ !

సత్యనారాయణ, కట్టుబడి కివ్వడం దేనికి? సొంత వ్యవసాయం గిట్టుబాటు కావడం లేదా ?

నాగేశ్వరరావు [ఈ ప్రశ్నను వినిపించుకోకుండానే]. చూడు! నీకు సెలవు....

సత్యనారాయణ. అయితే, ఈమధ్య మీ అమ్మాయికి అన్నప్రాశన చేశావటగాఁ - నన్ను పిలవలేదేఁ?

నాగేశ్వరరావు. పిలవలేదన్న నెపమేగాని, పిలిస్తే నువ్వు వచ్చే వాడివి గనకనా? ఇంతకూ మీ....

సత్యనారాయణ. ఊళ్ళోకి వచ్చికూడా మాయింటివైపు తొంగైనా చూశాడు కాదని మీ అమ్మ నెపం వేస్తుందేమో! మీ యింటికి వెళ్ళొద్దాం—పద!

నాగేశ్వరరావు. మా అమ్మ ఊళ్ళో లేదు.

సత్యనారాయణ. పోనీ, మీ పిల్లల్ని చూద్దాం.

నాగేశ్వరరావు. వాళ్ళూ నాయనమ్మ వెంట వూ రెళ్ళారు.

సత్యనారాయణ. అయితే, మీ ఆవిడను పలకరించి వస్తా—రా! పోదాం.

నాగేశ్వరరావు. కొత్త చుట్టరికమని ఆవిడ నీకు చాటు వెడు తుందిగా?

సత్యనారాయణ. ఇంతకీ మీ యింటికి రావద్దంటావ్! మంచి మర్యాదస్థుడివే! సర్లే—రా! [చెయ్యి పట్టుకుని నాగేశ్వరరావును లేవదీస్తాడు. అతడు తిరిగి మాట్లాడరాదనే ఆతురతకొద్దీ] ఆఁ! అన్నట్టు, నువ్వు మద్రాస్ చూడ్డానికి వస్తానని వచ్చావే కాదేఁ? చాలాకాలంగా ఇదుగో, అదుగో అనడమే తప్ప....

వెంకట్రామయ్య [ఈసరికి సింహద్వారాన్ని చేరిన సత్యనారా యణవంక ఆశ్చర్యంగా చూస్తూ]. పైపంచె మర్చిపోయావ్. వేసుకెళ్ళు, నాయనా!

సత్యనారాయణ [వీపుపై కంచీదెబ్బ పడ్డట్టు వెనక్కి తిరిగి]. దేనికి లెండి - ఈ అడుగు దూరంకోసం!

వెంకట్రామయ్య. అడుగైనా, ఆమడైనా పైపంచె లేకుండా వీధి లోకి వెళ్ళడం మంచిది కాదు.

సత్యనారాయణ. సరిలెండి. [చక చక ఉత్తరీయాన్ని తీసి, పైన వేసుకుని, రెండడుగులలో నాగేశ్వరరావును కలుసుకుని] ఆఁ! ఇప్పుడు వడ్ల ధర ఎలా వుంది? బస్తాకు పదహారు, పదిహేడు రూపాయలైనా పలుకుతున్నదా? అంతమాత్రమైనా లేక పోతే....

[గుక్క తిప్పుకోకుండా మాట్లాడుతూనే నాగేశ్వర రావును వీధిలోకి ఈడ్చుకుపోతాడు. సత్యనారా యణ వైఖరి కొంత అనుమానాన్ని కలిగించగా, లాల్చీ జేబులోంచి పుగాకు తీసి, చుట్ట చుట్టు కుంటూ వెంకట్రామయ్య ఒక మంచంపై కూర్చుం టాడు.

బండి భీమన్న [వీధిలోనుంచి]. బాబయ్యా!

వెంకట్రామయ్య. ఎవర్రా అది?

బండి భీమన్న [చావడిలోకి వస్తూ]. నేనే బాబయ్యా! బండి బీమన్నని.

వెంకట్రామయ్య. బండి కట్టుకొచ్చావట్రా?

బండి భీమన్న. లేదు బాబయ్యా!

వెంకట్రామయ్య. ఏఁ?

బండి భీమన్న. ఏం లేదు, బాబయ్యా! మరిగత్తే, బండి బేగి తోలుకు రమ్మని బసివిగా దొచ్చాడు. మరి నే నేమో పట్నం

బాబయ్యగార్ని మద్దాన్న మడిగితే ఎల్లుండి పొద్దున్నే మెయిల్ బండికి రమ్మన్నారండీ.

వెంకట్రామయ్య [అప్పటివరకు రెండు మోకాళ్ళపై రెండు మోచేతుల్ని ఆన్చి ముందుకు వంగి, తల వంచుకుని, చుట్ట చుట్టుకుంటూ వున్నవాడు చప్పున నిటారుగా కూర్చుని, సగం చుట్టిన చుట్టను లాల్చీజేబులో కుక్కి, బండి భీమన్నను గుచ్చి చూస్తూ]. వెధవ! నువ్వు తిన్నగా వినలేదు కాబోలు!

బండి భీమన్న. అయ్యో బాబయ్యా! తిన్నగా యినకే(! సిట్టెమ్మ గోరు ఎల్లుండి ఈల్లేదంటే, ఆ అయ్యగోరు ఎల్లి తీరాలని తెగేసి సెప్పారు బాబయ్యా!

వెంకట్రామయ్య. నిజమట్రా?

బండి భీమన్న. ఏ వొట్టుపెడితే ఆ వొట్టు, బాబయ్యా!

వెంకట్రామయ్య [తల పంకిస్తూ]. సరి సరి!

బండి భీమన్న. మరి బండెప్పుడు కావాలి, బాబయ్యా!

వెంకట్రామయ్య [ఇంకా తల పంకిస్తూ]. సరి సరి!

రాజేశ్వరి [వడమటింటిలోనుంచి వచ్చి]. ఏం, భీమన్నా! బండి తోలుకొచ్చావా?

బండి భీమన్న. ఇప్పుడే కావాలా అమ్మా!

రాజేశ్వరి. మరి కాసేపటికే మా ప్రయాణం.

బండి భీమన్న. అయితే, సిటికలో తోలుకొస్తా.

వెంకట్రామయ్య. సర్లే! భీమన్నా! నువ్వెళ్ళు.

బండి భీమన్న. సిత్తం, బాబయ్యా! సిత్తం!

[వెడతాడు.

రాజేశ్వరి. నాన్నా ! ఆయ నేరీ ?

వెంకట్రామయ్య. మన నాగేశ్వరరావుగా రింటికి వెళ్ళా డమ్మా ! ఇప్పుడే తిరిగొస్తా నన్నాడు గాని, సత్యనారాయణ తన ఉద్యోగం సంగతులు నీకేమైనా చెప్పాడా ?

రాజేశ్వరి [తెల్లబోయి, దాన్ని కప్పిపుచ్చుకోడానికి ప్రయత్న పూర్వకంగా]. లేదు, నాన్నా! ఏమీ అనలేదే! ఎందుకు?

వెంకట్రామయ్య. ఆఁ ! ఏం లేదమ్మా !

రాజేశ్వరి [ఒకవేళ రహస్యం తెలుసుకున్నాడేమో కనిపెట్టాలని]. నువ్వు ఉత్తినే అడగవు, నాన్నా! ఏమిటీ సంగతి ?

వెంకట్రామయ్య. అబ్బే! ఏం లేదు, తల్లీ! [ఇంతలో సత్యనారాయణ తిరిగి వస్తాడు] ఏం, నాయనా! అప్పుడే తిరిగొచ్చావ్?

సత్యనారాయణ. ప్రయాణానికి వ్యవధి లేదుగదండీ !

వెంకట్రామయ్య. ఆ మాటా నిజమే ! మరి నే వెళ్ళి, పైకాని కేర్పాటు చేసొస్తా.

సత్యనారాయణ [అలక్ష్యాన్ని నటిస్తూ]. ఏమో, మీ యిష్ట మది.

వెంకట్రామయ్య [చిరునవ్వుతో]. సరి సరి !

[వెడతాడు.

సత్యనారాయణ [మంచంపై చతికిలబడుతూ]. అమ్మయ్య! వాణ్ణి వొదిలించుకునేసరికి తాతలు దిగొచ్చారు.

రాజేశ్వరి. ఎవరండీ అది ?

సత్యనారాయణ. వాడే, ఆ పీనుగ, మీ నాగేశ్వరరావు.

రాజేశ్వరి. ఏం చేశాడండీ ?

సత్యనారాయణ. మా పత్రిక కట్టివేసినమాట వా డెక్కడో ఇవ్వాళే చూచాయగా విన్నాడు. ఆ మాటని కాస్తా మీ నాన్న ముందు....

రాజేశ్వరి. కొంపతీసి అనెయ్యలేదు గదా ?

సత్యనారాయణ. లేదులే ! కాని, అనకుండా వాణ్ణి పట్టుకునేసరికి బ్రహ్మప్రళయమైంది. తనదంతా మునిగిపోతున్నట్టు దేభ్యంలా సరిగా ఇప్పుడే వా డిక్కడికి తయారయ్యాడు !

రాజేశ్వరి. అత నెప్పుడూ అంతేనండీ ! ఒకరి పచ్చనచూచి వోర్వలేడు. కాని, మా నాన్నకు కొంచెం అనుమానం తగిలి నట్టున్నదే !

సత్యనారాయణ. నిజం ! ఏమన్నా డేమిటి ?

రాజేశ్వరి. మీ ఉద్యోగం సంగతులు మీరు నాకేమైనా చెప్పారా అని అడిగాడు.

సత్యనారాయణ. అడిగితే ?

రాజేశ్వరి. "నా కేమీ చెప్పలేదు నాన్నా !" అని చూస్తూ చూస్తూ పచ్చి అబద్ధ మాడాను.

సత్యనారాయణ. అయ్యో పాపం ! నీ కెంత ముప్పు వచ్చింది !

రాజేశ్వరి. మీకేం ? మీ కలాగే వుంటుంది. నానోట అబద్ధం రాదని అందరితో చెప్పుకుని మా నాన్న ఎంత మురుస్తాడో మీ కేం తెలుసు ?

సత్యనారాయణ. ఓహోహో ! సత్య హరిశ్చంద్రుడటు; తమ రిటు.

రాజేశ్వరి. సంతోషించాం - చాల్లెద్దురూ !

సత్యనారాయణ. అయితే, మీనాన్న మరేమైనా అడిగాడా ?

రాజేశ్వరి. ఉహుఁ! ఆయన మళ్ళీ మాట్లాడే లేదు. నేనే "ఏమిటి సంగతి నాన్నా?" అని గుచ్చిగుచ్చి అడిగినా, "అబ్బే! ఏం లేదమ్మా! ఊరికేనే" అని చప్పరించేశాడు.

సత్యనారాయణ. అయితే, ఏమీ ఫరవా లేదులే! పైగా, పైకం కోసం వెళ్ళాడుకూడాగా!

రాజేశ్వరి. అయినా, ఏమోనండీ! నాకు బెదురుగా వుంది, మన ప్రయాణానికి ఆటంక మేమీ కలగదుగదా?

సత్యనారాయణ. కలిగితే మంచిదే! రావాలని నీకు ఎలాగూ లేదయ్యే!

రాజేశ్వరి. అదేమన్న మాటండీ!

సత్యనారాయణ. ఏం మాటో? - ను వ్వన్నదేగా!

రాజేశ్వరి. చాల్లెద్దురూ! నే ననకేఁ! ఇంతకూ మా నాన్నకి నిజం తెలిసిందంటారా?

సత్యనారాయణ. అబ్బే! లేదు. నేను ఆ నాగేశ్వరరావు నోరు కట్టేశా! మా పత్రిక ఆగిపోలేదని వాడికి నచ్చ జెప్పా! నాటకం నడిపించడంలో ఎవరైనా మనతర్వాతే!

రాజేశ్వరి. మా నాన్న సంగతి మీకు తెలియదండీ! ఆయన అసాధ్యుడు. ఆవలిస్తే పేగులు లెఖ్ఖెడతాడు.

సత్యనారాయణ. మీ నాన్నకంటె నేను రెండాకు లెక్కువే చదివానంటావా?

రాజేశ్వరి. మీరు ఎంత బి. ఎ. చదివినా, తెలివికి మా నాన్న తర్వాతే!

సత్యనారాయణ [వెంకట్రామయ్య గొంతుపెట్టి]. సరి సరి!

రాజేశ్వరి. వెక్కిరింతకూడా దేనికిలెండి? ఇప్పుడు కాకపోతే, మరొక్కప్పుడైనా మీకే తెలిసి రాకపోతుందీ?

సత్యనారాయణ [దర్పంగా]. ఓహోహో!

రాజేశ్వరి. సర్లెండి! మరి నే వెళ్ళి పెట్టె బేడా సర్దుకోనా?

సత్యనారాయణ. నన్ను సాయం రమ్మంటావా?

రాజేశ్వరి. అడ్డం రాకుండా వుంటే సాయం వచ్చినంత ఫలం!

సత్యనారాయణ [తిరిగి వెంకట్రామయ్య గొంతుతో]. సరి సరి!

రాజేశ్వరి. నాటకాల్లో వేషాలకు బాగానే పనికొస్తారు.

[నవ్వు ముఖంతో రాజేశ్వరి పడక గదిలోకి వెడుతుంది. ఇంతలో "అరె వాడి తస్సా చెక్కా!" అంటూ వెంకట్రామయ్య వీధి గుమ్మంగుండా చావడిలోకి వస్తాడు. ఆశ్చర్యంగా సత్యనారాయణ అతని వంక చూస్తాడు.

రాజేశ్వరి [పడకగదిలోనుంచి తిరిగివచ్చి]. ఏమిటి, నాన్నా?

వెంకట్రామయ్య. ఆ షావుకారు రత్తయ్య-చూడమ్మా! ఇప్పుడు తనదగ్గిర చిల్లి గవ్వయినా లేదంటున్నాడు. ఎప్పు డడిగితే అప్పు డిస్తాడుగదా అని పాత పంటమ్మిన దస్తంతా వాడి దగ్గిర పెడితే - అయ్యయ్యయ్యయ్యో!-ఎంత పని చేశాడు?

రాజేశ్వరి [ఆశాభంగంతో]. నిజం?

వెంకట్రామయ్య. ఔను, తల్లీ!

రాజేశ్వరి [తెలివితక్కువగా]. అయితే, మా ప్రయాణం?

వెంకట్రామయ్య. దాని కేమమ్మా? మీరు వెళ్ళండి. వెనకా ముందుగా నే పంపిస్తాగా!

రాజేశ్వరి. అది కాదు, నాన్నా! మరి....

[సత్యనారాయణ చూపులతో వారిస్తాడు. రాజేశ్వరి మాట మధ్యలో ఆగిపోతుంది.

వెంకట్రామయ్య. ఏమి టమ్మా అది ?

[జవాబు చెప్పకుండానే నీళ్లు కారుతూ రాజేశ్వరి పడక గదిలోకి వెళ్ళిపోతుంది.

సత్యనారాయణ. దాని కేం లెండి. మీ కెప్పుడు వీలైతే అప్పుడే పంపించొచ్చు, కాని....కాని....

వెంకట్రామయ్య, ఏమి టది, నాయనా ?

సత్యనారాయణ. "ఇంత అవ్యవధిగా ఈ ప్రయాణం చేయించడం తగునా?" అని మళ్ళీ నాకే సందేహం తోస్తున్నదండీ !

వెంకట్రామయ్య. దాని కేమిలే, నాయనా! పిలుచుకెళ్లాలని నువ్వు, వెంటరావాలని మా అమ్మాయి ఉబలాట పడుతున్నారుగా !

సత్యనారాయణ. అయినా, చూడండి! అచ్చట్లు ముచ్చట్లు తీర లేదని మా అత్తగారు అనుకుంటారయ్యో. ఆమె మనస్సునైనా నొప్పించడం భావ్యమా అని....

వెంకట్రామయ్య. కూతుళ్ళను కన్నతల్లికి ఆవిషయంలో సంతృప్తి ఎక్కడికిలే !

సత్యనారాయణ. ఇంత హఠాత్తుగా మిమ్మల్ని విడిచిపెట్టడమంటే రాజేశ్వరికీ కష్టంగానే వుంది. పోనీ మరొక నెల తర్వాత తీరుబాటుగానే....

వెంకట్రామయ్య. ఏమైనా, అయినప్రయాణాన్ని ఆపడం మంచిది కాదు, నాయనా !

సత్యనారాయణ [ఉడుకుబోతుతనంతో]. బయల్దేరాలని అను కున్నామే తప్ప, ఇంకా బయల్దేరలేదు గదండీ!

వెంకట్రామయ్య. మంచిది, నాయనా! మాదేమున్నది? నీ యిష్టం; దాని యిష్టం.

[ముఖాన్ని తిప్పుకుని, ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వెనకటింటిలోకి వెడతాడు. రాజేశ్వరి గదిలో నుంచి తిరిగి వస్తుంది. ప్రయాణం ఆగిపోయినందుకు విచారం ఒక ప్రక్కన, తండ్రి లౌక్యానికి గర్వం మరొక ప్రక్కన పైచెయ్యి కావాలని ఆమెలో పెనగులాడుతూ వుంటాయి.

రాజేశ్వరి. ఏమండీ! ఇక, నాటక మెలా నడిపిస్తారు?

సత్యనారాయణ. ఇంకేమి నాటకం? నాటకం వికటించింది.

రాజేశ్వరి [తండ్రి లౌక్యాన్ని చూడగా కలిగిన గర్వానిదే పైచెయ్యి కాగా]. అయితే, ఎవరు రెండాకు లెక్కువ చదివినట్టు?

సత్యనారాయణ. ఆఁ! చాల్లే, సంతోషించాం.

రాజేశ్వరి. అవలిస్తే ఆయన పేగులు లెక్కెడతాడని నేను ముందే చెప్పలేదండీ?

సత్యనారాయణ [ఉడుకుబోతు తనంతో]. ఔను! ఆ తాను లోదేగా ఈ ముక్క!

రాజేశ్వరి. చాల్లెద్దురూ! మా నాన్నతో వ్యవహారమంటే నాటకాల్లో వేషా లనుకున్నారా?

[రాజేశ్వరి గదిలోకి వెళ్ళిపోతుంది. సత్యనారాయణ సిగరెట్టును ఆశ్రయిస్తాడు.

బండి భీమన్న [వీధిలోనుంచి]. బాబయ్యా!

సత్యనారాయణ [కోపంగా]. ఎవఁరా అది?

బండి భీమన్న [చావడిలోకి వచ్చి]. బండి తోలుకొచ్చా, బాబయ్యా!

సత్యనారాయణ. ఎల్లుండి పొద్దున రమ్మంటే ఇప్పు డెందు కొచ్చావ్! వెధవా! పో పో!

బండి భీమన్న. అయ్యో! ఇదేటి సిత్రం, బాబయ్యా!

సత్యనారాయణ. పొమ్మనేది నిన్ను కాదట్రా!

[కోపంగా ఒక అడుగు ముందుకు వేస్తాడు.

బండి భీమన్న [బుర్ర గోక్కుంటూ వెనకడుగు వేస్తూ]. సిత్తం! సిత్తం! కోపం సెయ్యకండి, బాబయ్యా! మరిగత్తే ఎంక ట్రామయ్య బాబయ్య....

సత్యనారాయణ [ముందు కురికి, భీమన్న మెడపై చెయ్యివేసి]. డాం ఫూల్! పోతావా, లేదా?

బండి భీమన్న. పోతున్నా, బాబయ్యా! పోతున్నా!

[చకచక సింహద్వారం వైపుకు నడుస్తాడు.

రాజేశ్వరి [పడకగది గుమ్మంలోకి వచ్చి]. ఏమిటండీ, అది? పాపం! మధ్య వాడేం చేశాడు?

సత్యనారాయణ. చాల్లే! నువ్వు కట్టిపెట్టు!

బండి భీమన్న [సింహద్వారాన్ని దాటుతూ]. ఇదేటో సాలా సిత్రంగానే వుందే!

[వీధిలోనుంచి "సత్యనారాయణా!" అంటూ నాగేశ్వర
రావు కేక.

సత్యనారాయణ. మళ్ళీ ఎందుకో తయారౌతున్నాడు, ఛీః శనిగాడు!

[వడమటింటి గుమ్మంలో నిలబడివున్న రాజేశ్వరి చాటుకు
వెడుతుంది.

నాగేశ్వరరావు [చావడిలోకి వచ్చి]. ఇప్పుడేనా ప్రయాణం?

[సత్యనారాయణ జవాబు చెప్పడు.

నాగేశ్వరరావు. అయితే, మీ పత్రిక తెప్పించా లనుకుంటున్నా. నెల చందా యెంత? రెండుంబావలా కాదూ?

సత్యనారాయణ [విసుగ్గా, కోపంగా]. ఊఁ!

నాగేశ్వరరావు. ముందు ఒక నెలపాటు తెప్పించి చూస్తాలే. [జేబులోనుంచి డబ్బుతీస్తూ] కాస్త దీన్ని మీ ఆఫీసులో కట్టు.

[పైక మివ్వబోతాడు.

సత్యనారాయణ. నా చేతికి దేనికి? మనియార్డర్ ద్వారా పంపించు.

నాగేశ్వరరావు. ఆఁ! రెండుంబావలా చందాకి రెండణాల మనియార్డర్ కమిషన్ దండగ దేనికి? మీ పత్రికే, మీ ఆఫీసే కదూ? ఏమంత శ్రమ? కాస్త నువ్వే కడుదూ!

సత్యనారాయణ. ఊహుఁ! నువ్వే పంపించు. కావాలంటే, ఆ రెండణాలు నే నిస్తా!

నాగేశ్వరరావు [నవ్వుతూ]. ఏదో పనిలో పని - చేస్తావనుకున్నా గాని....

వెంకట్రామయ్య [వడమటింటిలోనుంచి తిరిగి వస్తూ]. ఏమిటిరా అబ్బాయ్?

నాగేశ్వరరావు. ఎలాగూ తమ ఆఫీసుకు వెడుతున్నాడు గదా అని, వాళ్ళ పత్రిక్కి ఒక నెల చందా కట్టమని నేను పైక మివ్వబోతే....

వెంకట్రామయ్య. లేదురా! హడావుడి ప్రయాణమౌతున్నదని కూకలేసి ప్రస్తుతానికి నేనే ఆపుచేయించా.

నాగేశ్వరరావు. మరి ఆమాట చెప్పడేం! అందువల్లే కాబోలు చెడ్డ చికాగ్గా వున్నాడు. [సత్యనారాయణతో] సరే, ఇంకా రెండు, మూడు రోజులపాటు వుంటావుగా! రేపొచ్చి కనబడతాలే. కరణంగారింటికి తొందర పనిమీద పోతున్నా.

[నాగేశ్వరరావు వెళ్ళిపోతాడు. ఇక అక్కడ వుండడానికి ముఖంచెల్లక, గట్టిగా సిగరెట్టుదమ్ము పీకుతూ సత్యనారాయణ పడక గదిలోకి చక్కాపోతాడు. దీన్ని చూచి, తల పంకిస్తూ వెంకట్రామయ్య చిరునవ్వు నవ్వుతాడు.

వెంకట్రామయ్య [మంచంపై కూర్చుని, సగంచుట్టి జేబులో పడవేసిన చుట్ట పైకితీసి, దాన్ని చుట్టడాన్ని పూర్తిచేస్తూ]. చిట్టెమ్మా!

రాజేశ్వరి [గదిలోనుంచి]. వస్తున్నా, నాన్నా!

[మాట అంటూనే వస్తుంది.

వెంకట్రామయ్య. నువ్వు నాకొక ముచ్చట తీర్చాలమ్మా! పెద్దపిల్లకడుపు పండనేలేదు. రెండోదానికీ, మూడో దానికీ అంతా ఆడపిల్లలే. మరి, నీ కడుపు నైనా ఒక మగపిల్లవాడు పడితే....

రాజేశ్వరి. ఊఁ! చాల్లే, నాన్నా!

వెంకట్రామయ్య. అంత సిగ్గు దేనికమ్మా! ఇలా చూడు! తాతకు దగ్గులు నేర్పడానికి ఒక మనమడు కావొద్దూ?

[రాజేశ్వరి ముసిముసి నవ్వులతో నిష్క్రమిస్తుంది. వెంకట్రామయ్య తృప్తితో చుట్ట ముట్టించి, గుప్పుగుప్పున పొగ వదులుతూ వుండగా—

తెర]



# పాత్రలు

శివరావు : బ్యాంకి గుమాస్తా

కృష్ణవేణి : శివరావు భార్య

వెంకాయమ్మ : అతని తల్లి

శ్రీరాములు : ప్లీడర్ గుమాస్తా

సత్తిగాడు : క్లబ్ ఫ్యూన్

పచారుకొట్టు గుమాస్తా

# స్థలం

శివరావు అద్దెకున్న భాగంలో ఒక గది

# కాలం

వర్తమానం



# ఇంటిగుట్టు

[ఇది శివరావు అద్దెకున్న భాగంలో పెద్ద గది. కుడిచేతివైపుది వీధితల వసారా; ఎడమచేతివైపుది వెనకపక్క వసారా. వంటిల్లు వెనకపక్క వసారాలో సగం భాగమే. ఉన్నది ఒక్క గదే కనక, అది పెద్దదైనా, ఒక మంచంతో, ఒక వెదురు పుల్లల టేబుల్‌తో ఒక ఈజీచెయిర్‌తో, ఒక కుర్చీపీటతో, రెండు కుర్చీలతో, నాలుగైదు పెట్టెలతో ఇరకాటంగా వుంటుంది.

[తెర లేచిన క్షణానికి సినిమా పాట పాడుకుంటూ, శివరావు ప్రవేశిస్తాడు. అతడు యించుమించు పాతికేళ్లవాడు. సన్నగా, పొడుగ్గా, నాజూకైనవాడు, నీటుగోటులు హెచ్చు. లోతు లేనివాడు కాబట్టి, ఇట్టే ఉబ్బిపోగలడు; ఇట్టే కుంగిపోగలడు. సూట్ వేసుకున్నాడు. మిఠాయి పొట్లాలతో నింపిన గుడ్డ సంచి వెంట తెచ్చాడు.]

శివరావు [చేతిలోని గుడ్డసంచి టేబుల్‌మీద పెడుతూ]. కృష్ణా! కృష్ణా! [హాట్ తీసి, చెలాకీగా చిలక కొయ్యపైకి విసిరివేసి] అమ్మా! అమ్మా! [క్షణం ఆగి] ఎవ్వరూ పలకరు. ఎక్కడికెళ్లారో? [ఈలవేస్తూ, టై కొంచెం వదులు చేసుకుని, మరింత బిగ్గరగా] కృష్ణా!!

[వెనక వాకిలిగుండా కృష్ణవేణి వస్తుంది. ఆమె పద్ధెనిమిదేళ్ల పల్లెపడుచు. కాని, వేష భాషలలో బస్తీ కాపురం తళుకు బెళుకులు కొంతవరకు కనబడుతూ వుంటాయి.

కృష్ణవేణి [ముక్తసరిగా]. దేనికండీ ?

శివరావు. తమ రేం చేస్తున్నా రేమిటి ? బదులే లేదు !

కృష్ణవేణి. చెయ్యడానికి నాకు మ రేముంది ? వంట చేస్తున్నా.

శివరావు. నీ కొక శుభవార్త తెచ్చా ! ఏమిటో చెప్పుకో ?

కృష్ణవేణి. ఏమి టది ? మీరే చెప్పండి.

శివరావు. ఉహుఁ ! నువ్వే చెప్పుకోవాలి.

కృష్ణవేణి. బాగుంది. నామొహం నా కేం తెలుసు ?

శివరావు. ఊహించుకు చెప్పు.

[కృష్ణవేణి చెప్పనన్నట్టు తల తిప్పుతుంది.

శివరావు. ఉహుఁ ! చెప్పుకోవాలి. కావాలంటే మూడు ఛాన్సు లిస్తా.

కృష్ణవేణి. నా కేమీ వొద్దులెండి.

శివరావు. అహఁ ! చెప్పుకోవాలి. ఏదీ....వన్ !

కృష్ణవేణి. చాల్లెద్దురూ !

శివరావు. టూ !

కృష్ణవేణి. చెబితే చెప్పరాదా ? లేకపోతే, మానరాదా ? ఏమిటీ నన్ను ఆడించడం ?

శివరావు [నవ్వుతూ]. త్రీ !

కృష్ణవేణి. పిచ్చిదాన్నిచేసి ఆడించండి ! ఆడించండి !!

శివరావు. ఆడించడానికి కోతివి కాదుగా!

కృష్ణవేణి. కొందరి కళ్లకు కోతికంటె కూడా కనాకష్టమైనదాన్ని గానే కనబడుతున్నా లెండి!

శివరావు. ఛా! ఏమిటది? సర్లే! నువ్వు చెప్పుకోలేవన్న మాట! మరి, నే చెప్పనా?

కృష్ణవేణి [చేతుల్ని విడిపించుకుని]. వద్దులెండి.

శివరావు. వద్దన్న వాళ్ళకి చెప్పడం దేనికి? తిరిగి వంటింటిలోకి నడవండి!

కృష్ణవేణి. రమ్మన్నా, పొమ్మన్నా మీకే చెల్లు!

[వెనక వసారావైపు ఒక అడుగు వేస్తుంది.

శివరావు [రెక్కపట్టి చెంతకు లాక్కుంటూ]. దేవిగారికి....

కృష్ణవేణి. దేవీ లేదు; గివీ లేదు: ఈ దెయ్యపు గుడ్లదానికి అంత పెద్ద పేరు దేనికిలెండి!

శివరావు. ఏం కృష్ణా! కోప మొచ్చినట్టుందే?

కృష్ణవేణి. నాకుతోడు కోపం కూడానా?

శివరావు. చీర తేలేదనే ఇంత ఆగ్రహం?

కృష్ణవేణి. చీరా గీరా నే తెమ్మన్నానటండీ?

శివరావు. నేనే తెస్తానన్నాననుకో! కాని, శుభవార్త వెంటనే చెప్పాలని ఆఫీసునుంచి ఇవ్వాళ సరాసరి ఇంటి కొచ్చా. రేపు తప్పకుండా నీ కొక ఉప్పాడ జరీచీర కొనుక్కొస్తాగా!

కృష్ణవేణి. నా కొద్దులెండి.

శివరావు [కృష్ణవేణి గుండెదగ్గిరిగా చెవిపెట్టి, ఏదో వింటున్నట్టు నటించి]. నోరు వద్దంటున్నా, గుండెమాత్రం "తే! తే!" అంటూ కొట్టుకుంటున్నదే!

కృష్ణవేణి [ఒక అడుగు వెనక్కు జరిగి]. కట్టండి; ఇంకా తాటాకులు కట్టండి. ఎవరికైనా నేనేగా లోకువ?

శివరావు. ఈ పూట విసుగ్గా వున్నావేం? సర్లే! శుభవర్తమాన మేమిటో చెప్పనా?

కృష్ణవేణి. చెప్తే చెప్పండి; మాస్తే మానండి. నన్నడిగి చెబుతా రేమిటి?

శివరావు. చెబితే నా కేమిస్తావ్?

కృష్ణవేణి. నాదగ్గ రేముంది మీ కివ్వడానికి?

శివరావు. ఉంటే యిస్తావా?

కృష్ణవేణి. ఏమి టది?

శివరావు. ఒక....

[ముద్దు అస్పష్టంగా పెదవులతో సూచిస్తాడు.

కృష్ణవేణి. నాకు చెప్పొద్దులెండి.

[వెళ్ళిపోబోతుంది.

శివరావు [భుజంపై చెయ్యివేసి ఆపి]. ఎక్కడికలా పరిగెత్తుతా నంటావ్? కాస్త ఆగు! చెబుతాగా! అయితే, మా అమ్మేదీ?

కృష్ణవేణి. ఏమో, నాకు తెలవదు.

శివరావు. నీకు తెలవకపోవడ మేమిటి? ఎక్కడికి వెళ్లింది?

కృష్ణవేణి. ఎక్కడికీ లేదు. అదుగో! ఆ వెనక వసారాలో వున్నట్టుంది.

శివరావు [వసారా వైపుగా రెండడుగులు వేసి]. అమ్మా!

వెంకాయమ్మ [రాకుండానే బరువుగా]. ఆఁ!

శివరావు. అమ్మా! నిన్నే! ఒకసారిలా రా!

వెంకాయమ్మ [లోపలనుంచే]. ఇప్పుడు నాతో పను లేమొచ్చాయ్?

శివరావు. ఒకసారి రమ్మంటూ వుంటే!

వెంకాయమ్మ [వస్తూ]. పానకంలో పుడకలా మీ మధ్య మధ్య నేను దేనికి?

[తర్వాత ఒక అరనిమిషానికి [illegible] వెంకాయమ్మ వస్తుంది. ఆమె [illegible] యిల్లాలు. జీవితం అంతా [illegible] చేయడంవల్ల [illegible] పోయినట్లు [illegible] వుంటుంది. ఏదో చింతిస్తూన్నట్లు ఆమె ముఖం [illegible] వుంటుంది. [illegible] వేలుముడి జుట్టు, [illegible] గల.]

శివరావు [తల్లి ప్రవేశించగానే]. నీ కొక శుభవర్తమానం తెచ్చానమ్మా!

వెంకాయమ్మ. నాకు శుభవర్తమాన మేమిటిరా?

శివరావు. నా కివ్వాళ ఆఫీసులో యింక్రిమెంటిచ్చా రమ్మా!

వెంకాయమ్మ. మెట్టేమిటి? ఇవ్వడ మేమిటి?

శివరావు [నవ్వుతూ]. మెట్టూ, గట్టూ కాదమ్మా! ఈ నెలనుంచి నాకు జీతం హెచ్చించారు.

వెంకాయమ్మ. ఓహో! అదా సంగతి!

శివరావు. పదిహేను రూపాయలు హెచ్చించా రమ్మా! ఇక నెలకి నూటతొంభై యిస్తారు.

వెంకాయమ్మ. పదిహేనేనా! హెచ్చింపంటే ఏ పాతికో, ముప్ఫయ్యో అనుకున్నా.

శివరావు. ఆఫీసులో నాకు తప్ప మరెవ్వరికీ యివ్వనే లేదమ్మా! నన్నూ, నా పనినీ మెచ్చుకుని నా కొక్కడికే ప్రత్యేకంగా యిచ్చారు.

వెంకాయమ్మ [మాట తెంచివేస్తున్నట్టు]. మంచిదిరా, అబ్బాయ్! ఇదంతా నీ పెళ్ళాం అదృష్టం!

శివరావు. రేపు నీ కోడలి కొక ఉప్పాడ జరీ చీర, నీ కొక సైను చీర....

వెంకాయమ్మ. నాకు సైను చీరలూ వొద్దు; రవికెలూ వొద్దు. మీ ఆవిడకే తెచ్చుకో మరొక జరీ చీర.

కృష్ణవేణి. నా కేమీ తే నక్ఖర్లేదు.

[వెనక వసారాలోకి దారితీయబోతుంది.

శివరావు. ఇదుగో! కృష్ణా! బ్రహ్మానందాన్ని, మాధవరావుగార్ని, శ్రీనివాసరావుగార్ని కాఫీకి పిలిచా. వాళ్ళిప్పు డొస్తారు. బజారునుంచి స్వీట్స్ కొనితెచ్చా గాని, కాస్తేదైనా సేవరీ చేసి, కాఫీ పెట్టు.

కృష్ణవేణి. ఏమి చెయ్యమంటారు? ఇంట్లో యేమీ లేదు.

శివరావు. మొన్నొక రోజున వాళ్లెవరో వచ్చినప్పుడు తెప్పించిన ఉప్మారవ్వ లేదూ?

కృష్ణవేణి. కాస్త మిగిలింది. అదేం సరిపోతుంది?

శివరావు. వస్తున్నది ముగ్గురేగా? దాన్నే ఎలాగో సరిపెడుదూ!

[కృష్ణవేణి వెడుతుంది.

శివరావు [కోటు, పై తీసి చిలకకొయ్యకు తగిలిస్తూ]. ఈ గది ఒకసారి ఊడుస్తా వమ్మా ?

వెంకాయమ్మ. ఇంతకు ముందేరా పనిమనిషి ఊడ్చి వెళ్ళింది.

శివరావు. ఎక్కడి దుమ్ము అక్కడే వుంది. దాని మొహం! ఇదేనా ఊడ్చడ మంటే ?

వెంకాయమ్మ. అది అణిగి మణిగి పనిచేస్తేగా ? ఇక్క డొక చీపురూ, అక్క డొక చీపురూ వేసి చక్కాపోతుంది. చూస్తూ ఊరుకోలేక అ దేమిటని నే నడిగితే మూతీ, ముక్కూ విరిచి, ఏ డెక్కరింపు లెక్కరిస్తుంది. నేను పెట్టి పోషించడం లేదుగా ?—అది నా మా టినడానికి !

శివరావు. అంత వొళ్లు పొగ రెక్కివుంటే, దాన్ని పని మాన్పించ వమ్మా !

వెంకాయమ్మ. నాకు దేనికిరా, అబ్బాయ్ ! నే నిక్క డుం డొచ్చానా, పెట్టొచ్చానా ? దాన్ని అదుపు చెయ్యడానికి నే నెవతిని ?

శివరావు. అదేమి టమ్మా ! అలా అంటావ్ ? [వెదురు పుల్లల టేబుల్‌ను గదిమధ్యకు లాగుతూ] అమ్మా ! టేబుల్ క్లా తేదీ?

వెంకాయమ్మ. ఏమోరా, నా కేం తెలుసు ? ఇది నా కొంపా, గోడా ?

[వెనక వాకిలిగుండా వెడుతుంది.

శివరావు [పడకకుర్చీని టేబుల్ దగ్గరికి తెచ్చివేసి]. కృష్ణా !

కృష్ణవేణి [తిరిగివస్తూ]. దేని కిప్పుడు? ఉప్మా చెయ్యమన్నారుగా! చేస్తున్నా.

శివరావు. ఆఁ! ఏం లేదు. టేబుల్ క్లా తేదీ?

కృష్ణవేణి. మురిక్కై పోయిందని మొన్న చాకలికి వేశా!

శివరావు. అయితే, పాత దేమైంది?

కృష్ణవేణి. అ దెన్నడో చిరిగి పోయింది.

శివరావు. మరి, ఇప్పు డేమిటి చెయ్యడం? పోనీ, ఒక ఉత్తరీయమైనా కప్పుదాం. ఏదీ, ఒక టేదైనా తే! ఏమీ కప్పకపోతే, ఇది చెడ్డ అసహ్యంగా వుంటుంది.

[పై రెండు ట్రంకుపెట్లి కిందికి దించి, అడుగుదాన్ని ఉత్తరీయంకోసం కృష్ణవేణి గాలిస్తూ వుంటుంది. శివరావు కుర్చీపీటను ఈడ్చుకొచ్చి, కుర్చీలను వాటిని టేబుల్ దగ్గర చక్కగా అమర్చడానికి ప్రయత్నిస్తూ వుంటాడు.

కృష్ణవేణి. డబ్బుకు పాలవాడు తొందర చేస్తున్నాడండీ!

శివరావు. ఇవ్వాళేగా ఒకటో తారీఖు. ఆ వెధవకి అప్పుడే ఏం తొందర?

కృష్ణవేణి. పోయిననెల వాడికి సగమేగదండీ యిచ్చాం. నేతివాడికి కూడా బకాయిపెట్టాం. వాడూ సతాయిస్తున్నాడు.

శివరావు. కాస్త వెనకా ముందూ అయితే, వెధవలు ఆగలేరూ? ఈ అలగా జనంతో యింతే! మర్యాదా మన్నూ లేదు.

కృష్ణవేణి. కూరగాయలదైతే బతక నివ్వడమే లేదు. దానికి పాత బాకీతో చేరి నాలుగు రూపాయలదాకా అయింది. తెల్లవారేసరికి రాక్షసిలా వచ్చి అది వాకిట్లో కూర్చుంటుంది.

శివరావు. రానీ, వెధవముండని! దానిడబ్బు దానిముఖాన గిరగిర తిప్పి కొట్టి, ఇక మా గడప తొక్కొద్దని మెడమీద కర్రవేసి గెంటుతా!

కృష్ణవేణి. పచారీకొట్టు గుమాస్తా ఇవ్వాళప్పుడే నాలుగు దఫాలొచ్చి వెళ్ళాడు. వాళ్ళ బాకీ ఆగరట.

శివరావు. మొన్నేగా ఒక యిరవై వాడికి జమ కట్టింది?

కృష్ణవేణి. ఏమో? - ఇంకా పాతికదాకా యివ్వాలట.

శివరావు. దొంగ లెక్కలు రాస్తున్నాడు కాబోలు! స్కౌండ్రల్! రేపు వెళ్ళి, వాళ్ళ అంతు కనుక్కుంటా!

కృష్ణవేణి. ఏ నెల కా నెల ఎవళ్ళ డబ్బు వాళ్ళకి పారేస్తే, మనకు ఏ చికాకూ వుండదుగదండీ?

శివరావు. ఆ జీతమేమో తెచ్చి నీ చేతికే యిస్తున్నాగా! ఆరిందావి! అంతా చక్కగా దిద్దుకురారాదూ?

కృష్ణవేణి. అంతే లెండి! నేను మంచిదాన్నయితే మీ కిన్ని చిక్కు లెందుకొస్తాయ్? పాపం! నావల్ల మీరు....

[కళ్ళను గిర్రున నీళ్ళు తిరగ్గా, మాటమధ్యలో ఆగి పోతుంది.

శివరావు. కృష్ణా! [దగ్గరకు లాక్కుని] నువ్వు వొట్టి పెర్రిదానివి సుమీ!

కృష్ణవేణి [పట్టు విడిపించుకుని, దూరంగా జరిగి, కోపంగా]. చాల్లెద్దురూ! ముందు జీతం తెచ్చిస్తున్నారేమో! తర్వాత సిగరెట్లకనీ, సినిమాలకనీ గుంజు కెడుతున్నారేమో! అదేదో మీ దగ్గిరే పెట్టుకోండి; మీరే వాడుకోండి. మీరు సంపాయించి తెస్తుంటే కిందూ మీదూ కానకుండా నేను ఖర్చు చేస్తున్నానని న న్నందరు ఆడిపోసుకోవడం దేనికి?

శివరావు [అనునయిస్తూ]. నేను తలకుమించిన ఖర్చుల్ని చేస్తూ వుంటే—పాపం!— నువ్వేం చేస్తావులే? తప్పు నాదే!

కృష్ణవేణి. అబ్బే! మీ తప్పేముంది లెండి? ఇంతకూ నేను దరిద్రపుగొట్టుదాన్ని.

శివరావు. ఛీ! ఏమిటా మాటలు?

కృష్ణవేణి [ట్రంకును వెదకడం తిరిగి ప్రారంభించి, దాని అడుగునుంచి ఉత్తరీయాన్ని తీసి]. ఇదుగోనండీ ఉత్తరీయం!

శివరావు [దాన్ని అందుకొని, మడత విప్పిచూచి]. అబ్బే, ఇదీ చిరిగిందేనే! వేరే లేదూ?

కృష్ణవేణి [ట్రంక్ మూతవేస్తూ]. ఏ రెక్కడిదండీ? మీకున్నదే అదొక్కటైతే!

శివరావు. ఊఁ! సరే!

[కృష్ణవేణి ట్రంకుల్ని తిరిగి దొంతరగా పెడుతూ వుంటుంది. చిరుగులు కనబడకుండా ఉత్తరీయాన్ని మడత పెట్టి, టేబుల్‌పై పరచడానికి శివరావు ప్రయత్నిస్తూ వుంటాడు.

శివరావు. అయితే, టిఫిన్ తయారైందా?

కృష్ణవేణి. మొదలెట్టిన యెడ మెక్కడండీ? ఇంతలోనే మీరు పిలిస్తిరయ్యె!

శివరావు. మంచిది - త్వరగా సిద్ధం చెయ్యి! అల్లం సన్నగా తరిగి, జోరుగా వెయ్యి. డాక్టరు శ్రీనివాసరావుగారికి అల్లమంటే చాలా యిష్టం. జీడిపప్పుకూడా బాగా వెయ్యాలి.

కృష్ణవేణి. ఇంట్లో బద్దయినా లేదు, బాగా నే నేం వేస్తాను?

శివరావు. గట్టి చిక్కేనే! జీడిపప్పు లేందే ఉప్మాకు రుచీ పచీ వుండదు. ఆ బ్రహ్మానందం అసలే ఉలిపి నోటివాడు. ఊరికేనే పేర్లు పెడతాడు.

కృష్ణవేణి. అయితే, త్వరగావెళ్లి, రెండు తులాలు కొనుక్కురండి.

శివరావు. ఇప్పుడు టైం లేదులే. ఎలాగో పూర్తిచేశెయ్!

[కృష్ణవేణి వెనక గుమ్మంగుండా వెడుతుంది.

శివరావు. ఛా! ఎలా మడత పెడదామన్నా ఈ పాడు చిరుగు తప్పడమే లేదు!

వెంకాయమ్మ [చీపురుకట్టతో తిరిగివచ్చి]. దుమ్ము పైకొస్తుందేమో — కాస్త తప్పుకోరా, అబ్బాయ్!

శివరావు. రాదులే, అమ్మా! ఆ మూలనుంచి ఊడ్చుకురా!

[వెంకాయమ్మ ఒక మూలనుంచి గది జిమ్మడాన్ని ప్రారంభిస్తుంది.

శివరావు [ఉత్తరీయాన్ని నాలుగ్గా మడతపెడుతూ]. ఇవ్వాళ మనింటికి పెద్దపెద్దవాళ్ళొస్తున్నారమ్మా!

వెంకాయమ్మ. మంచిదిరా, అబ్బాయ్!

శివరావు [చిన్నదిగా మడతపెట్టడంవల్ల చాలీ చాలకుండాపోయిన ఉత్తరీయాన్ని టేబుల్ మీద వేసి, దాని అంచును ఒకవైపున కిందికి లాగబోతే, రెండోవైపున అది పైకి పోతూవుండగా]. బ్రహ్మానందాన్ని పిలిచానమ్మా! మే మిద్దరం ఒకే కాలేజీలో కలిసి చదువుకున్నాము. వా డిప్పుడు మునిసిపల్ కమిషనర్. నెలకు నాల్గు వందల జీతం తెచ్చుకుంటున్నాడమ్మా!

వెంకాయమ్మ. వాడి పెళ్ళాం అదృష్టమది!

శివరావు. మాధవరావుగారూ వస్తున్నారమ్మా! ఆయన త్వరలో డిప్టీ కలెక్టర్ కాబోతున్నాడు. నన్ను మించి చదువుకున్నవాడేమీ కాదు. అయినా, అప్పుడే పెద్ద పదవిలోకి పోబోతున్నాడు. ఆయ నింకా పైకి పోతాడు.

వెంకాయమ్మ. ఊఁ! చదువులు సమానమైతే సరేనా? నసీబు సమానం కావొద్దూ?

శివరావు. శ్రీనివాసరావుగార్నికూడా పిల్చాన్నా. ఆయన పెద్ద డాక్టరు. నెలకి వెయ్యిదాకా కళ్ళ జూస్తున్నాడు.

వెంకాయమ్మ. సర్లే! ఊళ్ళోవాళ్ళ సంపాదన చూసి మురిస్తే, మన కేం వొరుగుతుంది లేరా, అబ్బాయ్!

శివరావు. అది కాదమ్మా! పెద్దవాళ్ళ స్నేహముంటే, ఎందుకైనా మంచిది కాదూ? వాళ్ళ శిఫార్సు దొరికితే ఉద్యోగంలో ఎంత పైకైనా పాకి పోవచ్చు.

వెంకాయమ్మ. ఏమోరా, అబ్బాయ్? ఆ గొడవలేమిటో నా కేం తెలుస్తాయ్?

శివరావు. పెద్ద పెద్ద వాళ్ళందరికీ మా బ్యాంకిలో ఖాతా లున్నా యమ్మా! అందువల్లనే పెద్దవా ళ్ళిందరో నాకు స్నేహితు లయ్యారు.

[బయటినుంచి "శివరావుగారూ" అని కేక.

శివరావు. మాధవరావుగా రనుకుంటా. అన్న వేళకంటె ముందే వచ్చారు. ఇం కేం వూడుస్తావ్ లే, అమ్మా! నువ్వెళ్లు.

[వెంకాయమ్మ చీపురుకట్ట అక్కడే పారవేసి వెళ్ళ బోతుంది.

శివరావు. అమ్మా! అదేమిటి? ఆ చీపురుకట్ట తీసుకుపో.

[వెనక్కువచ్చి వెంకాయమ్మ చీపురుకట్ట తీసుకు వెడు తుంది. "శివరావుగారూ!" అని తిరిగి బయటి నుంచి కేక.

శివరావు. మాధవరావుగారా? రండి, రండి. మా గృహం పావన మైంది.

పచారీకొట్టు గుమాస్తా [లోపలికి వస్తూ]. నేనండీ పచారీకొట్టు పరంధామయ్య గుమాస్తాని.

శివరావు [ముందు తెల్లబోయి. అంతలోనే కోపం తెచ్చుకుని]. ఏమిటయ్యా! వేళా పాళా లేకుండా మళ్లీ తయారయ్యావ్! దేనికీ ఇన్నిసార్లు ఇంటిచుట్టూ తిరగడం?

పచారీకొట్టు గుమాస్తా. ఎందుకండీ మధ్య నా మీద కోపం? షాహుకారు పెళ్ళిరమ్మంటే నే నొస్తానా? నా అంతట నేనే వొస్తానా?

శివరావు. మొన్నేగా ఒక యిరవై జమ కట్టింది? ఇంతలోనే ఏమి తొందరొచ్చింది?

పచారీకొట్టు గుమాస్తా. ఇంకా ఇరవై అయిదు రూపాయల తొమ్మిదణాల ఏడుపైసల బాకీ వుంది. సంవత్సరాది వస్తున్నది. కొత్త ఖాతా పుస్తకాలు పెట్టుకోవాలి. పాత బాకీలన్నీ అణాపైసలతోసహా చుస్తాగా వసూలుచేసుకు రమ్మని మా షాహుకారు దండిస్తున్నాడు.

శివరావు. మా దేమీ పాతబాకీ కాదేఁ?

పచారీకొట్టు గుమాస్తా. పాతదో కొత్తదో—మా షాహుకారు మరి ఆగడండీ!

శివరావు. సర్లే! ఆ లెక్కా డొక్కా యేమిటో చూచి, రేపే బాకీ ఫైసల్ చేస్తానని చెప్పు.

పచారీకొట్టు గుమాస్తా. చిత్తా. ఆవర్జాలు చూసి మేము సరిగానే లెఖ్ఖ వేశామండీ. మా లెఖ్ఖలో తేడా వొస్తుందని ఇంతవర కెవ్వరూ అనలేదు.

శివరావు. పోనీ, ఇప్పుడు నే నంటున్నాగా! సరే, ఇఖ వెళ్ళు. ఏమో ననుకున్నా! మంచి మర్యాదస్తులే!

పచారీకొట్టు గుమాస్తా. ఇది లోకంలో రివాజే లెండి. బాకీ అడక్కపోతే మర్యాదస్తులు. అడిగితే....

శివరావు. చాల్లే! అధికప్రసంగం చెయ్యకు.

పచారీకొట్టు గుమాస్తా. అడిగితే మీకు కోపం, అడక్కపోతే ఆయనికి కోపం. ఈ బాకీ వసూ ళ్ళంతటి పాడుపని మరి లేదు!

శివరావు [తెప్పిరిల్లడానికా అన్నట్టు ఒక క్షణం ఆగి]. అమ్మా! అమ్మా!

వెంకాయమ్మ [వస్తూ]. ఎందుకురా, అబ్బాయ్?

శివరావు. గది సగమే ఊడ్చి వెళ్ళావ్. మళ్ళీ ఒకసారి ఆ చీపురు పట్టుకురా!

వెంకాయమ్మ. ఎవ రేమిటిరా, ఇప్పు డొచ్చి వెళ్ళింది?

శివరావు. ఆఁ! ఎవరూ లేదమ్మా! పచారీకొట్టు గుమాస్తాగాడు. పుట్టి మునిగినట్టు ఇంటిచుట్టూ తెగ తిరుగుతున్నాడు - బుద్ధి లేని వెధవ!

వెంకాయమ్మ. వాళ్ళకి బాకీవుంటే వాళ్ళు తిరగరట్రా? కాస్త వెనకా ముందూ చూసి కాపరం చేసుకోవాలి. "ఆడపెత్తనం తంబల దొరతనం" అన్నారు.

[చీపురుకోసం వెడుతుంది.

శివరావు [చిలక కొయ్యనున్న కోటుజేబులోనుంచి చిన్న దువ్వెన తీసుకుని, తల దువ్వుకుంటూ]. కృష్ణా !

[కృష్ణవేణి పలకదు. చీపురుతో వెంకాయమ్మ మాత్రం వచ్చి, గదిజిమ్మడాన్ని పూర్తిచేస్తూ వుంటుంది.

శివరావు [మొదటిసారికంటె బిగ్గరగా]. కృష్ణా !

["వస్తున్నా!" అంటూ కృష్ణవేణి ప్రవేశిస్తుంది.

శివరావు. ఏఁ ! పలకవ్. ఏం చేస్తున్నావ్?

కృష్ణవేణి. వినబడలేదు ; ఉప్మా చేస్తున్నా.

శివరావు. అయితే, మనకి మూడే కుర్చీ లున్నాయ్. మరొకటి కావాలి. పక్కింటివాళ్ళ నడిగి ఒక కుర్చీ తీసుకురా !

కృష్ణవేణి. ఏమో! వాళ్ళని నమ్మడానికి వీల్లేదండీ! మంచి గుణాన వుంటే యిస్తారు; లేకపోతే విసుక్కుంటారు.

[వీధి వాకిలిగుండా వెడుతుంది.

శివరావు. అమ్మా! పింగాణీ ప్లేట్లు ఎక్కడున్నవో చూసి, కడిగి పట్టుకురా!

వెంకాయమ్మ. మీ ప్లేట్లు, గీట్లు ఎక్కడున్నవో, ఏమిటో నాకు తెలవదురా, అబ్బాయ్!

శివరావు. వంటింటి అలమరలో లేవూ ?

వెంకాయమ్మ. వోటి చేతులదాన్ని. చెయ్యిజారి పగిల్తే మీచేత మాటలు పడాలి. మీ ఆవిణ్ణే రానివ్వరా! అది తెస్తుందిలే!

[గది జిమ్మడాన్ని పూర్తిచేసి వెళ్ళిపోతుంది. వెనక వాకిలిగుండా చీపురుతో ఆమె వెళ్ళిపోవడమేమో, తల వాకిలిగుండా కృష్ణవేణి కుర్చీతో రావడమేమో.

శివరావు. మా అమ్మ చికాగ్గా వుంది. టీ పార్టీకి డబ్బు తగలేస్తున్నా ననే రాబోలు! కాని, పెద్దవాళ్ళు మనింటి కెందు కొస్తారు? ఇవ్వాళ ఏదో సాకు దొరికింది కనక, వాళ్ళని మనం పిలవడం పడింది. పిలిచినా వాళ్ళు అంద రిళ్ళకూ వెళ్ళరు. పిలిచింది మనం కాబట్టే "ఎందుకోయ్! నీకు లేనిపోని ఖర్చు!" అన్నారు. వాళ్లు అనవలసిన మాటే అది! మా ఆఫీసు బడుద్ధాయిల మాదిరిగా యింక్రిమెంట్ వచ్చిన మాట వినగానే "మా కెప్పుడు టీపార్టీ చేస్తావ్? మా కెప్పుడు డిన్న రిస్తావ్?" అంటూ ఈగల్లా ముసురుకోడానికి వాళ్ల కేం తక్కువ? [కృష్ణవేణి ఔననిగాని, కాదనిగాని అనకపోవడాన్ని గమనించి] ఏం, కృష్ణా! పలకవ్, ఉలకవ్! ఇది వొట్టి దుబారేనని అత్తాకోడ ళ్ళిద్దరు కలిసే తీర్మానించుకున్నా రేమిటి!

కృష్ణవేణి. అడక్క అడక్క మా అత్తాకోడళ్ళమాటే అడగాలి!

శివరావు. సర్లే! ఏవీ పింగాణీ ప్లేట్లు పట్టుకురా! స్వీట్స్ వాటిలో పెట్టి సిద్ధంగా వుంచుదాం.

[కృష్ణవేణి వెడుతుంది. శివరావు తనవెంట తెచ్చిన గుడ్డ సంచి అందుకుని, దానిలోనుంచి ఒక పొట్లాన్ని పైకి తీసి, దాన్ని విప్పుతూ వుంటాడు. చిన్నవి, పెద్దవి ఎనిమిది ప్లేట్లతో కృష్ణవేణి తిరిగి ప్రవేశిస్తుంది.

శివరావు [ప్లేట్లు నింపి]. ఉప్మా అయిందా?

కృష్ణవేణి. ఆc!

శివరావు. ఈ ప్లేట్లు అన్నీ అన్ని సైజులుగా వున్నాయేc!

 

కృష్ణవేణి. ఏం సైజులో, మన కున్న వవీ.

శివరావు. [ఒక దాన్ని యెత్తి]. దీని అంచు నొక మొరికి పున్నది [మరొకదాన్ని పరీక్ష చేస్తూ] ఇది బీ టిచ్చింది. [వేరొకదాన్ని తీసి] ఇదేమో వంకర తిరిగింది. [ఇంకొక దాన్ని వేలితో చూపుతూ] దానికి రంగు పోయింది. వీటిని చూశాక ఆ బ్రహ్మానందం అందరివద్ద మనల్ని రేపటినుంచీ వెక్కిరిస్తాడు !

కృష్ణవేణి. ఈ కాస్తకే వెక్కిరించాలీ ! మరి అలాంటివాణ్ణి— మనకు లేని పోని కుమ్మ—మీరు పిలవడ మెందుకండీ ?

శివరావు. పిలవకుండా వదిలిపెడితే వాడు మరింత అల్లరి చేస్తాడు. మా కాలేజీ హాస్టల్‌లో వాడి నోటి కందరూ జడిసేవారు.

కృష్ణవేణి. మంచి స్నేహితుణ్ణే సంపాయించారు !

శివరావు. నీకు తెలవదు. వాడు భలేవాడు. అయితే, కాఫీ పెట్టావా ?

కృష్ణవేణి. ఆఁ !

[ఇద్దరూ చేరి ప్లేట్లలో స్వీట్సు పెడుతూవుంటారు.

శివరావు. డికాక్షన్ చిక్కగా పెట్టు. ఫిల్టర్ చేస్తే తప్ప, మాధవ రావుగారికి కాఫీ నచ్చదు. ఫిల్టర్ చెయ్యరాదూ ?

కృష్ణవేణి. మనకి ఫిల్ట రెక్కడిదండీ ?

శివరావు. పక్కింటి వాళ్ళకు లేదూ ?

కృష్ణవేణి. వాళ్ళివ్వరండీ? కుర్చీ అడిగినందుకే ఆవిడ ముఖం ధుమధుమ లాడింది. ఉప్మాకూడా ప్లేట్లలో వొడ్డించివుంచనా?

శివరావు. అందర్నీ రానీ! ఇప్పటినుంచీ వడ్డించి వుంచితే చల్లారి పోతుంది.

కృష్ణవేణి. అందరూ వొస్తారంటారా?

శివరావు. మనం పిలవడమూ, రాకపోవడమూనా? మన కెంత పలుకుబడి లేకపోతే, చిన్నపనికీ, పెద్దపనికీ మా ఏజెంట్ నన్ను ప్రతి ఆఫీసర్ దగ్గిరికీ తరుముతాడు! ఎంత పెద్ద ఆఫీసరైనా మనం వెళ్లామంటే, ముందు మన పనిచేసి పంపిస్తాడు. మన సూటూ, మన బూటూ, మన హ్యాటూ చూసేసరికి ఎంతటివాడైనా సీ టిస్తాడు. నువ్వేమైనా అను గాని, వేషంలో కొంత దాబూ దర్పం కావాలి. లేకపోతే, మన ముఖం చూసేవాడెవడు?

కృష్ణవేణి. ఏం దాబూ, దర్పాలో! ఊరినిండా బోలెడన్ని అప్పులూ, మనమున్నూ!

శివరావు. ఇలాంటి యింక్రిమెంట్లు త్వరత్వరగా మరి రెండొస్తే ఈ అప్పు లేం చేస్తాయ్! వెధ పప్పులు! [చిటిక వేస్తూ] ఇట్టే తీర్చిపారెయ్యం!

కృష్ణవేణి. ఆఁ! రెండేళ్ళకు ఇప్పుడేగా కాస్త జీతం హెచ్చించారు.

శివరావు. మన సత్తా వాళ్ళకి ఇప్పుడిప్పుడేగా తెలిసొచ్చింది! ఇక చూడు! చకచకా, చకచకా పైకి ఎలా వెళ్ళిపోతామో! నాలు గేళ్ళుపోయేసరికి ఏజెంట్ పని! అప్పు డొక కారు, బంగళా, టెలిఫోన్, నౌకర్లు, చాకర్లు....

కృష్ణవేణి. ఎవరైనా వింటే గప్పా లనుకుంటారు. అయినప్పు డనుకోవచ్చు, ఇప్పు డెందుకులెండి—ఈ మాటలన్నీ.

శివరావు. ఆగు! నువ్వే చూద్దువుగానిగాఁ! ఈ యేడు నాకు యింక్రిమెంట్ వచ్చి తీరుతుందని నే నంటే, నువ్వు నమ్మావూ? అలాగే....

[బయటినుంచి "శివరావ్!" అని కేక.

శివరావు. బ్రహ్మానందం వచ్చినట్టున్నాడు. సరే - నువ్వు లోపలికి పో. కాఫీకూడా రెడీ చెయ్యి! [కృష్ణవేణి వెడుతుంది] రావోయ్! బ్రహ్మానందం! రా! పిలవగా, పిలవగా—నీ పుణ్యమాయిరి—మా యింటి కిప్పటికైనా వచ్చావ్!

శ్రీరాములు [మందుసీసాతో లోపలికివస్తూ]. నేనురా, శ్రీరాముల్ని. ఏఁ! అంత కొత్తవాణ్ణి అయిపోయానూ—నా గొంతు ఆనవాలు పట్టలేకపోడానికి!

శివరావు. ఓరి పీనుగ! నువ్వట్రా! ఎక్కడినుంచి ఊడిపడ్డా విప్పుడు? ఆ మం దెవరికి?

శ్రీరాములు. మా ఆడవాళ్ళకు మొన్నటినుంచి జ్వరం తగులు తున్నదిరా! మందు తెద్దామంటే ఉదయం తీరనే లేదు. అందుకని కోర్టు పని కాగానే ఏకాయెకి డాక్టర్‌గారింటి కెళ్లా. ఏమిటిరా, ను వ్వేమిటో టీపార్టీ చేస్తున్నావట?

శివరావు. నీ కెవరు చెప్పారు? డాక్టర్ చెప్పాడా?

శ్రీరాములు. నువ్వు చెప్పకపోతే మాత్రం దాగుతుందట్రా! ఇంతకూ విశేష మేమిటి?

శివరావు. ఆఁ! మరేమీ లేదురా! ఇవ్వాళ మనకు స్పెషల్ ఇంక్రిమెంట్ వచ్చింది. అందుకని....

శ్రీరాములు. అదృష్టవంతుడివిరా! అయితే, టీపార్టీకి నన్ను పిలవనే లేదేఁ!

శివరావు. నువ్వు కనబడి యేడిస్తేనా?

శ్రీరాములు. అంతేలే! నీకు నే నిప్పుడు కనబడను. ఇప్పుడు నీ స్నేహాలన్నీ పెద్దపెద్దవాళ్ళతోనే. ప్లీడర్ గుమాస్తాగాణ్ణి! నాబోటి బక్కవా ళ్ళిప్పుడు నీ కంటికి ఆనరులే.

శివరావు. అఘోరించావ్! ఇప్పుడు మాత్రం మించిపోయిన దేముంది? ఉండు - నువ్వుకూడా వుండరా టీపార్టీకి!

శ్రీరాములు. నే నొచ్చి అడిగితే నన్ను పిలుస్తా వన్నమాట! ఏం మర్యాదస్తుడివిరా!

శివరావు. ఏడ్చావులేరా! బొట్టూ, కాటుకా పెట్టి పేరంటానికి పిలిచి నట్టు నిన్ను పిలవాలా? అయితే, డాక్టరుగారు బయల్దేరారా?

శ్రీరాములు. ఊహుఁ! లేదు. ఏదో అర్జెంటుకేసు వచ్చిందట. "నీ కది దారేగదా! రా లేనని ఆ శివరావుతో చెప్పిపో!" అని ఆయ నంటే, ఇంటికైనా పోకుండా నే నిలా వచ్చా.

శివరావు. అయ్యో! ఆయన తప్పకుండా వస్తా డనుకున్నారా! ఏమిటో అంత అర్జెంటు కేసు?

శ్రీరాములు. ఏమో! నాకేం తెలుసు? ఆయన చెప్పమన్న మాట చెప్పాను.

శివరావు. ఏదో పెద్ద ఆటంకం కలిగివుండకపోతే, ఆయన ఆగి పోయేవాడు కాదు. మనమంటే ఆయన చాలా ఫ్రెండ్లీగా వుంటాడు. వాళ్ళ యింట్లో ఏ పార్టీ జరిగినా, ఏర్పాట్లన్నీ మనకే అప్పజెబుతాడు.

శ్రీరాములు. మరి నే నెళ్ళొస్తారా !

శివరావు. కాస్త ఆగరా ! వెడుదువుగానిలే !

శ్రీరాములు. లేదురా! వెళ్ళాలి! అ దెలా వుందో, ఏమో గొడవ! పొద్దుటికే జ్వరం మంటలు మండుతున్నది.

శివరావు. మాధవరావుగారు, బ్రహ్మానందంగారు మన పార్టీకి వస్తున్నారు. అలాంటి పెద్దవాళ్లతో పరిచయం కలగడానికి ఇంత మంచిఛాన్సు నీకు మరెలా వస్తుంది ? పోనీ, కావాలంటే ఒక పావుగంట తర్వాత వెళ్ళిపోవచ్చులే !

శ్రీరాములు. ఆగడానికి వీల్లేదులేరా ! ఇంట్లో మందు అప్పగించి, వీలుపడితే, ఏదో ఒకవేళకు అందుకుంటాలే !

[వెడతాడు.

కృష్ణవేణి [తిరిగి వచ్చి]. ఎవరండీ అది ?

శివరావు. ఆఁ ! శ్రీరాములుగాడు.

కృష్ణవేణి. అంటే ?

శివరావు. వాడి వూరూ, మా వూరూ పక్కపక్కనే వున్నాయిలే ! మా కేదో బీరకాయపీచు చుట్టాన్నని చెబుతాడు. రెండు, మూడు నెలలైంది ప్లీడరుగుమాస్తాగా వా డిక్కడి కొచ్చి. రెండో గుమాస్తాగా ఒక యాభై రాళ్ళు తెచ్చుకుంటున్నాడు. చచ్చుపీనుగ ! నన్ను పూసుకు పూసుకు తిరగాలంటాడు. నే నెంత పెద్దవాళ్ళమధ్య వున్నా "ఏరా" అంటూ తయారౌతాడు. ఎప్పుడో బుద్ధి చెప్పాలి. ఇలాంటివాళ్ళని దగ్గిరికి చేరనిస్తే మన పరువు తీసేస్తారు. చేసినా స్నేహాలు పెద్దవాళ్ళతో చెయ్యాలి. ఇలాంటి ప్లీడరు గుమాస్తాగాళ్ళతోనా !

కృష్ణవేణి. అయ నేమిటో డాక్టరంటా డేమిటి ?

శివరావు. డాక్టర్ శ్రీనివాసరావుగారికి అర్జెంటు కే సొచ్చిందట. అందువల్ల మన టీపార్టీకి రాలేమని ఆ శ్రీరాములుగాడిద్వారా కబురు చేశారు.

కృష్ణవేణి. అయిందీ ? అప్పుడే ఒకరు జారుకున్నా రన్నమాట. తక్కిన యిద్ద రేరీ ?

శివరావు. ఆఫీసర్లు కాదూ ? వాళ్లకి ఊపిరిసలపని పను లుంటాయ్. వస్తారు—కాస్త వెనకా ముందుగా. తీరుతుందో, లేదో అని నేను పిలిచినప్పుడే అన్నారు. "ఎలాగైనా సరే తీరుబాటు చేసుకొనక తప్ప"దని నేను గట్టిగా చెప్పేసరికి "ఇంత బలవంతం చెయ్యాలటోయ్?" అన్నారు. అన్న మాట తప్పే రకం కాదు ; తప్పకుండా వస్తారు.

[బయటనుంచి "శివరావుగారూ!" అని కేక.

శివరావు. అ దెవరు ?

కృష్ణవేణి. ఏమోనండి ? నేతివాడేమో ?

శివరావు. ఆరి వెధవ ! వీడికి వేరే వేళ కుదరలేదు కాబోలు ! వీ డిప్పుడు తయారయ్యాడు !

["శివరావుగారూ !" అని తిరిగి కేక.

శివరావు [బిగ్గరగా]. బయటనుంచి అరుస్తావ్ దేనికి ? లోపలికి రా ! [కంఠస్వరం తగ్గించి] నీ కాళ్లు విరగ్గొట్టి పంపుతాలే ! రా !!

క్లబ్ ప్యూన్ [దణ్ణంపెడుతూ లోపలికి వచ్చి]. నేనయ్యా ! సత్తిగాణ్ణి ! మరిగత్తే మాదవరావుగార్ని, బమ్మానందంగార్ని

తమరు టీపార్టీకి దయసెయ్యా మన్నారంట. [బుర్ర గోక్కుంటూ] కాని, ఆరి కేదో తొందరపని తగిలిందంట. ఆ మాట మీతో సెప్పిరమ్మన్నా రయ్యా!

శివరావు [మనిషి చచ్చిపోయి]. ఏడ్చినట్టే వుంది! ఎక్కడున్నా రేమిరా వాళ్ళిద్దరూ?

క్లబ్ ప్యూన్. క్లబ్బులో వున్నారయ్యా.

శివరావు. ఏం చేస్తున్నారురా!

క్లబ్ ప్యూన్. ఏమో నయ్యా!

శివరావు. ఏమో యేమిటి?—నీ తలకాయ్! వా ళ్లేం చేస్తున్నారు?

క్లబ్ ప్యూన్. సెబ్తే, నన్ను తెగ్గోస్తారేమో నయ్యా!

శివరావు. ఫరవాలేదురా, చెప్పు!

క్లబ్ ప్యూన్. నే సెప్పానని తమరు....

శివరావు. చెప్పనులేరా! నీ కేమీ భయమొద్దు.

క్లబ్ ప్యూన్. ఆ రిద్దరూ పేకాటలో కూకున్నారయ్యా!

శివరావు. రాస్కెల్స్!

క్లబ్ ప్యూన్. పేదోణ్ణయ్యా! తమరు నిగ్గదీస్తే సెప్పాగాని....

శివరావు. ప్చ! నీ కేమీ ఫరవా లేదు! నీకు మాట రానివ్వను. సరే — నువ్వు పో!

క్లబ్ ప్యూన్. ఎళ్ళొస్తా నయ్యా! దయుంచండి.

[దణ్ణంపెట్టి వెళ్ళిపోతాడు.

శివరావు. స్కౌండ్రల్స్!

కృష్ణవేణి. వీళ్ళా ఎగవేశా రన్నమాట. నే చెబ్తే వింటారటండి? ఉత్తిపుణ్యానికి డబ్బుకు డబ్బూ ఖర్చుపోతారు; మనస్సుకి

మనస్సూ హైరాన పెట్టుకుంటారు. మన యెత్తువాళ్ళతో మనం వుండాలిగాని, పై కెగరబోతే....

శివరావు. ఊఁ! చాల్లే—! సంతోషించాం! పోపో!!

కృష్ణవేణి. అంతే లెండి! అమ్మకీ నేనే లోకువ! కొడుక్కీ నేనే లోకువ!

[కృష్ణవేణి నెడుతుంది. శివరావు "ఉస్!" అంటూ పడకకుర్చీలో జేరగిలబడతాడు.

శివరావు. [పడకకుర్చీలో జేరగిలబడినవాడు, హఠాత్తుగా నిటారుగా కూర్చుని] అమ్మా!....అమ్మా!

వెంకాయమ్మ [వచ్చి]. దేనికిరా, అబ్బాయ్!

శివరావు. ఈ ప్లేట్లు తీసుకుపో!

వెంకాయమ్మ. అదేమిటిరా? అంతా యేరీ?

శివరావు. ఆఁ! ఏం తగలడ్డారో! వీటిని పట్టుకుపో!

వెంకాయమ్మ. పట్టుకొచ్చింది పట్టుకుపోలేదూ? — మీ ఆవిడొచ్చి పట్టుకుపోతుందిలే! [ఒకక్షణం ఆగి] ఎల్లుండి మంచిరోజటరా, అబ్బాయ్! నేను మన వూరు వెడతా.

శివరావు. ఎందు కమ్మా, యిప్పు డక్కడికి? అక్క డేం మునిగిపోతున్నది?

వెంకాయమ్మ. లేదురా, అబ్బాయ్ నే నెళ్ళాలి.

శివరావు. రాకరాక మొన్నే గదమ్మా, నువ్వొచ్చావ్! అప్పుడే వెళ్ళాలా? మరొక నెలరోజులైనా వుండగూడదూ?

వెంకాయమ్మ. ఇక్కడి కిది చాల్లే.

శివరావు. ఇక్కడ నీకు బాగా లేదే మమ్మా ?

వెంకాయమ్మ. బాగేమిటి, వోగేమిటి ? ఎక్కడైనా నేను పొట్ట కూటిదాన్నేగా ! ఇంత పని చేయించుకుంటారేమో, ఇంత ముద్ద వేస్తారేమో !

శివరావు. నిన్ను పనెవ్వరు చెయ్యమన్నారమ్మా ? - మహారాజులా కాలిమీద కాలువేసుకు కూర్చోక !

వెంకాయమ్మ. ఆఁ ! కాలిమీద కాలువేసుకు కూర్చుంటే నెత్తిని బండ పెడతారు.

శివరావు. ఏమి టమ్మా ? ఈ పూట నువ్వు చాలా చిత్రంగా మాట్లాడుతున్నావ్ !

వెంకాయమ్మ. చిత్రంగా మాట్టాడ్డానికి నే నేమీ చిత్రాంగిని కాదు.
[విసురుగా వెళ్ళిపోతుంది.

శివరావు [కుర్చీనుంచి లేచి]. కృష్ణా !

కృష్ణవేణి [వచ్చి]. దేనికండీ ?

శివరావు. మా అమ్మ ఊరు వెళ్ళిపోతానంటున్న దేమిటి ?

కృష్ణవేణి. ఏమో నాకేం తెలుసు ?

శివరావు. ఆమెతో పోట్లాడావా ?

కృష్ణవేణి. ఉహుఁ !

శివరావు, నిజం చెప్పు.

కృష్ణవేణి. లేదండీ ! ఆమే ఉత్తిపుణ్యానికి నన్ననీ్న దులపరించింది.

శివరావు. అకారణంగా ఆమె నీతో తగ వెందుకు పెట్టుకుంటుంది?

కృష్ణవేణి. ఏమో, నన్నడిగితే ?

శివరావు. అసలు తగ వెలా ప్రారంభమైం దేమిటి ?

కృష్ణవేణి. ఆమెగారితో తగ వెవరు పెట్టుకున్నారండీ ! కృష్ణా, రామా అంటూ మీకు ఒక్కటే స్మరణైపోయిందని ఆమే సాధింపు ప్రారంభించింది.

శివరావు. ఊరికే ఆమె ని న్నెందుకు సాధిస్తుంది?

కృష్ణవేణి. నిజమండీ ! నే నేమీ అనలేదు. ఆమె అదృష్టంవల్లనే మీకు పెద్ద చదువొచ్చిందట ; నా దురదృష్టంవల్ల మీకు పెద్ద ఉద్యోగ మేదీ రాకుండా పోయిందిట. పెద్దబ్బాయికి అన్యాయం చేసి, కాపరాన్ని అప్పుల పాల్జేసి, మిమ్మల్ని చదివించిన వెలుగేమీ కనబడ్డంలేదట. ఏ డిప్టీ కలెక్టరు పనైనా కాక పోతుందా అనుకుంటే, ఈ గుమాస్తాగిరి దొరికిందట. పెద్ద చదువు చదువుకున్నందుకు పెద్ద కొలువులో చేరి, అన్నయ్యను ఆదుకుంటా రనుకుంటే, మీ సంపాదన మీకే అస్తు బిస్తుగా వుందట. మరే సింగారం లేకపోయినా, అప్పుల సింగారం కనబడుతున్నదట. పెట్టి పోషించక పోయినా, ఏదో వాస్తూ పోతూ వుందామంటే, ఇది పరాయి కొంపకంటె కనాకష్టమై పోయిందట.

శివరావు. ఆమెను నువ్వేమి నొప్పించావో ? లేకపోతే ఆమె ఇంత నిష్ఠూరంగా మాట్లాడేది కాదు.

కృష్ణవేణి. ఏ వొట్టుపెడితే ఆ వొట్టు ! నే నేమీ అనలేదండీ !

శివరావు. చాల్లే ! నువ్వేమీ అనకపోతే ఆమె మనస్సు కింత కష్ట మెందుకు కలుగుతుంది ? వొంటిమీద వెండి బంగారాలు తెగనమ్మికూడా నాకు చదువు చెప్పించింది. ఆమెను పువ్వుల్లో

పెట్టి పూజించేది పోయి, మనం కాపరంపెట్టిన ఇన్నాళ్ళ కొకసా రొస్తే మంచి మర్యాదే చేశావ్ !

కృష్ణవేణి. నాతోడు ! నే నొక్కమాటైనా అనలేదండీ !

శివరావు. ఊహు! నువ్వేమీ అనలేదు! మా అమ్మే గయ్యాళి గంప. మా అమ్మే నీతో పోట్లాటకు బొడ్డుకు మసిపూసుకు కూర్చున్నది.

[కళ్ల వెంట నీళ్లు కాల్వ కాగా, మారు మాట్లాడకుండా కృష్ణవేణి వెడుతుంది.

శివరావు [అశాంతిగా నాలుగైదుసార్లు పచారుచేసి]. అమ్మా!

వెంకాయమ్మ [వస్తూ]. ఎందు కేమిటి?

శివరావు. అత్తాకోడళ్లకు జగడ మెందుకు వచ్చిందమ్మా?

వెంకాయమ్మ. మాకు జగడ మేమిటిరా?

శివరావు. ఇంకా నాదగ్గిర దాపరికం దేనికమ్మా? ఎందుకొచ్చింది పోట్లాట?

వెంకాయమ్మ. మీ యింటి కొచ్చి, ఎదురు మీతో పోట్లాట కూడానా?

శివరావు. అదేమి టమ్మా? ఇది నీ యిల్లు కాదూ?

వెంకాయమ్మ. ఆఁ! నాయిల్లు కాకేఁ! మీ ఆవిడ మా యిల్లు, మా వాకిలి, మా కంచాలు, మా మంచాలని నేనొచ్చిన కాడినుంచీ అంటున్నది - నువ్వీన లేదూ? ఇక్కడ నా దేముంది?

శివరావు. ఇంతేనా? మరేమైనా అనిందా?

వెంకాయమ్మ. ఇది చాలమా? ఇంకే మనాలి? రోస మున్న దెవ తైనా పిసుక్కు చావడాని కిది చాలు!

శివరావు. ఈ మాట తప్పుకాదని నే ననడం లేదమ్మా! ఇది తప్పే. కాని, ఇంతే అనిందా? ఇంకేమైనా కూడా నోరు పారేసుకున్నదా?

వెంకాయమ్మ. నోరు మెదపకుండానే చుర్రున వాత లంటించ గలిగినప్పుడు నో రెందుకు పారేసుకుంటారు?

శివరావు. అయితే, నువ్వు దాన్ని మన్నించవచ్చు. కావాలని అది నీ మనస్సు నొప్పించలేదు; తెలియకచేసింది.

వెంకాయమ్మ. చెప్పొచ్చావులే — మా లావు తీర్పు! పెళ్లాం బెల్లం, తల్లి విషం - లోకంలో వున్న సంగతేగా?

శివరావు. అది కాదమ్మా? ఇక్కడ మన చుట్టాలా, పక్కాలా? మేము కాపరంపెట్టి రెండేళ్ళు కావొస్తున్నా, ఇప్పటికిగాని నువ్వు వచ్చావ్ కాదయ్యె. ఈలోపున ఇరుగు పొరుగువాళ్ళతో మా యిల్లనడం దానికి అలవాటై పోయింది. మరొకవిధంగా వాళ్ళతో అది మాట్లాడ్డానికి వాళ్లు మన చుట్టాలా? పక్కాలా? అదే అలవాటు చొప్పున నీతోకూడా....

వెంకాయమ్మ. చాల్లే! వెనుకేసుకొచ్చావ్!

[మూతీ, ముక్కూ విరుస్తూ వెడుతుంది.

శివరావు. అమ్మా! [కాస్త ఆగి] అమ్మా! [ఎంతకూ బదులు లేక పోగా] పొరపాటుగా అన్న మాట కింతకోప మెందు కమ్మా? [క్షణం ఆగి] కృష్ణా! [నాలుక కరుచుకుంటూ] కృష్ణవేణీ!

కృష్ణవేణి [కళ్లు తుడుచుకుంటూ వచ్చి]. దేనికండీ?

శివరావు. మా అమ్మ మనస్సుకు ఎందుకు కష్టం కలిగిందో తెలుసా ?

[కృష్ణవేణి జవాబు చెప్పదు.

శివరావు. ఆవిడతో మాట్లాడుతూకూడా మాయిల్లు, మా వాకిలి, మా మంచాలు, మా కంచాలు అంటావట ! అలా అంటే....

కృష్ణవేణి. అబ్బే ! నే ననలేదండీ !

శివరావు. అలవాటుచొప్పున అన్నావేమోలే ! కాని, పొరపాటుగానైనా పరాయిదాన్నిగా చూస్తే ఆమె మనస్సుకు....

కృష్ణవేణి. నా కామె కాదు ; ఆమెకు నేనే పరాయిదాన్ని. చిన్నదైనా తమ్ముడి కూతుర్ని చేసుకుంటె, మాలో అతుక్కుపోయేదని ఆమె సూటీ పోటీగా అనని రోజు లేదు.

శివరావు. చాల్లే ! ఇఖ కయ్యానికి కాలు దువ్వకు !

కృష్ణవేణి. అంతే లెండి ! మీరూ మీరూ ఒఖటి. నేనేగా పరాయిదాన్ని !

[గిర్రున నీళ్లుతిరిగిన కళ్ళతో ఒక్కసారి తలెత్తి చూచి, కృష్ణవేణి వెళ్ళిపోతుంది, "అబ్బబ్బ" అంటూ శివరావు తిరిగి పడక కుర్చీలో జేరగిలబడతాడు.

శ్రీరాములు [చడీ చప్పుడు కాకుండా వచ్చి]. ఏరా, అప్పుడే అంతా వచ్చి వెళ్లా రేమిటి ?

శివరావు [విసుగ్గా]. ఊఁ !

శ్రీరాములు. వేళకు అందుకో లేనేమోనని అక్కడికీ ఆదరాబాదరా పడొచ్చారా ? అసలు రాకే పోదును. కాని, నువ్వు ఏమనుకుని పోతావోనని తెరిపి చేసుకొచ్చా. అడుగూ బొడుగూ కాస్తనా కేమైనా మిగిలిందా ?

శివరావు. కాస్త ఖర్మ మేమిటి? అంతా నీకే మిగిలింది!

శ్రీరాములు [కంఠంవరకూ మెక్కడానికి అన్నట్టుగా తాపీగా ఒక కుర్చీలో కూర్చుంటూ]. నిన్ను చూస్తే నా కెంతో ముచ్చటరా! శ్రమలేని ఉద్యోగం, ఒకటో తేదీకి ఠంచనగా జీతం, అప్పు డప్పుడూ స్పెషల్ యింక్రిమెంట్లు, త్వర త్వరగా ప్రమోషన్లు, పెద్దపెద్దవాళ్ళతో స్నేహాలు, రవ్వా రట్టూ లేకుండా గుట్టుగా సంసారం. ఓః! ఏం హాయి!

శివరావు. ఆః! చాలా హాయి! ఇంటిగుట్టు ఈశ్వరుడి కెరుక!

తెర]



## పాత్రలు

| | |
|---|---|
| మోహనరావు<br>అనసూయ | తెరపైకి వచ్చేవారు |
| బిచ్చగాళ్లు,<br>సీతారామయ్య<br>తులశమ్మ | నేపథ్యంలో నిలిచేవారు |

## స్థలం

మోహన్‌రావ్ యింటిలో ముందు గది

## కాలం

వర్తమానం



# భావకవి

మోహన్‌రావు యింటిలో ముందరి గది. కుడిచేతివైపు ద్వారం వీధి తల వరండాలోకి; ఎదురుగానున్న ద్వారం పడకగదిలోకి; ఎడమ చేతివైపు ద్వారం భోజనాలగది, వంటిల్లు మొదలైన వాటిలోకి. [వీధి తల వరండాలోనుంచి ముందరి గదిలోకి ఒక ద్వారం వుంటే, పడక గది లోపలికి మరొక ద్వారం వున్నదన్నమాట.] ఎదురుగుండా వున్న ద్వారానికి రెండుపక్కలా రెండు కిటికీలు.

గదిలో ఒక పక్కగా రోజ్ వుడ్ టేబుల్, దాని వెనక కుర్చీ. గది మధ్యగా రెండు, మూడు పాత పేము కుర్చీలు. గోడలకు చౌకబారు క్యాలెండర్లు. తుక్కు పుస్తకాలతో అద్దం తలుపుల బీరువా.

తెర లేచేసరికి మోహన్‌రావు టేబుల్ వద్ద కూర్చుని ఏదో వ్రాయడానికి ప్రయత్నం చేస్తూవుంటాడు. కుడిచేతిలో కలం; ఎడమ చేతిలో సిగరెట్టు. వ్రాత సాగడం కష్టమైపోయినకొద్దీ సిగరెట్టు దమ్మును మరింత గట్టిగా లాగుతూవుంటాడు.

అతని వయస్సు ముప్ఫయి అయిదుప్రాంతాల. కాశ్మీర్ శాలువ వల్లెవాటుతో సహా పక్కా బెంగాలీబాబు వేషం.

అనసూయ వయస్సు పాతిక సంవత్సరాలు. అందకత్తె. లేనిపోని ఆడంబరాలకు పోక, సంసార పక్షంగా వుంటుంది. మాటకారి కాని, మెత్తని మనస్సు.

మోహనరావు [వ్రాసే ప్రయత్నం విరమించి]. అనూ! అనూ!

అనసూయ [ప్రవేశిస్తూ]. "అనసూయ" అంటూ నాకు శుభ్రమైన పే రుండగా, ఏమిటండీ, ఈ అనూ, వినూ!

మోహనరావు. వినడానికే నిన్ను పిలిచింది.

అనసూయ. మీ కవిత్వమేనా? "నా సఖీ! ఓ సఖీ! ఓహో సఖీ!" ఎన్నిసార్లు విననండీ? చెంతనున్న ఈ సఖిని కన్నెత్తి చూడ్డానికి పురసత్ లేకపోయినా, ఏ సఖినిగురించో అదే పనిగా కలవరిస్తూ వుంటారు.

మోహనరావు. నేను బాధపడతానని తెలిసికూడా నా సఖిని అవహేళన చేయడం నీకు తగునా?

అనసూయ. అబ్బే! నే నేమీ హేళన చెయ్యడం లేదు. అయినా చేస్తేమాత్రం త ప్పేమున్నది?—నా కామె సవి తైనప్పుడు? ఎప్పటి కప్పుడు ఆమె సంగతి సందర్భాలు విచారిద్దా మనుకుంటూనే వివరంగా అడగలేదు. ఆ సఖిగా రెవరండీ?

మోహనరావు. ఆమె నా కవితాసఖి; గగన సీమంతిని.

అనసూయ. రెండు పేర్లు చెబుతున్నారు. ఇంతకీ, ఒక్కరా? ఇద్దరా?

మోహనరావు. ఒక్కతే! కాని, ఆమెకు సహస్రనామా లున్నాయి.

అనసూయ. అందుకనేనా మీ రామెకు సహస్రనామ పూజ చేస్తూ వుంటారు. మీ పూజ లందుకోడానికి ఆమెగా రెక్కడ బైఠాయించారు?

మోహనరావు. నా హృదయపీఠంపై.

అనసూయ. నాకు తెలిసినంత వరకు అది నలుసంత పీట. దాని మీద కూర్చోడానికి ఆమె నలుసంత మనిషా?

మోహనరావు. ఆమె సూక్ష్మాతిసూక్ష్మ; విశ్వవిశాల.

అనసూయ. విన్నకొద్దీ ఆవిడ సంగతి మహా చిత్రంగా వుంది. అంత చిన్నదీ, అంత పెద్దదీ కూడా కావడానికి ఆమె హనుమానులవారికి తోబుట్టువు కాదుగదా?

మోహనరావు. ఇది ఆమెపట్ల మహాపచారం!

అనసూయ. ఆమె రూపురేఖలు తెలుసుకోవాలని అడుగుతున్నానండీ! ఈ మాత్రానికే తప్పు పట్టాలా? ఆమె చూడ చక్కనిదేనా? ముక్కూ, ముఖమూ అందంగా వుంటాయా?

మోహనరావు. ఆమె అశరీరవ్యక్తి; ఆద్యంతరహిత శక్తి.

అనసూయ. అంటే మీరనే దేమిటి? ఆమెకు రూపమే లేదూ?

మోహనరావు. కాని, కోటి రూపాలతో కోటానుకోట్ల ప్రియులకు ఆమె సాక్షాత్కరిస్తూ వుంటుంది.

అనసూయ. మీ రొక్కరే అనుకున్నా! ఆమెగారికి నా తలలో వెంట్రుక లంతమంది మొగుళ్ళున్నా రన్నమాట!

మోహనరావు. నన్ను నొప్పించడానికే నీ వీ మాట లంటున్నా, ఆమె నా భావనావీధిలోని ప్రియాంగన కాని, నీవు చిత్రించ గోరుతున్నట్టు, బజారులోని పణ్యాంగన కాదు.

అనసూయ. నాకు తెలియ కడుగుతాగాని, వీధి అంటే బజారు కాదండీ? ఏమైనా తుకిడీలు, తుకిడీలుగా ఇంతమందిని ఆమె తనకు గులాముల్ని చేసుకోవడం గొప్ప సంగతే!

ఆమె వయస్సెంత ? పడుచుదేనా? లేక, ఆమె విషయంలో అన్నీ విడ్డూరాలైనట్టు, ముసిలిదా?

మోహనరావు. ఆమెకు జరలేదు; మృతిలేదు, ఆమె నిత్య యౌవని; నిత్యనూత్న ; నిత్యప్రణయిని ; నిత్యవిరహిణి. ఏజాతికీ ఆమె చెందదు! ఏ నీతీ ఆమెను బంధించదు.

అనసూయ. అలా చెప్పండి. ఆమెకు నీతీ లేదు; జాతీ లేదు. అటు తిరిగి, ఇటు తిరిగి, చివరికి మీరూ నే నన్న మాటకే వచ్చారు!

మోహనరావు. మానవమాత్రకాని ఆ తేజోమూర్తిని సామాన్య మానదండాలతో కొలవడానికి ప్రయత్నించబోకు.

అనసూయ. దండాలు పెట్టి, ప్రాణాచారాలు పడి, మీరు దాన్ని కొలుస్తున్నారు చాలదూ? నేనుకూడా కొలవడం దేనికి లెండి. నాకు వేరే కొలువున్నది; వంటింటి కొలువు. నే పోతున్నా.

మోహనరావు. వంటిల్లే నీకు వైకుంఠం.

అనసూయ. లేకపోతే విస్తరిలోకి మెతుకు లెలా వస్తాయండీ!

మోహనరావు. తిండి! తిండి! పాడు తిండి! పొట్ట నింపుకోవడమే ప్రధానమా? అయితే మనకూ, పశుపక్ష్యాదులకూ భేదమేమిటి? జీవితం విలువలు తెలిసినవారికి అన్నవస్త్రాదులు ముఖ్యం కావు; ఉషఃకాలం, సూర్యోదయం....

అనసూయ. పొద్దు బారెడెక్కేదాకా మీరు నిద్ర లేవరయ్యె! లేచిన తర్వాత గంటకైనా మంచంపైనుంచి కాలు కిందపెట్టరయ్యె! సూర్యోదయాలతో మీకేం పని?

మోహనరావు. నీ భౌతిక ప్రపంచంలో ఒక్క సూర్యుడే కాని, నా మానసిక జగత్తులో శత సహస్ర సూర్యు లుదయిస్తూ వుంటారు. నా సూర్యుల కాంతి తీక్ష్ణమైంది కాదు ; కవోష్ణ మైంది. అది తృష్ణ కలిగించదు; తృప్తి నిస్తుంది.

అనసూయ. నేను మామూలు మనిషిని. నాతో మామూలుగా మాట్లాడరాదటండీ ? మీ పుస్తకాల్లో మాటలు నాకు అప్పజెబు తారు దేనికి ? మీ కవితాసఖితో మీరు కాలక్షేపం చెయ్యండి ; నేను చక్కా పోతున్నా.

[పోబోతుంది.

మోహనరావు [ధోరణి మార్చి]. ఆఁ! ఆఁ! లేదులే. కాస్త నిదా నించు. కొత్తగా నే నొక నాటకం ప్రారంభించా.

అనసూయ. మన బ్రతుకే ఒక నాటకంగా, ఒక బూటకంగా వున్నదయ్యో! ఇప్పుడు మీరు కొత్తగా ప్రారంభించడం దేనికి?

మోహనరావు. చాల్లే! నువ్వు ప్రతిదానికీ విపరీతార్థాలు తీస్తావ్!

అనసూయ. మీ కింత విసుగు దేనికి లెండి! నన్ను పోనీయండి!

మోహనరావు. లేదులే—ఆగు! ఇదివర కెన్నడూ నేను నాటకం రాయలేదు. ఇవ్వాళే కొత్తగా ఒకదాన్ని ప్రారంభించా.

అనసూయ. ఏఁ! మీ కవితాకన్యకు విడాకు లిచ్చారేమిటి?

మోహనరావు. నేనా ? కవితాకన్యకు విడాకు లివ్వడమా? అదెన్న టికీ జరగదు.

అనసూయ. ఔనులెండి! మీ రొకవేళ విడిచిపెట్టాలన్నా, అది మిమ్మల్ని విడిచిపెట్టదు. పుట్టుమచ్చలు పోతాయి కనకనా, పుట్టుకతో వచ్చిన కవిత్వం పోవడానికి!

మోహనరావు. నిజం, అనూ! నిజం! నీ వన్నది నిజం! నేను పుట్టుకతోనే కవిని. జన్మ జన్మాంతరాలనుంచీ కవిత నంటి నేను వస్తున్నాను; న న్నంటి కవిత వస్తున్నది. కవితే నాకు ప్రాణం; కవితే నాకు ప్రపంచం; కవితే నాకు సర్వస్వం. కవిత కానిది కల్ల.

అనసూయ. ఔనండీ! ఔను! ఈ సంగతి నాకు బాగా తెలుసు. ఇల్లూ, వాకిలీ మీకు కల్ల! ఇల్లాలూ కల్ల! ఇంతకీ మన కవితా కన్యకు చెల్లుచీటీల ప్రమాదమేమీ లేదంటారు!

మోహనరావు. నా కవితారాధనలో ఒక భాగమే ఈ నాటక రచనా ప్రయత్నం. "కావ్యేషు నాటకమ్ రమ్యమ్". కాళిదాస మహాకవికూడా మేఘసందేశాది మహాకావ్యాల తర్వాత అభిజ్ఞాన శాకుంతలం, విక్రమోర్వశీయం మొదలైన నాటకాలు రాశాడు.

అనసూయ. అయితే, మీరూ రాసుకోండి! మీ దేవకన్యల్ని గురించి వినడానికి నా కిప్పుడు తీరుబాటు లేదు.

మోహనరావు. ఉహుఁ! నా నాటకం దేవకన్యల్ని గురించికాదు.

అనసూయ. మీ రాజపుత్రికల గొడవైనా నాకు పట్టదండీ!

మోహనరావు. అబ్బే! కాదు. ఇది పూర్తిగా కొత్త నాటకం. కథా వస్తువులో, కథా సంవిధానంలో, పాత్రకల్పనలో, పాత్ర పోషణలో, సంభాషణల గతిలో, సన్నివేశాల రతిలో— అంతా కొత్త; క్రొత్త నడలతో, క్రొంగొత్త నుడులతో, రసస్ఫోరకంగా, రసోజ్జ్వలంగా, రసైక్యంగా నడుస్తుందిలే!

అనసూయ. నడవనివ్వండి. మీ మాటలే నాకు కొరుకుడు పడ నప్పుడు మీ నాటకం నడకలు నాకేం తెలుస్తాయ్! నే వెళ్లి నా వంటపని చేసుకుంటా; మీరు రాసుకోండి.

మోహనరావు. రాయడానికే ప్రయత్నం. కాని, కృత్యాద్యవస్థలో పడ్డాను.

అనసూయ. అంటే?

మోహనరావు. ఆదిలోనే అడ్డింది.

అనసూయ [నవ్వుతూ]. అయితే, అట్లకాడ తేనా, అడ్డు కుళ్ళ గించడానికి?

మోహనరావు. పరిహాసంలో గట్టిదానివేలే! కాని, నా కిప్పుడు పట్టిన ప్రశ్న పరిహాసం కాదు; ప్రణయం.

అనసూయ. అంత ప్రళయ మేమి వచ్చిపడిందండీ?

మోహనరావు. అదుగో! తిరిగి పరిహాసమా? ఇహ చాలించి, రాసినంతవరకు నా నాటకాన్ని సావధానంగా విని, ఒక సలహా చెప్పు.

అనసూయ. అయ్యో రామ! నేను మీకు సలహాలు చెప్పేపాటి దాన్నా? అయినా చదవండి.

మోహనరావు. ఈ నాటకంలోని రసస్ఫూర్తి నీ వనుభవించా లంటే, ముందు కొంత ఉపోద్ఘాతం అవసరం.

[ఉపోద్ఘాతం ప్రారంభించడానికి గభీర ముద్ర ధరించి, అర్ధనిమీలితనేత్రు డౌతాడు.

అనసూయ. ఏమండోయ్! నా కవతల చేతినిండా పనుంది. మీ రిప్పుడు మబ్బుల్లోకి పరుగులెత్తి, చుక్కల్ని పుణుకుతూ కూర్చుంటే....

మోహనరావు. [విసుగ్గా]. అబ్బ! రసభంగం చేస్తావ్!
అనసూయ [నాలిక కరుచుకుంటూ]. అయ్యో రామ! తప్పే!
మోహనరావు. సరే! ఇకనైనా ఉపోద్ఘాతం చెప్పనిస్తావా?
అనసూయ. ఊఁ! కానివ్వండి.

మోహనరావు [ఈసారి పోజ్ పెట్టకుండానే]. అతడు కురూపి. కాని కవి, రసజ్ఞుడు, వ్యుత్పన్నుడు. కళాసంపత్తి ఎక్కువ. కవిత్వంకోసం బ్రతుకుతాడు, రుచిగలవాడు.

అనసూయ. రుచిగలవా డేమిటండోయ్! మీరు కొరుక్కు తిని చూశారేమిటి?

మోహనరావు ["కాస్త ఆగు!" అన్నట్టు సంజ్ఞచేసి]. అతడు స్నిగ్ధ హృదయుడు, సౌందర్యోపాసి.

అనసూయ. ఒక్కరూపులో తప్ప, అచ్చంగా మీ లాంటివాడే అందురూ!

మోహనరావు [అంతవరకు కాల్చుతున్న సిగరెట్టును నేలపై పారవేస్తూ]. కొంతవరకు అంతే ననుకోవచ్చు.

అనసూయ. ఎక్కడబడితే అక్కడ మీలా యిలాగే సిగరెట్టు పీకలు పారవేసేవాడా?

మోహనరావు. సౌందర్యోపాసనకు, సిగరెట్టు పీకలు పారవేయడానికీ సంబంధ మేమిటి?

అనసూయ. ఆఁ! నిజమే! వాటికి సంబంధ మేమీ లేదు. కాని, అద్దంలా వూడ్చి పెట్టుకున్న నేలమీద సిగరెట్టు పీకల్ని చూస్తే నా కెందుకో వొళ్ళు గరపొడుస్తుంది. ఇంతకూ, మీ నాటకంలోని ఈ అత డెవడండీ?

మోహనరావు. నా నాటకానికి కథానాయకుడు.

అనసూయ. అతనికి ఊరూ, పేరూ లేవేమిటి?

మోహనరావు. అతనిపేరు చంద్ర.

అనసూయ. అ దేమిటండీ ఆడపేరు!

మోహనరావు. అతడు కవి. రసజగత్తును సృష్టించే కవికి రసధుని వంటి పేరు పెట్టడమే రసౌచిత్యం.

అనసూయ. సర్లే! ఆ చంద్రప్పగారి మాటేమిటి ?

మోహనరావు. అబ్బబ్బ! నేను ఎంతో ఆలోచించి పెట్టిన పేరు సొగసు ఇట్టే చెడగొట్టేశావ్!

అనసూయ. ఆ సొగసు లేవో నా కేం తెలుస్తాయిలెండి. సరే కానివ్వండి!

మోహనరావు. చెప్పాను కదూ? - అతడు కురూపి.

అనసూయ. వొత్తి కోతిలా వుంటాడేమిటి?

మోహనరావు. అబ్బ! ఇంత కటువుగా మాట్లాడతావేఁ?

అనసూయ. మీరే అంటిరిగా అతడు కురూపివాడని.

మోహనరావు. సర్లే! విను! బాహ్యసౌందర్యం లేకపోయినా, అంటే, పైపై అందం లేకపోయినా....

అనసూయ. పైపై అందమొకటి, లోపల అందమొకటి - ఇన్ని వుంటాయటండీ?

మోహనరావు. ఔనౌను! ముక్కు, ముఖాల అంద మొక అందమా?

అనసూయ. ఓహో! అలాగేఁ! అందువల్లనే కాబోలు....

[మాట పూర్తి చేయకుండానే ఆగిపోతుంది.

మోహనరావు. ఏమి టది ?

అనసూయ. ఆ(! ఏమీ లేదులెండి.

మోహనరావు. ఏ మాటకూ లేని సంకోచం దీని కెందుకు?

అనసూయ. ఆ( ! మరేమీ లేదు. ముక్కు, ముఖాల అంద మొక అందం కాకపోబట్టే కాబోలు నేనున్నదీ, లేనిదీ కాననట్టుగా మీరు సంచరిస్తూ వుంటారు.

మోహనరావు. కానక పోవడమేమిటి? కళ్ళెదట తిరుగుతూ వుంటే!

అనసూయ. కళ్ళెదట ఎంత తిరిగితే మాత్రమే? మీ లోక మేమిటో! మీరేమిటో! రాత్రి నే నేమి పువ్వులు జడలో పెట్టు కున్నానో చెప్పండి? చూద్దాం!

మోహనరావు. నువ్వు జడలో పెట్టుకున్న పువ్వుల పేర్లు జ్ఞాపకం వుంచుకోవడం తప్ప నాకు పని లేదా?

అనసూయ. కవిత్వం రాసేవారికి పెళ్ళాం పెట్టుకున్న పువ్వుల పైకి కన్నే పోదన్నమాట. అయితే, మరి పువ్వులపైన పాటలూ, పద్యాలూ అల్లడం దేనికో!

మోహనరావు. ఇవి పెద్ద సంగతులులే! ఇవి నీకు అర్థం కావడం కష్టం. రసజ్ఞ హృదయంవల్ల, రసోపాసక జీవితంవల్ల, రస పారవశ్యంవల్ల సిద్ధించే ఆత్మసౌందర్యమే వాస్తవికమైన సౌందర్యం. అదే అనుపమ సౌందర్యం; అదే అలౌకిక సౌంద ర్యం. రసోపాసకు లందరు ఆశాజీవులు. ఊహాతీతమైన దేనికో వారు అర్రులు జాస్తారు. దూర దూరాలకు, రహస్తీరా

లకు వారు పరుగుపెడతారు. వారినే కవిత్వం వరిస్తుంది. వారు బాధలో హృదయం చీల్చుతారు; బ్రతుకులో కవిత్వం ఏరుకుంటారు. ప్రతి పదం జీవించే పలుకుతారు.

అనసూయ. తక్కినవాళ్లు చచ్చికూడా పలుకుతా రేమిటి? ఏమీ అర్థంకాని మొద్దుని. ఆ చెప్పే దేదో నాకు కాస్త తెలిసేటట్టు చెబుదురూ!

మోహనరావు. రసోద్వేగంలో పడిపోయాలే! సరే, విను! చంద్ర పైకి అందగాడు కాకపోయినా, నిజానికి అందమైన వాడే.

అనసూయ. కాబోలు!

మోహనరావు. కాబోలు కాదు; ముమ్మాటికీ.

అనసూయ. మంచిది; అచ్చుకున్నానండీ! అతడు బాలచంద్రుడే!

మోహనరావు. ఒక యువతిని అతడు ప్రేమిస్తున్నాడు. ఆమె దివ్యసుందరమూర్తిని తన హృదయపీఠంపై ప్రతిష్ఠాపించుకుని, ప్రేమసుమాలతో, రక్తోదకాలతో అహర్నిశలు అర్చిస్తున్నాడు.

అనసూయ. రికామీగా కూర్చోడానికి మీవలె జరుగుబా టున్నవా డేమిటి?

మోహనరావు [ముఖం చిట్లిస్తూ]. నీకు తోచే వన్నీ యిలాంటి అవకతవక ప్రశ్నలే!

అనసూయ. నాకు తెలియకడుగుతా గాని, తిని కూర్చోడానికి తగు స్థితి లేనివాడైతే, రాత్రింబగళ్లు ఏదో ఒక అమ్మాయిని గురించి జపంచేస్తూ కూర్చోగలడటండీ!

మోహనరావు. చాల్ చాల్లే! ఈ విషయాలు నీకు తెలియవ్.
అనసూయ. అయితే, మరి నాకు చెప్పడం దేనికి ?
మోహనరావు. ఆ మాటా నిజమే! నా మూడ్ చెడగొట్టేశావ్.
అనసూయ. అయ్యో రామ! మళ్ళీ మూడుపోటు వచ్చిందేమిటి ?
మోహనరావు. ఊఁ! మూడుపోటూ లేదు; గీడుపోటూ లేదు.

[మోహన్‌రావు సిగరెట్టు ముట్టిస్తాడు. అనసూయ "ఏఁ! కోపమొచ్చిందా ?" అని అడుగుతుంది. అతడు జవాబు చెప్పడు. ఇంతలో ఈ కింది పాట పాడుకుంటూ తలవాకిలిలోకి ఇద్దరు, ముగ్గురు బిచ్చానికి వస్తారు.

"బిచ్చగాళ్ళామండి నారాయణా !
కాసిని బియ్యం పెట్టించండి నారాయణా !
పట్టెడన్నంలేదు నారాయణా !
మాకు కట్ట గుడ్డాలేదు నారాయణా !
కొంపగోడూలేదు నారాయణా !
చింపిగుడ్డ లిప్పించండి నారాయణా !
ఆకలికి చస్తున్నాము నారాయణా !
మేము చలికి నొస్తున్నాము నారాయణా !
లేనివాళ్లమండి నారాయణా !
మాకు లేదన బోకండి నారాయణా !

[బిచ్చగాళ్ళ పాటమధ్య "నిజంగా ఇదంతా కోపమే ?" అని అనసూయ అడుగుతుంది. ఆమె మాట విననట్టు మోహనరావు నటిస్తాడు. ఒక క్షణం తర్వాత "చాల్లే!

పొండోయ్" అని బిచ్చగాళ్లను కసురుకుంటాడు. అయినా వాళ్లు పాటసాగిస్తూ పోతూవుండగా, "వీళ్ళకెవ్వరూ చెప్పేది! చచ్చుపీనుగుల్లారా! పో పొండి!" అని గద్దిస్తాడు. అప్పటికీ బిచ్చగాళ్లు పాట మానరు. అంతట "వస్తున్నానర్రా! ఆగండి!" అంటూ అనసూయ కదులుతుంటె పాట ఆపి, "అమ్మా! మా అమ్మా!! కాశీ అన్నపూర్ణమ్మా! గుప్పెడు గింజలు" అని బిచ్చగాళ్లు అర్థిస్తారు. సిగరెట్టు కాల్చుతూ మోహనరావు గదిలో పచారుచేస్తూ వుంటాడు. బిచ్చగాళ్లకు ముష్టి పెట్టి పంపించిన అనసూయ తిరిగి వస్తుంది.

అనసూయ. పాపం! వాళ్ళ దేశంలో కరువు వచ్చిందటండీ! మూడేళ్లనుంచి వరసగా వానలు లేవట. వాగులు, వంకలు, చెరువులు, దొరువులు — దేనిలోనూ చుక్క నీళ్ళైనా లేవట. వానదేవుడు దయచూడక పోతాడా అని ఈ మూడేళ్లనుంచీ ఏటేటా పైర్లు పెట్టుకుంటే, ఏటేటా పెట్టిన పైర్లు పెట్టినవే మలమల మాడిపోయినవట. అమ్మకు తినగలదల్లా అమ్మకు తిన్నారట, మరేమీ దారి కనబడక, ఊరూ, నాడూ విడిచిపెట్టి, కొంపా గోడూ పాడుపెట్టి, "అమ్మా - అయ్యా!" అంటూ పట్టెడు మెతుకులకోసం గడప గడపకు తిరుగుతున్నారు. కళ్లు లోతుకు దించుకుపోయి, ముఖాలు చప్పగా డొక్కుపోయి, పొట్టలు వెన్నుకు అతుక్కుపోయి, పక్క టెముకలు బయటికి పొడుచుకొచ్చి, పీనుగులంటే పీనుగులుగా....

మోహనరావు [చెవులు మూసుకుంటూ]. ఈ పాడు మాటలు నాకు చెప్పకు!

అనసూయ. పాడు మాట లేమిటండీ! పాపం! తినడానికి పట్టెడు మెతుకులు లేక, తాగడానికి చిట్టెడు గంజైనా లేక, చెట్టుకొాక పక్షిచొప్పున అయిపోయి, "అమ్మా! తల్లీ!" అంటూ వాళ్లు అఘోరిస్తుంటే! వాళ్ళ వొంటిని ఎక్కడైనా ఇంత కండన్నమాట వుంటే వొట్టు. వొత్తి ఎముకలగూళ్ళు. ఎండి వొరుగై, రాసేపో, కూసేపో అన్నట్టుగా వున్నారు. వాళ్ళని చూస్తే నాగుండె చెరువై పోయింది.

మోహనరావు [కోపంతో సిగరెట్టు విసిరికొట్టి]. చాల్ చాలు! ఇఖ కట్టిపెట్టు! కూడులేక ఎన్ని కుక్కలు చావడం లేదు! వాటిసంగతి నేను పట్టించుకో బోతున్నానా?

అనసూయ. అయ్యో రామ! మనుష్యులు, కుక్కలు ఒఖటే నటండీ!

మోహనరావు. ఆఁ! అంతే! సంస్కారం లేకపోతే, రసజ్ఞత లేకపోతే! నేను కవిని. కమనీయ వాతావరణం నాకు కావాలి. అందాన్ని నేను ఆరాధిస్తాను; ఆనందాన్ని నేను అన్వేషిస్తాను. వాటిని నా రచనలద్వారా లోకానికి పంచి పెడతాను. నాదృష్టి మేఘాలపైకేగాని, మురికి గుంటలపైకి పోరాదు. నేను వినవలసినవి కోకిలపాటలు గాని, కూటికై అరుపులు కావు. ఈ వికృతప్రపంచంతో, దీని వికార జీవితంతో సంబంధం లేకుండా, అనంతాకాశాలలోకి కరగని ఒక ఆవేదనతో, దొరకని ఒక తేజస్సుకై .... నేను.... నేను....

అనసూయ [తెల్లబోయి]. అయ్యో రామ! ఎందుకండీ అంత కోపం? [లెంపలు వాయించుకుంటూ] బుద్ధి పొరపాటైంది.

[అనసూయ వెళ్ళిపోతుంది. మోహన్‌రావు కుర్చీలో కూర్చుని కొత్త సిగరెట్టు ముట్టిస్తాడు. టేబుల్‌వద్ద కూర్చుని వ్రాయడానికి ప్రయత్నించగా ఒక్క అక్షర మైనా రాలదు. అంతట కుర్చీలోనుంచి లేచి, గదిలో నాలుగైదుసార్లు పచారుచేస్తాడు. పిమ్మట "అనూ" అని వరసగా రెండు, మూడుసార్లు పిలుస్తాడు.

అనసూయ [వస్తూ]. మళ్ళీ ఎందుకండీ?

మోహనరావు. ఏఁ! కోప మొచ్చిందా?

అనసూయ. కోపమైనా, తాపమైనా మీకే చెల్లు! నా దేముంది? మొద్దురాచ్చిప్పను!

మోహనరావు. నాది సున్నితమైన మనస్సని నీకు తెలుసుగదా? తెలిసీ, కరువు, కాటకాల మాటలు నాకు చెప్పవచ్చునా?

అనసూయ. తప్పేనని చెంపలు వాయించుకున్నా గదండీ!

మోహనరావు. సరే! ఇలాంటి పాడుమాటలు చెప్పి, నా మనసు మరి నొప్పించకు. ఆఁ! అన్నట్టు నా నాటకం కథ ఎంత వరకు చెప్పాను? ఆఁ! ఆమె....

అనసూయ. ఆమె యెవతండీ? [అంతలో నాలిక కరచుకుని] ఆఁ! ఎవతైతే నాకు దేనికిలెండి! ఊరుకోలేక నవ్వులాటకు నేనేమైనా అంటే, ఇట్టే మీకు తట్టెడు కోప మొస్తుంది.

మోహనరావు. అబ్బే! సందేహం వస్తే అడగనూ వచ్చు; తీర్చు కోనూ వచ్చు. నా మనోవీధిలో ఈ పాత్రలు స్పష్టంగా,

సజీవంగా మూ_ర్తిమంతమై వున్నందున నీకూ సుపరిచిత వ్యక్తులే అన్నట్టు పొరపడుతున్నాను. ఆమె ఎవరో నీకు చెప్పనే లేదు. ఆమె సరళ. చంద్ర ప్రేమిస్తున్న దివ్యసుందర యువతి.

అనసూయ. ఓహో!

మోహనరావు. పేరు చక్కగా కుదిరింది కాదూ! ఆమెది సరళాతి సరళ హృదయం. అందువల్ల "సరళ" అని నామకరణం చేశాను.

అనసూయ. ఓ! దివ్యమైన పనిచేశారు.

మోహనరావు. ఆమె ఎంత రూపవతో అంత గుణవతి; ఎంత గుణవతో, అంత విద్యావతి. ఇక, ఆమె సిరి సంపత్తు లింతంత కావు.

అనసూయ. పాడుదేవుడు! అన్నీ ఒక్కరికే అమిర్చిపెడతాడు!

మోహనరావు. ఆమె మహదైశ్వర్యానికి ప్రలోభపడి ఒక జిత్తులమారి.... అతడి పేరు శాస్త్రి.... జంబుక శాస్త్రి అని ధ్వనించాలే! ధ్వని ప్రధానమైనదే ఉ_త్తమకావ్య మౌతుంది.... చంద్ర, సరళ, శాస్త్రి అని పేర్లు పెట్టడంలోనే నేను గొప్పగా ధ్వనించాను కాదూ?....ఆమె సంప_త్తికి ప్రలోభపడి ఆమెను వశీకృతను చేసుకోవాలని శాస్త్రి సకల మాయోపాయాల ద్వారా ప్రయత్నిస్తున్నాడు; సమ_స్త సమ్మోహనాస్త్రాలను పుంఖానుపుంఖాలుగా ఆమెపై సంధిస్తున్నాడు. సరళహృదయ గనక, అతడి కపటాన్ని ఆమె కానలేక పోతున్నది. అతడి పైపై మెరుగులకు భ్రమసి, అతడి మాయ మాటలకు మురిసి,

అతడే తనకు తగిన వరుడని ఆమె భావిస్తున్నది. హృదయం లేని ఒక మహానీచుడు, సంస్కారంలేని ఒక పరమతుచ్ఛుడు సరళ మధుర జీవితాన్ని బలిగొనబోతున్నాడే అని చంద్ర ఆందోళన పడుతున్నాడు; ఆవేదన చెందుతున్నాడు; ఆక్రోశిస్తున్నాడు. ఈ ఘట్టంలో నేను నా నాటకాన్ని యెత్తుకుంటున్నాను. ఏం! ఈ యెత్తుగడ రసవత్తరంగా వుంటుంది కదూ?

అనసూయ. మీ మాటలు నాకు రావు గాని, బలే పసందుగా వుంటుంది.

మోహనరావు. నిజమేనా? పరిహాసం చేస్తున్నావా?

అనసూయ. అయ్యో రామ! ఇదెక్కడి పాపమండీ! నే నే మాటన్నా పరాచక మంటారు!

మోహనరావు. సరే! నా మొదటిరంగం,—సరళ దివ్యసౌధాన్ని పరివేష్టించివున్న పుష్పోద్యానవనం. దానిలో ఒక సుందర లతానికుంజం. ఆ నికుంజంలో ఒక చంద్రశిలావేదిక. ఆ వేదికపై దేవకన్యవలె విశ్రమించివున్న సరళ. ఆమె సహజ సౌందర్యానికి శీతల సుధాచంద్రికలు ఒక నూత్న శోభను తెస్తున్నాయి. ఆమె పాదపద్మయుగ్మంవద్ద శాస్త్రి కూర్చుని వున్నాడు. అతడు ఒక ప్రేమగీతాన్ని ఆలపిస్తూ వున్నాడు.

అనసూయ. అది మీరు రాసిందేనా?

మోహనరావు. ఔను. నేను రాసిందే. "సఖీ! సఖీ: నీ సఖుడనే" అంటూ రాశానే—ఆ ప్రేమ గీతం. ఆ గీతంలోని అవ్యక్త మాధుర్యానికి మందానిలంతో మావిచిగురువలె ఆమె చలించి పోతున్నది. చంద్రశిలావేదికపైనుంచి అశాంతిగా లేచి, ఆమె

లతానికుంజం వెలుపలికి వస్తుంది. మరింత తేనె లూరేటట్టు ప్రేమగీతాన్ని ఆలపిస్తూ శాస్త్రి ఆమెను అనుసరిస్తాడు అప్పుడు....

అనసూయ. ఆ అమ్మాయికి అమ్మా, బాబూ లేరేమిటి?

మోహనరావు [పిడుగుపై బడ్డట్టు]. అదేమిటి?

అనసూయ. అమ్మా బాబూ వుంటే అదుపాజ్ఞలలో పెట్టుకోరటండీ? పెళ్ళికాని పిల్లను తోటలెంట వాళ్ళతోను, వీళ్ళతోను కలిసి తిరగనిస్తారా?

మోహనరావు. అబ్బబ్బ! నీ సామాన్యపు కొలతబద్దలతో నేను సృష్టిస్తున్న ఆదర్శజీవులను కొలవాలంటావ్!

అనసూయ. మీ కొలతబద్దలకైతే గజానికి ఆరడుగు లుంటాయి కాబోలు!

మోహనరావు. నీ పరిహాసాలకేమి గాని, నేను చెప్పబోతున్న దాన్ని కాస్త చెప్పనీ! "శాస్త్రి కపటి. అతడు ప్రేమిస్తున్నది నిన్ను కాదు; నీ సంపత్తిని" అని సరళను హెచ్చరించడం తన విధ్యుక్త ధర్మమని ఒక నిశ్చయానికి వచ్చి, సరిగా అదే వేళకు చంద్ర వస్తాడు. రసకందాయపు పట్టులో చంద్ర వచ్చాడని శాస్త్రి ఆగ్రహపరవశు డౌతాడు. అన్యాపదేశంగా చంద్రను నిందించాలని,....సరే, ఇక నేను రాసింది చదువుతా విను.

[తను వ్రాసిన కాగితాలు తీసుకుని, నాటకంలో వేషధారి వలె పోజ్ పెట్టబోయి, అంతలోనే ఆగుతాడు.

మోహనరావు. ఆఁ! అన్నట్టు నీ కిక్కడ ఒకమాట చెప్పాలి. లేకపోతే, నా ఉపక్రమణికలోని రసవద్విశేషం నీకు బోధ

పడదు. చంద్ర నల్లటివాడు. నల్లటివాడని శాస్త్రి అతణ్ణి వెక్కిరిస్తున్నాడన్నమాట.

అనసూయ. ఓహో!

మోహనరావు. ఇక చదవనా? [అనసూయ "సరే" అన్నట్టు తల ఊపగా, నాటక వేషధారి పోజ్ పెట్టి] మంచిది. సావధానంగా విను!

శాస్త్రి. సరళా! ఆ నీల మేఘశకలాన్ని చూడండి. క్రూర వన్యమృగంవలె అది పైకి దూకుతుంటే, భీతహరిణాలవలె ఆ చుక్క కన్నెలు ఎలా చలించిపోతున్నవో!

అనసూయ. అతని మాటలు మన మాటలుగా లేవేం?

మోహనరావు. చంపేశావ్! ఎత్తుగడలోనే నేను కాళిదాసు పోకడ పోయాననుకుంటే, నువ్వు చేసే వ్యాఖ్యాన మిదేనా?

అనసూయ. ఆఁ! నా మొఖం, నాకేం తెలుసులెండి! చదవండి.

మోహనరావు. మధ్యమధ్య నువ్వు వాఖ్యానాలు చెయ్యనంటే గాని చదవను. [అలాగే నన్నట్టు అనసూయ తల వూపుతుంది] ఈ మాటమీదే నిలబడాలి సుమా! [సరే నన్నట్టు అనసూయ తిరిగి మౌనంగానే సూచిస్తుంది.] అయితే విను!

సరళ [నవ్వుతూ]. చంద్రగారిని మించిన కవిచంద్రు లౌతున్నారే మీరు!

[ఇంతలో ఎవరో ఉక్కిరిబిక్కిరై దగ్గుతున్నట్టు వినబడుతుంది.

మోహనరావు. ఎవరది?

అనసూయ. సీతారామయ్యగారు కాబోలు!

మోహనరావు [చప్పున రెండుచేతులతో రెండుకళ్లు మూసివేసుకుంటూ]. ఖర్మం! సరాసరి ఇక్కడికే రాడుగదా! వెళ్ళి ఆయన్ని పంపించిరా! ముందు వెళ్లు!

అనసూయ. అంత భయం దేనికండీ! ఆయ నేం దెయ్యమా? భూతమా?

మోహనరావు. ఆ శవాకారాన్ని నేను చూడలేను. నా కళ్ళ బడకుండా తక్షణం పంపించి రా!

అనసూయ. అయ్యో రామ! వెడుతున్నాలెండి.

[అనసూయ వెడుతుంది. ఆమె వెళ్ళిన క్షణానికి మోహనరావు వెళ్ళనందుగుండా గుమ్మం వంక చూచి, భయం లేదని గుండె దిటవు చేసుకుని, గర్వాన కళ్ళకు కప్పుకొన్న చేతుల్ని తీసివేసుకుంటాడు. సిగరెట్టు తేసు, అగ్గి పెట్టె అందుకోబోయేసరికి అనసూయ తిరిగి వస్తుంది.

అనసూయ, సీతారామయ్యగారే నండీ! ఈ ఉత్తరమట - కాస్త చదివి పెట్టండి.

మోహనరావు [ఉత్తరాన్ని అందుకుంటూ]. తెలుగు ఉత్తరమేగాః? నువ్వే చదివి చెప్పరపోయావూ?

అనసూయ. ఆ గొలుసుకట్టు రాత నాకు తెలిస్తేనా?

మోహనరావు [ఉత్తరాన్ని చకచక లోపల చదువుకుని]. ఆః! ఏం లేదు. ఆడబిడ్డ లాంచనాలకింద నూటపదహార్లివ్వకపోతే వాళ్ళు పెళ్ళిసంబంధం వదులుకుంటారట.

అనసూయ. ఏమి అఘాయిత్య మిది?

[సీతారామయ్య తిరిగి ఉక్కిరి బిక్కిరిగా దగ్గుతాడు.

మోహనరావు. సరే! నువ్వెళ్ళి తక్షణం ఆయన్ని సాగనంపిరా!

అనసూయ. ఇలాంటి కష్టాలు మరి నాలుగు చుట్టుకుంటే ఆ పిచ్చి మారాజు తనే వెళ్ళిపోతాడు; ఎవ్వరూ సాగనంప నఖ్ఖరలేదు.

[అనసూయ వెడుతుంది. సీతారామయ్యగారికి తిరిగి దగ్గ తెర వస్తుంది.

మోహనరావు [ముఖం చిట్లిస్తూ]. అబ్బబ్బ!

[విసుగుదలతో గదిలో పచారు చేస్తుంటాడు. దగ్గుకుంటూ సీతారామయ్య వెళ్ళిపోతాడు.

అనసూయ [తిరిగి వచ్చి]. పాపం! మాటవినగానే ఆయన నిలువునా నీరైపోయాడండీ. చేతి కక్కరకొచ్చిన చెట్టంత కొడుకు నిరుడు పోయినప్పటినుంచీ ఆయన పడుతున్న కష్టాలు ఆ పగవాడికైనా వద్దు. "కట్నం వెయ్యిన్నూట పదహార్లకే గిజ గిజ లాడుతుంటే, మరొక నూటపదహార్లు నే నెక్కడ తెస్తానమ్మా?" అని - పాపం!—ఆయన కంట తడిపెట్టుకున్నాడు. కాని, ఏం చేస్తాడు ? రక్తం పిండుకునైనా ఆ నూట పదహార్ల ముడుపుకూడా చెల్లించుకోవాలి. ఈడు ముదిరిపోతున్న పిల్ల—మరెంతకాలం పెళ్ళీ పేరంటం లేకుండా యింట్లో పెట్టుకుంటాడు. తల్లి చాటున బ్రతకడానికి తల్లీ లేదయ్యె! ఆ కోడలున్నదంటే, అదొక రాక్షసి. ఆడబిడ్డను అష్ట కష్టాలు పెడుతున్నది. కడుపునిండా కూడైనా పెట్టకుండా మల మల మాడ్చి వేస్తున్నది. "నా ఆయుస్సుకూడా పోసుకుని మా అన్నయ్య చల్లగా వుండి, నేనైనా పోకపోయాను. మా నాన్నకు ఈ ముసలితనంలో ఈ కష్టాలైనా తప్పేవని మొన్న ఆ పిల్ల నా దగ్గిర ఆవురుమన్నది. అందరి కాళ్ళూ,

కడుపూ పట్టుకుని, అవస్థ లెన్నో పడితేగాని, ఈ సంబంధం కుదిరింది కాదు. ఇప్పు డిది తప్పిపోతే, ఆ పిల్ల ఏంకాను? ఆ తండ్రి ఏంకాను? అయ్యో రామ! ఆడపిల్లల్ని కనడమే మహాపాతకమైపోతే! చేతనైతే లోకానికి సిగ్గొచ్చేలా దీన్ని గురించి ఒక నాటకం రాయరా దటండీ?

మోహనరావు. వెర్రిదానా! ఇలాంటి సామాన్య విషయాలు కావ్య వస్తువు లౌతాయా?

అనసూయ. అయితే, లోకంలోలేని విషయాల్నిగురించి రాయడం ఎవర్ని ఉద్ధరించడానికండీ ?

మోహనరావు. ఉద్ధరింపేమిటి? ఆ ప్రశ్న లేనే లేదు. కళ కళ కోసమే. పువ్వు ఎందుకు విచ్చుతుంది ? కోకిల ఎందుకు పాడుతుంది? సెలయేరు ఎందుకు ప్రవహిస్తుంది?

అనసూయ. ఇంకా నయం! "నువ్వెందుకు అన్నం తింటున్నావ్? ఎందుకు గుడ్డ కడుతున్నావ్?" అన్నారు కాదు.

మోహనరావు. ఎంత గొప్ప సంగతినైనా ఇట్టే కూడుగుడ్డల లెవెల్‌కు దించేస్తావ్! ఇందుకు పూర్తిగా భిన్నమైనదే సాహిత్యం. జీవితాన్ని కవి యథామాత్రంగా చిత్రించరాదు. లోకానికి అతీతుడై, అతిలోకాన్ని సృష్టించాలి,

అనసూయ. ఆఁ! ముందు ఈ లోకంలో కడతేరితే గదా, తర్వాత ఏ లోకమైనా.

మోహనరావు. దుఃఖం, దైన్యం, దారిద్ర్యం, కల్ల, కపటం, కాఠిన్యం - ఇదేగా లోకమంటే? ఈ పాడు లోకంనుంచి ఎంత దూరానికి పారిపోగలిగితే, అంత గొప్ప కవి కావచ్చు.

అప్పుడే కవి రసాధిదేవతను ప్రసన్నం చేసుకోగలుగుతాడు! రసం లేనిదే....

అనసూయ. ఏం రసమో? నీరసం!

మోహనరావు. మ్చ్! నిన్ననే పనిలేదులే. ఇంతకూ తప్పు నాది! నేను నీతోనా సాహిత్యమీమాంస చెయ్యవలసింది?

అనసూయ. పోనీ, ఇప్పటికైనా మీ తప్పు తెలుసుకున్నారు. నేను పోతున్నాలెండి. వంటకు వేళ మించిపోతున్నది.

[నాలు గడుగులు వేస్తుంది.

మోహనరావు. అనూ! అనూ! ఆగు !—నీ వంట కేమిలే!

అనసూయ. మీ వంటేనా ముఖ్యం. మీరు తొమ్మిది రసాలే పెట్టగలరేమో కాని, నేను తొంభై రకాలు పెట్టగలను. నేను ఏ రసంపెట్టినా నోటికి కమ్మగా వుంటుంది.

మోహనరావు. సరే! ఒక్కమాట విని వెళ్లు. నా నాటకంలోని ఒక ఘట్టంలో....[తాను వ్రాసిన కాగితాలు తిప్పివేస్తూ] ఈ మధ్య భాగాలు వదిలేస్తున్నాలే! శ్రద్ధగా నీవు విననప్పుడు చదివి మాత్రం ప్రయోజన మేమిటి? చివరి భాగం మాత్రం చదువుతా. చంద్ర సరళతో....ఏఁ! చదవ మంటావా?

[నాటకంలోని వేషధారివలె పోజ్ పెట్టి గడగడ చదువుతాడు.

చంద్ర: "సరళా! నేను మిమ్మ మనసార ప్రేమిస్తున్నాను; పూజిస్తున్నాను. నాది కాముకుని తుచ్ఛ ప్రేమ కాదు; కవికుమారుని స్వచ్ఛప్రేమ; కళాజీవి మహోచ్చప్రేమ. కవితా కన్యకోసం, కళాదేవికోసం భువన భవనాలను యుగ యుగాలనుంచి అన్వేషిస్తున్నాను. కోకిల పాటలో, కేకిని ఆటలో ఆమెను

కానలేక వేగిపోయాను. పున్నమ తోటలో, వెన్నెల తేటలో ఆమెను కానలేక వేసారిపోయాను. ఎన్నో వింత కలలు కన్నాను; పంట కాఁకే మిగిలింది. కాని మీ వదనశ్రీని చూచినంతనే, నా తపస్సు ఫలించింది. తుది మొదలులేని అగాధ తమస్సులను చీల్చుకుంటూ మీ తరళలోచనాలు మెరుపులై మెరసినవి; పలుకులై పిలిచినవి. మీరు నన్ను స్వీకరించవచ్చు; లేదా తిరస్కరించవచ్చు. కాని, నా ప్రేమ మేరువుకంటె నిశ్చలమైనది ; నయాగరాకంటె మహోద్వేగమైనది; సాగరంకంటె అగాధమైనది. మీరు ఆనతిస్తే, ప్రళయాగ్ని గుండంలోనైనా దూకగలను; కాలకూట విషమైనా గ్రోలగలను. కాని, మీ సిగపువ్వు వాడినా నేను సహించలేను. శాస్త్రి మీ పాదరజాన్ని తలదాల్చడానికైనా తగడు. అతడు ధనలోభి, కామాంధుడు, సంస్కారశూన్యుడు, రసజ్ఞతావిహీనుడు. అతని కపటానికి మీరు బలి కావలదని నా ప్రార్థన’’.

మోహనరావు. ఈవిధంగా చంద్ర అనేసరికి....

అనసూయ. సరళ “అమ్మయ్యా!” అంటుంది.

మోహనరావు [ఆశ్చర్యంగా]. అదేమిటి? ఆ పిచ్చిమాట ఎందుకంటుంది?

అనసూయ. జడివాన కురిసి కురిసి వెలిసిందిగదా అని?

మోహనరావు. హాస్యానికి నీకు సమయాసమయాలు లేవు గాని, చంద్ర తనను ప్రేమిస్తున్నట్టు సరళ ఎన్నడూ శంకించనైనా లేదు. అట్టిది మహాగ్నిపర్వతమే బ్రద్దలైనట్టుగా అతడు తన ప్రేమను ప్రకటించాడు. కవి కుమారుడని, రసజ్ఞహృదయుడని అతడంటే ఆమెకు గౌరవాదరాలు లేకపోలేదు గాని, అతని

సౌందర్యవిహీనత కారణంగా, ప్రియునిగా ఆమె ఎన్నడూ అతనిని భావించలేదు. ఈ పరిస్థితిలో ఆమె మనోగతభావాలు ఏవిధంగా వుంటాయి?

అనసూయ. ఏమో నాకేం తెలుసు? ఆ వైనం ఆ సరళమ్మగారినే అడిగి చూడండి.

మోహనరావు. ఆ పరిస్థితిలో నువ్వే కాసేపు వున్నావనుకో.

అనసూయ. అంత దౌర్భాగ్యం నాకెందుకు పడుతుందండీ?

మోహనరావు. నువ్వు చెప్పలేకపోతే పోయావుగాని, నే నేమని ఊహిస్తున్నానంటే....

అనసూయ. మీకు తెలియని సంగతులు, మీకు అనుభవంలో లేని విషయాలు మీ రెందుకు రాయాలండీ?

మోహనరావు. అదే కవి ప్రత్యేకత! సమస్త విషయాలను అతడు ఊహిస్తాడు. అతడి ఊహకు అందనిది ముల్లోకాలలో లేదు. అతడి మనోనేత్రం మహాశక్తిమంతమైంది; అతడి అంతశ్చక్షువు మహామహితాత్మమైనది!

అనసూయ. అందువల్లే కాబోలు మామూలు కళ్ళతో చూడరు! మామూలు చెవులతో వినరు !!

మోహనరావు. ఇలాంటి మాటలంటేనే నాకు కోప మొస్తుంది!

అనసూయ [భయం నటించి, లెంపలు వాయించుకుంటూ]. అపరాధం! మహాపరాధం!!

మోహనరావు. శాస్త్రిపట్ల అసూయతోనే అతడి నింత నికృష్టమైనవాణ్ణిగా చంద్ర చిత్రించినట్టు సరళ శంకిస్తుందని నేను ఊహిస్తున్నాను. నా ఊహ సరైనదే అంటావా?

అనసూయ. మీరు ఏమైనా అనుకోవాలేగాని, మరి దానికి తిరుగేమిటండీ?

మోహనరావు. అనుకోవటాలు. గినుకోవటాలు కాదు. ఇక్కడే నన్ను కొంత సంశయం పీడిస్తున్నది. అందువల్లే నా నాటకం నడవడంలేదు. నువ్వే సరళ స్థితిలో....

అనసూయ. అయ్యో రామ! వద్దన్నకొద్దీ దానికీ, నాకూ సాపత్యం పెడతా రెందుకండీ?

మోహనరావు. నాకోసమని మాట వరసకు నువ్వే....[బయట నుంచి ఎవరో "అనసూయమ్మా!" అని పిలవగా] వీ రెవరు? అబ్బబ్బ! అంతా రసాభాస!

అనసూయ. ఏమండీ తులశమ్మగారూ! మీరా?

[అనసూయ వెడుతుంది. ముఖంలో విసుగుదల కనబడుతూ మోహనరావు తను వ్రాసిన కాగితాలు తిరగవేస్తూ వుంటాడు. కొన్ని క్షణాల తర్వాత సిగరెట్టు ముట్టిస్తాడుకూడా.

అనసూయ [తిరిగివస్తూ]. పాపం! ఆ తులశమ్మ వలవల యేడుస్తున్నదండీ! "మాది అవిభక్తకుటుంబం. ఇక్కడ నిదేముంది?" అని ఆవిడను....వాడులేడూ?....ఆవిడ మరిది... వా డొక్తి కర్కోటకుడు....ఈపూట ఇంట్లోనుంచి గెంటి వేశాడట. భర్తపోయిన ఈ ఆరేడు నెలలనుంచీ ఆ మరిది.... వాడి దెంత కటికిగుండో కాని....నానా హింసలు పెడుతున్నాడు. మీ నాన్న గారేనట, వాళ్ళకి నాలుగైదేళ్ళనాడు అన్నాదమ్ముల భాగాలు పంచిపెట్టి, పార్టీకత్తులు రాసిచ్చింది. ఆ కాస్త కొంపకూడా కలుపుకుపోతే, ఆమె తను వెలా గడుస్తుంది? అడిగేవారు లేకపోబట్టే గదా, వాడు ఆమె నింతగా కాల్చుకు తినడం! మీరు కాస్త జోక్యం కలిగించుకుని. ఆమెకు కోర్టు వ్యవహారం....

మోహనరావు [ముక్కుపై వేలు వేసుకుంటూ]. ఔరా! కవిత్వం పలికే నోటితో కూటసాక్ష్యాలు పలకమంటావా?

అనసూయ. ఇందులో అబద్ధ మేమున్నదండీ? వాళ్ళు ఏనాడో వేరుపడ్డ సంగతి....

మోహనరావు [చేతిలోని కాగితాలను నేలకు విసిరికొడుతూ]. చాల్ చాల్లే! పాపం వాళ్ళు, పాపం వీళ్ళు అంటూ అందర్నీ తెచ్చి నా నెత్తి నెక్కించు. ఈ వాతావరణంలో కళాసృష్టి ఏం జరుగుతుంది? రసాధిదేవతను ఏమి ప్రసన్నం చేసుకోగలం? రసవాహినులను ఎలా ప్రవహింప జేస్తాం? అందుకే కవి నిర్జనప్రదేశానికి పోవాలి; ఏకాంతవాసం చెయ్యాలి. నేనూ పోతాతే ఏ నదీతీరానికో, ఏ పర్వతప్రాంతానికో, ఏ అరణ్యగర్భానికో!

అనసూయ [తెల్లబోయి]. అయ్యో రామ!!

తెర]



# పాత్రలు

సుబ్బయ్య [రంగస్థలంపై]
గుమాస్తా [ నేపథ్యంలో ]

గమనిక : ఒక పాత్రను రంగస్థలంపై నిలిపి, రెండవ పాత్రను నేపథ్యంలో వుంచి, అమెరికన్ నాటక కర్త యూజీన్ ఓనీల్ "బిఫోర్ బ్రెక్‌ఫాస్ట్" అనే ఏకాంక నాటికను రచించాడు. కేవలం ఆ టెక్నిక్ మాత్రం ఈ నాటికలో అనుసరించబడింది. టెక్నిక్‌లో తప్ప, తక్కిన అన్ని విషయాలలో ఇది స్వతంత్ర రచన.



# దొంగ : దొర

శ్రీరామరాజ్యం రైసుమిల్లు ఆఫీసు రూమ్. కుడివైపున వీధితల ద్వారం, ఎదురుగా రెండు పెద్ద కిటికీలు. ఆ కిటికీలగుండా దూరాన చెట్లూ, ఆకాశమూ కనబడుతూ వుంటాయి. ఆఫీసు రూమ్ ఎడమపక్క గుమాస్తాల గది. పైభాగంలో రంగు అద్దాలు అమర్చబడిన బల్లకూర్పుతో [గ్లాస్ పేన్డ్ వుడెన్ పార్టిషన్‌తో] ఆఫీసు రూమ్‌లోని ఎడమభాగమే గుమాస్తాల గదిగా ఏర్పాటు అయివుంటుంది. బల్లకూర్పుమధ్య ఒక ద్వారం. దానికి "స్వింగ్ డోర్స్" [స్ప్రింగ్ తలుపులు]. ఈ తలుపులకు రెండు వైపుల కోట్లు తగిలించుకోడానికి రెండు చిలకకొయ్యలు.

గది మధ్యగా ఒక పెద్ద టేబుల్. దానిమీద టెలిఫోన్, లెటర్ బాక్స్, వ్రాతపరికరాలు, రబ్బర్ స్టాంపులు వగైరా. టేబుల్‌కు ఒకవైపున [ప్రేక్షకులకు సమ్ముఖంగా] ఒక చేతులున్న కుర్చీ; తక్కిన వైపుల మరి అయిదారు చేతులులేని కుర్చీలు.

తెర లేచిన ఒక క్షణానికి శ్రీరామరాజ్యం రైసుమిల్లు యజమాని సుబ్బయ్య ప్రవేశిస్తాడు. అతని వయస్సు నలభైపైన, నలభై అయిదు లోపు. పొట్టిగా, పలచగా వుంటాడు. కోలముఖం, చిన్న నుదురు, చింకి కళ్లు, పీచు మీసం.

పంచె కట్టి, కోటు తొడిగి, మెడచుట్టు నాలుగైదు మెలికలుచుట్టి ఉత్తరీయాన్ని వేసుకున్న సుబ్బయ్య ఆఫీసు రూమ్‌లో ప్రవేశిస్తూనే

ఒక చిలక కొయ్యదగ్గరకు వెళ్లి, ఉత్తరీయాన్ని తీసి దానికి తగిలిస్తాడు.

సుబ్బయ్య [స్వింగ్ డోర్సులో ఒకదాన్ని బయటికి లాగి, లోపలికి తొంగిచూస్తూ, లోపలున్న గుమాస్తాతో]. ఏం! ఇంకా పెన్సిళ్లు చెక్కడంకాదే వున్నావ్? ఒక బద్దీకత్తి పుచ్చుకుని పొద్దస్తమానం పెన్సిళ్ళు చెక్కిపారెయ్యడ మొక్కటే కన బడుతుంది. పనీ పంగూ లేదు.

[స్వింగ్ డోర్‌ను అతడు విడిచిపెట్టగా అది తక్షణమే మూసుకు పోతుంది. కోటు విప్పి, దాని జేబులో నుంచి కళ్లజోడు తీసుకుంటాడు. ఉత్తరీయాన్ని తగిలించిన చిలకకొయ్యకే కోటు కూడా తగిలించి, అతడు టేబుల్ దగ్గరకు వెడతాడు.

సుబ్బయ్య [టేబుల్‌పై పెట్టివున్న టపాను అందుకుంటూ, గది లోని గుమాస్తాను ఉద్దేశించి]. రెండో గుమాస్తా యివ్వాళ కూడా రానట్టేనా? ఇంకెన్ని రోజు లింట్లో పడుకుంటాడు!

[లోపలనుంచి ఏదో జవాబు వస్తుంది. అది మనకు వినబడదు; ఇంతలో ఒక ఉత్తరాన్ని విప్పి దాన్ని చదువుకోసాగిన సుబ్బయ్య ఆ జవాబు వినిపించుకోడు.

సుబ్బయ్య [ఆ ఉత్తరాన్ని పూర్తిచేసి, మరొకదాన్ని విప్పుతూ]. ఆం! ఏమన్నావ్?

[జవాబుకోసం నిరీక్షించకుండానే మూడవ ఉత్తరాన్ని చదవ నారంభిస్తాడు.

సుబ్బయ్య. చందాలట! చందాలు!! ఇక్కడ పోగోసుకు కూర్చున్నాం అందరికీ పందేరం పెట్టడానికి! [ఆ ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చించి, బుట్టదాఖలు చేస్తూ] వెధవలు! తెంపి వెధవలు!! నిమ్నజాతి సంఘమట. హాస్టలు పెడతారట. అడ్డమైనవాడికీ ఇప్పుడు చదువులు కావాల్సొచ్చాయ్! ఈ పాడు చదువులొచ్చాకే అలగాజనానికి కళ్లొచ్చాయ్. ధర్మ ఫండు ఇలాంటివాళ్లకి దొబ్బబెట్టడానికేనా! ఏ రామభజన కూటానికో, ఏ సాయిబాబా భక్తసంఘానికో ముట్టజెబితే పుణ్యం, పురుషార్థం. అంతే కాని.... [తర్వాత ఒక కార్డు అందుకుని, దాన్ని చదువుకుని, కలర్ పెన్సిల్‌తో దానిమీద ఏదో రిమార్కు వ్రాసుకుంటూ గుమాస్తాతో] ఆఁ! అయితే?

[సంబద్ధంలేని ఈ మాటతర్వాత మరొక కవరు చించి, కవరులోనుంచి ఉత్తరం త్వరగా బయటికి రాక పోగా విసుక్కుంటాడు.

సుబ్బయ్య [ఉత్తరాన్ని ఎలాగో బయటికి లాగి దాన్ని చదువుకుంటూ గుమాస్తాతో]. మొన్నరాత్రి హోటల్‌వాడి లారీ రాలా?....ఆఁ?....అంకిలి నొక్కుకుపోయిందేమిటి? నోట మాటే పెగలడంలేదు! [ఈమాటలు అంటూనే ఉత్తరాన్ని కంటితో చదువుతూ] ఆఁ! వచ్చి, వెళ్లిందటగా! ఆ మాట వీడే రాస్తున్నాడు. "మొన్నరాత్రి పెద్దయ్య ఇక్కడికి సుఖంగా చేరాడు." పెద్ద లారీనే పంపించాడూ? [గుమాస్తాతో] అయితే—ఓ దేభ్యం! పనిలో పని, ఆ రేషన్ కొట్టువాడికి కూడా ఒక పదిమూట లెత్తించకపోయావూ? [ఉత్తరం

మొదటి పేజీ పూర్తిచేసి, రెండవదాన్ని లోలోపల చదువుకుంటూ] మళ్ళీ అప్పుడే సరుకు కావాలంటా డేమిటి? వెధవ! దొంగ వెధవ! తన హోటల్ కని ఖరీదు చేసి, అక్కడ మారు బేరం సాగిస్తున్నట్టున్నాడు. వీడి హోటలే ఒక నల్ల బజారు. నల్ల బజారే అన్నమా టేమిటి? పిల్ల బజారు కూడా. వాటికి తోడు బియ్యం బజారుకూడా పెట్టాడు కాబోలు! దొంగ లాభాలు పోసుకోడానికి కాకపోతే, అప్పుడే మళ్లీ వీడికి సరు కెందుకు? టౌన్ స్టేషన్ సబినస్పెక్టరు నిన్నే బదిలీ అయ్యాడని ఎవరో అన్నారు. కొంచెం నోటి దురుసుతన మున్నా, బోళా మనిషి. తన మామూలు తనకు పుట్టజెపితే, మళ్ళీ మన జోలి కొచ్చేవాడు కాదు. కొత్తవాడు ఏ బాపతో మన కింకా తెలవదు. వాణ్ణి ఆకట్టుకోందే సరు కెలా పంపిస్తాం? [ఆ ఉత్తరాన్ని ఒక పక్కగా పెట్టి, ఆనాటి టపాలో మిగిలి వున్న కార్డును చదువుకుంటూ] ఆరి పీపి తస్స దియ్య! ఈ పెద్ద గుమాస్తా మరి వారం, పదిరోజులదాకా రాలేడ టే! ఒక దారీ తెన్నూ లేకుండా లెక్కలన్నీ తీన్ తేరాగా వున్నాయి. ఇన్ కమ్ టాక్సువాళ్లు లగాలగీ అంటున్నారు. [ఆనాటి ఉత్తరాలను డ్రాయర్ లో ఒకమూల భద్రంచేస్తూ] అబ్బబ్బ! ఈ గుమాస్తాగాళ్ళతో చెడ్డ బెడదైపోతే! పెద్ద గుమాస్తాకి కూతురు పెళ్ళాస్తే, రెండోవాడికి రోగ మొచ్చిందట! ఏం రోగమో, మాయరోగం! పని తొందరున్నప్పుడే వీళ్ళకి రోగాలూ, నెప్పులూ వస్తాయ్. వాళ్లు బలిస్తే సరి, రోగా లొస్తాయ్! రావూ? మందు తింటానంటే వాడి కొక నెల జీతం ముందే పారెయ్యడం పొరపాటై పోయింది. అది

చేతిలో పడ్డాక రెండు, మూడు రోజులైనా వాడు తిన్నగా ఆఫీసు కొచ్చాడో, లేదో ! ఆ రెండు, మూడు రోజులైనా వాడు మిడికిన పనేముంది ? ఖంగ్ ఖంగ్ మంటూ చెవికింద దగ్గుతూ కూలోవ్డం తప్ప. ఆకలి చచ్చిపోయిందట ! ఆకలి !! ఎక్కడ చచ్చిందీ ఆకలి ! మొన్నేగా ఈ మూడోగుమాస్తా బుడ్డాయ్ గాణ్ణి కూడగట్టుకుని తమకు జీతం చాలడంలేదంటూ తెగ బారెడు పిటీషన్ పెట్టాడు. ఈ యుద్ధంరోజుల్లో కాగితాలకు అసలే కరువుగా వుంటే, రెండు తావులు ఖరాబు చేశాడు. తమ అబ్బగాడి సొమ్మేమీ పోలేదుగా ! ఎన్ని పిటీషనులైనా పెడతారు. ఆ కాగితాలు నావి, ఆ కలాలు నావి, ఆ పాళీలు నావి, ఆ సిరాబుడ్లు నావి. నా ఖర్చుతో నాకే అర్జీలు! సాయంత్ర మయ్యేసరికి ఆ ముచ్చుముఖంవాడికి కాక తగిలినట్టుగా వుంటుందట! ఇద్దరికి ముగ్గురై పని తగ్గేసరికి ఎన్నిరోగాలైనా పుట్టుకొస్తాయ్ ! వెధవలు ! అంట్ల వెధవలు !! [గుమాస్తాతో] సర్లే ! ఆ చిట్టా, ఆవర్జా లిలా తగలెయ్ ! ఈ రెండు రోజుల నుంచీ లెక్క లేమైనా సరిచూశావా? గోళ్లు గిల్లుకుంటూ కూర్చు న్నావా ? బద్దీ కత్తితో పెన్సిళ్ళు చెక్కి పారెయ్యడం తప్ప. నీకు పనెక్కడ కదులుతుందిలే ! నిన్ను నమ్ముకుంటే ఇన్‌కమ్‌టాక్సు వ్యవహారం నిర్వాకమైనట్టే !

[గుమాస్తా గదిలోపలవుండే చిట్టా, ఆవర్జాలను అందిస్తాడు. అతని చెయ్యిమాత్రం మనకు కనబడుతుంది. అది పుల్ల లాంటి చెయ్యి. సగంవరకు దాన్ని కప్పివున్న చొక్కా చిరిగిపోయి వేలాడుతూ వుంటుంది. చిట్టా,

ఆపర్జాలను అందిస్తుండగా ఆ చెయ్యి కొంచెం వణుకుతున్నట్టు వాసం గమనిస్తాడు గాని, సుబ్బయ్య దాన్ని కానడు.

సుబ్బయ్య [చిట్టా, ఆపర్జాలను అందుకుంటూ]. ఏఁ ? లోపల నక్కుతున్నావే ? సందు దొరికిందిగదా అని చెప్పినపని సున్నా చుట్టి, ఊ రట్టుకు అడుక్కుతిన్నా వేమిటి ?

[చిట్టా విప్పి కొన్ని పేజీలు ఒకటొకటే తిప్పివేస్తాడు. ఎక్కువ పేజీలు తిప్పివేసి సందులన్ని వెనక్కి వచ్చి, ఒక పేజీ వద్ద ఆగుతాడు.

సుబ్బయ్య [గుమాస్తాతో]. ఏం రాతిది ? బ్రహ్మరాత ! తెలిసేటట్టు అక్షరాలు విడివిడిగా రాయమంటే, గొలుసుకట్టు అఘోరిస్తావ్ దేనికి ? [నొసలు ముడివేసి] ఏమి టిది ? బొబ్బా?.... ఉహుఁ !....బొప్పన ?....ఆఁ !....బొప్పనే .... లింగన్నగారికి పంకసన్నాలు నలభై రెండు బస్తాలకి బస్తా ఒకటింటికి పన్నెండు రూపాయల రెండణాల ఆరుపైసల చొప్పున అయిదు వందల పది రూపాయల ....

[టెలిఫోన్ గంట గణగణ మోగుతుంది.

సుబ్బయ్య [రిసీవర్ అందుకుని]. హలో ! ఆఁ ! శ్రీ రామరాజ్యం రైసుమిల్లే....ఊఁ ! ఊఁ ! సుబ్బయ్యనే....ఏమి టది ?.... సర్కిల్‌గారు మాట్లాడతారా ? అయ్యో ! అంతకంటేనా ! మాట్లాడమనండి....నమస్కారమండీ ! నమస్కారం ! అమ్మగారు కన్నారింటినుంచి తిరిగొచ్చారా ? .... మొన్న హెడ్డు చెప్పాడు లెండి, రేపో మాపో వొస్తున్నారని—ఆఁ ! చిత్తం !

చిత్తం! అలాగే లెండి, అదెంత భాగ్యం!....ఆఁ! ఆఁ! అరమూట చాలంటారా? పనిలోపని ఒక మూట....సరే, అలాగే!....ఢిల్లీ ఫోగాలే. వంకపెట్టడానికి వీల్లేదు. నాణ్యమైన సరుకు....అబ్బే! అవల్ రకమండీ! ఎంతమాట! తమకి కొత్తవి పంపిస్తామా? పాతవే. పాతరేసినొడ్లు. మనింట్లోకని స్పెషల్‌గా రెండు పుట్లు కొన్నాంలెండి. మొన్నే నాలుగు బస్తా లాడించాను. వాటిలోనుంచే....ఆఁ? కిందటిసారి కొత్త బియ్యం....ఆఁ! ఔనౌను! హెడ్డు ఆ మాట చెబితే నే నెంత నొచ్చుకున్నానని! నే నూళ్ళో వుంటే అలాంటి పని జరిగేదా? మా రెండో గుమాస్తాగాడికి చెప్పి, ఇన్‌కమ్‌టాక్స్ వాయిదాకని నేను....వా డొత్తి వెధవలెండి! చచ్చు వెధవ! అయ్యో!.... అయ్యో!....ఆఁ! ఆఁ! వాడే మింగ మెతుకులేదుగాని మీటింగు లెడతాడు!....ఆఁ! తీసి పారేద్దునుగాని, మనిషి పోతే మనిషి దొరకడం లేదండీ! ఈ యుద్ధ మొక టొచ్చాక గుమాస్తాగాళ్ళకీ గిరాకీ వచ్చిందయ్యో!....ఆఁ! ఆఁ!.... చిత్తం! చిత్తం....మరొక గంటకి మూట మీ యింటిదగ్గి రుండకపోతే న న్నడగండి! మా లారీ రాగానే....మంచి దండీ, అయ్యా! సెలవ్!!

[టెలిఫోన్ రిసీవర్ పెట్టేస్తాడు.

సుబ్బయ్య [చిట్టా తిరిగి అందుకుంటూ]. తేర సొమ్ము తెగతిని బలిసి కొట్టుకుంటున్నాడు. వీడి కథ, వీడి కమామిషు ఎవడికి తెలవదు! నిన్న మొన్నటిదాకా వీడు కనిస్టేబేగా? కాంగ్రెసువాళ్ళకి మతులు పోబట్టే వీడి గీత బయటపడింది.

ఉన్నచోటుండక ఆగస్టు ఉద్యమం, వాళ్ళ తలకాయ అంటూ బుద్ధగంతు లేస్తే, వాళ్ళ మక్కె లిరగ్గొట్టి వీడు సర్కి-లయ్యాడు. లేకపోతే, ఎక్కడుండేవాడో! కొత్త బియ్యం తినలేడట! అన్నం కాస్త చిమిడితే వీడి గొంతు పట్టుకుంటుంది కాబోలు! మహామహావాళ్ళే ఇప్పుడు కొత్తా పాతా చూడ్డంలేదు. దుమ్మూ, దుగ్రా కలిసినా గింజొకటి దొరికితే చాలని కళ్ళ కద్దుకుంటున్నారు. తెల్లారి లేస్తే ఏదో ఒక పని పడుతుంది గదా అని, అడగ్గానే నంబర్లు పంపిస్తే కొత్త బియ్యమట! కొత్త బియ్యం!! వీ డబ్బగాడి సొమ్ము ఇక్కడేదో దాచి పెట్టినట్టు! తేరగా తెమ్మనేది కాకుండా తప్పుపడుతున్నాడయ్యా, తప్పు!!

[చిట్టా ఒక పక్కని పెట్టి, ఆవర్జా తెరుస్తాడు. చిట్టా చూస్తూ, ఆవర్జా పేజీలు తిప్పుతూ, కలర్ పెన్సిల్‌తో టిక్కులు పెడుతూ పోతాడు.

సుబ్బయ్య. కళ్ళు పోతున్నాయ్ ఈ రాత తెలపక. ఏం రాత? పాడు రాత! [గుమాస్తాల గదివైపుకు తిరిగి] ఇదుగో నబ్బాయ్! ఇక నువ్విలా రాశావంటేనా, యింటికి నడవొచ్చు. [మళ్ళీ చిట్టావైపుకు తిరిగి] “ఈదుప్పుగంటి రాఘవయ్యగారి ఖాతాకు ధనిగుజార్తున చెల్లించిన రొక్కం ఏడువందల యాభై రూపాయలు.” మళ్ళీ వీడు ఏడున్నరవందలు పట్టుకుపోయాడూ? మరీ లెక్కాపత్రం లేకుండా వాడుకుంటున్నాడే!! వీడు తోలింది ముప్పై పుట్లేగా? ఖాతా వాడుకోవడంలో ఈ ఖరాటా యేమిటో వీణ్ణి కాస్త కనుక్కోవాలి.

[ఇంతలో టెలిఫోన్ తిరిగి మోగుతుంది.

సుబ్బయ్య [రిసీవర్ అందుకుని]. హలో : హలో !....ఆఁ ?.... అబ్బే ! మర్చిపోలేదు. తెప్పించి పంపిస్తా !....ఎప్పుడోనా ? అబ్బే ! ఇదుగో ! ఇప్పుడంటే యిప్పుడే....

[ఆ నంబరు డిస్‌కనెక్ట్ చేసి, కొత్త నంబరు అడుగుతాడు.

సుబ్బయ్య. హలో ! రావుగారేనా ?....ఆఁ ! నేనండి ! శ్రీ రామ రాజ్యం రైసుమిల్లు సుబ్బయ్యగారిని. మా చిన్న పిల్లవాడు కొన్ని రోజులుగా నలతగా వుంటున్నాడు. డాక్టరుగారికి చూపిస్తే, పాలలో పంచదార మానేసి, గ్లూకోజ్ వాడమన్నారు. ఒక పౌను డబ్బా....మీరే ఇలాగంటే ఎలాగండీ ? ఈ సాయం మీరు చెయ్యాలి. మాట తీసెయ్యొద్దు....పోనీ, ఒక అరపౌను డబ్బా........కనీసం పాతిక పౌను....అయ్యయ్యో ! మీవల్ల కాకపోతే. మరెవరివల్ల....ఏ ధరకైనా సరే.... అబ్బెబ్బే ! మీ షాపులో వుందని కాదు. మీపరంగా మరెక్కడైనా తెప్పించి....కాస్త వాకబుచేసి చూడండి, మీకు దొరక్కపోతుందీ !....ఎంతైతే తప్పుతుంది ?—మన కవసర మొచ్చినప్పుడు! మీ రెలాగైనా మాట దక్కించాలి....వుంటానండీ, వుంటాను !

[రిసీవరు పెట్టివేస్తాడు.

సుబ్బయ్య. వెధవ ! ఆశపాత్రపు వెధవ ! దొంగలాభాలు దొబ్బి మరిగి, వుంచుకునే లేదంటున్నాడు ! మరెక్కడో తెప్పించానంటే, అక్కడికి పెద్ద మెహర్బానీ చేసినవాడూ అవుతాడు; నల్లబజారు ధర పుచ్చుకున్నవాడూ అవుతాడు ! పిల్లవాడికి

కావాలని చెప్పినా, వాడి లేకిబుద్ధి వా డెందుకు పోనిస్తాడు ! వెధవ ! బందిపోటు వెధవ !!

[చూపు మళ్ళీ చిట్టాం, ఆవర్జా మీదికి పోతుంది. పరాసంగా కాసేపు పద్దుల్ని సరిచూసుకుంటాడు.

సుబ్బయ్య [గుమాస్తాను ఉద్దేశించి]. ఏం పనిది ? తిరపతి మంగలి పని ! చిట్టాలో పద్దులు ఆవర్జాలోకి ఒక ఎక్కితే ఒక ఎక్క లేదు. నువ్వు వొళ్ళొంగి పనిచేస్తేనా ? చుంచు ముఖమూ, నువ్వూను ! కూటికైనా గతి లేదంటూ కాళ్ళా, వేళ్ళా పడ్డావని దగ్గరికి తియ్యడంగాని, నిన్ను పనిలో పెట్టుకోమన్నదీ ? ఎప్పుడు చూసినా ఈదురోమంటూ వుంటావ్. ఏల్నాటి శని నీముఖానే వుంటుంది. ఒక్కరోజు ఆ పెద్దగుమాస్తా రాక పోతే అంతా ఖంగాళీయే ! ఈ ముష్టిపనికే వీళ్ళకి జీతాలు చాలవట. నెలకి పాతిక, ముప్పైచొప్పున పోసుకుంటున్నా నెప్పే ! వీళ్ల ప్యాసయిన బి. ఏ.లు, యం. ఏ.లు హితాయి పోతున్నాయా? వెధవలు ! పింజారీ వెధవలు !! వీళ్ల నసలు రామరామ అనగూడదు. ఎందు కీ ఆవర్జా ? అంతా తిన్నగా మండబెట్టినట్టు చేతికిచ్చావ్ !

[ఆవర్జాను ఫెడేలున మూసి ఒక పక్కకు తోసివేస్తాడు.

సుబ్బయ్య [చిట్టా మాత్రమే చూస్తూ]. తపుడు ఖాతాకు జమ : వెరసి అమ్మకం పదకొండు బస్తాలకు, బస్తా ఒకటింటికి...." ఏ తారీఖు నిది ? పదహారు—ఏడు—పంధొమ్మిదివందల నలభై నాలుగు—ఈమధ్య ఏనాడూ యాభై, అరవై బస్తాలకు తక్కువ అమ్మడంలేదే ! [గుమాస్తాను ఉద్దేశించి] ఇదుగో !

ఓ చవట పెద్దమ్మా! నిన్నే! కూడికలు తిన్నగా మిడికావా? కునికిపాట్లు పడుతూ చేతి కెంతొస్తే అంత వేశావా? నిద్ర మొఖం, నువ్వూను!

[టెలిఫోన్ మోగుతుంది.

సుబ్బయ్య [రిసీవర్ అందుకుని]. హలో!....ఎఫ్. ఐ. గారా? అయ్యా! నమస్కారమండీ! నమస్కారం! అబ్బే లేదండీ! మూడురోజులనుంచీ ఫ్యాక్టరీ ఆడ్డంలేదు. ఇంజను పిస్టను దెబ్బ తినింది. రిపేరుకు పంపించాం....ఆఁ?....ఆఁ!....రేపో, మాపో తిరిగి ఆడతాం....లేదండీ! రెండు రోజులనుంచీ ఊళ్లో లేను. ఇవ్వాళ పొద్దున్నే తిరిగొచ్చాను....అబ్బే! పద్దు పుస్తకాలు చూచుకుందామని .... ఇన్‌కమ్‌టాక్సు లెక్కలొచ్చి నెత్తిని కూర్చున్నాయ్!....ఆఁ! అన్నింటికీ నేనే నుంచోవాలి. పెద్ద గుమాస్తా లిద్దరు సెలవుమీ దున్నారు. చిన్నవాణ్ణి పెట్టుకుని నేనే దేవులాడుతున్నా....[నవ్వుతూ] అయ్యా! తమకేమండీ? తమరు మహారాజులు....అయ్యా!....అయ్యా!....చిత్తం!.... అబ్బబ్బే! తమకు మాట రానిస్తామా?....మొన్న బళ్ళారికి బట్వాడాచేసిన వెయ్యిబస్తాల మాటేనా?....ఆ బియ్యంలో సగానికి సగం మట్టేనన్నారూ? రామరామ! అం తెక్కడిదండీ? వుంటే, గింటే ఏ కొంచెమో వున్నదేమో! నిజంమాటకి అస లిప్పుడు రైతు సజావుగా గింజ అమ్ముతున్నాడండీ! తప్పా, తాలూ, దుమ్మూ. దూగరా, మానుకాయా, మసిని కాయా—అన్నీ కలిపి....అబ్బే! మనం ఎగుమతి చేసినప్పుడు పురుగులేదు; గాలిపాటుకు తర్వాత ఏమైనా పుట్టిందేమో!....

అబ్బే! మీకు లెక్కడివండీ? ఇను మిప్పుడు అసలే కరువుగా వుంటే!....చిత్తం!.... అయ్యా!.... చిత్తం!....అయ్యా!.... వారంనాటికే?....మూడువేల బస్తా వచ్చిబియ్యమా?....అంత ఆర్డరుకు మనదగ్గర ధాన్యం స్టాకులేదే!....మొత్తం స్టాకు ఎంతంటారా?....హోల్ మొత్తం అయిదువేల రెండువందల బస్తాలండి!....చిత్తం,అంతే లెండి! అయిదువేల రెండువందల బస్తా ధాన్య మాపితే, కటాకటిగా రెండువేల అయిదువందల బస్తా బియ్యమే దిగుబడి!....ఆఁ! అయితే, తమ దయ వుండాలే కాని, ఆ సరుకునే మరొక వంద బస్తా దేకించి, రెండువేల ఆరువందలు చెయ్యకపోతామూ?....నూతకలే అనుకోండి. కాని, మీరు సర్టిఫై చేస్తే నూతకలు సన్నాలై పోవ టండీ!....ఆఁ! మద్రాసుకైతే మరీ మంచిది! అక్కడ సన్నా లేవో, నూతక లేవో ఏ వెధవకి తెలుసండీ!....అయ్యా! మరొక ఆర్డరుకూడా వుందా?....ఆఁ? ఉప్పుడు బియ్యానికా?....కాని, రైతు ధాన్య మమ్మితేనా? వాళ్ళ ఆశకి అంతులేదు. పోసు కున్నకొద్దీ ఇంకా పోసుకోవా లంటున్నారు. కార్తీక మాసం నాటికి మరింత గిరాకీ వస్తుందేమోనని నిల్వపోసుకు కూర్చు న్నారు! బ్లాకు చెయ్యడంలో వాళ్ళ తర్వాతే. తమ రిప్పిస్తా నంటే, సరుకు చూపించడ మెంత పనండీ!....ఓఁ! చాలా వుంది....రామ్మూర్తి లేడూ? అతనిదగ్గిర....ఆఁ! ఆఁ! ఆ ఊరివాడే! ఆ ఊరు మొత్తంమీద అతనే మోతుబరి ఆసామీ! బాగా మదాయించి వున్నాడు....ఆఁ! అతనే! అత నొక్కడి దగ్గిరే వెయ్యిబస్తాదాకా ధాన్యం వుంది. తలవాకిట్లో వామి లాంటి పురికట్టుకు కూర్చున్నాడు. తమరు దాన్ని రిక్విజిషన్

చేసి మన కిప్పిస్తే.... అయ్యా! చిత్తం! చిత్తం!! దయమట్టుకు వుంచండి. తమ రాక కంటితో కనిపెట్టకపోతే.... నమస్కారమండీ! నమస్కారం!

[రిసీవర్ పెట్టివేస్తాడు.

సుబ్బయ్య, వీడికి బుద్ధి లేదు. ఇలాంటి సంగతులు టెలిఫోన్‌లో మాట్లాడొద్దురా అని ఎన్నిసార్లు మొత్తుకున్నా వినడు. అన్నీ మనరోజులే వుంటాయా? వెధవ! బుర్రలేని వెధవ. తెలివి తేటలకు ఆ జి. పి. ఓ. నే చెప్పుకోవాలి. పురుగునైనా దరిదాపులకు చేరనివ్వనట్టే వుంటాడు; అయినా, లక్షలకు లక్షలే దండుకుంటున్నాడు. ఆ జి. యం. ఒ. కూడా గడుసువాడే! మడి కట్టుకున్నవాడిలా బలే నాటకమాడతాడు. లొడలొడ వాగుడుగాళ్లు ఈ ఫుడ్ ఇన్‌స్పెక్టరూ, ఆ లోడింగ్ క్లర్కుగాడూ వున్నారుగా! వసూళ్లు చెయ్యడం వీళ్ళ పని; వాటాలు పంచుకోవడం వాళ్ళ పని. ఎగుడు దిగుడేమైనా వస్తే బొక్కలో వీళ్ళే కూర్చుంటారు, పైవాళ్ళిద్దరికే? వాళ్ళకొచ్చే ప్రమాద మేమీ లేదు. [చిట్టా అందుకుని. కళ్ళజోడు సరిచేసుకుంటూ] ఎంతపోసుకున్నా వీళ్ళ దాహం తీరదు. ఎదురింకా మట్టీ గిట్టీ అంటారు. ఏదో ఒక తొత్తడం చెయ్యందే వీళ్ళకు గుమ్మరించే సంచులన్నీ ఎక్కడి నుంచొస్తాయ్! ఈ యఫ్. ఐ. గాడు మరీని! నిన్నకాక మొన్నొచ్చాడు. అప్పుడే ఒక లకారం చేతబట్టాడు. వాని పుణ్యమా అని యుద్ధ మొక టొచ్చి బాగుపడ్డాడుగాని, వీడి నెత్తిని కానీపెట్టి

వేలంవేస్తే యేగాణీకి కొనేవాడుండేవాడా? వెధవ! లంచ గొండి వెధవ!!

[చిట్టా పేజీలు తిరగవేస్తూ వుంటాడు.

సుబ్బయ్య [విసుగెత్తిపోయినట్టు చిట్టానుకూడా రపీమని మూసి, దాన్ని ఒక పక్కకు నెట్టివేస్తూ]. అబ్బబ్బ! కళ్ళు పోతు న్నాయ్, ఈ పాడురాత తెలవక! కోడి కెలికిన పేడలానే వుంది నీ వెవసం రాత! అసలు నీ వల్ల ఏం పని కదులుతుందిలే! రేపు ఆ పెద్ద గుమాస్తా దగ్గిరికి మనిషి నురికించాలి, చప్పున తెముల్చుకు రమ్మని. ఆ పెళ్ళి పెటాకులూ ఎప్పుడో అయిపో యాయిగా! వీ డింకా అక్క డేమి అఘోరిస్తున్నాడు? పోనీలే, కూతురు పెళ్ళంటున్నాడని ధర్మఫండు ఖాతాలో ఖర్చురాసి, నాలుగు బస్తాల బియ్యం కొలిపించా. అవి తినేశేదాకా కదలడు కాబోలు! వెంటనే బయల్దేరి రాకపోతే నాగాలు కట్టి, జీతం తెగ్గోస్తే సరి! అప్పుడుగాని బుద్ధిరాదు. సర్లే! ఆ అనామతుఖాతా పుస్తక మిలా తగలెయ్! [ఒక క్షణం ఆగి] లోపల ఏం మిడుకుతున్నావ్? వెధవ! చచ్చు వెధవ!! తే! త్వరగా తే!!

[లోపలనుండే గుమాస్తా అనామతుఖాతా పుస్తకం అందిస్తాడు. ఈసారి అతని చెయ్యి గజగజ వణికి పోతూ వుంటుంది.

సుబ్బయ్య. ఏం? చెయ్యికి వొణుకు పుట్టింది! నీకూ కూడా మాయరోగ మేదైనా వచ్చిం దేమిటి? — పని మన్నాచేసి ఇంట్లో పడుకోడానికి!

[అనామతుఖాతా పుస్తకం తెరిచి, దాన్ని మౌనంగా ఒకటి, రెండు నిమిషాలు తిరగవేస్తాడు.

సుబ్బయ్య. మళ్ళీ ఈ ప్లీడరు అరమూట బియ్యం వేయించుకు పోయాడూ? ఏమిటి మనకి ఈ మెహర్బానీ! ఏదో శుభకార్యం వచ్చిందని మొహమోటపెడితే, నాలుగు బస్తాలు రాయితీగా యిచ్చామని వరస సాగుతున్నాడేఁ! తన ఫీజు తను తగ్గుతున్నాడా? ఈ సాహాస్తే నాకు తెలవదు, మా ఖామందు నడగమను! తన ప్రాక్టీసేమో తను చూసుకోకుండా, ఈ ముండమోపి కాంగ్రెసు ప్రచార మంటాడు! ఈ కాంగ్రెసు వాళ్ళుకాదూ దేశాని కిన్ని తిప్పలు తెచ్చింది. స్వరాజ్యం కావాలట; యుద్ధం వొద్దట! స్వరాజ్య మొచ్చి బువ్వ పెడుతుందా? దాని పుణ్యమా అని ఈ యుద్ధ మొచ్చాకే ఎవడికైనా నాలుగు డబ్బులు కళ్ళబడుతున్నాయి. ఆగకుండా మరి నాలుగేళ్ళ ఇలాగే యుద్ధం సాగాలని మొక్కుకునేది పోయి....

[మాట పూర్తిచేయకుండానే, కలర్ పెన్సిల్ పుచ్చుకుని, మొదటి పేజీలోని పద్దుల్ని కూడ నారంభిస్తాడు.

సుబ్బయ్య [కూడిక సరిగా వున్నందున ఆ పేజీ తిప్పివేస్తూ]. ఉఁ! సరే! [రెండో పేజీ తిప్పి, దానిలోని పద్దుల్ని పైనుంచి కిందికి ఒకసారి చూస్తూ]. మొన్నరాత్రి హోటల్ వాడికి తోలిన సరుకు పద్దు ఎక్కడా కనబడదేఁ? [మళ్ళీ ఒకసారి పైనుంచి కిందికి పద్దులన్నీ చూచి, వెనకపేజీలోకి వెళ్ళి, దాన్నికూడా తనిఖీ చేసి, కుర్చీలోనుంచి చరాలున లేస్తూ] ఆరి వెధవ! దొంగ వెధవ! ఇ దేమిటి? ఇలారా! ఎదటికి రా! ఇందుకేనా పొద్దుటి నుంచీ గదిలో నక్కినక్కి కూర్చున్నావ్! ఇందుకేనా అనామతుఖాతా తెమ్మంటే చేతులు గజగజలాడిపోయాయ్! నేను

మరేమిటో అనుకున్నా! వెధవ! దగాకోర్ వెధవ! రావేరా? రా! బయటికి రా! [ఎంతకూ గుమాస్తా బయటికి రాకపోగా స్వింగ్‌డోర్సువద్దకు వెళ్ళి. ఒక తలుపును లోపలికి తోసి పట్టుకుని] దొరగారూ! అయితే మొన్నరాత్రి హోటల్‌వాడికి వేసిన సరుకు పద్దు అనామతుఖాతాలో కనబడదేఁ? మాటా పలుకూ లేకుండా అలా గుడ్లు అప్పగించి చూస్తారేమండీ?.... ఆఁ?........ఎక్కించడం మర్చిపోయావూ? ముండమోపి! అయితే క్యాషుందా? ఏడీ, క్యాషుబాక్సు బీగ మేదీ? క్యాషు తిన్నగా లేకపోతే, చూసుకో నీపని? ఈఃపూట నీ పెళ్ళి చేశా నన్నమాటే!

[గుమాస్తా యివ్వగా క్యాష్‌బాక్స్ బీగం అందుకుని, స్వింగ్ డోర్‌ను చరాలున వదలివేస్తాడు. అది తపీమని మూసుకుపోతుంది. తన టేబుల్ పైనే వున్న క్యాష్ బాక్స్ తెరిచి, దానిలోని పైకాన్ని సుబ్బయ్య లెక్క పెడతాడు. తర్వాత ఆ మొత్తాన్ని అనామతుఖాతా లోని మొత్తంతో సరిచూస్తాడు.

సుబ్బయ్య. వెధవ! దగుల్బాజీ వెధవ!! నువ్వు పద్దురాయడం మర్చిపోతే క్యాషులో పెచ్చు కనబడదేఁ? [ఒక్క గంతులో వెళ్ళి, స్వింగ్‌డోర్ బయటికి లాగిపట్టుకుని, పట్టరాని కోపంతో మండిపడుతూ] వెధవ! బటాచోర్ వెధవ!! పన్నెండొందలు దొబ్బేశావ్! రా, బయటికిరా! నే నేం గుడ్డివాడి ననుకున్నావా? పన్నెండొందలు జేబులో వేసుకొని, క్యాషు బ్యాలెన్సుకూ, అనామతు ఖాతాకూ సరిపెడితే, ఆపాటి నేను కనిపెట్టలేనను

తున్నావ్ ! ఇంతకీ తప్పు నాదేలే ! బికారి వెధవ్వి—నీకు తాళాలప్పగించి వెళ్ళడం తప్పుకాదూ ? ఏమిటి ఆ దెయ్యపు గడ్డూ, నవ్వూనూ ! గుడ్లు పెద్దవి చేస్తే, నేనేం భయపడతా ననుకున్నావా? పళ్లుకూడా బిగిస్తున్నావ్ ! ఏం ! పొంటిరిగా వున్నానని పైబడి కొడదా మనుకుంటున్నావా ? వెధవ ! చచ్చువెధవ! నీలాంటివాళ్ళని చాలామందిని చూశాలే ! ఈ వప్పులు మనదగ్గ రుడకవ్. మర్యాదగా ఆ పైకం అప్ప గించు. రద్ది మాస్తుంది. లేకపోతే, పాతచెప్పు ప్రచ్చుకుని ఈ దవడ, ఆ దవడ....అరి వెధవ ! రౌడీ వెధవ ! పైపై కొస్తావటరా ?

[స్ప్రింగ్ డోర్‌ను వదిలిపెట్టి, చల్లగా యివతలికి వస్తాడు.

సుబ్బయ్య [టేబిల్ వద్దకు చేరి, ముఖాన్నిపట్టిన చెమటను చొక్కా కే తుడుచుకున్న తర్వాత]. ఎందు కబ్బాయ్ చెడి పోతావ్: ఒకేసారిగా చాలా డబ్బు కంటబడేసరికి ఎంత లావాడికైనా మనస్సు రెపరెప లాడుతుందిలే! ఇలాంటి బుద్ధి పొరపాట్లు ఎవరికైనా వస్తాయ్! పెద్దవాళ్ళు చెప్పినప్పుడు సర్దుబాటు చేసుకోవాలి ! కాస్తా, కూస్తా పన్నెండొందలు. [స్ప్రింగ్‌డోర్ వద్దకు వెళ్ళి, దాన్ని తెరుస్తూ] కాజేసిన పైకం బుద్ధిమంతుడిలా వాపసు చేశావంటే....చేతిలో ఆ బద్దీకత్తే మిటి? [ఒక అడుగు వెనక్కి వేస్తూ] అరి వెధవ! రాక్షసి వెధవ !! అది పెట్టి నన్ను పొడుస్తావా యేమిటి?

[భయంతో చేతిలోని స్ప్రింగ్ డోర్‌ను చప్పున వదిలి వేస్తాడు. ఢకీమని అది మూసుకుపోతుంది.

సుబ్బయ్య [వీలైనంత దూరానికి జరిగి]. ఉండు, వెధవ! పొగరు బోతు వెధవ! పోలీసులకు రిపోర్టిచ్చి నిన్ను బొక్కలో తోయిస్తా! పిల్లా జెల్లాతో కూటికిలేక మలమల మాడి చస్తున్నా

పని నీ కొక చిక్కు చూపించినందుకు ఇదట్రా నువ్వుచేసే పని? నేను దగ్గిరికి తియ్యకపోతే, నీకు పొయ్యిమీద కుండైనా యెక్కేదట్రా? అన్నంపెట్టే చేతినే కరుస్తావూ? పన్నెండొందలు దొబ్బింది కాకుండా కత్తి చూపిస్తావూ! రాటా వాళ్ళంటే, నిన్నిప్పు డిక్కడ పాతేయించేవాణ్ణి కాడూ? ఏమైనా ఈపూట నీ అంతు కనుక్కోకపోతే నన్ను సుబ్బయ్యని పిలవొద్దు.

[టెలిఫోన్ రిసీవర్ అందుకుంటాడు.

సుబ్బయ్య. హలో! హలో! పోలీసుస్టేషన్....ఔను! టౌన్ పోలీసుస్టేషన్ [కనెక్షన్ రాగానే] హలో! సర్కిలుగా రున్నారా?....అయ్యా! నేనండీ! శ్రీ రామరాజ్యం రైస్‌మిల్లు సుబ్బయ్యని....సర్కిలుగారు లేరూ? అయితే, మీ రెవరు?.... కొత్త సబిన్స్పెక్టరుగారా? నమస్కారమండీ! నమస్కారం! మీ దర్శనమింకా చేసుకోలేదు....నేను నిన్నా, మొన్నా ఊళ్ళో లేనండీ! నమ్మి, మా మూడో గుమాస్తాగాడికి తాళం చెవి అప్పజెప్పి వెళ్ళితే, మొన్న రాత్రి లారీలో.... [తాను చేస్తున్నపని తప్పని తనకే తోచగా మాట తిప్పివేసుకుంటూ] అయ్యా! మ రేం లేదు. ఈ గుమాస్తాలను నమ్మడానికి వీల్లే దండీ! వీళ్ల పచ్చి దొంగ వెధవలు కారండీ! అందువల్ల....

[గదిలోనుంచి ఏదో విరుచుకుపడ్డ చప్పుడు వస్తుంది.

సుబ్బయ్య [గదివంక ప్రశ్నార్థకంగా చూస్తూ]. సర్కిల్‌గారు బియ్యం పంపించమన్నారు. ఈ గుమాస్తాగాళ్ళని నమ్మడానికి వీల్లేదు. మంచి పాతబియ్యం దగ్గిరుండి పంపిద్దా మను కుంటున్నా. ఇంకా మా మిల్లు లారీ రాలేదు....అయ్య! చిత్తం! చిత్తం! [ఒక కంటితో గుమస్తాల గదివైపుచూస్తూ టెలిఫోన్ డిస్‌కనెక్ట్‌చేసి, సబ్ ఇన్‌స్పెక్టరుతో ఇంకా మాట్లాడు

తూనే వున్నట్టు నటనచేస్తూ] నేను ఊళ్ళోలేని సందుచూసి, మా మూడోగుమాస్తాగాడు పన్నెండొందల రూపాయలు రొక్కం కొట్టేశాడండీ!....ఆఁ! ఆఁ! అవునండీ! పన్నెం డొందలు. ఎదురు, హొతిచేస్తానంటూ బద్దీ కత్తి పుచ్చుకుని పైపైకొచ్చాడు....ఆఁ! ఇక్కడున్నట్టు పంపించండి నలుగురు జవానుల్ని....మీరే వస్తానంటారా? చిత్తం! అంతకంటేనా? సెలవ్! నమస్కారమండీ! నమస్కారం!

[అంతటితో టెలిఫోన్లో మాట్లాడుతున్న నటన చాలించి రసీవర్ పెట్టివేస్తాడు.

సుబ్బయ్య [ఒక క్షణం ఆగి, గుమాస్తాల గదివైపుకు బెదురు బెదురుగా రెండడుగులు వేసి]. వస్తున్నారులే నీ మొగుళ్ళు! చేతులకు బేడీలు తొడిగి, బొక్కలో తోస్తారు! ఒంటిరిగా చూసి నన్ననుకున్నావా బద్దీకత్తితో బెదిరించడానికి! వెధవ! పోకిరీ వెధవ!! పిల్లలు గలవాడివి, ఎందుకు చెడిపోతావుగాని, ఇప్పటి కైనా బుద్ధికలిగి ఆ డబ్బు వాపసు చెయ్యి. ఇప్పుడైనా మించుకు పోలేదు. నా పైకం నాకిచ్చి, నా కాళ్ళమీద పడ్డా వంటే, వాళ్ళకేదో సర్దిచెప్పి పంపిస్తా! ఈరా వాళ్ళొచ్చి పట్టుకు పోయారంటే, మరి నీగతి కుక్కలొల్లవ్! పిల్లా పీచూతో గంపెడు సంసారమూ, నువ్వూనూ! తింటున్న కూటిలో మట్టి పోసుకోబోకు. నీ మంచికే చెబుతున్నా. పీక మీదికి తెచ్చుకున్నాక పస్తాయించి లాభం లేదు. [నెమ్మ దిగా స్వింగ్‌డోర్స్ వద్దకు వెళ్ళి, వాటిలో ఒక దాన్ని కొద్దిగా తెరిచి] నామాట విన్నావంటే జెయిల్ తప్పిస్తా! సర్కారు

మన చేతిలోవాడేనయ్యో! మన మాట దాటిపోడు. ఏం, మాట్లాడవేం? [ఎదురు ఎదురుగా లోపలికి తొంగి చూచి] ఆఁ! ఆఁ! కత్తితో మెడకోసుకు చచ్చాడు! చచ్చాడర్రో! చచ్చాడు!! ఆరి వెధవ! పింజారీ వెధవ! నన్ను పీక్కుతినమని నా కొంపమీదికి పోలీసాళ్ళను తోలడానికట్రా! ఓరి వెధవ! దొంగ వెధవ!!

[వ్రగంగిస్తు [illegible] గంతులు వేస్తుండగా—

తెర]



## పాత్రలు

సుందరి : పెళ్ళీఈడు పిల్ల

సీతమ్మ : సుందరి తల్లి

రాజమ్మ : సుందరి మేనత్త

రంగమ్మ : సుందరి నాయనమ్మ

నేను "సుమంగళి", "స్వర్గసీమ" ఫిల్ములలోని మూడు పాటలను ఈ నాటికలో నేను ఉపయోగించుకోవడానికి అనుమతించిన వాహినీ పిక్చర్స్ లిమిటెడ్ వారికి కృతజ్ఞుడను.



# ఆడబ్రతుకు

## 1

అది సుందరిగారి యింటిలో ముందుగది. ఎదురుగా వున్నది సింహద్వారం. దానికి రెండు వైపుల రెండు కిటికీలు. కుడిచేతి వైపు ద్వారం పడకగదిలోకి; ఎడమ చేతి వైపుది భోజనాల గది, వంటిల్లు మొదలైన వాటిలోకి.

గోడలకు కొన్ని రవివర్మ పటాలు. పడకగది గోడనరసను ఒక స్టూల్. దానిమీద ఒక గ్రామఫోన్. భోజనాల గది గోడకు ఆన్చి ఒక టేబుల్. దానిమీద ఏవో కొన్ని ఆఫీసు రికార్డులు.

తెర లేచినంతనే మనకు కానవచ్చే సుందరి పెళ్ళీఈడు వచ్చిన పిల్ల. పేరుకు తగినట్టు అందకత్తె. కల్లా, కపటం యెరగదు. పగటి కలలు కనడంలో దిట్ట. చాకపాయ నేతచీర కట్టుకున్నది చేతికి ఒక జత బంగారం గాజులు, చెవులకు లోలకులు, మెడలో ఒంటిపేట గొలుసు.

తెర లేవబోతుండగా ఈ క్రింది గ్రామఫోన్ రికార్డు "లో వాల్యూమ్"లో ప్రారంభమై, క్రమంగా "హై పిచ్" లోకి వస్తుంది.

"వస్తాడే—మాబావ—వస్తాడే——రేపో—మాపో—వస్తాడే
ఢిల్లీనుంచి వస్తాడే పరీక్షపాసై వస్తాడే!

ఉల్లాసముగ ఆడీపాడీ, మల్లెపూవులా దండలువేసీ
తీయతీయనీ పండ్లానొసగీ, చందమామలా అందము చిలికే
బావకు స్వాగతమిస్తానూ—ఇస్తానూ—బావకు స్వాగతమిస్తానూ॥
పూలతోటలో కోయిల పలుకూ క్రొత్తపాటతో మేళవించీ
పాడి ఆడుకొనగా, చిలకలు కిలకిల నవ్వేనూ॥
బస్తీనుంచీ వస్తావా, చీరెలు నగలూ తెస్తావా?
కోరినవన్నీ తెస్తావా? తెస్తాడూ, అడిగినవన్నీ తెస్తాడూ
రేపో మాపో వస్తాడూ
వస్తాడూ, వింటాడూ
నీ మువ్వల మోతలు వింటాడూ, నీ మువ్వల మోతలు వింటాడు
తెస్తాడు, నీ కిస్తాడూ
వెన్నెల మీగడ లిస్తాడు, వెన్నెల మీగడ లిస్తాడు
వస్తాడే మాబావ, వస్తాడే మాబావా
నవ్వుతాడే, నవ్విస్తాడే
హోహోహోహో హూహూహోహో నన్ను పెళ్ళి చేసుకుంటాడే॥

[గ్రామఫోన్ రికార్డుతో గొంతుకలిపి పాటపాడుతూ సుందరి గిరగిర తిరుగుతుంది. ఇలా తిరగడంవల్ల కళ్ళు బైర్లు కమ్మగా తూలి పడిపోబోతుంది. కాని, నిలదొక్కుకుని ఒక క్షణంపాటు కళ్ళు మూసుకుంటుంది. ఆ తర్వాత శూన్యాన్ని చూస్తూ “రా అత్తయ్యా! రా! ఇదేనా రావడం? అంతా బాగున్నారా? మా మామయ్యా, మా బావ... [“బావ” అనే సరికి సిగ్గుపడి మాటమధ్యలో ఆగిపోయి] “అమ్మా! అత్త యొచ్చిందే!” అని కేక వేస్తుంది. ఈ ఘట్టంలో చప్పున అన్ని లైట్స్ ఫేడ్ ఔట్ అయిపోతాయి.

## 2

తిరిగి లైట్స్ ఆన్ అయ్యేసరికి సీతమ్మ, రాజమ్మ చిరిచాపపై కూర్చుని మాట్లాడుకుంటూ వుంటారు. సీతమ్మ వయస్సు ఇంచు మించు ముప్పై; రాజమ్మ వయస్సు దాదాపు నలభై. సీతమ్మ మాసిన చీరతో, చెరగిన జుట్టుతో వుంటుంది. బోసి మెడ. చేతికి ఒక జత బంగారం గాజులైనా లేవు. రాజమ్మ చక్కగా ముస్తాబై వుంటుంది. మెడ తిరగనన్ని నగలు.

సీతమ్మ. మీ అన్నయ్య చూపంతా నీమీదే పెట్టుకున్నారు. మరి నువ్వేమి చేస్తావో రాజమ్మొదినా!

రాజమ్మ. ఆఁ! నా దేమున్నదే, సీతమ్మా!

సీతమ్మ. అదేం మా టొదినా! నువ్వు కావాలంటే....

రాజమ్మ. నేను కావాలన్నవన్నీ అవుతున్నాయటే? - ఇది కావ డానికి!

సీతమ్మ. అయినదానివి నువ్వే ఇలా మాట్లాడితే, ఇక ఏం సానుకూల మౌతుంది? సుందరి భూంమీద పడ్డప్పటినుంచీ దాన్ని మేనల్లుడి కిచ్చి చెయ్యాలని మీ అన్నయ్య ముచ్చట పడుతున్నారు. మేనల్లుడంటే ఆయన కెంత అపేక్షో నీకు తెలియంం దేమున్నది?

రాజమ్మ. అయితే, ఇప్పుడు నేనే ఈ సంబంధం వొద్దంటున్నా నటే! కన్నారితో వియ్యమంది వస్తూ పోతూ వుండాలని నాకు మాత్రం వుండదూ?

సీతమ్మ. నువ్వు వద్దనడం లేదనుకో. కాని, అదే సరిపోతుందా? కావాలని పట్టు పట్టాలి. నువ్వు పట్టుపడితే మా అన్నయ్య నీ మాట తోసేస్తాడా?

రాజమ్మ. మావారి సంగతి నీకేం తెలుసు? తన కెంత తోస్తే అంతే! ఎవ రేం చెప్పినా వినిపించుకోరు. నాలుగేళ్ళనాడు భూమీపుత్రా అమ్మొద్దని చెవి నిల్లు కట్టుకు పోరినా విన్నారూ?

సీతమ్మ. అప్పు డమ్మకోవడం మంచిపనే అయిందిగా! ఆనాడు ఆ నాలుగెకరా లమ్ముకుని వ్యాపారం చెయ్యబట్టేగా ఈనాడు లక్షన్నర సంపాయించారు!

రాజమ్మ. ఆఁ! అప్పుడు మూడువేలకు తెగనమ్ముకున్న ఆ చేనే యిప్పుడు అయిదువేలు చేస్తున్నది! ఆయన చేసే బేరాలన్నీ యింతే! ఏం బేరాలో - బెండిత్తులు!

సీతమ్మ. మా అన్నయ్య బేరాలకే సువ్వు వంక పెడుతున్నావుగా! ఆ నాలుగెకరాలు పోతేనేఁ? ఇప్పుడు కావాలనుకోవాలే గాని, పాతి కెకరాలు కొని వెయ్యగలడు!

రాజమ్మ. ఏమైనా తాతలనాటిగడ్డ పోయిందిగా! దాన్ని తొందర పడి అమ్మివేసుకోకుండా, తసఖా పెట్టుకుంటే పనికి పనీ జరి గేది; పొలానికి పొలమూ మిగిలేది.

సీతమ్మ. నీ మాటల కేమిలే, వొదినా! తెగింపు చెయ్యబట్టే మా అన్నయ్యకు బాగా కలిసొచ్చింది. మాపని చూడరాదూ? ఎప్పు డొచ్చినా ఆ జీతపురాళ్ళేగా? యుద్ధానికి ముందు ఏదో కాస్త పచ్చపచ్చగా కనబడ్డా, ఇప్పుడు నీళ్ళు కారిపోతున్నాం. ఏం కొనబోయినా ధరలన్నీ మండిపోతున్నాయమ్మో! రూపాయి మార్చడమే కనపడుతున్నది కాని, ఇంటి కొచ్చేది కనబడ్డం లేదు. ఏమీ మిగలకపోతే పాయె! ఎప్పుడు మిగిలింది కాబట్టి ఇప్పుడు మిగలడానికి! కాని, ఇదివరలో జరిగినట్లు జరగడ

మైనా కష్టమై పోతున్నది. మా పని దిగదియ్యబట్టిగా మేం మీకు దూరమై పోతున్నాం; మే మిప్పుడు మీ కంటిలో దూరంలే!

రాజమ్మ. అదేమిటే! మాకు క్రొత్త భాగ్య మొచ్చిందని మా కళ్లు పైకి పోయాయా?

సీతమ్మ. అబ్బే! ఎంతమాట! కాని, మాతో సంబంధం చెయ్యడ మంటే, ముందు నీకే యేమంత యిష్టం లేనట్టున్నది.

రాజమ్మ. నే నిష్టపడితే సరేనా? ఆయ నిష్ట పడొద్దా?

సీతమ్మ. మా అన్నయ్య కేమీ అభ్యంతరం లేదట. ఈ మధ్య మావారు కదిలిస్తే "ఆఁ! నాదే మున్నది? నీ యిష్టం, నీ చెల్లె లిష్ట" మన్నాడట.

రాజమ్మ. ఆయ ననవలసినమాట అంతేగా!

సీతమ్మ. అయితే, మా అన్నయ్యకే మాతో సంబంధం చెయ్యా లని కడుపులో లేదన్నమాట!

రాజమ్మ. ఆఁ! మా మాట కేమిలే? అసలు పిల్లవా డిష్ట పడొద్దా? ఈకాలపువాళ్ళు అమ్మా, బాబూ కుదిర్చిన పిల్లల్ని చేసుకుంటు న్నారూ?-తమకు నచ్చినదాన్ని తామే ఏరి, కోరి కట్టుకుంటు న్నారు గాని!

సీతమ్మ. అబ్బాయినికూడా మావారు కదిలించి చూస్తే, తన కిష్టమే నన్నాడట. నిన్ను, మా అన్నయ్యను అడిగి చూడ మన్నాడట.

రాజమ్మ. ఆఁ! పసివాడు! తెలిసీ తెలియక మాట, తెలియ కొకమాట. అయినా, ఇప్పు డేం తొందర? వాడి చదువైనా పూర్తికాలే

దింతా. మరి రెండు, మూడేళ్ళదాకా వాడి పెళ్ళిమాట మేము తలపెట్టబోవడం లేదు.

సీతమ్మ. అదేమిటి రాజమ్మొదినా? గుడివాడవా రెవరితోనో సంబంధం మాటలు నలుగుతున్నాయటగా!

రాజమ్మ. ఎవ రన్నారు?

సీతమ్మ. అః! ఎవరంటే నేమిలే! మీరు ఎంత కప్పిపెట్టా లన్నా ఆ నోటా, ఆ నోటా తెలియక పోతుందీ?

రాజమ్మ. మరి అన్నీ తెలిసినదానివి స న్నడగడం దేనికి?

సీతమ్మ. ఊరుకుంటుందీ పాడు మనస్సు, ఆశ పీడిస్తుందిగా? "ఇంకొకసారి అడిగి చూడండి. వాళ్ళమాట వాళ్ళకే వుంటుం" దని నలుగు రనబట్టే, ఇంతా మీవెంట బడుతున్నాం.

రాజమ్మ. వాళ్ళెవరో మొన్నొచ్చారులే! - పదెకరాల మాగాణి, పాతికవేల రొక్కం యిస్తామంటూ. పిల్ల వొంటిని నూట యాభై నవర్సుల బంగారంకూడా వుందట.

సీతమ్మ. మీ చూపు కట్నాలమీదికి పోతే, మే మెక్కడ తూగగల మొదినా? మా అన్నయ్య చుట్టరికం చూసుకుంటాడు గాని, డబ్బు కాశపడతా డనుకోలేదు.

రాజమ్మ. ఏః! డబ్బంటే ఎవరికైనా చేదా?

సీతమ్మ. అయితే మీకూ, మాకూ ఇంతటితో తీరిపోవలసిందేనా, వొదినా? ఇక మమ్మల్ని మీ గడప తొక్కొద్దంటారా?

రాజమ్మ నీదంతా చోద్యమే, సీతమ్మా! ఇంతమాత్రానికే మా అన్నయ్య నాకు అన్నయ్య కాకపోతాడా? నేను చెల్లెల్ని కాకపోతానా?

సీతమ్మ. సుందరిని నీ చేతిలో పెడితే, అది సుఖపడుతుందని మీ అన్నయ్య....

రాజమ్మ. ఎవరి కెక్కడ రాసిపెట్టివుంటే అక్క డౌతుంది. మన మనుకున్న వన్నీ అవుతాయటే !

సీతమ్మ. అది వొఠ్ఠి మెతకపిల్ల. నోట నాలిక లేదు. అయినవాళ్ళ యింట్లో పడితే కడుపులో పెట్టుకు కాపాడతా రనుకున్నాం. కానీలే—దాని గీత ఎలావుంటే అలాగే జరుగుతుంది.

రాజమ్మ. దానికేమేఁ ? పుత్తడిబొమ్మ ! దాన్ని ఎవరైనా కళ్ళ కద్దుకు చేసుకుంటారు.

సీతమ్మ [నిట్టూరుస్తూ]. ఇప్పు డంద మెవరికి కావాలి? చదువు లెవరికి కావాలి ? బుద్ధు లెవరికి కావాలి ? కట్నాలు కావాలి: కాస్కలు కావాలి. మాకు లేవుగా సంపద ? - గుమ్మరించ డానికి !

రాజమ్మ. ఆఁ ! దానికి తగినవా డెవడో దాని కొస్తాడు. పేదపిల్ల లందరు పెళ్ళిళ్ళుకాకుండా అట్టే వుంటున్నారటే ! దాని కెవడో, ఎక్కడో పుట్టేవున్నాడుగాని, పుట్టబోడుగా?

సీతమ్మ. ఇంకా మీ అన్నయ్య గంపెడాశతోనే వున్నారు. "మమ్మల్ని విడిచిపెట్టి వాళ్ళెక్కడికి పోతారే?" అని మొన్న కూడా నాతో అన్నారు. ఈ మాట వింటే ఆయనకు నడుం విరిగినంత పని అవుతుంది.

రాజమ్మ. ఆఁ ! మా అన్నయ్యకు అల్లుడే కరువౌతాడా ?

సీతమ్మ. అల్లుడు దొరక్క అట్టే వుండడులే! కాని, బుద్ధిమంతు డని మేనల్లుడంటే, ఆయన కెంతో యిది ! ఇంట్లో పెట్టుకుని నాలుగేళ్ళు చదువు చెప్పించుకున్నారు కూడా.

రాజమ్మ. ఎవరి మేనల్లుడిమీద ఎవరికి భ్రమత యింతవు లేవే! నాలుగేళ్లు చదువు చెప్పించినందుకు అయిదారొందలు అయ్యాయేమో! సుందరి పెళ్ళికి అంతరంత మే మేదో ఒక రూపంలో ముట్టజెప్పక పోములే! నేను ఆయనకు చెప్పే వుంచా—సుందరికి పెళ్ళినాడు వెయ్యినూట పదహార్లు చదివించాలని.

సీతమ్మ. మీరు ముందెప్పుడో అంతరంత మాకు ముట్టజెబుతారని మేము మేనల్లుడికి చదువు చెప్పించుకోలేదు. మీ కట్నాలు, కానుకలు మాకొద్దులే, తల్లీ! ఏదో ఒక విధంగా దాన్ని విరగడ చేసుకోలేక పోతామా?

రాజమ్మ. సరే! మీరు మమ్మల్ని తోసెయ్యదల్చుకుంటే....

సీతమ్మ. ఎదురు ఈ మాట కూడానా? ఎవరు ఎవర్ని తోసేస్తున్నారో లోకానికి తెలవదూ? మీ అన్నయ్య వన్నీ పిచ్చి భ్రమతలుగాని, ఇప్పుడు మీచూపులు మే మెక్కడ ఆనతాం! మీ రిప్పుడు కోటీమీద కూర్చున్నారమ్మా! మిమ్మ అందుకో వాలన్నా మేము....

[ఫేడ్ ఔట్.

## 3

[మొదటి దృశ్యంలో ఎక్కడ, ఏ భంగిమలో నిలబడిందో అక్కడే, ఆ భంగిమలోనే నిలబడి సుందరి "అమ్మా! అత్తయ్యొచ్చిందే!" అని కేక వేస్తుంది. ఈ కేక విని సీతమ్మ ప్రవేశిస్తుంది.

సీతమ్మ. ఏమిటే నీ కేకలు సుందరీ?

సుందరి. అత్తయ్యొచ్చిందే, అమ్మా!

సీతమ్మ. ఏదీ? ఎక్కడ?

సుందరి [శూన్యాన్ని చూపిస్తూ]. అదే! ఎదురుగుండా!

సీతమ్మ. నీకు పిచ్చేమైనా పట్టిందేమేఁ! ఎవరున్నా రక్కడ?

సుందరి [నిద్రలోనుంచి మేల్కొంటున్నట్లు కళ్లనులుముకుంటూ].
లేదమ్మా! ఎవరూ లేరు. కాని, ఇంతకుముందు—ఒక్క క్షణానికిముందు—అత్త య్యొచ్చినట్టు....

సీతమ్మ. ఆవిడ మనింటి కెందుకొస్తుందే! వాళ్ళ చూపుకు మన మిప్పుడు ఆనం! వాళ్ళిప్పుడు కోటీమీద కూచ్చున్నా రమ్మే!

సుందరి. అత్తయ్య రాలేదుగాని, సినిమా తెరమీద బొమ్మ కనబడ్డట్టు....

సీతమ్మ. నీకు మతి పోతున్నదేమే? వాళ్ళు అస లిప్పుడు కింద నడుస్తున్నారా? దొంగ వ్యాపారం చేస్తేనేఁ! లోకుల కొంపలు మాల్చితేనేఁ? తమ కింత పోగు పడింది. ఇప్పుడు మన మంటే వాళ్ళ కెంత చులకన! ఈ పాడు సినిమాలతో నీ మతి సగం చెడుతున్నది. కాసేపు మురిపించి డబ్బు పోసుకో డానికి—వాళ్ళకేఁ?—తెరమీద బొమ్మల్ని తైతక్క లాడిస్తారు.

సుందరి. అయితే, సినిమాలలో మనం చూసినట్టు జరగనే జరగ దంటావా, అమ్మా?

సీతమ్మ. అది పచ్చి బూటకం: బ్రతుకు దొకదారైతే, సినిమా దొకదారి. దానికీ, దీనికీ సాపత్యమెక్కడ? ప్రేమలనీ, పెళ్ళి ళ్ళనీ వాళ్ళు ఏమేమో అంటారు. ప్రపంచంలో ప్రేమ లెక్కడివి, తల్లీ? డబ్బే ప్రధానం. డబ్బులేనివాడు దుబ్బుకు కొరగాడు.

సుందరి. ఆఁ ! డబ్బేనా ప్రధానం ?

సీతమ్మ. ఔను తల్లీ ! మీ మామయ్యకు, అత్తయ్యకు మన మెందుకు దూరమైపోయాం? మనకి డబ్బు లేకపోబట్టేగా ? డబ్బుంటేనే ప్రేమలైనా, బంధుత్వాలైనా.

సుందరి. ఆఁ! నీమాట నేను నమ్మలే నమ్మా !

సీతమ్మ [సుందరిని దగ్గరికి తీసుకుని తల నిమురుతూ]. ఇంత పిచ్చితల్లివి ! నువ్వేం కడతేరతావో !

సుందరి. పోనీ, అత్తయ్యా, మామయ్యా పెద్దవాళ్ళనుకో! వాళ్ళకి డబ్బే ప్రధాన మనుకో! కాని, బావయ్యకూడా....

సీతమ్మ. అతడు మంచివాడైతే కావచ్చు. కాని, అతని మాటేమి సాగుతుంది? తల్లీ, తండ్రీ చాటుబిడ్డ. వాళ్లు రావడం తగ్గించు కోగానే తనూ తగ్గించుకున్నాడుగా మనింటికి రావడం! మొన్న మీ నాన్న వీధిలో ఎదురుపడితే, చూసీ చూడనట్టు వెళ్ళిపోయాడట.

సుందరి [తల్లి మాటలు అంతగా రుచించక, సంభాషణ వేరొక ధోరణికి మార్చాలని]. అయితే, అమ్మా....

సీతమ్మ. ఏమిటి, తల్లీ ?

సుందరి. నే నొక కొత్త సినిమా పాట నేర్చుకున్నా నమ్మా

సీతమ్మ. అలాగేఁ ?

సుందరి. అది చాలా చక్కని పా టమ్మా !

సీతమ్మ. అంత చక్కనిదా ?

సుందరి. ఔనమ్మా ! దాని బాణీ నేనింకా బాగా పట్టుకోలేదుగాని, పాడి వినిపించనా !

సీతమ్మ. సరే! పాడవమ్మా! వింటాను.

[సుందరి ఈ కింది పాట పాడుతుంది:

"గృహమేకదా స్వర్గసీమా!
మహనీయమౌ ప్రేమ మహిమమ్ము వెలసిన
ఈ గృహమే కదా, మన గృహమే కదా స్వర్గసీమ!
ఇలలోన లేదంచు తలపోయనేలా?
కలలందు దర్శింపగా కోరనేలా?
జపమేల, తపమేల, వ్రతపూజలేలా?
సాధించితే ప్రేమ సామ్రాజ్యమౌ నీదు.
జగతిని యశ మందె, సంపద లందె,
ప్రియమున లాలించి, పాలించు విభుడు."

[పాట పూర్తికావస్తుండగా ఫేడ్ ఔట్

## 4

తిరిగి లైట్స్ ఆన్ అయ్యేసరికి రంగమ్మ నీళ్ల బిందెతో ప్రవేశిస్తుంది. ఆమె వితంతువు. వయస్సు యాభై అయినా. కాని, సందర్భానుసారంగా ఆమె దాన్ని యాభయ్యో, అరవయ్యో చేస్తూవుంటుంది.

రంగమ్మ. గంపెడు చీకటి నెత్తినేసు కెళ్లినా, పాడుమూక అప్పుడే పంపుచుట్టూ చేరింది. బిందెడు నీళ్లు పట్టుకొచ్చే సరికి తలప్రాణం తోక కొచ్చింది. మాయదారి గుంపు! ముదనష్టపు గుంపు!! కాస్త సందిస్తేనా? పైపైకి తోసుకు రావడమే! అ దున్నది—ఆ పుట్టుకుంక—దాని ముఖం మండ!—అది మరీనీ! పంపుకింద బిందెట్టుకుంటే లాగి

పారేస్తుంది. దాన్ని అమ్మోరమ్మ తల్లి యెత్తికెళ్ళ! దాని వొలికిల్లో జిల్లేళ్లూ, పల్లేళ్లూ మొలవ! పోట్లాటకు అది వయ్యేఁమని పైకొస్తుంది. దానికంటె కొట్లకుక్క నయం. దాని దెవసం చెయ్య! దెవసం చెయ్యడానికైనా ఆ పుట్టు కుంక కెవ రున్నారులే! [బిందె యింటిలో దింపివచ్చి] ఈ నీళ్లు నేను జేరబొయ్యలే నమ్మా! పాడు నీళ్లు! అయినా, పంపులేని కొంపలో వుండడంకంటె బుద్ధి తక్కువున్నదీ? రెండు, మూడు రూపాయ లెక్కువ అద్దె అయినాసరే పంపున్న యిల్లు చూడరా అంటే, మా సన్నాసి నా మాట వింటాడా, పెడతాడా? నే నున్నానుగా మండిననీళ్లు ఎన్నైనా జేర బొయ్యడానికి! వాడి కేం నెప్పి? నేను నెత్తిని నోరెట్టుకు మొరిగినా, చీమైనా కుట్టనట్టు ఊరుకుంటాడు. ఎంతకాలం చేస్తాను నే నీ అరవ చాకిరి? అంతకంతకు ఒక ఏడు పైబడుతున్నది కాని, తగ్గడంలేదుగా! అప్పుడే అరవై యేళ్లొచ్చాయి. ఒసేయ్! నిన్నే....ఏమేయ్! సీతమ్మా!.... ఉహూఁ! అ దెందుకు పలుకుతుంది? వినిపించుకునే మెదల కుండా వూరుకుంటుంది. అమ్మో! అ దెంత నాలిముచ్చు!.... ఒసేయ్! సీతమ్మా! ఒసేయ్! నిన్నేనే!....నే నెంత గొంతు చించుకుంటే మాత్రం దాని కెందుకు వినబడు తుంది? నా పిలుపంటేనే దాని చెవుల్లో చెట్లు మొలుస్తాయ్! అమ్మ! ఎంత కానరాని దది! నోట్లో బెల్లంరాయి కొట్టు కున్నట్టు నిలబడే, తేలులా చిటుక్కు పొటుక్కున కొండి అంటిస్తుంది. లోకులకు రాగదాన్ని నేనే! అది చేసేపనులు

వాళ్ళకేం తెలుస్తాయ్!....రంగమ్మ నోరే అందరికీ వినబడు తుంది. సీతమ్మా! ఏమేయ్!....

[సీతమ్మ వస్తుంది. కిందటి రంగంలో మనం చూచినప్పటి కంటె ఆమె దాదాపు పదిహేడేళ్లు చిన్నది.

సీతమ్మ. ఎందు కత్తయ్యా?

రంగమ్మ. ఎంత అరిచినా పలకవే? అంకిలి నొక్కుకు పోయిందా?

సీతమ్మ. కళ్లాపి జల్లుతున్నా నత్తయ్యా! నీ కేక వినబడలేదు.

రంగమ్మ. తెచ్చిన నీళ్ళన్నీ అప్పుడే దిమ్మరించేశావ్! ఆ పాడు పంపుదగ్గిరి కెళ్లి, ఆ పాడు ముండలందరితో చెలిగి, తెచ్చే దున్నదిగా!—దిమ్మరించడానికి నీకేం నెప్పి!

సీతమ్మ. లేద త్తయ్యా! నాలుగంటే నాలుగు చెంబుల నీళ్లు....

రంగమ్మ. నీకు నాలుగు చెంబులుగానే కనబడతాయ్! ఒక్కొక్క బిందెడు నీళ్లెత్తు కొచ్చేసరికి నా నడుములు విరుగుతున్నాయ్! ఇంకా ఎంతకాలం చేస్తాను నే నీ గాడిద చాకిరి? పాచి నీళ్లట! పాచినీళ్లు!! జీతం బత్తెం లేకుండా తెచ్చి పొయ్య డానికి నౌకరుదాన్ని నే నున్నానుగా! ఇంట్లో కూర్చుని బుడబుడ ఎన్ని నీళ్లైనా పారబోస్తావు! ఒక్క చెంబుడునీళ్లు పట్టుకురా, నీకే తెలుస్తుంది ఆ కష్ట మేమిటో, సుఖ మేమిటో!

సీతమ్మ. అంత కోపం దేని కత్తయ్యా! పోనీ, నేనే నీళ్లు తెచ్చుకుంటాను.

రంగమ్మ. నీకు ముచ్చటగా వుందటే?—నన్ను నలుగురి నోళ్లలో పడెయ్యాలని! "ఆ రంగమ్మ కొత్తగా కాపరాని

కొచ్చిన కోడల్ని బజార్లెంట తిప్పుతున్న" దని అమ్మలక్క లందరు మూతీ ముక్కూ విరుస్తుంటే చూడాలని ముచ్చటగా వుందా ?

సీతమ్మ. తప్పు మాటంటే, మన్నించ త్తయ్యా !

రంగమ్మ. ఎంత వగలాడివే ! అన్నిటికీ ఇదొకటి నేర్చుకున్నావ్ ! ఉలిపి, చిలిపిమాట లనడం ! "మన్నించ త్తమ్మా !" అని చిలక పలుకులు పలకడం !

[సీతమ్మ కళ్ళవెంట గిర్రున నీళ్లు తిరుగుతాయి.

రంగమ్మ. ఏం వంగనాచివే ! తల్లిబొల్లి యేడ్పులుకూడా మొద లెట్టావ్ ! "రంగమ్మ కోడల్ని రాల్చుకు తింటున్న" దని నలుగురిచేత నన్ను ఆడిపోయించమ్మా ! ఆడిపోయించు !! రద్దీ రవ్వా లేకుండా బతికిన ముండని, నన్ను అల్లరి పెట్టందే నీకళ్ళు చల్లబడవులే !

[సీతమ్మ కళ్లు తుడుచుకుని వెళ్ళిపోబోతుంది.

రంగమ్మ. ఎక్కడికే పోతున్నావ్ ?

సీతమ్మ. వాకిట్లో ఒక ముగ్గుకర్రే పోస్తా.

రంగమ్మ. మాట్లాడేదాన్ని నేను మనిషినేనా ? ఒక పక్కని మాట్లాడుతూవుంటే దులపరించుకు పోతున్నావ్ !

సీతమ్మ. తప్పే, అత్తయ్యా ! మన్నించు.

రంగమ్మ. అదుగో ! మళ్ళీ....

[సీతమ్మ గుడ్లనీళ్లు గుడ్లలో కుక్కుకుంటుంది.

రంగమ్మ. సర్లే ! నీకు నీ అమ్మా, బాబూ నేర్పివంపిన చిలక పలుకులు ఇవ్వాళ పొమ్మంటే ఎక్కడికి పోతాయిగాని, కాఫీ పెట్టావా ?

సీతమ్మ. ఇంకా లేదత్తయ్యా!

రంగమ్మ. బారెడు పొద్దెక్కినా నీకు కాఫీ పెట్టడానికే తీరలా?

సీతమ్మ. చేతిలో పని కాగానే పెడతా నత్తయ్యా!

రంగమ్మ. అబ్బే! ఎందుకులే! పెట్టొద్దు! నా కూతురు పల్లెటూరి దయ్యే! మన్ను పిసుక్కునేదయ్యే! అది నీలా ఉద్యోగస్థుడి పెళ్ళామా? బస్తీ కాపరం చేస్తున్నదా? అది కాఫీ ముఖ మెరుగున్నది?

సీతమ్మ. రాజమ్మొదిన ఇంకా నిద్ర లేవలేదత్తయ్యా! ముందే పెడితే చల్లారిపోతాయని పెట్టలేదు. ఇదుగో! పెడుతున్నా! ఇప్పుడే పెడతా!

[సీతమ్మ వెడుతుంది.

రంగమ్మ [వెనకనుంచి]. దానికి కాసిని కాఫీ నీళ్ళివ్వడానికి చేతులు రాక ఎన్ని వేషాలు వేస్తున్నావే! ఇంతకూ నిన్ననే పనేమిటి? నా కొడుకు మంచివాడైతే నువ్వు ఆడింది ఆటగా సాగుతుందా? వాడొఠ్ఠి దద్దమ్మ! పెళ్ళానికి చాల్లేడు. మొన్న మట్టుకు మొన్న నేను వద్దంటున్నా, ఇరుగు పొరుగు అమ్మలక్కలతో చేరి అది నాటకానికి వెళ్లొస్తే కుక్కిన పేనులా వూరుకున్నాడు గాని, పల్లెత్తు మా టన్నాడూ? మనం సంసారులం; నాటకాలు, గీటకాలు మన కెందుకు? ఇది డబ్బు దండగచేటేనా? మ రేమైనానా? అది ఎన్ని దండగలు పెట్టినా వాడి కిష్టమే. కచ్చేరీకి వెళ్ళిన ఆ కాసేపు తప్పితే, వాని కొంగుచ్చుకు తిరగాల్సిందే! పట్టపగలే దాంతో పకపకలు, యికయికలై పోతే! ఇంతకూ నాకు చావు

రావడం లేదు. కూతురు రాకరాక చుట్టపుచూపుగా ఒకసారొస్తే దాని కిన్ని కాఫీనీళ్లకు గతిలేకపాయె! ఇంకా నా బతు కెందుకు?—పాడు బతుకు! ఏ నుయ్యో, గొయ్యో చూసుకుంటే అందరికీ పీడ విరగడై పోతుంది. నలుగురిచేత ఔననిపించుకున్న ముండని. నా కెన్ని తిప్పలొచ్చాయ్! నా కెన్ని తిప్పలొచ్చాయ్!!

[రాని కన్నీళ్లను తుడుచుకుని, వేలు విదిలిస్తుంది.

రంగమ్మ [మూలనున్న చీపురు తీసుకుని, గది కొంత చిమ్మి]. ఒసేయ్! నిన్నే....ఏమేయ్! సీతమ్మా! ఊఁహూఁ! అదెందుకు పలుకుతుంది? నా పిలుపంటేనే దాని చెవుల్లో చెట్లు మొలుస్తాయ్! అమ్మ! ఎంత కానరాని దట! ఏమేయ్! నిన్నేనే!!

["గృహమే స్వర్గసీమ" అంటూ నేపథ్యంలోనుంచి పాట ప్రారంభమౌతుంది.

ఫేడ్ ఔట్

## 5

లైట్స్ ఆన్ అయ్యేసరికి సుందరి, సీతమ్మ నాల్గవ రంగంలో కూర్చున్నట్లుగానే కూర్చునివుంటారు. సుందరి "గృహమే స్వర్గసీమ" పాట చివర చరణాలలో వుంటుంది. సీతమ్మ చెమ్మగిలిన కళ్ళను పైటచెంగుతో ఒత్తుకుంటూ వుంటుంది.

సుందరి. అదేమమ్మా, కంట తడిపెడుతున్నావ్?

సీతమ్మ. ఆఁ! ఏం లేదు, తల్లీ!

సుందరి. ఎందు కమ్మా? నాకు చెప్పవ్?

సీతమ్మ. పాట బాగున్నది, తల్లీ!

సుందరి. చాలా బాగున్నది కాదూ!

సీతమ్మ. ఉఁ!

సుందరి. మరి సినిమా పాటలన్నీ పిచ్చిపాట లంటావ్? ఒక్కొక్క పాట వింటుంటే, నాకూ కళ్ళు చెమ్మగిలతా యమ్మా!

సీతమ్మ, నువ్వింత వెఱ్ఱిబాపమ్మవేమే?

సుందరి. అదేమి టమ్మా?

సీతమ్మ. సంసారమంటే మాటలు కాదు, తల్లీ! మంచి చెడ్డలు ఎన్నెన్నో వుంటాయ్. పడివున్న వాళ్ళకేగాని అవి తెలియవ్. పదహారు, పదిహేడేళ్ళనాడు నాది నీ ఈడే. అప్పుడు అచ్చంగా నీ మాదిరిగానే వుండేదాన్ని. ఇప్పుడు నిన్ను చూస్తే అప్పుడు నన్ను చూడ నక్ఖరలేదు. ఈ సినిమాలు మే మప్పు డెఱగంగాని, నీకుమల్లేనే నాకూ కష్టం, సుఖం తెలిసేది కాదు. తల్లీ తండ్రీ ఆదరించినట్టే లోక మెల్లా ఆదరిస్తుందనుకున్నా. కాపరాని కొచ్చి, సంసార మీదడం ప్రారంభించిన తర్వాతగాని తెలిసి రాలేదు, బ్రతుకులు వెళ్ళ మారడ మెంత కష్టమో! నేను పడ్డపాట్లు నిన్ను చుట్టుకో రాదని నే నెందరి దేవుళ్ళకు మొక్కుకుంటున్నానో నీకేం తెలుసు? ఒక ఆటగానో, పాటగానో తనువు గడుస్తుందని లేనిపోని బ్రమతలకు పోవద్దు, తల్లీ!

సుందరి. అమ్మా, ఈపూట నువ్వింత యిదిగా మాట్లాడుతున్నావేం ? మనస్సు బాగుండలేదా ?

సీతమ్మ. ఔను, తల్లీ !

సుందరి. అదేమో నమ్మా ! ఒక్కొక్కసారి పాటేదైనా వింటుంటే, కడుపులో చెయ్యిపెట్టి దేవుతున్నట్టుగా వుంటుంది. అదే మరొక్కొక్కసారి పాట వినగానే ఎంత కలతగావున్నా మనస్సు ఇట్టే తేటపడుతుంది. అది మరి పాటలో వుంటుందో, మనం వినే వేళావిశేషంలో వుంటుందో !

సీతమ్మ. ఏమో నమ్మా ! నే నేం చెప్పగలను ?

సుందరి. ఒక కమ్మనిపాట వున్నదమ్మా ? దాన్ని వింటే చాలు, గాలిలో తేలిపోతున్నట్టుగానే వుంటుంది నాకు. అ దెంత మంచి పా టనుకున్నావ్ !

సీతమ్మ [మందహాసం చేస్తూ]. అబ్బో ! అంత గొప్ప పాటా !

సుందరి. ఔనమ్మా ! నాన్న నాకు దాని రికార్డు తెచ్చిపెట్టాడు.

సీతమ్మ ఎప్పుడు ?

సుందరి. నిన్న సాయంత్రం.

సీతమ్మ. బాబూ, కూతురూ చేరి, నా కీ మాట తెలియకుండా ఇప్పటిదాకా దాచిపెట్టారన్నమాట ! మనం కలవాళ్ళమా ? ఎందుకమ్మా మీ నాన్నచేత నువ్విలా డబ్బు తగలేయించడం? ఈ రికార్డులకని నెలనెలకి దండగపెట్టే డబ్బు కూడబెట్టు కుంటే, మెడబోత తీరడానికి ఏదో ఒక చిన్న నగ యేర్పడదూ ?

సుందరి, తెచ్చిపెట్టమని నే నడగలే దమ్మా ! అది మంచి రికార్డని నే నంటే....

సీతమ్మ. ఆయన కొనుక్కొచ్చారు, అంతేనా ? నీకు ఏ లోపం చెయ్యరాదని ఆయన ఎన్ని చిక్కులైనా పడతారు.

సుందరి. ఇంకెప్పుడు నాన్నదగ్గిర రికార్డుల మాట యెత్తనులే, అమ్మా !

సీతమ్మ [నవ్వుతూ]. చూస్తానుగా ఎన్నిరోజులు నిలుస్తావో ఈ మాటమీదే ! నిన్ననగా మీ నాన్న రికార్డు తెస్తే దాన్ని యింతవరకు పెట్టనే లేదని నువ్వెంత ఆరాటపడుతున్నావో ! ఏదీ, ఆ రికార్డు వినిపించు !

[సుందరి ఈ కింది గ్రామఫోన్ రికార్డు పెడుతుంది :

ఆడబ్రదుకే మధురమ్
సయసూ, వలపూ, సొగసు కులికే
యువతిబ్రదుకే మధురమ్
పసుపు కుంకుమా నొసటను వెలిగే
ఆడబ్రదుకే మధురమ్
పతి కౌగిటిలో పరవశమయ్యే
భార్యబ్రదుకే మధురమ్
పసికూనకు పాలొసగుచు మురిసే
తల్లిబ్రదుకే మధురమ్
ఆఁ ఆడబ్రదుకే మధురమ్
విరజాజులతో, చిరు నగవులతో
కుంకుమరాగము, అనురాగముతో

సిరిసంపదలతో, పసిపాపలతో
అనురాగపూరితగా, ఆనందపూరితగా
అలరు సుమంగళి బ్రతుకే మహనీయము
ఆ ఆదర్శమే మహనీయము ||

[ఆ వెనకాలే పాట "లాంగ్ డిస్టెన్సు"లో వస్తుంది.

సుందరి. అమ్మా! ఇది చాలా మంచిపాట కాదూ?

సీతమ్మ. పాటకేం? మంచిపాటే! కాని, బ్రతుకు కొరక పాటా, ఆటా కాదు, తల్లీ! పైకి సాఫీగానే నడుస్తున్నట్టు కనబడ్డా, అడుగడుక్కీ చిన్నచిన్న చిక్కులూ, చిల్లర యిబ్బందులూ ఒక లక్ష వస్తుంటాయి. వడ్డించిన విస్తరిలా బ్రతుకు ఉన్న వాళ్ళకే ఏవో కొన్ని ఒడుదుడుకులు తప్పవంటే, ఆస్తిపాస్తులు లేనివాళ్ళమాట వేరే చెప్పాలీ? కొద్దికొద్ది సంసారాలనేసరికి అన్నీ కొరతలే! అయినా, పరువుకోసమని ఏ లోపం లేనట్టు దేవులాడాలి. ఇఖ, అత్తపోరూ, ఆడబిడ్డపోరూ వుంటే సరేసరి! ఒక యింటిదానివై, నీ సంసారం నువ్వు దిద్దుకుంటున్నప్పుడు మంచి చెడ్డలన్నీ నీకే తెలుస్తాయిలే!

[లైట్స్ ఫేడ్ అవుట్ అయిపోతాయి. ఆ వెంటనే పాటకూడా నిలిచిపోతుంది. సిమ్మ్రట ఒక క్షణానికి ఒక్క సుందరిమాత్రం స్పాట్ లైట్ లో నిలబడి వుంటుంది. ఆమె చుట్టుపక్కల కటిక చీకటి. ఆ చీకటిలో నుంచి వేర్వేరు గొంతులు ఒకదాని తర్వాత మరొకటి, ఒకదాన్ని మరొకటి తరుముతున్నట్టు వినబడతాయి.

మొదటి గొంతు [సుందరికి కాగల భర్తది]. ఇంకా నీ వంట తెమల్లేదటే?

సుందరి [గొంతు వినవచ్చినవైపుకు తిరిగి]. అయిపోతుంది ఒక చిటికలో!

మొదటి గొంతు. చాల్ చాలు! ఆఫీసుకు వేళ మించిపోతున్నది. రోజూ ఇదే యేడుపు!

సుందరి. అయ్యో! అయిపోయిందంటే!

మొదటి గొంతు. ఏమైపోయింది? నీ మొఖం! ఆఫీసులో నాకు మాటొస్తున్నది.

సుందరి. ఒక్క అయిదు నిమిషాలంటే....

మొదటి గొంతు. చాల్లే! నే పోతున్నా!

సుందరి. అయ్యో! అయ్యో!

* *
*

రెండవ గొంతు [పాలమ్మేది]. ఏమిటమ్మా ఈ తిప్పించుకోడం?

సుందరి [అటు తిరిగి]. రేపిస్తాంగా తప్పకుండా!

రెండవ గొంతు. రోజూ రేపురేపేనా? అంత గతిలేనివాళ్ళు పాలెందుకు పోయించుకోవాలి?

సుందరి. ఏమిటమ్మో! మాటలు మహ రానిస్తున్నావ్!

రెండవ గొంతు. ఏఁ! నేను మీకు అచ్చివున్నా నేమిటి మీ కొంపచుట్టూ తిరగడానికి!

* *
*

మూడవ గొంతు [సుందరికి కాగల అత్తగారిది]. కాస్త నేల మీద ఆని నడువమ్మా! ఆని నడుపు!! మిడిసిపాటు తగదు. ఏం కట్టుకొచ్చావని అంత పొంగు!

[సుందరి అటు తిరిగి గుడ్లు అప్పగించి చూస్తుంది.

* *
*

నాల్గవ గొంతు [పిల్లవాడిది]. అమ్మా! అమ్మా! పండక్కి నాకు కొత్తచొక్కాయేఁ!

సుందరి [అటు తిరిగి]. నాన్న రేపు తెస్తాడులే, బాబూ!

నాల్గవ గొంతు. అహఁ! నా కిప్పుడే కావాలి. పండ గివ్వాళే! వాళ్ళ కిట్టిగాడు కొత్త చేసుకున్నాడు.

సుందరి. మా నాన్నవుగా! రేపు నీకు....

నాల్గవ గొంతు. ఉహుఁ! పిల్లలందరు కొత్త చొక్కా లేసుకున్నారు. నా కిప్పుడే కావాలి!

* *
*

తిరిగి మొదటి గొంతు. మొన్నేగా ఒక వీసెడు నెయ్యి మంద బెట్టింది.

సుందరి [అటు తిరిగి]. అయ్యో! అయిపోయిందండీ!

మొదటి గొంతు. వెనకా ముందూ చూసుకోవద్దూ? ఇలాగైతే నే నెక్కడ ఛస్తాను.

* *
*

తిరిగి మూడవ గొంతు. చంకల్లోకి ఆ రవి కేమిటి? ఆ బెత్తెడు పమి టేమిటి? చెవులపైకి జారుతూ ఆ జుట్టు ముడేమిటి? ఏం వేషా లివి? దొమ్మరి వేషాలు! ఎక్కడైనా సంసారుల కివి తగునా? దానికి బుద్ధిలేకపోతే, ఆ అత్తకు బుద్ధిలేదా అని నలుగురూ నన్ను దెప్పడానికా?

[సుందరి అటు తిరిగి దిగాలుపడి చూస్తుంది.

* *
*

అయిదవ గొంతు [పిల్లవానిది]. బడిలో జీతం తెమ్మన్నా రమ్మా!

సుందరి [అటు తిరిగి]. రేపిస్తాం లే, బాబూ!

అయిదవ గొంతు. ఊఁ! ఊఁ! ఇవ్వాళ కట్టకపోతే, పేరు కొట్టేస్తామన్నారే, అమ్మా!

* *
*

మరొకసారి మొదటి గొంతు. మళ్ళీ డాక్టరా?

సుందరి [అటు తిరిగి]. అయ్యో! నా తండ్రి కెక్కువగా వున్న దండీ!

మొదటి గొంతు. తడవకి మూడేసి రూపాయలు పొయ్యాలి.

సుందరి. అయ్యో! అయ్యో! నా డాబేం కాను!!

మొదటి గొంతు. చాల్లే! నీ ఖంగారు!

["ఆడబ్రతుకే సంసారం" అని రికార్డు ఫుల్‌బ్లాస్టుతో ప్రారంభం కాగా—

తెర]



# వంతెన

[ఏకాంక నాటిక]

# పాత్రలు

అప్పయ్య : పల్లెటూరి రైతు
కోటమ్మ : అతని భార్య
చలపతి : అతని కొడుకు
పొన్నమ్మ : ఇరుగు పొరుగు యిల్లాలు
భూషయ్య : ఊరు పెత్తందారు

# స్థలం

అప్పయ్యగారి యింటిచావడి

# కాలం

వర్తమానం



# వంతెన

అది అప్పయ్యగారి మండువా చావడి. మండువా నాలుగు వైపులా నాలుగు స్తంభాలు. ఆ స్తంభాలను కలుపుతూ పిట్టగోడ. మండువా మధ్య తులసికోట. ప్రేక్షకులకు సమ్ముఖంలో — మండువాకు అవతలగా — కానవచ్చేది సింహద్వారం. ఎడమ చేతివైపు నున్న రెండు ద్వారాలు గదులలోకి, కుడిచేతివైపు నున్న మరె రెండు ద్వారాలలో ఒకటి వంటింటిలోకి, రెండవది పెరటిలోకి. చావడిలో రెండు నవారు మంచాలు మాత్రం వున్నాయి.

తెర లేచిన క్షణానికి పొన్నమ్మ ప్రవేశిస్తుంది. ఆమె వయస్సు నలభై అయిదు ప్రాంతాల. పూర్వకాలపు ముత్తయిదువ ముస్తాబు.

పొన్నమ్మ. పిన్నామ్మా, కోటమ్మ పిన్నామ్మా!

కోటమ్మ [లోపలినుంచే]. నువ్వాటే పొన్నీ! చేతిలో కాస్త పనుంది. చేసుకొస్తాగాని, కూకోవే, కల్లాలా!

పొన్నమ్మ. ఇంత పొద్దుగూకేళ అంత వంటేమి చేస్తున్నావ్, తల్లీ! చుట్టపా డెవడైనా వొచ్చా డేమిటి?

[పొన్నమ్మ ఈ ప్రశ్న వేసిన తర్వాత ఒక క్షణానికి కోటమ్మ ప్రవేశిస్తుంది. ఆమె వయస్సు ఇంచు మించు యాభై అయిదు సంవత్సరాలు. అభం శుభం తెలియని పల్లెటూరి యిల్లాలు.

కోటమ్మ [ప్రవేశిస్తూ]. సుట్టాలూ లేరు; పక్కాలూ లేరు. ఉల
వల్లో తపుడు కలుపుతున్నా.

పొన్నమ్మ. ఏం? మా బాబాయి లేడూ?

కోటమ్మ. ఊహుం! పేట కెళ్ళాడు.

పొన్నమ్మ. మరి మా తమ్ముడో?

కోటమ్మ. ఆడు పుంచాడైతే మా కిన్ని తిప్పు తెందుకొస్తాయ్! ఆయనగార్కి బద్ధకంగా వుంటే "అబ్బాయ్! పేట కెళ్ళి వా డ్లమ్ముకు రారా!" అని మొన్ననగా పంపిస్తే అజా పజా లేడు. తెల్లారగట్టే ఆ గింజల్ని తోలుకెళ్ళిన బళ్ళు ఆవాళ రేత్రికే తిరిగొచ్చేశాయి. ఎళ్ళీ ఎళ్ళగానే ఆ గింజలేవో బేరమిచ్చేశా డని బళ్ళాళ్ళు చెప్పారు. మరి ఆడేమయ్యాడో ఆ డబ్బే మైందో! ఇదుగో వొస్తాడు, అదుగో వొస్తాడని చూసి చూసి మా కళ్ళు కాయలు కాసినా ఆడి పత్తా లేదు. ఆడి సంగతి తెలుసుండీ ఆడి నెందుకు పంపించానని తన్ను తను ఒక పది తిట్టుకుని మీ బాబాయి సీకటితో లేచి పేటకి లగెత్తాడు. సందేళకి తిరిగొస్తా నన్నాడు. ఇంకా రానే లేదు. గొడ్లు యిళ్ళ కొచ్చేయాళకు ఒక బస్సొస్తుందటగా! అది రానేలా?

పొన్నమ్మ. ఆం! అదింకా మండిందో, లేదో! ఏం బస్సులో పాడు బస్సులు! ఇవేమంటూ వొచ్చాయోగాని, మన ఊరికే శని పట్టుకుంది. పనీ పోయింది; పాటూ పోయింది. బస్సెక్కి బుడిగీ బుడిగీ బస్తీకి దౌడుతీస్తున్నారు. నడవాలా? పెట్టాలా? ఇక్కడ గడపలో యెక్కడం, అక్కడ బజార్లో దిగడం.

ఒక అర్ధరూపాయి మన్ది కాదనుకుంటే బుర్రున పోయి, బర్రున రావొచ్చుమ్యే !

కోటమ్మ. ఔనే, కల్లాలా! ఈ మాయదారి బస్సులు మన కెక్కడ దాపరించాయోగాని, ఊ రొక అందాన లేదు.

పొన్నమ్మ. కాదటే, పిన్నామా? మొన్నొకనాడు ఏం జరిగిం దనుకున్నావ్ ! మా రెండో పిల్లదానికి పురు డొయ్యడానికని ఏటవతలి కెడుతుంటే, ఆ మేసాల యెంకడు - పెదమాలపల్లి యెంకడు - ఆడి పెళ్ళామొచ్చి, తింగు రంగా అంటూ పక్కని కూర్చుంది. ఏం సెయ్యను? మాట్టాడ్డానికి మనవల్లా ? ఇంకా దాని పుణ్యమాయిరి ! పక్కనే కూకుందిగాని, వాళ్ళో కూకుంటేమాత్రం దాన్ని అడిగేవాళ్ళెవరు? పిసుక్కు చచ్చి, నేనే కాస్త ఒక పక్కకి వొత్తిగిలా ! అదే మన మెక్కిన బల్లకట్టమీ దెక్కితే, దాన్ని కాళ్ళిరగగొట్టేవాళ్ల కాదూ?

కోటమ్మ. ఇది మాయ కలికాలం కాదటే, కల్లాలా! ఒక కట్ట డెక్క డేడ్చింది? కుడీ, యెడ మెక్క డేడ్చింది ? ఆ మాట కొస్తే, సిన్నా పెద్దా అయినా చూస్తున్నారటే! మా అబ్బాయి మానానికి మా అబ్బాయి బాబుమాట యింటున్నాడూ ? ఈ యేడు ఆ దసలు మాసూల్లోకి యెళితేనా ? "కళ్ళాం తొక్కించరా !" అంటే చెవి నట్టించుకోలేదు. "కుప్ప దింపించరా!" అంటే గోడకి చెప్పినట్టే! ఏమిటో సినిమాలట! మాయదారి సినిమాలు !! ఈటిని మరిగాక ఆ డింటిపట్టు నుంటేనా !

పొన్నమ్మ. ఆడి కేమే పిన్నామా ! ఎంత చెడ్డా మగబిడ్డ. కాని, ఈ ఆడముండల కేం తిప్ప లొచ్చాయ్ ! కొత్త సినిమా

ఆడుతున్నదని టపు కొస్తే చాలు, - తంబలకి తంబ లిరగ బడుతున్నారు. వాటిని చూసొచ్చినకాడినుంచీ ఆ పాపట్లు పాపట్లు కావు; ఆ పమిటలు పమిటలుకావు. రోజు కొక రకం. నిన్న చూద్దుసుగదా ఆ ఎత్తుపళ్ళ సుబ్బి కోడలిచేతిని కిందినుంచి పైదాకా అన్నీ గాజులే. లంబాడీముండా. లంబాడీ యానముస్నా !

కోటమ్మ. ఇంకా అది నయం కాదటే, పల్లాలా ? ఆ మెరకీడి నరిసి కూతురు....

పొన్నమ్మ. చల్లనేళ ఆ పుట్టుకుంత పేరెందు కెత్తావే, పిన్నామా! పాపం చుట్టుకోడానికా ! అది ఆ బస్సు కండక్టర్ని - దుబ్బు జుట్టుతో గడాసారిలా వుంటాడే ! - ఆణ్ణి....

కోటమ్మ. ఎవడే ఆడు ?

పొన్నమ్మ. ఉన్నాడులే వొకడు చింబోతులా ! - అపి ఊమ్మడ ! ఆణ్ణి పగలు చూస్తే, రాత్రి కలలో కొస్తాడు - ఆణ్ణి అది పెట్టుకుంది. మల్లెపువ్వు లేమిటి? మిఠాయిపొట్లా లేమిటి? - ఆడు నడిపే బుట్టలు బుట్టలు కావు. అన్నీ తెచ్చి యింటి నిండా పడేస్తున్నాడని ఆణ్ణి ఇంటి అల్లుణ్ణి చేసుకున్నారు.

కోటమ్మ. ఛీ ! ముద్దెపు ముండలు. మరి దాని మొగు డెలా వూరుకుంటున్నాడే ?

పొన్నమ్మ. ఆడు గాజులు తొడిగించుకొన్న యదవ కాడంటే, పిన్నామా ! పెళ్ళాం ఏంకూళ్ళు కుడిస్తే ఆడికేం ? దమ్మిడీ ఖర్చులేకుండా బస్సులెక్కి గదేకారిలా తిరుగుతున్నానని ఆడికులు కాడిది.

కోటమ్మ. అంత సన్నాసతే ఆడు !

పొన్నమ్మ. సన్నాసా ! సన్నాసిన్నరా !! నెరీదిగా ఇలాంటి తప్పుడు పనులు సాగుతుంటే, ఇదివరకైతే ఊరుకునే వాళ్ళుటే, పిన్నామా! నిలువునా తెగ్గోసి, ఉప్పుపాతర్లో ఊరేసే వాళ్ళు కదూ ?

కోటమ్మ. ఇంతకీ ఈ తిప్పలన్నీ పెదనాగన్నగారి బూసయ్యే తెచ్చిపెట్టాడు. ఏటిమీద వొంతిన కట్టి, రోడ్డొస్తే ఊరుకేదో వొరుగుతుందని గడప గడపకి తిరిగి చందా లోగుజేసి చట్టు బండ లయ్యాడు. అంతకుముందు ఆ పేట ఎక్కడ మండిందో ఎవళ్ళకి తెలుసు ? నామట్టుకు నేను ఇన్నేళ్ళొచ్చినా దాని మురక్కు ముఖ మెలా వుంటుందో యెరగను.

పొన్నమ్మ. అంతేనే, పిన్నామా ! మనకి బస్తీలతో పనేమిటి ? ఏటి కొకసారెళ్ళితే గింజా గిట్రా అమ్ముకోటాని కెళ్ళాలి. పెళ్ళికీ, పబ్బానికీ గుడ్డా గుడుసూ తెచ్చుకోడాని కెళ్ళాలి. అప్పుడైనా ఎవళ్లు బడితే ఆళ్ళే యెళ్ళేవాళ్లా? పెద్దతలకాయలు ఒకరో, యిద్దరో పొద్దున్నే చద్దన్నం తినెళ్ళితే, సందేళకి ఆ పనేమిటో చూసుకుని చక్కా వొచ్చేవాళ్ళు. ఇప్పుడేముంది? అడ్డమైనాళ్ళూ ఆసులో గొట్టం తిరిగినట్టు ఈ సందుకీ, ఆ సందుకీ తిరుగుతున్నారు. ఎన్ని బస్సులు నడిచినా, నిలుచో టానికైనా సందుంటేనా !

కోటమ్మ. ఇంతకీ మా కొంపకి తిప్పలు తేవటానికే వొచ్చి పడ్డాయి ఈ పాడు బస్సులు ! తన పనేమో, తనేమో ఒకరి

జోలీ సొంటీ లేకుండా దొరలా వుండే నా బిడ్డ ఇవొచ్చాక చప్పగా చెడిపోయాడు. వారానికి రెండు, మూడు సార్లయినా బస్తీ కెళ్ళి రాకపోతే ఆడికి నిద్ద పట్టడం లేదు.

పొన్నమ్మ. మన పెత్తందారు బూసయ్య వొంతి నేయించాక, మనాళ్ళందరు—నీళ్ళకు చేప ఎదురెక్కినట్టు — బస్తీ కెళ్ళడ మేనా, మన కొచ్చిపడ్డ తిప్పలు? ఆ బస్తీయే వొంతినమీదగా వొచ్చి, మన గొంతుమీద కూకోడం లేదటే, పిన్నామా? అంతకుముందు బీడీలు, సిగరెట్లు, సోడాలు, కిళ్ళీలు మన వూళ్ళో అమ్మేవారా? ఇప్పుడు ఆ మంది నొంతినదగ్గిర అన్నీ ఈ కొట్లే. రెండో, మూడో బట్టల కొట్లుకూడా కొత్తగా యెలిశాయిగా! ఇంక కాపీ హోటళ్ళ సరేసరి. రోజు కొకటి రాడి కొస్తున్నది. హోటల్, హోటల్లోసు పానిగ్రాపులంట— పొద్దోయేదాకా ఒక్కటే గొడవ. ఈ లెక్కని మరి నాల్గురోజులు పోతే, ఇదే పెద్ద బస్తీ రాకపోతే నన్నడుగు.

కోటమ్మ. అవునే, కల్లాలా! ఈ మాయదారి వొంతె నొచ్చాక ఊరే తలకిందులై పోతున్నది. మా అబ్బాయి మానానికి మా అబ్బాయి వుంటే ఆ బస్తీలో వుంటాడు; లేకపోతే ఆ వొంతెనదగ్గి రుంటాడు. ఇల్లంటేనే ఆడికి కంపరంగా.... అడుగో! ఆ డొచ్చాడు. ఏరా, అబ్బాయ్! ఎన్ని రోజు లైంది నువ్వెళ్ళి? రేపటికి నాలుగు! ఇదుగో తిరిగొస్తానన్న బిడ్డ రానేలేదని మా మడుసెంత పీకిందో నీ కేం తెలుస్తుంది! ఇట్టాగైతే ఎట్టారా, బాబూ! ఏడీ, మీ బా వేదీ?

[ఈ ఘట్టంలో ప్రవేశించిన చలపతి ఇరవై రెండు, ఇరవై మూడు యేళ్ళవాడు. మనిషిలో నాజూకుతనం లేకపోయినా, వేషంలో నాజూకుతనం కోసం చాలా ప్రయత్నం కనబడుతుంది. కుబుసంలాంటి ధోవతి; ఆ ధోవతికంటెకూడా సన్నని లాల్చీ; ఆ లాల్చీలో నుంచి తొంగిచూస్తూ చేతులులేని అల్లిక బనియన్; వల్లెవాటుగా సన్నని జరీ ఉత్తరీయం. కాళ్ళకు ఆకు చెప్పులు; చేతికి గడియారం; కళ్ళకు గాగుల్సు.

చలపతి. ఏమో, నాకేం తెలుసు ?

కోటమ్మ. నీవెంట రాలేదట్రా ?

చలపతి. నావెంట రావడ మేమిటి ?

కోటమ్మ. నిన్నెతుక్కుంటూ, పొద్దున్నే పేటకి రాలేదట్రా మీ బాబు ?

చలపతి. నన్ను వెతుక్కుంటూ తను రావడం దేనికి ? నేనేం పాపాయినా దారితప్పి పోవడానికి ?

కోటమ్మ. అది కాదురా, బాబూ! పం టమ్మి డబ్బు తెమ్మని పంపిస్తే....

చలపతి. పంపిస్తే, ఆ డబ్బు పుచ్చుకుని, దేశం తెగించి పారి పోయాననుకున్నాడా ?

కోటమ్మ. చూడవే, పొన్నీ! అడి మాటలు! మొన్న పొద్దున్నగా వొడ్లు తోలించుకెళ్ళి తను బస్తీలో కూకుంటే కూకున్నాడు గాని....

చలపతి. అక్కడ ఆ రైసుమిల్లు వాళ్లు డబ్బివ్వకపోతే నన్నేం చెయ్యమంటా రేమిటి?

పొన్నమ్మ. అంత కోపం దేనికిరా తమ్ముడూ? ఇప్పుడు పిన్నా మేమనిందని?

కోటమ్మ. అక్కడ పైక మందకపోతే, అందలేదని—తెల్లారి లేస్తే లచ్చా తొంబై మంది వొస్తూ పోతూ వుంటారుగదా!— ఎవళ్ళ చేతనైనా కాస్త కబు రంపితే మే మెందుకు గుంజాటన పడతాం!

పొన్నమ్మ. నిజమే తమ్ముడూ! కాకితోనైనా కాస్త కబురు చేస్తే కాదూ?

చలపతి. కబురెలా చెయ్యడం? ఏపూట కాపూట ఈపని చేసి పంపిస్తామని వాళ్ళంటూవుంటే!

కోటమ్మ. సర్లే, బాబూ! నువ్వు సుఖంగా తిరిగొచ్చావ్! అదే పదేలు గాని, నిన్నెతుక్కుంటూ యెళ్ళిన మీ బాబు నువ్వు తగల్లేదని యెంత గాబరా పడుతున్నాడో, ఏమో, ఖర్మం! పైకెంత బోకరించినా, వొట్టి బయస్తుడు. కాస్తికీ కూస్తికీ గుండె బేజారౌతాడు. సందేళకి తప్పకుండా తిరిగొస్తానని చెప్పెళ్లాడు గాని, నువ్వు కనిపించలేదని ఇవాల్టికిక రాదేమో. చివరి బస్సొచ్చేసిందా?

పొన్నమ్మ. వచ్చే వుండాలి. నువ్వొచ్చింది చిట్టచివరి బస్సేగా, అబ్బాయ్?

చలపతి. ఉహుఁ. అది మరి కాసేపటికిగాని రాదు. నేనొచ్చింది దారిలో చెడిపోయి, గంటన్నర అలస్యమైంది.

పొన్నమ్మ. అంతే మరి! ఏదైనా సాగితే బంతి, సాగకపోతే మొండి.

కోటమ్మ. సర్లేరా, బాబూ! రా! కాళ్లు కడుక్కురా బువ్వపెడతా!

చలపతి. ఉఁహూఁ! ఆకలెయ్యడం లేదు.

కోటమ్మ. అయ్యో, ఖర్మ! ఆకలెయ్యకపోవట మేమిట్రా? పెరుగోసుకైనా రెండు ముద్దలు....

చలపతి. నా కేమీ వద్దు.

కోటమ్మ. మా నాన్నవుగా రెం డంటే రెండే ముద్దలు.

చలపతి [చిరాకుగా]. నా కాకలి లేదంటూంటే!

[బయటికి వెళ్ళబోతాడు.

కోటమ్మ. మళ్ళీ యిప్పుడు బయటి కెక్కడికిరా? కాసేపటికో, కూసేపటికో ఏ బా బొస్తాడేమో! ఆయి నొచ్చేయాళకి నువ్వింటికాడ లేకపోతే....

పొన్నమ్మ. ఔను, తమ్ముడూ! బాబాయి యిప్ప డొస్తాడేమోగా! నువ్విప్పు డెక్కడికి?

చలపతి. ఎక్కడికీ లేదు - ఇక్కడికే! ఇప్పుడే తిరిగొస్తా.

[తిరిగి కదులుతాడు.

కోటమ్మ. సరేగాని, ఆ దస్తు యెంట దేనికిరా, బాబూ! ఇంట్లో బద్రంచేసి పో.

చలపతి. దస్తేమిటి? వాళ్ళు డబ్బివ్వందే!

కోటమ్మ. ఆళ్ళ జిమ్మడ! ఇన్నిరోజు లట్టిపెట్టుకుని ఆళ్లు డబ్బివ్వ నేలా?

చలపతి. ఉఁహూఁ!

[వెడతాడు.

కోటమ్మ. చూశావటే, పొన్నీ! ఆ వొచ్చిన యెద మెక్కడ? ఎళ్ళిన యెద మెక్కడ? కూసేపైనా కొంపలో ఆడికి కాలు నిలిస్తేనా? ఈ మండిన వొంతిన పడి, ఈ మాయదారి బస్సు లేమంటూ వొచ్చాయో గాని, నాబిడ్డ చప్పగా చెడిపోయాడు. ఏ మేసిపెట్టినా సుబ్బరంగా పళ్ళెం తుడుసుకు తినేవాడు. ఇప్పు డెంత కమ్మగా కూ రొండినా, ఆడికి రెండు ముద్దలైనా దిగందే! కూకున్నాడు కూకున్నట్టే లేసి చక్కా పోతున్నాడు. ఈపూట గత్తే అస లన్నమే వొద్దన్నాడు!

పొన్నమ్మ. ఆఁ! కాపీహోటళ్ళకి మరిగినాళ్ళకి మన కూరా నారా సచ్చుతాయటే, పిన్నామా! ఇడ్డెన్లని, దోసెలని - ఆటి పేర్లయినా - మండిన పేర్లు! - మనకి తెలవ్వు - అక్కడేమిటో వర్రగా పెడతారట!

కోటమ్మ. ఏం తిళ్ళో పాడు తిళ్ళు! ఇల్లాంటి తిళ్ళు ఎన్ని తిన్నా అన్నమౌతుందటే, కల్లాలా!

పొన్నమ్మ. కాదనుకో! కాని అడ్డమైనాళ్ళకి ఇప్పుడు కాపీ హోటలు ఒక పెద్ద రంధై పోయిందిగా! బస్తీకి తిరిగేవాళ్ళ సగం సినిమాలకైతే, సగం కాపీహోటళ్ళకి. ఈ పాడు హోటళ్ళమూలంగానేగా, ఊళ్ళో పాలూ, పెరుగూ, మజ్జిగా కరువైపోయాయ్? నెయ్యి మాత్రం కావాలంటే దొరుకుతున్నదా? ఇప్పుడు పాడిచేసుకోవడం తాగడానికటే, పిన్నామా?—అమ్మకు మూటలు కట్టుకోడానికిగాని! తెల్లారకముందే వాడిక వాళ్ళొచ్చి పాలూ, పెరుగూ, యెన్నా, అన్నీ బస్సులమీద యెక్కించుకు పోతున్నారు.

కోటమ్మ. నిజమేనే, పొన్నీ! మొన్నొకనాడు సుట్టపాడొస్తే పాపుసేరు నెయ్యికోసమని పెడతెట్టి ఊరంతా తిప్పించినా వొరికితేనా౽! ఏ రమ్మేదానికి కానీ, అర్దాణా ఎక్కు వేసుకు పొయ్యమన్నా, ఎవ్వతీ పొయ్యలేదు.

పొన్నమ్మ. నీదంతా పిచ్చిగాని, ఇప్పు డసలు అర్ద శేరు పాలు పొయ్యమన్నా పోస్తున్నారటే, పిన్నిమా? ఒకపూట వాడిక తప్పిస్తే, వాడిగ్గా వొచ్చేవాళ్ళు అలిగి బిగదీసుకు పోతారట! అడిగితే మాట వోటుపోవడమే తప్ప, ఒక్క బొట్టయినా రాల్చరు.

కోటమ్మ. అయ్యో! కాలాని కెన్ని కడగళ్ళొచ్చాయే, కల్లాలా!

పొన్నమ్మ. పిల్లా జెల్లా నోట గడ్డ కొట్టి, ఆ అమ్మకునే పాడైనా ఒక తీరూ వారీగా అమ్ముతున్నారా? అన్నీ కల్తీలేగా! అంతా తొత్తడమేగా!

కోటమ్మ. ఔనే, పొన్నీ! మొన్న ఎవతో చెప్పింది. వెన్న తీశాక, దాన్లో యింత మజ్జి గోసి, కవ్వంతో గిలకొడితే, ఆ మజ్జిగంతా వెన్నలో కెక్కి అటొస్తుందటగా!

పొన్నమ్మ. అదొక్కటేనా? మైదాపిండి మెత్తగా ఉడకమెట్టి వెన్నలో కలిపేస్తున్నారు!

కోటమ్మ. ఇంత పాపం మూట కట్టుకుంటే ఏం ముందు కొస్తారులే! ఈ మండి నొంతెన వడీ, ఈ మాయ దారి బస్సులొచ్చి, ఈ ముదనష్టపు బస్తీల కెక్కడం ఎక్కువైనాకేగాని, అంతకుముందు ఈ పాపా లెరగమే, పొన్నీ! ఎటొచ్చి ఏణ్ణర్థం, రెండేళ్ళనుంచేగా ఈ యిద్దూరా లన్నీ!

పొన్నమ్మ. నిజమేనే పిన్నామా ! నాలుగేళ్ళనాడు మా రెండోపిల్ల పెళ్ళికి కానీపెట్టి కూరకొన్నామూ? ఇరుగు పొరుగాళ్ళే గుమ్మిడికాయలు, సొరకాయలు, దోసకాయలు, వంకాయలు, బెండకాయలు, దొడ్లలో కాసినాటిని, అడక్కుండానే పట్టుకొచ్చి యిల్లు నింపారు. అదే పోయినేడు మా మూడో పిల్ల పెళ్ళికి తోటకూరకాడసుద్దా అన్నీ బస్తీ కెళ్ళి కొనుక్కోవాల్సొచ్చింది !

కోటమ్మ. అంతేనే, కల్లాలా ! ఇదివరకంటే మంచొచ్చినా, చెడొచ్చినా, ఒకళ్ళ కొకళ్ళు ఆదుకునేవాళ్ళు. ఇప్పు డేముందీ? డబ్బుకు పలో డబ్బు ముడేసి....

పొన్నమ్మ [కాళ్ళ అలికిడి విని, వీధిగుమ్మంవైపు ముఖం తిప్పి]. అడుగోనే, పిన్నామా, మా బాబాయి !

[అప్పయ్య ప్రవేశిస్తాడు. వయస్సు దాదాపు అరవై సంవత్సరాలు. అయినా, శరీరపటుత్వం కొంచెమైనా సడలనివాడు. పొలంలో పంగితే, పడుచువాళ్లను మించి పాటుపడగలవాడు.

అప్పయ్య [లోపలికి అడుగు పెడుతూనే కోటమ్మతో]. ఏమేఁ! వాడు పేటలో లేడు! ఏమైపోయినట్టు?

కోటమ్మ. ఇంటి కొచ్చాడు.

పొన్నమ్మ. ఇంతకు ముందేనే, బాబాయ్ !

అప్పయ్య. దొర దిగాడన్నమాట ! ఏడీ, మరి?

కోటమ్మ. వాకిట్లోవాడు వాకిట్లోనే ఊరిమీదికి పోయాడు. ఎంత బతిమిలాడినా తిండైనా తిన్లేదు !

అప్పయ్య. అప్పుడే ఇంటికి రావడమూ, ఊరిమీదికి పోవడమూ జరిగిందన్నమాట! ఆ దస్తు ఇంట్లో భద్రంచేసి పోయాడా!

కోటమ్మ. ఆళ్ళింకా డబ్బివ్వలేదటగా!

అప్పయ్య. డబ్బివ్వకపోవడ మేమిటి? సొమ్ము సంచులమీద పెట్టామని వాళ్ళు చెబితే!

పొన్నమ్మ. అప్పే! లేదపే బాబాయ్! ఆళ్ళు తెగ తిప్పి, ఉత్తి చేతుల్తో పంపించారని అబ్బాయి అంటేనే!

అప్పయ్య. వీడింత దొంగ వెధవయ్యాడే! ఒక్కమాటైనా నిజం లేదుగదా? వేరం పుచ్చుకోగానే, డబ్బిచ్చేశామని వాళ్ళు నాతో సొషంగా చెప్పారు!

కోటమ్మ. అయ్యో ఖర్మ! అయితే ఆడు డబ్బేం చేసినట్టు! తాస్తా, కూస్తా! మూడేల సిల్లర!

అప్పయ్య. వాడొంటికి బాగా నీరుపట్టింది. కళ్ళు పసరెక్కి కొట్టుకుంటున్నాడు. నేను కాస్త బద్ధకించి, వొడ్లు అమ్ముకు రారా అని పంపిస్తే, నన్నింత రొష్టు పెడతాడూ? ఎక్కడున్నాడో చూసి, సిగ పాయతీసి, వాణ్ణి ఈ పూట సున్నంలోకి ఎముకలేకుండా నలగ బొడవకపోతే నా పేరు అప్పయ్య కాదు.

[ముందువా మూలలోనుంచి కోలబుర్ర తీసుకుని, వీధిలోకి బయల్దేరబోతాడు.

కోటమ్మ [అడ్డు వచ్చి]. సర్లే! నువ్వూరుకో! కన్నాక మన్దే; యేలూ మన్దే. ఆణ్ణి పట్టుకు కొడితే పోయిన డబ్బొస్తుందా?

అప్పయ్య [కోటమ్మను తోసివేసి వెళ్ళిపోతూ]. ఎప్పటికప్పుడు నువ్వే వాణ్ణి చెడగొట్టింది. నువ్విచ్చిన అలుసు చూసుకునేగా వాడు మేకై కూర్చున్నాడు.

కోటమ్మ [నెత్తి కొట్టుకుంటూ]. ఇది నా ఖర్మ.

పొన్నమ్మ. ఆఁ! నీకు తెలవదులేవే, పిన్నామా! ఆపాటి భయం లేకపోతే మా టింటారటే!

కోటమ్మ. చాల్లే! చెప్పొచ్చావ్! కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందని. ఆడి కాలో, సెయ్యో యిరిగితే ఎవళ్ళకీ తిప్పలు? మాక్కాదూ?

పొన్నమ్మ. ఆఁ! బాబాయిది బుసబుస పొంగు! ఏదో తామస మొచ్చి కేకలేస్తూ పోయాడు గాని, పెరిగొచ్చిన కొడుకుపై చెయ్యి చేసుకుంటాడటే, పిన్నామా!

కోటమ్మ. ఏమో ఖర్మ! మండిపడుతూ యెల్లాడు. పిచ్చి కోపంలో నా కొంప కేమి తిప్పలు తెస్తాడో! ఇంతకీ ఈ పీడంతా ఆ పెదనాగన్నగారి బూసయ్య....

భూషయ్య [ప్రవేశిస్తూ]. ఏమిటే, కోటమ్మక్కా! నా పేరెత్తుతున్నావ్!

[భూషయ్య వయస్సు నలభై అయిదు ప్రాంతాల. మనిషిలో ఎంతో హుందాతనం కనబడుతూ వుంటుంది. తాతవలె, తండ్రివలె తానుకూడా తన హుందాతనంపల్లనే ఊరుకు పెత్తందారై, వయస్సులో తన కంటె పెద్దవారినుంచికూడా మన్నన లందుకొంటున్నవాడు.

కోటమ్మ. వొచ్చావ్, బాబూ, నువ్వు!—మాటలో మూటేసుకుని! నువ్వే మా కిన్ని కడగళ్లు తెచ్చావ్!

భూషయ్య [నవ్వుతూ]. అంత పాపం చేశానూ?

కోటమ్మ. నీ కిది నవ్వులాటగా వుందటరా, బూసయ్యా?

భూషయ్య. ఇంతకీ, ఏమిటమ్మా సంగతి?

కోటమ్మ. ఏమిటా? గింజలమ్ముకురారా అని పిల్లాడిని పేటకి పంపిస్తే, ఆటి నమ్మి ఆ డబ్బంతా మంగళం చేసుకొచ్చాడు. ఈః మా టినేసరికి మీ బావయ్యకి వొళ్లు మండుకొచ్చి కఱ్ఱుచ్చుకు కొడుకుమీది కెళ్లాడు.

భూషయ్య. ఆఁ! మా బావయ్యకి అంత వొళ్లు తెలియని కోప మొచ్చిందీ?

పొన్నమ్మ. ఎవళ్ళకైనా పుట్టుకొస్తుంది రేచిక్క, ఇట్టాంటి పన్లు చూస్తే!

కోటమ్మ. అబ్బాయ్! నువ్వు కాస్తెళ్ళి మీ బావయ్యకి సర్దిచెప్పి తీసుకురారా! మంగళమైన సొమ్మేమో మంగళమైంది. ఆణ్ణి బాదితే పోయిన డబ్బొస్తుందా?

భూషయ్య. ఇప్పుడు నీ కొడుకొచ్చిన భయ మేమీ లేదు, కోటమ్మక్కా! వాడు మాయింట్లో భద్రంగా వున్నాడులే.

కోటమ్మ. ఆడు మీయింటి కాడున్నాడూ? అయితే, పరవా లేదులే!

భూషయ్య. పరవా లేదూ? ఇంతకు ముందేగా నేను మీకు కడగళ్లు తెచ్చానన్నావ్!

కోటమ్మ. ఆ మాట ఇప్పు డననూ ? నువ్వు ఈ మండిన రోడ్డు పోయించి, ఈ మాయదారి వొంతె నేయించి, ఈ మదనష్టపు బస్సులు తెప్పించాకే కాదట్రా, ఊళ్ళో కొంపకొంపకీ ఇన్ని కడగళ్ళొచ్చాయ్ ! అంతకుముందు ఈ యిడ్డూరా లెరుగున్నామూ ?

పొన్నమ్మ. అట్టా అడుగు, పిన్నామా ! బాగా అడుగు !

భూషయ్య. అయితే, పొన్నమ్మా! నువ్వు పాడిమీద ఎంత సంపాయిస్తున్నావ్ ?

పొన్నమ్మ. ఆఁ! ఈ యేడు మాకు పా డెక్కడిది ?

భూషయ్య. పోనీ, ఈ యేడు కాకపోతే నిరుడెంత మూటగట్టావ్ ?

పొన్నమ్మ, ఆఁ ! చాలా మూట గట్టాం! వాటికి పోసిన తవుడుకే చాల్లేదు.

కోటమ్మ. అదేంటే, పొన్నీ! పాడికుండమీద నాలుగు డబ్బులు కళ్ళబడితేనేగాఁ ఆ నానుపేట చేయించుకుని మెళ్ళో పెట్టుకున్నావ్ !

భూషయ్య [నవ్వుతూ]. అలా అడుగు, కోటమ్మక్కా ! బాగా అడుగు !

పొన్నమ్మ. అడగడానికీ, కడగడానికీ నే నెవరి యింట్లోనైనా కన్నా మేశానా ;

భూషయ్య.. ఎవరింట్లో కన్నంవేస్తే ఎవ రూరుకుంటా రమ్మా ? పాడి అమ్ముకోబట్టి....

పొన్నమ్మ. అమ్మకోక పందేరం పెడతా రేమిటి? ఊరికే మా కెవ్వరేమీ పంచిపెట్టడం లేదేఁ!

భూషయ్య. ఊరికే పంచిపెట్టమని నేనంటానా? రోడ్డు పొయ్య బట్టే, వంతెన పడబట్టే నాలుగుడబ్బులు అందరి కళ్లా పడు తున్నా యంటున్నాను; అందరూ కాస్త పచ్చపచ్చగా వున్నా రంటున్నాను. కొత్తగా చేతిలో నాలుగు డబ్బులు గురగుర లాడుతుంటే, ఎంతటివాళ్ళకైనా మతులు పోతాయ్! అంత మాత్రానికి చేతిలోకి నాలుగు డబ్బు లొచ్చేదారి చూపించడమే తప్పా?

కోటమ్మ. అఁ! మా లావు నువ్వు చూపించావులే దారి! ఆ మండిన బస్తీనుంచి ఒక కానీ ఇక్కడికి కొస్తే, ఇక్కడినుంచి రూపాయి అక్కడికి పోతున్నది. ఇంతేనా సంబరం! ఇవ్వాళ చూశావుగా! కాస్తా, కూస్తా! మూడేల చిల్లర! చల్లా పెరుగూ అమ్ముకుని కానీ కానీకాటికి ముడేస్తే, ఎప్పటికి కాను మూడేలు! ఈ మాయదారి బస్సులు తగలడకముందు మా అబ్బాయి బస్తీ ముఖ మెరుగున్నాడూ?

పొన్నమ్మ. అట్టా అడుగు, పిన్నామా! బాగా అడుగు!

భూషయ్య. నేను తిరగమన్నానటే, కోటమ్మక్కా, మీ అబ్బా యిని బస్తీ చుట్టూ! నామాట విని, ఎక్కడైనా మంచి పిల్లను చూచి వాడికి తొందరగా ముడిపెట్టండి. గుదిబండ మెడని పడితే, ఇంటి నతికి వుంటాడు.

కోటమ్మ. ఆఁ! అడింత గాలిగా తిరుగుతుంటే ఆడికి పిల్ల నెవ రిస్తారు?

పొన్నమ్మ. ఆడికి పిల్లనిచ్చేవాళ్ళే కరువచే, పిన్నామా? మా పెద్దమ్మాయిదగ్గిర వుందిగా ఎదిగినపిల్ల. నువ్వు "ఊఁ" అనాలేగాని, పదేనేలు కట్నంపోసి....

కోటమ్మ. కట్నాల కేమొచ్చెలే! అంత దూరం సమ్మందం....

పొన్నమ్మ. ఎంతదూరమే, పిన్నామా! పది ఆమడలైనా లేదు. ఈ ఊరునుంచి ఆ ఊరుదాకా బస్సులు నడుస్తూనే వున్నాయిగాఁ! పొద్దు నిక్కడ బయల్దేరితే, పొద్దుగూకేళకుముందే అక్కడ దిగొచ్చు.

[భూషయ్య నవ్వుతాడు.

కోటమ్మ. ఎందుకురా బూసయ్యా! నీకంత నవ్వుగా వుంది?

భూషయ్య. అఁ! ఏం లేదు, కోటమ్మక్కా! ఈ ముదనష్టపు బస్సులు రాబట్టే గదా, పొన్నమ్మ పెద్దమ్మాయిగారి వూరు ఇంతదగ్గరి కొచ్చిందని నవ్వొచ్చింది.

పొన్నమ్మ. అఁ! మన పెత్తందారుగారి ఎకసక్కాలకేం గాని, అయిన సమ్మందం! పిల్ల వొంటిని డెబ్బై నవర్సుల బంగారం వుంది. ఏమంటావే, పిన్నామా?

కోటమ్మ. అఁ! ఇప్పు డేం తొందర లేవేఁ!

పొన్నమ్మ. వచ్చే నెల్లో రెండే లగ్గా లున్నాయి. ఆ రెండూ తప్పనిచిసి, మరి ఈయేటికి లగ్గమే లేదంటున్నారు. ఈపూట నే నసలు ఈ మాట కదలేసిపోదామనే సగ మొచ్చానే, పిన్నామా!

కోటమ్మ. సరే సూద్దాం లేవే, పొన్నీ!

పొన్నమ్మ. సూర్దామంటే కాదు; తొరగా ఏదో ఒకమాట తేల్చాలి నువ్వూ, మా బావాయీ కూడాబలుక్కుని. నోరు తెరిసి అడిగినందుకు, నామాట దక్కించాలి. పొద్దోయింది. మరి నే నెళ్ళొస్తా.

[ వెడుతుంది.

భూషయ్య. అంత కట్నం పోస్తామంటే, ఆ సంబంధం వొద్దంటా వేమే, కోటమ్మక్కా!

కోటమ్మ. కట్నమొస్తే సాలట్రా? మంచీ సెబ్బరా లేదూ?

భూషయ్య. వాళ్ళకేం? పొన్నమ్మ పెద్దల్లుడికి ఈ మధ్య బాగా కలిసొచ్చిందటగా!

కోటమ్మ. ఆ! ఎంత కొత్త భాగ్య మొస్తేనేరా, అబ్బాయ్! ఆడి గుణం మంచిది కాదు. ఆడు బోగం కొంపలకి తిరుగుతూ, పెళ్ళాన్ని కాపరానికి తీసికెళ్ళకుండా, మొదట్లో రెండు మూడేళ్ళు ఈ పొన్నిని నానాగడ్డీ తినిపించలేదట్రా? ఈ మాయదారి సొమ్మందం మా కెక్కడ దాపరించిందని కనబడ్డాళ్ళందరికీ చెప్పుకుని ఆపురావుఁరని ఇది అప్పు దేడ్చేదికాదూ? ఇవ్వాళ గత్తే, నా అల్లుడు పదేనేలు కట్నమిస్తాడంటూ చెప్పొచ్చింది!

భూషయ్య. కట్నం అక్కరలేదనుకుంటే, మా పిల్లని చేసుకో!

కోటమ్మ. నీకేం తక్కువరా? - కట్నమివ్వకపోవటానికి!

భూషయ్య. ఇవ్వలేక కాదుగాని, యివ్వను.

కోటమ్మ. నీ కూతురికి నువ్వేమీ పెట్టుకోవట్రా? అయితే, అది ఉసూరుమన్దూ?

ఘాషయ్య. నా కూతురికి నే నేమైనా పెట్టుకుంటానో, లేదో అది నా యిష్టం. ఇంత కట్నం, అంత కట్న మని ముందుగానే పేరాలు మాత్రం నాకు గిట్టవ్. బేరాలకు ఇదేం బ్రేగోడ్డా! కట్నం పేరుపెట్టి నే నొక చిల్లిగవ్వైనా యివ్వను!

కోటమ్మ. కట్నంలేందే నీపిల్ల మాకు దేనికి? ఆడికి పాతికేలు పోస్తామంటూ ఎన్నో సమ్మందా లొస్తున్నాయి. నిచ్చేపం లాంటి బిడ్డ! నిలువెత్తు డబ్బోసినా, నా బిడ్డంటి అల్లుడు నీకు దొరుకుతాడూ?

ఘాషయ్య [ఈ ఘట్టంలో ధుమధుమలాడుతూ లోపలికి వచ్చిన అప్పయ్యతో]. అప్పయ్యబావా! నిలువెత్తు డబ్బు పోసినా దొరకని కొడుకుతో లేనిపోని పేచీ లెందుకు....

అప్పయ్య. వాడా నా కొడుకు! ఇఖ, వాణ్ణి నా గడప తొక్క నిస్తానూ?

కోటమ్మ. చాల్లే! ఏం మాటలు! ఎవరైనా యింటే నవ్విపోతారు!

ఘాషయ్య. ఎందుకే, అప్పయ్యబావా, అంత కొంపరు!

అప్పయ్య. ఈపూట వాడి గీత బాగుంది! లేకపోతే, రక్తం కళ్ళ జూసేవాణ్ణికాదూ? కర్రెత్తేసరికి నలుగురూ పోగై పట్టు కున్నారు గాని....

ఘాషయ్య [నవ్వుతూ]. నలుగురూ పోగయ్యేవరకు ఆగినావివి నువ్వేం రక్తం కళ్ళజూస్తావ్, అప్పయ్యబావా!

కోటమ్మ. నీ యెకసక్కాలకు యేళా పాళా లేదట్రా, బూసయ్యా!

అప్పయ్య. ఆ వెధవని ఈపూట పాతేసేవాణ్ణికాదూ! ఆ వంతెన కాడ పదిమంది పుండబట్టిగాని....

భూషయ్య. చలపతి వంతెనవద్ద వున్నాడటే, అప్పయ్యబావా? నేను తిరిగొచ్చేదాకా మా యింట్లోనుంచి కదలొద్దని చెప్పొస్తే వాడికి కాలు నిలవలే దన్నమాట!

కోటమ్మ. ఆ డొంకచోట కాలు నిలిచే గున్నైన్లైతే మా కిన్ని తిప్పలెందు కొస్తాయిలే!

భూషయ్య. మాట్లాడితే తిప్పలు తిప్పలంటావ్. ఇప్పుడు నీకొచ్చిన ప్రమాద మేమిటి, కోటమ్మక్కా?

కోటమ్మ. చూస్తూనే వున్నావుగా! ఇ దేమిట్రా? కొంపకి తిప్పలు కావూ?

అప్పయ్య. శిస్తుకైనా ఠికానా లేకపోబట్టిగా ఈ తక్కువధరల్లో సగం పంట అమ్మింది! "జాగ్రత్తరా, అబ్బాయ్!" అని మరీమరీ చెప్పి పంపిస్తే, అంతా జలగడుక్కొస్తాడూ? పైగా, వాళ్ళు డబ్బివ్వలేదని అబద్ధాలా!

భూషయ్య. అబ్బే! లేదే, అప్పయ్యబావా! వాడు మొత్తమంతా ఖర్చుపెట్టలేదు. ఏదో కొంచెం దొర్రి పడింది. చేబదులుచేసి దాన్ని పూడుద్దామనే ఈపూట నాదగ్గిరికి పరిగెత్తుకొచ్చాడు. బుద్ధిమంతుడిలా నాదగ్గిరికి రాబట్టి సరిపోయిందిగాని, అదే ఏ షాహుకారు సుబ్బయ్యలాంటి వాడిదగ్గిరికో వెళ్ళితే రూపాయి చేతిలో పెట్టి, రెండు రూపాయలకు ప్రోనోటు రాయించుకునే వాడు కాడూ?

కోటమ్మ. నే ననుకుంటూనే వున్నారా, బూసయ్యా! చిన్నన్నాసి ఏ యాబయ్యో, వందో ఖర్చుపెట్టుకుంటాదేమో గాని, ఆడు మూడే లేం చేస్తాడు! ఆ దేం లాగుతాడా? తలకుబోసుకుంటాడా?

అప్పయ్య [మొత్తం సొమ్ము గల్లంతుకాలేదని విన్నంతనే, కోపం కొంత చల్లారిపోగా]. జొర్రి పెట్టుకొచ్చాడూ? ఏపాటి?

ఘూషయ్య. ఆఁ! ఎంతోనా, అప్పయ్య బావా! సాదరుకింద తను వాడుకున్న బాపతు ఏవో చిల్లరమల్లర అప్పులుంటే, వాటిని ఆపడానికి వీల్లేక, ఒక నాలుగు వందలు వాటికింద జమకట్టాడట. ఈ మాట తెలిస్తే నువ్వెక్కడ కోప్పడతావో అని నీ యెదటపడ్డానికి వాడు జంకుతున్నాడు.

అప్పయ్య. అలాగేఁ!

కోటమ్మ. ఏదో చిన్న సన్నాసి! ఆపాటి వాతు వాడుకున్నాడేమోలే!

అప్పయ్య. వాడా చిన్న సన్నాసి! ఈమధ్య నీటుగోటులు తెగ బలిసిపోతే! ఇస్త్రీమడతలు తప్ప పనికి రావడంలేదు. తలకి వాసన నూనెలు కావాల్సొచ్చాయి. వీడు ఉద్యోగాలు చేస్తున్నాడా? ఊళ్ళేలుతున్నాడా? వీడికి చేతికాక గడియారం దేనికి? నాకు అరవైయేళ్ళొస్తున్నాయ్! ఇంకా కళ్ళజోడుతో పనిపడలేదు. నాకురాని చత్వారం వీడి కొచ్చిందా? వీడికి కళ్ళజోడు దేనికి? షోకు బలిసి, ఎంత నాజూకు తేలాడని! ఎండ తగిల్తే వొళ్ళు కందిపోతుంది కాబోలు — పొలంవైపు తొంగైనా చూడ్డంలేదు.

ఘూషయ్య. అదీ ఒక చిన్నతనమే! ఏమైనా నువ్వంటే వాడికి భయభక్తులేనే, అప్పయ్య బావా! లేకపోతే, ఈపూట ఇంత గజగజలాడ్డం దేనికి?

అప్పయ్య. వాడి ఖయత్తు లేవో కనబడుతూనే వున్నాయ్! నమ్మి గింజలు తోలించి పంపిస్తే....

ఘూషయ్య. వాడు చేసింది తప్పేననుకో. కాని, నువ్వు కానకుండా ఏ రాత్రివేళో కళ్లాంలోనుంచి ఒక పదిబస్తా లెత్తించివేస్తే ను వ్వేం చేసేవాడివి? అలాంటి పాడు పని చెయ్యనందుకు సంతోషించక....

కోటమ్మ. బొర్రసుబ్బయ్యగారి రెండోవాడు మొన్న మాసూలులో అంత పనీ చేశాడు. పాతేసని కట్టుకుని, బాబుకి తెలియకుండా పందుమొల్లు కోమటి మల్లయ్యకి పోశాట్ట!

ఘూషయ్య. ఆఁ! నేను చెప్పవచ్చిందీ అదే, బావా! ఈకళ్ళో సన్నాసులకంటె మన చలపతి చాలా మెరుగ్గామా? అలాంటి తప్పుడు పను లేమీ చెయ్యకుండా తనింత వాడుకున్నానని పబ్లికుగా చెబుతున్నాడు. వాడి ఖర్చులేవో అయిటంవారీగా నాకు చెప్పాడు. కాస్త దుబారా అయినా, అంత పెద్ద ఖర్చు లేమీ కావు. సినిమాలు, కాఫీహోటళ్ళు, సోడాలు, సిగరెట్లు, కిళ్లీలు—ఇలాంటివే!

అప్పయ్య. సర్లే! ఏం తగలడ్డాడోగాని, ఆ మిగతా సొమ్మైనా భద్రంగా వుందా?

ఘూషయ్య. ఆఁ! కాస్త యించుమించునా.

అప్పయ్య. మళ్ళీ అదేమిటి?

ఘూషయ్య. ఏదో బస్తీ అనగానే తలయిమార్చేవాళ్లు వుంటారుగా! పేటలో ఆ పార్కుపక్కని—నీకు తెలుసుగా, పెద్దబజారులోని శివాలయం - దానిఎదట - ఎవళ్ళో వచ్చి ఫెయిరీ

లాండ్స్ అనో, వాళ్ళ తలకాయ లాండ్స్ అనో పెట్టారు. అందరూ విరగబడుతుంటే, ఏమిటోనని మన చలపతికూడా ఒకపూట లోపలికి వెళ్లాడట. కళ్లు జిగేల్మంటూ ఎలక్ట్రిక్ దీపాలుపెట్టి పాటలని, డ్యాన్సులని, ముందు నలుగుర్నీ లోపలికి రాబడతారు. ఆ తర్వాత బంతులూ, బాణాలూ విసరడమని ఏవేవో ఆటల్లోకి దించి, డబ్బు గుంజుతారు. మనవాడు వాళ్ళ మాయలో పడి....

అప్పయ్య [కోపంగా]. చప్పగా గొరిగించుకొచ్చాడా?

కోటమ్మ. అయ్యో, ఖర్మ!

ఘూషయ్య. వరసగా నాలుగుసార్లు పందెం పోయేసరికి మరొక డైతే వేడెక్కి మొత్తానికి మొత్తాన్నే పోగొట్టు కొచ్చేవాడే! మనవాడు బుద్ధిమంతుడు గనక, చప్పున గుక్కతిప్పు కున్నాడు. వా డోడింది - అప్పే! ఎంతోనా? - ఒక్క ఆ రెండలు!

అప్పయ్య. వొళ్లు తెగబలిసి జూదంకూడా మొదలెట్టాడన్నమాట! ఇక తాగు డొక్కటే తక్కువ! వీడు నాకడుపున చెడ బుట్టాడు! ఈ నీతిమాలినవాణ్ణి ఇక నా గడప తొక్కనివ్వను, అదేమైనా గాని!

ఘూషయ్య. ఎందుకే, అప్పయ్యా బావా, అంత రెంపరు! తెలిసో తెలియకో వాడు కాస్త దారితప్పాడే అనుకో! పెద్దవాళ్ళం మనం వాణ్ణి నయానా, భయనా మళ్ళీ సరైనదారికి తెచ్చు కోవాలేగాని, శరిస్తే చప్పగా చెడిపోడూ?

అప్పయ్య. వాడిఖ ఎలా తగలబడితే నాకేం ?—జూదాలుకూడా మొదలెట్టిం తర్వాత !

ఘోషయ్య. అదుగో! అక్కడే నువ్వు పప్పులో కాలేస్తున్నావ్, అప్పయ్య బావా! తను చేసింది తప్పేనని వాడు నొచ్చుకుంటున్నాడు. వాడొచ్చి కన్నీళ్ళ పర్యంతమైతేనే నేను పని కట్టుకొచ్చానుగాని, లేకపోతే జమీందారొచ్చినా ఈ వేళప్పుడు యింట్లోనుంచి కదిలేవాణ్ణా? నువ్విప్పుడు తొందర పడొద్దు.

అప్పయ్య. తొందరలేదు; గిందరలేదు. ఈ మాటతో వాడికీ, నాకూ సరి!

కోటమ్మ. ఆఁ! ఏం మాట లవి? ఆ డింకా చిన్న సన్నాసి! ఈ మండిన రోట్టు పడి. ఈ మాయదారి వొంతె నేర్పడి, ఈ ముదనష్టపు బస్సు లొచ్చాక ఆడు కాస్త గాలిగా తిరుగుతున్నాడు గాని, అంతకిముందు ఆడు ఏ పక్కని పడుండేవాడో అసలు అజుంటేది?

అప్పయ్య. ఈమాటలు నాదగ్గిరిక చెప్పకండి. ఆరు నూరైనా, నూరు ఆరైనా ఇక వాడిదారి వాడు చూసుకోవాల్సిందే!

కోటమ్మ [నెత్తి కొట్టుకుంటూ]. ఇంతకీ నాకొచ్చి పడ్డాయి ఈ తిప్పలు!

ఘోషయ్య. నువ్వూరుకో వమ్మా! బావ కెంపరులో వుండి అలా అంటున్నాడుగాని, కొడుకు నింట్లోనుంచి వెళ్ళగొట్టేస్తాడనే? మొదటి సంబంధం కొడుకు లిద్దరితో పంచుకున్న పదెకరాల్ని రాత్రింబగళ్ళూ దేవులాడి పాతికెకరాలు చేసింది ఈ కొడుకుమీద మమకారంతో కాదూ?

కోటమ్మ. నువ్వేమైనా అనుకోగాని, బూసయ్యా! నువ్వేరా నిచ్చేపంలాంటి నాబిడ్డకీ తిప్పలు తెచ్చిపెట్టావ్!

ఘాషయ్య [నవ్వుతూ]. ఔను, కోటమ్మక్కా! ఈ మండిన రోడ్డు పోయించి, ఈ మాయదారి వంతెన వేయించి, ఈ పుదనష్టపు బస్సులు తెప్పించి....

అప్పయ్య. నవ్వులాట కాదురా, అబ్బాయ్! ఊరు నుద్ధరిస్తానని బయల్దేరి, నువ్వే ఈ పీడలన్నీ తెచ్చి మా తలకు చుట్టావ్! ఈ పాడు బస్సు లొచ్చాక ఏ తండ్రిమాటా ఏ కొడుకూ వినడం లేదు. ఊరే నాశనమైపోతున్నది!

ఘాషయ్య. అయితే, అప్పయ్య బావా! నిన్నపొద్దున నువ్వు తూర్పు చెరువుగట్టున ఏమిటీ చేయిస్తున్నావ్?

అప్పయ్య. ఆఁ! ఏం లేదు. చెరువు నీళ్ళన్నీ పసరెక్కి పోయాయని, తూము తెరిపించి, కాల్వలోనుంచి కొత్త నీళ్ళు....

ఘాషయ్య, ఆఁ! నేను చేయించిందీ అంతే! పాత పసరునీళ్ళని కొట్టేసినా, కొత్త నీళ్ళెంట వొండు రాదూ? చెత్తా చెదారం కొట్టుకురాదూ? అలాగని పసరునీళ్ళే తాగుతామా? కొత్త నీళ్ళెంట వచ్చే వొండు విరిగి, చెత్తా, చెదారం పోయి, మంచి నీళ్లు తేరుకోడానికి కొంతకాలం పట్టదూ?

కోటమ్మ. పసరు నీళ్ళేమిటీ? వొండు నీళ్ళేమిటి? ఏమిట్రా నీ మాటలు, బూసయ్యా!

ఘాషయ్య. నీ కెలాగే విడమర్చి చెప్పడం, కోటమ్మక్కా? సర్లే, నువ్వే చెప్పు-లోకం ఆరోజు కారోజు తెలివి మీరిపోతున్నదా? లేదా?

కోటమ్మ. ఆఁ! తెలివి మీరిపోకేఁ? ఈ బస్సులు, ఈ సినిమాలు ఈ కాఫీహోటళ్ళు....

భూషయ్య. అవ్వే! ఇంతే కాదు. ఇతర విధాలకూడా ప్రపంచం చకచక ముందుకు సాగిపోతూ వుంది. మనంకూడా దానితో పాటు నడవాలి. లేకపోతే, అది మనపైగా నడిచిపోతుంది. అందుకని బస్తీలతో మనకి సంబంధం తప్పదు.

కోటమ్మ. ఇదివర కిల్లా గడపలేదేమిటి? - బస్తీలకి పోకపోతే!

భూషయ్య. ఇదివరకటి దారి వేరు; ఇప్పటి దారివేరు. కాలానితో పాటు మనమూ పోవాలి; దానికి ఎదురీద లేము. సరే అప్పయ్య బావా! నేను వెళ్ళొస్తాగాని, నువ్వు కాస్త తమా యించుకో! లేకపోతే, వాడు మరీ తెగబడి చప్పగా చెడి పోతాడు.

అప్పయ్య. పోనీ. ఇక వాడు ఏ యేట్లో కలిస్తే నాకేఁ?

కోటమ్మ. చూశావట్రా, భూషయ్యా, ఆ మాటలు!

భూషయ్య. అదుగో! ఆ పెంపరే వద్దంటున్నాను. తెగేవరకు లాగడం మంచిదికాదు. బ్రహ్మయ్య, బ్రహ్మయ్యకొడుకు— వీధికెక్కడం చూస్తూనే వున్నాంగా! తలలు బద్దలు గొట్టు కుని ఛార్టీలదాకా వెళ్ళారు. తండ్రీ కొడుకులకైనాసరే తగ వులు పెంచి, కొంపలు తియ్యడానికి ఎంతమంది టౌట్లు మన ఊళ్ళో తయారయ్యారో నీకు నేను చెప్పాలటే?

అప్పయ్య. సర్లే! ఆకాడికొస్తే ఎవరి పసెంత వుందో తెలుస్తుంది!

కోటమ్మ. అయ్యో ఖర్మ! ఆ దెవడని అడిమీద నువ్వు పగ

పట్టడానికి! పెద్దాళ్ళకి మనకే యింత మర్రతనముంటే, సిన్నాడు ఆడికి....

పొన్నమ్మ [హుటాహుటిగా ప్రవేశిస్తూ], పిన్నామా! కోటమ్మ పిన్నామా!

కోటమ్మ. ఏమిటే పొన్నీ? ఏమిటి?

పొన్నమ్మ. ఆడు లేడంటే, పిన్నామా! ఆ సీపురుకళ్ళ శేశయ్య, ఆడు........ [అప్పయ్యను చూచి] మా బాబాయి ఇక్కడే వున్నాడూ! బాబాయ్! నువ్వ అబ్బాయిని పట్టుకు కొట్టావని చెప్పి, నీమీద ఆ సీపురుకళ్ళ శేషయ్య కేసు పెట్టించబోతున్నాడటే!

కోటమ్మ. ఆరి! ఈడి జిమ్మడ! ఈడి కేం పోయేకాలం?

పొన్నమ్మ. దెబ్బలు తగిలినట్టు దొంగ సర్టిపికెట్టు పుట్టిస్తానని రెండొందలో, మూడొందలో అబ్బాయి దగ్గిరనుంచి అప్పుడే ఆ దొడుక్కున్నాడట.

కోటమ్మ. ఆరి! ఈడి పెళ్ళాంతాడు పుటుక్కున తెగ! ఈడు మా కెక్కడ పోగయ్యాడేఁ!

భూషయ్య. నా నోట్లోమాట నోట్లో వుండగానే నే నన్నంత పనీ జరిగింది, చూశావా, అప్పయ్య బావా!

అప్పయ్య. అబ్బే! ఆణ్ణి నేను కొట్టిం దెక్కడ?

భూషయ్య. కొట్టాలటే కేసు బనాయింపుకు! దీన్తో సరేనా! చీపురుకళ్ళ శేషయ్య అంటే సామాన్యుడా! రేపు పార్టిషన్ దావాకూడా పడేయిస్తాడు!

అప్పయ్య. అరవై ఏళ్ళొచ్చినై. నే నెన్నడూ సాక్ష్యానికైనా బో నెక్కలేదు. ఇవ్వాళ వీడు నన్ను కోర్టు కీడుస్తాడూ ?

కోటమ్మ. అది తలకాడ దీపమెట్ట ! ఆ చీపిరి కళ్ళయెదవెంత చేయిస్తున్నాడు !

ఘోషయ్య. ఔను ! వా డెంతైనా చేయిస్తాడు ! తంపులు పెట్టందే, తగవులు పెంచందే వాడి పొయ్యిలో పిల్లి ఎలా లేస్తుంది ? వాడి కదే బ్రతుకయ్యె ! ఇంతకీ, అప్పయ్య బావా, మొదటే నువ్వు నా మాట వింటే, పంట అమ్మకున్న మూడువేల చిల్లరలో పోయిన వెయ్యి పోగా, మిగిలిందైనా దక్కేదా ? ఇప్పుడు మరొక రెండొందలో, మూడొందలో బొక్క ! ఇంకా మన మాలస్యం చేస్తే....

పొన్నమ్మ. మన పక్కూరు డాక్టరుగారి దగ్గిరికి అబ్బాయిని తీసి కెళ్ళటానికని ఆ శేశిగాడు ఒంటెద్దుబండి కట్టిస్తున్నాడటే, బాబాయ్ !

కోటమ్మ. ఆడికి బిడ్డలు లేరా ! ఆ డింట్లో పీని గెళ్ళ !

అప్పయ్య. ఇందాక కుర్రవాడు మీ యింటి కొచ్చినప్పుడు వాడి దగ్గరి డబ్బు తీసుకుని నువ్వెందుకు భద్రం చెయ్యలేదురా, ఘోషయ్యా ?

ఘోషయ్య. నిజమేనే, అప్పయ్య బావా ! ఆ పని చేస్తే బాగానే వుండేది, కాని, నాకు తోచి చావలేదు.

కోటమ్మ. అయిందేదో అయింది ; ఆణ్ణి ఎట్టాగైనా కొంపకి చేర్చరా, బూసయ్యా ! నీకు పున్నెం వుంటుంది.

ఘూషయ్య. మరి, మా అప్పయ్య బావ కా_స్త తగ్గుతాడా, లేదా? లేకపోతే, మధ్య నా మాట పోతుంది.

కోటమ్మ. ఆc! తగ్గ కేం చేస్తా డేమిటి?

పొన్నమ్మ. ఎవరో ఒకరు తగ్గా లిప్పుడు. లేకపోతే, కొంప గుణ్ణాన పడిపోదూ?

ఘూషయ్య. కాని, మా అప్పయ్య బావ "ఊc!" అనందేనా? పట్నాలని చూసి బాగుపడేదిపోయి, మన కుర్రకారు చెడి పోతున్నారనే ఒక హిందీ స్కూ_లైనా పెట్టించి, కొంత ప్రపంచజ్ఞానం కలిగించాలని నే ననుకుంటే, ఊళ్ళో పెద్ద తలకాయలు నలుగురు కలిసొస్తేనా! "తుద కబ్బిరా తురక దాస" అన్నట్టు ఇప్పుడు హిందీ స్కూ_లొక్క_టే తక్కు_వై పోయిందని నవ్వి, నామాట సాగనిచ్చారు కాదు. సర్లే! అప్పయ్య బావా! ఏమంటావే? ఏవో రెండు మంచి మాటలు చెప్పి, మన చలపతి మనస్సు తిప్పి, ఇంటికి రమ్మన్నా!

అప్పయ్య. ఆc! తగలబడమను!

ఘూషయ్య. మరి నే నెళ్ళొస్తానే, కోటమ్మక్కా_! ఏమైనా, కొడుకును అదుపులో పెట్టుకోవడం మా బావయ్యకి చేత కాదనుకుంటా. ఆయన పాతకాలపు మనిషి. ఊరకేనే కస్సు బుస్సు మంటే, ఈ కాలపాళ్లు అంకికొస్తారా! వాణ్ణి నే నొక దారికి తెచ్చుకుంటా, నాతో సంబంధం చేస్తే. భార్యా భ_ర్తలు దూర మాలోచించుకుని రేపు నాకు కబురు చెయ్యండి.

కోటమ్మ. సర్లే! నువ్వేగా ఈ తిప్పలన్నీ తెచ్చింది. ఎలాగో నువ్వే మళ్ళీ కాస్త చక్కదొయ్యి! ఊరెంట తిరిగి, చందా లోగుచేసి చట్టుబండర్లై, ఈ మండిన రోడ్డు పోయించి, ఈ మాయదారి వాంతి నేయించి. ఈ ముదనష్టపు బస్సులు తెప్పించి....

తెర]



## పాత్రలు

ప్రొఫెసర్ రాధాకృష్ణ

మిసెస్ శ్యామలా రాధాకృష్ణ

## స్థలం

మద్రాసులో

ప్రొఫెసర్ రాధాకృష్ణ

డ్రాయింగ్‌రూం

## కాలం

వర్తమానం



# అర్ధాంగి

అది ప్రొఫెసర్ రాధాకృష్ణ డ్రాయింగ్ రూమ్. కుడివైపున బయటి వరండాలో నుంచి ద్వారం; ఎడమవైపున డైనింగ్ రూమ్, కిచెన్ మొదలైన వాటిలోకి ద్వారం. ఎడమవైపునే ఒక మూలగా మేడపైకి మెట్లు. ఒక సెటీ, రెండు చెయిర్స్, ఒక సెంట్రల్ టేబుల్, రెండు పెగ్ టేబుల్స్, ఒక స్టాండర్డ్ ల్యాంప్, ఒక బుక్ షెల్ఫ్, రెండు పామ్ స్టాండ్స్, ఒక పెద్ద తివాచీ, ఒక సైడ్ టేబుల్ మొదలైన ఫర్నిచర్‌తో, యాంటిక్స్‌తో, ఒరిజనల్ పెయింటింగ్స్‌తో అది అధునాతన సంస్కృతి తొలుకాడుతున్న డ్రాయింగ్ రూమ్.

తెర లేచిన ఒక క్షణానికి మోటారుకారు వచ్చి వాకిట్లో ఆగిన శబ్దమౌతుంది. ఆ వెంటనే బయటి వరండాలోనుంచి ఈ కింది మాటలు వినబడతాయి.

ఆడగొంతు. థాంక్స్ మచ్.

మగగొంతు. ఓ, ఇట్స్ ఎ ప్లెజర్.

ఆడగొంతు. మరి సెలవు.

మగగొంతు. నమస్కారం.

ఆడగొంతు. నమస్కారం.

ఆ పిమ్మట మోటారు [illegible] వినబడుతుంది. ఈ శబ్దం అణగి పోకముందే శ్యామల ప్రవేశిస్తుంది. ఆమె [illegible] లోనుంచి వినవచ్చిన [illegible].

శ్యామలను [illegible] నడుస్తున్నట్టు, [illegible] దాటినట్టు కనబడుతుంది. ఆ [illegible] ఆమె సౌందర్యం కంటె, ఆమె సంస్కృతి అధికంగా [illegible].

హాండ్ బ్యాగ్ తోనూ, [illegible] తోనూ ప్రవేశించిన శ్యామల వాటిని [illegible] పై పెట్టి, [illegible] ఉంటుంది.

శ్యామల. బోయ్ ! బోయ్ !

బోయ్ [లోపలినుంచి]. ఆఁ ! ఇదుగో వచ్చే, అమ్మా! వచ్చే !!

శ్యామల. ఏం చేస్తున్నావ్ ?

బోయ్ [ప్రవేశించబోతూ]. వస్తున్నా నమ్మా ! వస్తున్నా !

శ్యామల [బోయ్ రాగానే]. వీధితలుపు వేసుకోమంటే, తెరచి వుంచావేఁ ? దొంగ లెవరైనా దూరితేనో !

బోయ్. అయ్యగా రొచ్చారమ్మా

శ్యామల [ఆశ్చర్యంగా]. ఆఁ ! ఎంత సేపైంది ?

బోయ్. అప్పుడే అరగంట కావొచ్చిందమ్మా !

శ్యామల. ఆయ నేరీ ?

బోయ్. మేడమీదున్నా రమ్మా !

[ఇంతలో రాధాకృష్ణ ప్రవేశిస్తాడు. వయస్సు ముప్పై ప్రాంతాల అందగా డనలేము గాని, చాలా నాజూకైనవాడు. మనస్సులో రేగుతున్న తుపాను దాచి

పెట్టుకోడానికి ప్రయత్నిస్తున్నవాని ముఖ కవళికలతో ప్రవేశిస్తాడు. కాలేజీకి వెడుతూ వేసుకున్న సూట్‌లో, సగం విప్పిన కోటు గుండీలతో, అతడు బరువుగా అడుగులు పెట్టుకుంటూ వస్తాడు.

శ్యామల. ఏమండీ! మీటింగ్ అప్పుడే అయిపోయిందా?

రాధాకృష్ణ. ఏఁ! అన్‌ఎక్స్‌పెక్టెడ్‌గా వచ్చా నేమిటి?

శ్యామల. ఇవ్వాళ సాయంత్రం మీ కాలేజీ ఎకనామిక్స్ అసోసియేషన్ మీటింగు వుందన్నారుగా!

రాధాకృష్ణ. అది కాన్సెల్ అయిపోయింది.

శ్యామల. ఏఁ?

రాధాకృష్ణ. ఉపన్యాస మిస్తానన్న వెధవ రానే లేదు.

శ్యామల. అయ్యో! రామారావుగారు వాకిట్లోనుంచే వెళ్ళిపోయారేఁ! మీ రింట్లోనే వున్నట్టు తెలిస్తే, మాట్లాడిపోదురు.

రాధాకృష్ణ. అతనికి నాతో ఏం మాట లున్నాయ్?

శ్యామల. ఏమో, నా కేం తెలుసు? మీరు సాయంత్రం అయిదు గంటలకు ఆయనతో ఎంగేజ్‌మెంటు పెట్టుకున్నారటగా!

రాధాకృష్ణ. ఆఁ! ఔను. కాలేజిలో మీటింగ్‌మాట గుర్తులేక....

శ్యామల [చిరునవ్వుతూ]. మీ ప్రొఫెసర్ల జాతికి మతిమరుపు మామూలే లెండి!

రాధాకృష్ణ. ఎంత మతిమరుపైనా బుద్ధిమాంద్య మింకా రాలేదు.

శ్యామల. యం. ఎ. లో ఫస్ట్ క్లాస్, ప్రెసిడెన్సీ ఫస్ట్, గోల్డ్ మెడలిస్ట్! మీకా బుద్ధిమాంద్యం!

[ఏదో బాగా నిరుత్సాహపడ్డట్టు రాధాకృష్ణ ఒక పడక్కుర్చీలో చతికిల బడి, చాలా సేపట్నుంచి అలా కూర్చొని, ఆలోచనలో తల మునకలవుతుంటాడు.

శ్యామల. ఏం! అలా వున్నారే?

రాధాకృష్ణ. ఎలా వున్నాను? బాగానే వున్నానే!

శ్యామల. తల నొప్పిగా వుందా?

రాధాకృష్ణ. లేదు.

శ్యామల. మరి, అలా వున్నారేమండీ? ఇందాకెప్పుడో కాలేజీ నుంచి వచ్చినవారు ఇంకా నూరైనా విప్పలేదు.

రాధాకృష్ణ. అఁ! ఏం లేదు.

శ్యామల. మళ్ళీ బయటికి వెళ్ళవలసిన పని వున్నదా?

రాధాకృష్ణ. లేదు.

శ్యామల [చిరునవ్వుతో]. అన్నింటికీ ఒక్కటే ముక్తసరి జవాబుగా "లే" దనే ముక్క కొత్తగా నేర్చుకున్నారేమిటి?

రాధాకృష్ణ. కొత్తగా చాలా నేర్చుకుంటున్నాలే!

శ్యామల. ఏమిటది?

రాధాకృష్ణ. అఁ! ఏం లేదు.

శ్యామల. అదుగో! మళ్ళీ అదే జవాబా?

రాధాకృష్ణ. సర్లే! నాకు అలసటగా వుంది.

శ్యామల. ఆమాట మీరు చెప్పడం దేనికి? కనబడుతూనే వుంది. ఒక కప్పు కాఫీ పెట్టుకురానా?

రాధాకృష్ణ. బోయ్ పెడుతున్నాడులే.

శ్యామల. నాలుగు బిస్కట్లు తీసుకురానా? [అక్కర లేదన్నట్టు ప్రొఫెసర్ మౌనంగా సూచిస్తాడు] గ్లూకోజ్ బిస్కట్లు మంచి వున్నాయండీ! మీ కవి యిష్టంగా!! ఇవ్వాళ పొద్దున తెప్పించా. [వద్దని మౌనముద్ర వీడకుండానే తిరిగి రాధాకృష్ణ తెలియజేస్తాడు] సరే! అయితే వేడి వేడిగా కాఫీ అయినా పుచ్చుకోండి. బోయ్! [ఒక క్షణం ఆగి, మరి కొంచెం బిగ్గరిగా] బోయ్!!

బోయ్ [లోపలినుంచి]. ఆఁ అమ్మా!

శ్యామల. కాఫీ పెట్టడం కాలేదూ?

బోయ్ [లోపలినుంచే]. అయిపోవచ్చిం దమ్మా! తెస్తున్నా!

శ్యామల [సెంట్రల్ టేబుల్‌పై తానుంచిన పార్శెల్ అందుకుని, దాన్ని విప్పుతూ]. ఈ సిల్కుచీర చూడండి. చెల్లారామ్స్‌లో కొన్నా. లేటెస్ట్ డిజైన్. ఈ అంచులు చూశారా? అజంతా ఫ్రెస్కోవ్‌నుంచి యెడాప్ట్‌చేశారట. కలర్ పేటరన్‌కూడా నాకు నచ్చింది. మీకు లౌడ్ కలర్సు గిట్టవ్. దీని రంగులు సాఫ్ట్‌గా, ప్లీజింగ్‌గా లేవూ? అయితే, ఎంత బిల్లు చేశారో తెలుసా? రెండువందల నలభై రూపాయల చిల్లర. ఖరీదుకు తగినట్టు బాగుందంటారా? లేక, దండగ బేరమా?

రాధాకృష్ణ. [చీరవంక చూడక, శ్యామలను చూస్తూ]. నాలుగైదు రోజులనాడుకూడా ఒక చీర తెచ్చావ్‌కదూ?

శ్యామల. అది ఈ కట్టుకున్నదే నండీ! మిసెస్ రాజారాం ఇది ఎంతో మంచి సెలెక్షన్ అని మెచ్చుకుంది.

రాధాకృష్ణ [వ్యంగ్యంగా]. ఒక్క నా విషయంలో తప్ప నీవన్నీ మంచి సెలెక్షన్లే!

శ్యామల [నవ్వుతూ]. ఏం! మీమీద మీకే నమ్మకం తగ్గిపోతున్న దేమిటి?

రాధాకృష్ణ. అబ్బే! లేదు. కాని, నీకుమాత్రం....

[బోయ్ కాఫీ ట్రేతో వచ్చి, దాన్ని ఒక పెగ్ టేబుల్‌పై పెట్టి వెళ్ళిపోతాడు.

శ్యామల [కెటిల్‌లోనుంచి, ఒక కప్పులోకి కాఫీ పోస్తూ]. ఆఁ! ఏమిటది? నాకుమాత్రం?

రాధాకృష్ణ. ఊఁ! ఏం లేదులే.

శ్యామల [కాఫీకప్పు అందిస్తూ]. ఈ పూట మరీ యింత నీరసంగా వున్నారేం? బస్సు దొరకలేదని ఎదురెండలో నడిచి రాలేదుగదా? ట్యాక్సీ అయినా చేయించుకొనక పోయారూ? సరే, వేడి వేడిగా కాస్త కాఫీ పుచ్చుకోండి.

రాధాకృష్ణ [కప్పు అందుకుంటూ]. నీ కొద్దూ?

శ్యామల. నే నింతకుముందే పుచ్చుకున్నా. వద్దన్నకొద్దీ రామారావుగారు కన్నిమరాకు కారు పట్టించారు. తాగింది రెండు కప్పుల కాఫీయే అయినా, అయిదు రూపాయలు బిల్లు చేశారు!

రాధాకృష్ణ. లేడీ ఫ్రెండ్స్ విషయంలో అతడు ఖర్చుకు వెనకా ముందూ ఆడడులేఁ!

[ఈ మాట అంటూనే సగం మాత్రమే తాగిన కాఫీకప్పు ట్రేలో పెట్టివేస్తాడు.

శ్యామల. ఏం! మళ్ళీ షుగర్ ఎక్కువ వేశాడా? ఎన్నిసార్లు చెప్పినా - ఈ ఫూల్! - కాఫీని పానకంలా చేసుకొస్తాడు. బోయ్! బోయ్!!

రాధాకృష్ణ. ఆఁ! షుగర్ సరిపడే వేశాడు.

శ్యామల. అయితే, సగానికిపైగా వదిలిపెట్టేశారేఁ!

[బోయ్ ప్రవేశిస్తాడు.

రాధాకృష్ణ. ఈ ట్రే పట్టుకుపోరా!

శ్యామల [బోయ్ ట్రే అందుకోబోతూ వుండగా]. బాగానే వుంది మీరు కాఫీ తాగడం! మరి కాస్త పుచ్చుకోండి - అలసట తగ్గుతుంది.

[కప్పు తిరిగి అందించబోతుంది.

రాధాకృష్ణ. అహాఁ! మరొద్దు. [బోయ్‌తో చికాకుగా] పోరా! పట్టుకుపో!

[ట్రేతో బోయ్ వెళ్ళిపోతాడు.

శ్యామల. కాఫీ బాగుంటే తాగకుండా మీరు వదిలిపెట్టరేఁ? ఆ వెధవ మళ్ళీ పానకం చేసుకొచ్చినట్టున్నాడు. నేను పెట్టుకు రానా?

రాధాకృష్ణ. నీకంత శ్రమ దేనికిలే!

శ్యామల. శ్రమేమిటండీ? చిత్రంగా మాట్లాడుతున్నారు! మీతో చెప్పకుండా షాపింగ్‌కు వెళ్లానని కోపమే, ఇదంతా?

రాధాకృష్ణ. కోపానికైనా, తాపానికైనా నాకు హక్కేముంది? నువ్వు స్వతంత్రురాలివి.

శ్యామల [నవ్వుతో]. ఏం! స్త్రీ స్వాతంత్ర్యానికి హఠాత్తుగా మీరు విరోధులైపోయా రేమిటి? మీకోసమని రామారావుగారొస్తే...

రాధాకృష్ణ. ఔను! ఈమధ్య అతనికి నాతో తరుచు పనిపడు తున్నది.

శ్యామల. మరి. ఆయన పెడుతున్న కొత్త లిమిటెడ్ కంపెనీ ప్రాస్పెక్టస్ మీ రింకా పూర్తిచేసి పెట్టనేలేదట!

రాధాకృష్ణ. వాటి ఎపిటర్సు ఫరమే లేదూ?—వాటికి కావలసింది ప్రాస్పెక్టస్సే అయితే!

శ్యామల. ఫైనాన్షియల్ ప్రాబ్లెమ్సులో మీకు చాలినవారు లేరని ఆయన నమ్మకం. మొన్న మీరు డిఫిసిట్ ఫైనాన్సింగ్‌మీద వ్రాసిన వ్యాసాన్ని కాస్మోపాలిటన్ క్లబ్‌లో పెద్దపెద్ద వాళ్ళందరు మెచ్చుకున్నారట. కంపెనీ లాలో కూడా మీ తర్వాతే మరెవరినైనా చెప్పాలని ఆయ నన్నాడు.

రాధాకృష్ణ. ఏమైనా, నేను బడిపంతుల్నేగా! కాస్మోపాలిటన్ క్లబ్ మెంబర్నా? కన్నెమరాలో కాఫీలు తాగుతానా? నాకు షెవ్రలెట్ కారుందా?

శ్యామల. ఏం! ఈ పూట చాలా చిత్రమైన మూడ్‌లో పడ్డారు! మీ రింటికొచ్చేసరికి నేను లేనందుకే ఇంత కోపం రావాలా? మీ మీటింగ్ కాన్సిల్ అవుతుందని నా కేం తెలుసు? మీరు ఎంగేజ్‌మెంట్ కీప్ చెయ్యలేదు గనక, క్లబ్బుకైనా పోతా నని రామారావుగారంటే నన్ను చెల్లారామ్సువద్ద డ్రాప్ చెయ్య మన్నాను. తిరిగి రావడానికి ట్యాక్సీ చేయించుకుంటానంటే వినక, మళ్లీ ఆయనే యింటి దగ్గర డ్రాప్ చేశాడు. వద్దన్నకొద్దీ దారిలో ఆయన కన్నెమరాకు కాఫీకి తీసుకు వెడితే కాస్త ఆలస్యమైంది.

రాధాకృష్ణ. ఔను. అతను చాలా సరసుడు! నిన్ను వెంటబెట్టుకుని కన్నిమరాలో ప్రవేశించడం కాలేజీనుంచి వస్తూ నేను చూశాను. [సెంట్రల్ టేబుల్‌పై పెట్టివున్న సిల్కుచీరపైకి కన్ను పోనిస్తూ] అలడు తన లేడీ ఫ్రెండ్సుకు కాస్ట్లీ ప్రెజంట్సుకూడా యిస్తాడు!

శ్యామల [చురుకుగా]. అయితే, మీరు ఏం సజెస్ట్ చేస్తున్నారు?

రాధాకృష్ణ. అబ్బే! ఏమీ లేదు.

శ్యామల. అయితే, మీ మాటల కర్థం?

రాధాకృష్ణ. అతని స్వభావాన్ని గురించే నేను ప్రస్తావిస్తున్నాను.

శ్యామల [కరకుగా]. ఆయన స్వభావమేమిటో మీకే తెలవాలి. చిరకాలంగా అతను మీ స్నేహితుడు. మీరు ఇంటర్‌డ్యూస్ చేసేవరకూ అతని ముక్కూ మొఖమైనా నే నెరగను.

రాధాకృష్ణ. స్నేహితుడు గనకనే చెబుతున్నాను. ఎంతటి సరసుడు కాకపోతే, ఒక్కవారంలో శ్రమ అనుకోకుండా రెండుమార్లు నిన్ను షాపింగ్‌కు తీసుకు........

శ్యామల ["షాపింగ్" వద్ద మాటను తెంచివేస్తూ]. మీరు సూచిస్తున్న దేమిటి?

రాధాకృష్ణ. అబ్బే! ఏం లేదు.

శ్యామల. నిజంగానా?

రాధాకృష్ణ. ఆఁ!

శ్యామల. ముమ్మాటికీనా?

రాధాకృష్ణ. ఉఁ!

శ్యామల. సర్లెండి!

[ఈమాట అంటూనే సెంట్రల్ టేబుల్ పైనుంచి సిల్కుచీర తీసుకుని శ్యామల వెళ్ళిపోతుంది. ఆమె తన హాండ్ బ్యాగ్ అక్కడే విడిచిపెట్టి వెడుతుంది. ఆ

[చెప్పిన సంగతి మానసిక వేదనతో సోఫాలో జేరగిల బడి, రాధాకృష్ణ కళ్లు మూసుకుంటాడు. కొన్ని క్షణాలు సంగతి గట్టిగా నిట్టూర్చి, కళ్లు తెరిచే సరికి శ్యామల హాండ్ బ్యాగ్ పై అతని కన్ను పడు తుంది. దాన్ని తెరిచి చూడాలనే దుర్బుద్ధి అతనికి కలిగినే పుడుతుంది. కొంచెం ముందుకు వంగి, దాన్ని అందుకోబోయి, తన సంస్కారం అడ్డురాగా అంతలోనే ఆగిపోతాడు. కాని, అనుమాన పిశాచం సంస్కారం గొంతుకను నులిమివేయగా, హాండ్ బ్యాగ్ అందుకుని, గబగబా చేస్తున్న వాకిలి మేడ మెట్లపైకి ఒకసారి చూస్తాడు. పిమ్మట హాండ్ బ్యాగ్ తెరిచి దాన్ని గాలిస్తాడు. పౌడర్ డబ్బా, మూడు ఉత్తరాలు అతనికి కనబడతాయి. వాటిని తిరిగి మళ్ళీ లోపల పెట్టివేస్తాడు. కొంత గాలించి, ఒక మనియార్డర్ కూపన్ పైకి తీస్తాడు. దాన్ని చదువుతున్నసరికి అతని ముఖం వివర్ణమౌతుంది. ఇంతలో మేడ మెట్లపై కాలి అలికిడౌతుంది. చప్పున మనియార్డర్ కూపన్ అతడు తన కోటు జేబులో పెట్టివేసుకుంటాడు. జేబు లోనించి చెయ్యి పైకి తీయకముందే శ్యామల ప్రవేశిస్తుంది. భర్త చేసిన పనిని చూసినందున ఆమె ముఖంలో ఆశ్చర్యం, ఆగ్రహం, ఆవేదన, ఒక దానితో ఒకటి పెనవేసుకుంటూ, ఒక్కసారిగా కనబడతాయి.

రాధాకృష్ణ [శ్యామలను కన్నెత్తిచూడ్డానికి సిగ్గుపడి, పెడముఖం పెట్టి, పైై విప్పుకుంటూ]. ఆ వెధవ పెట్టిన కాఫీ నిజంగానే బాగా లేదు. మరికొంచెం కాఫీ పెడతావా, శ్యామలా ?

[శ్యామల జవాబు చెప్పదు.

రాధాకృష్ణ [ఏదో ఒకటి మాట్లాడాలనే ఆతురత కొద్దీ]. ఇంకా వస్తాడేమో, ఇంకా వస్తాడేమో నంటూ అరగంటసేపు వెయిట్ చేసినా, ఆ స్పీకర్ - డామ్ స్కౌండ్రల్ - రానేలేదు. మీటింగ్ కాన్సెల్ చేశాక, కారు బ్రేక్‌డౌన్ వల్ల రాలేక పోతున్నానని టెలిఫోన్ చేశాడు. తన కారు లేకపోతే, ఏ టాక్సీలోనో రాగూడదూ? మన ఇండియన్సుతో యిదే పెద్ద చికాకు. ఎంగేజ్‌మెంట్స్ కీప్ చెయ్యరు. ఆ రాస్కెల్ కోసం ఎదురుచూస్తూ కూర్చోబట్టే పెద్ద తలనొప్పి వచ్చింది. నిన్ను వెంటబెట్టుకుని కాసేపు అలా బీచ్ వైపుకైనా పోదామని యింటికొస్తే ఇక్కడా డిసప్పాయింట్‌మెంట్ అయింది. [కణతలు నొక్కుకుంటూ] అబ్బ ఇంకా తల నొప్పి తగ్గనే లేదు. [మెడపై చెయ్యి వేసుకుని] మెడలుకూడా పీక్కుపోతున్నాయి. [సానుభూతికోసం ఒక క్షణం ఎదురు చూచి, నిరాశ చెంది] నేను పోయి బట్టలు మార్చుకొస్తాగాని, కాస్త కాఫీ పెట్టు. డబుల్ డోస్ కావాలి.

[కోటు విప్పి భుజంపైన వేసుకుంటూ రాధాకృష్ణ మేడ పైకి పోతాడు. అతను వెళ్ళిపోయిన తర్వాత పెదవి కొరుక్కుంటూ, తల పంకిస్తూ కొన్ని క్షణాలపాటు నిలబడి, తుదకు ఒక నిర్ణయానికి వచ్చినట్టు శ్యామల కనబడుతుంది.

శ్యామల. బోయ్!

బోయ్ [ప్రవేశిస్తూ]. ఎందుకమ్మా?

శ్యామల. పొద్దుటి "ఎక్స్‌ప్రెస్" యేదిరా?

దో య. ఇదుగో సమ్మా! ఆ పుస్తకాల బీరువామీద.

[సర్వర్ చేతిలోని [illegible] వెళ్ళిపోతాడు. శ్యామల [illegible] [illegible] [illegible], [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible]. ఆ [illegible] డ్రాయింగ్ రూమ్‌లోనుంచి [illegible] [illegible] తీసి, ప్రొఫెసర్ రాధాకృష్ణ పేరు అచ్చొత్తివున్న [illegible] భాగాన్ని నింపి తెస్తుంది. శ్యామల ఆ డ్రాయర్‌లో నుంచి ఒక కవరు తీసుకుని సోఫాలో కూర్చుంటుంది. పైన హ్యాండ్ బ్యాగ్‌లోనుంచి ఫౌంటెన్ పెన్ తీసుకుని, ఏదో వ్రాస్తూ వుంటుంది. ఇంతలో రాధాకృష్ణ [illegible], [illegible] మెడ మీద [illegible] తిరిగొస్తాడు. [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] ప్రవేశిస్తాడు.

రాధాకృష్ణ [శ్యామల ముఖాన్ని చూడ్డానికి ఇంకా సిగ్గుపడుతూ, వీధిలోకి చూస్తున్నట్టు గుమ్మంవైపుకు తిరిగి నిలబడి]. కాఫీ పెట్టావా?

[శ్యామల జవాబు చెప్పదు.

రాధాకృష్ణ. ఆఁ! అన్నట్టు, నీతో చెప్పానా? ఇవ్వాళ ఉదయం మిస్టర్ చెట్టియార్ పిలుపడితే రే పొకసారి తమ ఆఫీసులో తప్పకుండా కలుకోమని ఫోన్‌చేశారు. వాళ్ళ జనరల్ ఇన్స్యూరెన్స్ కంపెనీ సెక్రటరీ రిటైర్ అవుతున్నాడట. ఆ పోస్ట్ నాకు ఆఫర్ చెయ్యడానికే కాబోలు! అది సౌండ్ కంపెనీయే. ఆ పదవి పుచ్చుకోమంటావా? కమిటీ కాలేజీలలో

ఉద్యోగాలకంటె, నిజానికి ఏ పనైనా మెరుగే! ఇచ్చే ఆకొద్ది జీతాలైనా నెలనెలకు సరిగా పుట్టజెప్పకపోయినా, ప్రతి కమిటీ మెంబరూ మాపై పెత్తనం చలాయించేవాడే! "వీడు నా తమ్ముడి బావమరిది తోడల్లుడు కొడుకు, వీడికి సీటివ్వాలి; వాడు నా అన్నయ్య పినమామ మరద లల్లుడు, వాడిని ప్రమోట్ చెయ్యాలి." అంటూ సిఫార్సులు చేసి ప్రాణాలు తోడేస్తారు. ఏఁ! శ్యామలా! మిస్టర్ చెట్టియార్ రేపు సెక్రటరీ పోస్ట్ ఆఫర్ చేస్తే పుచ్చుకోమంటావా?

[శ్యామల అప్పటికీ జవాబు చెప్పదు.

రాధాకృష్ణ [శ్యామలవైపుకు నాలు గడుగులు వేసి]. ఏమి టది, శ్యామలా?—అంత దీక్షగా వ్రాస్తున్నావ్!

శ్యామల [తాను వ్రాస్తున్నది కనబడకుండా కాగితం పై అంచును మడిచిపట్టుకుంటూ]. ఆఁ! ఏమీ లేదు. ప్రజెంట్స్ యివ్వగల ఫ్రెండ్స్‌కు లెటర్స్ రాస్తున్నా.

రాధాకృష్ణ [లేని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ]. వాట్ నాన్‌సెన్స్!

శ్యామల. ఇంతకు ముందు మీరే అన్నారుగా, వారంరోజుల లోపల రామారావుగారి నుంచి రెండుసార్లు ప్రెజెంట్స్ పుచ్చుకున్నానని!

రాధాకృష్ణ. అబ్బే! ఆమాట నే నన్నానా?

శ్యామల. సరిగా అదేమాట అనకపోతేనేఁ? ఆ అర్థం వచ్చే మాట మరొకటి!



రాధాకృష్ణ. ఆఁ! చెడ్డ తలనొప్పికొచ్చి నే నేదో అంటే, నువ్వేవో లేనిపోని అర్థాలు తీస్తున్నావ్. నాకు తెలియదూ? - మీనాన్న పంపించిన డబ్బుతో నువ్వు షాపింగ్ చేశావని.

శ్యామల [సోఫాలోనుంచి చరాలున లేచి, ముఖాముఖిగా నిలబడి]. అయితే, మా నాన్న నాకు డబ్బు పంపించిన సంగతి మీ కెలా తెలిసింది?

[తెల్లబోయి రాధాకృష్ణ జవాబు చెప్పడు.

శ్యామల [తీవ్రంగా]. నన్ను శంకించి, చాటుమాటుగా నా హ్యాండ్ బ్యాగ్ విప్పిచూస్తే తెలిసింది - అంతేనా?

రాధాకృష్ణ. అబ్బే! లేదు.

శ్యామల. అయ్యో! అబద్ధంకూడానా? [సెంట్రల్ టేబుల్ను వేలితో చూపిస్తూ] అదుగో! నా హ్యాండ్ బ్యాగ్ విప్పిలేదూ? దానిలోని నా మనియార్డర్ కూపన్ [కప్పువైపు వేలితో చూపిస్తూ] మేడమీది మీ కోటుజేబులోకి ఎలా నడిచివెళ్ళింది?

రాధాకృష్ణ [చిన్నముఖం చేసుకుని, శ్యామల చేతుల్ని పట్టుకుని]. తప్పే! క్షమించు.

శ్యామల [చేతుల్ని విడిపించుకుంటూ]. తప్పు మీది కాదు; నాదే! చేసుకుంటున్న ఉద్యోగం చేతులారా విడిచిపెట్టు కున్న తప్పు నాదే కాదూ? నాకే సంపాదనుంటే మీ రివ్వాళ నన్నెందుకు శంకించేవారు?

రాధాకృష్ణ [దీనంగా]. శ్యామలా! నన్ను మన్నించవ్!

శ్యామల. ఇక నన్ను నేనే మన్నించుకో లేను - మిమ్మలను నే నేం మన్నిస్తాను! భర్త యివ్వన్దే భార్యవద్ద డబ్బుంటే,

దొంగతనమో, రంకుతనమో చేసిందని వెంటనే తీర్మానించు కుంటారు. చదువుకున్నదాన్నని, తెలిసినదాన్నని అనుకున్నా గాని, ఈపాటి గుర్తించగల జ్ఞానం నాకు లేకపోయింది.

[ఉద్వేగంతో చలించిపోతూ పెడముఖం పెట్టుకుంటుంది.

రాధాకృష్ణ. శ్యామలా! ఇటు చూడు ! [ఆమె తిరిగి చూడకపోగా బలవంతాన ఆమె ముఖం తనవైపుకు తిప్పుకుంటూ] "బిలీవ్ మి, మై డియర్. ఐ యామ్ ఫీలింగ్ అట్టర్‌లీ ఎషేమ్డ్ ఆఫ్ మైసెల్ఫ్."

శ్యామల. నన్ను చూచుకుంటే నాకుమాత్రం సిగ్గువెయ్యడం లేదంటీ? మన మిద్దరం విద్యావంతులమే; ఇద్దరం సంస్కృతి పరులమే. ఒకరి నొకరు ప్రేమించుకున్నాం; ఒకరి నొకరు పూర్తిగా అర్థం చేసుకున్నా మనుకున్నాం. కాని, మన విద్య, మన సంస్కృతి, చివరికి మన ప్రేమైనా, మీరు నన్ను శంకించడానికి అడ్డుకాలేక పోయింది. అయినా, తప్పు మీది కాదు. నా ఆర్థిక బానిసత్వమే మన మధ్య విషం చిలికింది. దాన్ని తొలగించుకో గలిగితేనే నేను తిరిగి మీ ముఖం చూడగలిగినా, మీరు నాముఖం చూడగలిగినా! ఒకరు భరించేవారై, మరొకరు భరించబడేవారైనంతవరకు హృదయాలు నిజంగా కలవవ్.

రాధాకృష్ణ. అయితే, ఇప్పుడు తిరిగి....

శ్యామల. ఔను! తిరిగి ఏదైనా ఉద్యోగంలో ప్రవేశిస్తాను. [సగం వ్రాసిన ఉత్తరంవద్ద తిరిగి కూర్చుంటూ] గుంటూరు విమెన్స్ కాలేజీలో లెక్చరర్ పోస్ట్ ఖాళీగా వుందట. దానికి అప్లయి చేస్తున్నా.

రాధాకృష్ణ. ఉద్యోగం తిరిగి చేసి తీరాలంటే ఇక్కడే ఏదైనా దొరికేవరకూ పోనీ ఆగవచ్చుగా !

శ్యామల. ఎక్కడైతేనేమి లెండి ! ఉన్న వూళ్ళోనే అందరికీ ఉద్యోగాలు దొరుకుతాయా?

రాధాకృష్ణ. ఎక్కడైనా ఒక్కటేనా ? మనం కలసి వుండడం, దూరమైపోవడం ఒక్కటేనా ?

శ్యామల. మైళ్లనుబట్టి ఇద్దరిమధ్య దూరాలను, దాపులను కొలవ గలమా? మనస్సులు కలిసిపోతే ఎంత దూరాన వున్నా, కలిసి వున్నట్టే. లేకపోతే, ఒకచోటనే వున్నా, వేర్వేరు ప్రపంచాలలో వున్నట్టే.

రాధాకృష్ణ. ఇంతగా నీ మనస్సు విరిగిపోయిందా, శ్యామలా? ఇంతగా నేను నీకు దూరమై పోయానా ?

శ్యామల. మీరు నన్ను సరిగా అర్థం చేసుకోవడం లేదు. ఇవ్వాళే నేను కన్నుతెరిచా; నాది కల్లబ్రతుకని తెలుసు కున్నా. నాకు అర్థం లేనంతవరకు నేను మీకు అర్ధాంగిని కాలేను. ఆ అర్హతను సంపాదించుకోవడంలో నేను ఆలస్య మెందుకు చెయ్యాలి ?

రాధాకృష్ణ. శ్యామలా ! ఇవ్వాళ నీపట్ల మహాపచారమే చేశానని ఒప్పుకుంటున్నాగా !

శ్యామల. మీపట్ల నేను చేసింది కూడా మహాపచారమే. నన్ను నేను ఆర్థికదాస్యంలో పెట్టుకోబట్టేగదా, మీనోట ఇవ్వాళ అబద్ధం పలికించడం జరిగింది. ఇది మీకూ, నాకూ కూడా ఫాల్స్ పొజిషన్. ఇది మన యిద్దరి నైతిక పతనానికి సమా నంగా కారణమౌతున్నది.

రాధాకృష్ణ. మన్నించవలసిందిగా ప్రతిమాలాడుకుంటున్నా, నన్ను మన్నించలేవా, మైడియర్?

శ్యామల. ఇది కేవలం మీ, నా ప్రశ్నమాత్రమే కాదండీ! చదువుకునే భాగ్యం - ముఖ్యంగా పెద్ద చదువులు చదువుకునే భాగ్యం - మా స్త్రీజాతిలో ఎంతమంది కబ్బుతుంది? నేను చదువుకున్న చదువుకు సార్థక్యం పదిమంది స్త్రీలకు దాన్ని చెప్పినప్పుడే అనుకున్నా. ఆ ఉద్దేశంతోనే టీచర్‌గా ప్రవేశించాను. కాని, మన వివాహం స్థిరపడగానే "నా సంపాదన చాలదా? నువ్వు శ్రమపడ్డం దేనికి?" అని మీరంటే నా సుఖాన్నే, నా స్వార్థాన్నే చూచుకుని, నా లక్ష్యాన్నే మరిచిపోయాను. ఇప్పుడు వెనక్కి తిరిగి చూచుకుంటే ఒకనాటి ఆశయాలన్నింటికీ ఎంత దూరమైపోయానో తెలిసొస్తున్నది. ఆ పాపాని కిప్పుడు పరిహారం చేసుకోబోతున్నాను.

[అప్లికేషన్‌పై సంతకంపెట్టి, దాన్ని మడిచి కవరులో పెడుతూ వుంటుంది.

రాధాకృష్ణ. మన కొక బిడ్డేవుంటే నువ్వింత తొందరపడేదానివా?

శ్యామల. ఔను! అంతవరకు అదృష్టవంతురాలినే!

రాధాకృష్ణ. అదీ ఒక అదృష్టమే!

శ్యామల. కాదటండీ! మీరే ఇప్పు డన్నట్టు, మనకు ఒక బిడ్డే వుంటే ఈపాటి తెగింపైనా నేను చెయ్యగలిగేదాన్నా! ఆత్మగౌరవాన్ని కాపాడుకోగలిగేదాన్నా?

రాధాకృష్ణ [వాదంలోకి దించితే, మనస్సు మార్చవచ్చుననే ఆశతో]. ఆత్మగౌరవాల కేమిగాని, మాతృత్వమే స్త్రీ జీవితానికి శోభైనా, సాఫల్యమైనా. అసలు స్త్రీ పురుష ప్రేమకు వైశిష్ట్యాన్ని కూర్చేదే సంతానాపేక్ష. ఆ అపేక్షే లేకపోతే....

శ్యామల [పట్టరాని కోపాన్ని అణచివేసుకోడానికి ప్రయత్నిస్తూ]. "ఆత్మ గౌరవాల కేమిగాని....", ఔను! మీ దృష్టిలో స్త్రీకి ఆత్మే వుండదు. ఇఖ, ఆత్మగౌరవం ఎక్కడినుంచి వస్తుంది లెండి!

రాధాకృష్ణ. ఇది న్యాయమేనా, శ్యామలా? నే నేమన్నా దానికి పెడర్థాలు తీస్తున్నావ్!

శ్యామల. ఇందులో పెడర్థా లేమున్నై! నేనే తల్లినై వుంటే, బిడ్డలపై మమకారంకొద్దీ మీ రేం చేసినా పడివుండేదాన్నని మీ రంటున్నారు - అంతేగా!

రాధాకృష్ణ. నీతో వాదానికి నే నెక్కడ నిలవగలను గాని, నీ నిర్ణయం మారదా, శ్యామలా?

[ఈ ప్రశ్నకు జవాబు అన్నట్టుగా శ్యామల కవరుపై అడ్రసు వ్రాస్తుంది.

రాధాకృష్ణ. లుక్ హియర్, మై డియర్!

శ్యామల. బోయ్!

బోయ్ [లోపలినుంచి]. వస్తున్నా నమ్మా!

రాధాకృష్ణ. పోనీ, రేపటివరకైనా ఆగరాదా? ఈలోగా ఆ ఉద్యోగ మెక్కడికీ పోదు.

శ్యామల. పోకపోవచ్చు. కాని, వెంటనే అప్లికేషన్ పంప కుండా ఆగవలసిన అగత్యం నాకేమీ కనబడ్డం లేదు.

రాధాకృష్ణ. నా తప్పు అంగీకరించిన తర్వాత కూడా ఇంత క్రూరమైన శిక్ష విధించాలా?

శ్యామల. ఇది శిక్షే అయితే, మీకు కాదు; నాకు. నా ఆర్థిక దాస్యాని కిది శిక్ష; నా అబద్ధపు బ్రతుకు కిది శిక్ష.

రాధాకృష్ణ. మరొకసారి అడుగుతున్నా—నన్ను మన్నించు, శ్యామలా! నాకు దూరం కావద్దు.

శ్యామల. నన్ను మీరు అర్థం చేసుకోవడంలేదు. నా ప్రయత్న మంతా మీరు మరింత దగ్గరగా—నిజంగా దగ్గరగా—రావాలనే.

రాధాకృష్ణ [శ్యామల రెండు చేతుల్ని పట్టుకుని]. డోన్ట్ టార్చర్ మి, మై డియర్.

బోయ్ [ప్రవేశిస్తూ]. ఎందుకమ్మా!

[శ్యామల చేతుల్ని విడిపించుకుని, అవతలికి జరుగుతుంది.

శ్యామల [కవర్ అందుకుని, దాన్ని బోయ్ చేతి కిస్తూ]. ఈ ఉత్తరం పోస్ట్ చేసిరా!

బోయ్ [ఉత్తరాన్ని అందుకుంటూ]. అలాగే నమ్మా!

[బోయ్ వెళ్ళబోతాడు.

రాధాకృష్ణ. తొందర లేదు లేరా! ఆగు!

[బోయ్ ఆగిపోతాడు.

శ్యామల. ఊహుఁ! వెళ్ళరా, వెళ్ళు!

[భోగయ్య తిరిగి కదులుతాడు.

రాధాకృష్ణ. నీ క్కాదురా చెప్పేది? రేపు వెయ్యొచ్చులే!

[భోగయ్య మళ్ళీ నిలిచిపోతాడు.

శ్యామల. ఔను! వాడికి జీతభత్యా లిస్తున్నది మీరేగా! వాడికి పనిచెప్పడానికి నాకు హక్కేముంది? తేరా! తే! ఆ ఉత్తరమిలా తే! నేనే పోస్టుచేసుకుంటాలే!

రాధాకృష్ణ. వెళ్ళరా, వెళ్ళు! వేసిరా!

తెర]



## పాత్రలు

భూషయ్య : మోతుబరి రైతు

మాధవరావు : భూషయ్య కుమారుడు

వీరభద్రయ్య : పైకి పెద్దమనిషి

కృష్ణమాచార్యులు : పౌరాణికుడు

వెంకటశాస్త్రి : జ్యోతిష్కుడు

## స్థలం

భూషయ్యగారి ముందువా చావడి

## కాలం

వర్తమానం



# ఆశాపాశం

భూపయ్య మండువా చావడిలో పడకకుర్చీపై కూర్చుని వుంటాడు. ఆయనకు దగ్గిరగా మామూలు కుర్చీలో కూర్చుని కృష్ణమాచార్యులు బమ్మెరపోతన భాగవతంనుంచి వామనావతార ఘట్టాన్ని వినిపిస్తూంటాడు. చావడిలో మరి రెండు కుర్చీలు, ఒక బెంచీ వుంటాయి.

కృష్ణమాచార్యులు. "అని మరియు నిట్లనియె." బలి చక్రవర్తి ఇంకా ఏ ప్రకారంబుగా అంటున్నాడయ్యా....

"వసుధాఖండము వేడితో, జగములన్
వాంఛించితో, వాజులన్
వెస నూహించితో, కోరితో యువతులన్
వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేర వీ వడుగ నీ
భాగ్యంబు లీపాటి గా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ
యల్పంబు నీ నేర్చునే!"

....అయ్యయ్యో ! వెర్రి బ్రాహ్మడా ! ఏమిటయ్యా యిది !! నీకు మడులు కావాలా ? మాన్యాలు కావాలా ? అగ్రహారాలు కావాలా ? అర్ధభాగమే కావాలా? ముల్లోకాలు జయించినవాణ్ణి.

కనీస మొర లోకాన్ని అడిగి పుచ్చుకోరాదటయ్యా? పోనీ దొడ్లమీదా, దోపలమీదా నీకు మమత లేదే అనుకో; ఊళ్ళమీద, నాళ్ళ మీద బ్రమత లేదే అనుకో; అయితే, "వాజులన్", గుర్రాలను అడగరాదటయ్యా? వాయువేగ మనోవేగాలతో ప్రయాణించే ఉత్తమాశ్వాలు ఒక వంద—ఒక వెయ్యి—ఒకలక్ష—ఎన్ని కావాలి? చెప్పవయ్యా! సంకోచం దేనికి? గుర్రాలూ, ఏనుగులూ నే నేమి చేసుకొంటాను, నాకు దేని కంటావా? అయితే, పడుచుపిల్ల లెవ్వరూ నీకంట దూరనే లేదటయ్యా? ఎవ్వరిపైకీ నీ మనస్సు పోనేలేదటయ్యా? పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని—ఏజాతి స్త్రీలు నీకు కావాలి? ఎంత మంది కావాలి? ఇంతకూ నువ్వు ముక్కుపచ్చలారని పసివాడివి. ఒక చెంప పాలు, మరొక చెంప నీళ్ళు. అభం శుభం యెరగవు. "నేఁ వీ పడుగ!". అడగడమైనా సరిగా చేత కాదయ్యె. ఇచ్చేవారున్నా పుచ్చుకొనడానికీ, అనుభవించ డానికీ నీకు ప్రాప్తం లేదు కాబోలు. "బుద్ధిః కర్మానుసారిణీ". కర్మనుబట్టే బుద్ధి. కాకపోతే దానచక్రవర్తిని; ముల్లోకాధి పతిని. నన్నేమిటి? ముష్టి మూడడుగుల నేల అడగడ మేమిటి? ఇంత స్వల్పాన్ని నువ్వు అడిగితే మాత్రం నే నెలా యివ్వగలనయ్యా! నాది భారీచెయ్యి. నన్ను భారీగా అడుగు. భారీగా పుచ్చుకో, "అనిన మొగంబునం జిరునగవు మొలకలెత్త గృహమేధికి మేధావి యిట్లనియె"........బలి చక్రవర్తి ఈ ప్రకారంబున పలుకగా ఆయనతో ఆ వామన మూర్తి—ఆ లీలామానుష విగ్రహుండు—ఆ జగన్నాటక

సూత్రధారి—ముఖంపై చిరునవ్వులు మొలకలెత్తుతుండగా ఏ విధంబుగా అంటున్నాడంటే........

"గొడుగో, జన్నిదమో, కమండలువో, నా
కుఁ న్ముంజియో, దండమో
వడు గే నెక్కడ? భూమి లెక్కడ? కరుల్
వామాత్తు లశ్వంబు లె
క్కడ? నిత్యోచితకర్మ మెక్కడ? మదా
కాంక్షామితంబైన మూ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చు టది బ్ర
హ్మాండంబు నాపాలికిన్"

....చేత పట్టుకోడానికి ఒక గొడుగో, మెడలో వేసుకోడానికి ఒక జంధ్యమో, మంచితీర్థం పుచ్చుకోడానికి ఒక కమండలమో, మొలకు కట్టుకోడానికి ఒక ముంజియో........అంతే మరేమీ లేదు, భూషయ్య బాబూ!....దర్భలతో పేనిన మొలత్రాడు........"గొడుగో, జన్నిదమో, కమండలువో, నాకుఁ ముంజియో, దండమో."........లేదా జపతపాలకు అక్కరకు రావడానికి ఒక దండమో—ఇలాంటి దేదైనా నే నడిగినా, తమరిచ్చినా అదొక అందం, చందంగాని, బ్రహ్మచారిని, నాకు మడులు దేనికి? మాన్యాలు దేనికి? అగ్రహారాలు దేనికి? అర్ధాసనాలు దేనికి? గుర్రాలూ, ఏనుగులూ నే నేమి చేసుకొంటాను, స్వామీ? అందకత్తెలు నాకు దేనికి? నెత్తిని పెట్టుకొని ఊరేగడానికా? "కౌపీనసంరక్షణార్థం అయం పటాటోపః" అన్నట్టు, ఈ బాదరబందీ యావత్తూ నాకు దేనికి, ప్రభూ? నామొర విని—నా విన్న

పాన్ని ఆలించి—నేను కోరిన మూడడుగుల నేలను దేవర వారు నా కనుగ్రహిస్తే, అదే నాకు బ్రహ్మాండాన్ని కట్టబెట్టి నట్టు.........ఆయన—ఆ వామనమూర్తి—ఆ మాయామానుష విగ్రహుడు సాక్షాత్తు జగదీశ్వరుడు. "జగ త్సర్వం మయా సృష్టం." సమస్త జగాలూ ఆయన సృష్టించినవే. మాయలో పడి "ఇది నాది-అది నాది" అని అనుకోడమే గాని, సర్వం ఆ జగన్నాథునిదే. సకలచరాచర జీవకోటికీ ఆయన పెట్టిందే భిక్ష. అయినప్పుడు ఆయన్ని ఏం కావాలో కోరుకో మనడ మేమిటి? ఆయన కోరుకున్నది స్వల్ప మనడ మేమిటి? "ఓయి! వెర్రివాడా! నీవు మాయామోహపాశాలలో చిక్కు కున్నావు. నేను సర్వేశ్వరుడ నని గుర్తెరగలేక పోతున్నావు. నీ ముల్లోకాలూ నాకు మూడడుగులే సుమీ!" అని ఆయన —ఆ వామనమూర్తి—"మదాకాంక్షమితంబైన మూడడుగుల్ మేరయ త్రోవ కిచ్చు టది బ్రహ్మాండంబు నా పాలికిన్" అని సూచిస్తున్నాడు.... "అదియునుంగాక...."

"వ్యాప్తిం బొందక వగవక
ప్రాప్తంబగు లేశమైన బదివే లనుచుం
దృప్తింజెందని మనుజుడు
సప్తద్వీపములనయిన జక్కంబడునే?"

....ఇంకా, ఇంకా పోగుజేసుకోవాలి, ఇంకా ఇంకా మీట వేసి పోవాలి, ఇంటిమీద ఇల్లు వచ్చిపడాలని తాపత్రయ పడకుండా తనకు ప్రాప్తంబయ్యేది .... అది తృణమైనా, పణమైనా —అదే పదివేలని సంతుష్టి పడనివారు..........."సప్త

ద్వీపములనయిన జక్కాంబడునే"....ఏడు ద్వీపాలలోనైనా ముందుకు రాగలరా? "దురాశ దుఃఖం చేటు". వెనకటి కెవడికో తనకులేదని ఏడిస్తే ఒక కన్ను పోయిందట; ఎదటి వాడి కున్నదని ఏడిస్తే రెండో కన్ను పోయిందట. సంతోషం సగం బలమని పెద్దలన్నారుగాని, సంతుష్టి పూర్తిబలం....

"ఆశాపాశము దాఁ గడున్ నిడుపు, లే
దంతంబు, రాజేంద్ర! వా
రాశిప్రావృతమేదినీవలయసా
మ్రాజ్యంబు నే కూరియుం
గాసిం బొందిరి గాక వైన్యగయయాభూ
కాంతాదులు న్నర్థకా
మాశం బాయగ నేర్చిరే మును, నిగా
శాంతంబులం జూచిరే?"

....ఆశ అనే పాశం బహు పొడవైనది. పల్నాటి చేంతాడుకైనా అంతు వుంటుందేమోగాని, ఆశకు మాత్రం అంతే లేదు.

["ఆశాపాశము దా గడున్ నిడుపు" అనే పద్యాన్ని కృష్ణమాచార్యులు ప్రారంభించబోయే సమయానికి వీధిలో కారు హారన్ మోత వినపడుతుంది. తర్వాత కొన్ని క్షణాలకు వీధిగుమ్మంలో మోటారు కారు ఆగుతుంది. ఆ వెనువెంటనే మాధవరావు, వీరభద్రయ్య, వెంకటశాస్త్రి చావడిలోకి వచ్చి, ఒక పక్కగా ఒదిగి కూర్చుంటారు. వారి రాకను చూచి, కృష్ణమాచార్యులు తన వ్యాఖ్యానం మధ్యలో ఆగిపోతాడు.

వీరభద్రయ్య. ఆపివేశా రేమండీ, ఆచార్యులుగారూ! కానివ్వండి.

ఘూషయ్య [వీరభద్రయ్యతో]. రానిస్తారులే! ఏం? ఇలా వేంచేశారు?

వీరభద్రయ్య. అబ్బే! ఊరికేనే, బాబాయ్!

ఘూషయ్య. "ఊరకరారు మహాత్ము" లన్నారు. ఊరికే సువ్వెందు కొస్తావ్?

కృష్ణమాచార్యులు. ఘూషయ్యబాబూ, వీ రెవ్వరు?

ఘూషయ్య. అయ్యో! మీకు తెలియదటండీ? ఈయన పెద్ద నాయకుడు. దేశాన్ని ఉద్ధరిస్తున్నాడు. మన తిరపతయ్యకు—మన చినతిరపతయ్యకు—నయానా మేనత్తకొడుకు.

కృష్ణమాచార్యులు. ఓహో! వీరభద్రయ్యగారా? పేరు ప్రఖ్యాతులు వింటమేతప్ప ఎన్నడూ దర్శనం చేసుకోలేదు.

ఘూషయ్య. ఈయన దర్శనం మనబోటి సామాన్యులకు దొరుకుతుందటండీ! కలెక్టర్లు, గవర్నర్లు, మినిస్టర్లు—ఎంతెంత పెద్దఫాయావారితో ఈయ నిప్పుడు భుజాలు రాసుకుంటూ తిరుగుతున్నాడని! పేరు ఇతరులదైనా, ప్రభుత్వచక్రం ఇప్పు డీయన చేతిలోనే వుంది.

వెంకటశాస్త్రి. మనవాడి కిప్పుడు బృహస్పతి రాజ్యంలో వున్నాడు, ఘూషయ్యబాబూ! రాజయోగం పట్టింది. మహర్దశ అందుకుంది. పదహారేళ్లు దేదీప్యమానంగా వెలుగుతాడు!

ఘూషయ్య. ఇంకేం? ఈ సారి ముఖ్యమంత్రి ఛాన్సు మనవాడిదే.

వీరభద్రయ్య. నీ యద్దేవ కేమిగాని....

ఘూషయ్య. అబ్బే! యద్దేవ కాదురా! నిజం మాటే. నేను....

వీరభద్రయ్య. ఇప్పుడు మినిస్టర్లుగా వున్న వాళ్ళందరూ మన వంటి పౌరులేనా రేమిటి ?

వెంకటశాస్త్రి. ఇంతకీ ఎవరి ప్రయోజకత్వ మేమున్నది ? దేనికైనా రాజయోగం కలిసిరావాలి.

భూషయ్య. సరేనయ్యా ! ఇప్పు డిక్కడ ఈ గ్రహసంయోగానికి కారణ మేమిటి ?

మాధవరావు. మరేమీ లేదు, నాన్నా ! కొత్త బస్సు రూటుకు....

[మాటను నవ్వులో మింగివేస్తాడు.

భూషయ్య. పాతది నిర్వాకం చేస్తున్నావ్. ఇక, కొత్తది....

వీరభద్రయ్య [తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో]. నోట్లో మాట నోట్లో వుండగానే నువ్వు వాణ్ణి కసురుకొంటావేమే, బాబాయ్ ! నువ్వెక్కడ కూకలేస్తావోనని ఈ పూట వా డసలు నీ దగ్గిరికి పెద్దపులిదగ్గిరి కొచ్చినట్టొచ్చాడు.

భూషయ్య. తోడేళ్ళ సావాసం చేస్తున్నవాడికి పెద్దపులంటే అంత భయమట్రా ?

కృష్ణమాచార్యులు. భూషయ్యబాబూ ! ఇవ్వాళ్టికి పురాణకాలక్షేపం చాలిద్దామా ?

భూషయ్య. ఆఁ ! ఈ పురాణంలో పడినాక మరి అదేమి సాగుతుంది లెండి.

కృష్ణమాచార్యులు. అది పొద్దున వాకిట చేరింది. పిల్లలే చెయ్యి కాల్చుకుంటున్నారు. ఏమి తిన్ తేరా చేస్తున్నారో ! నేను వెళ్ళొస్తాగాని, వంట చిచ్చుమాట మర్చిపోబోకు సుమీ !

ఒక వంద పిడక, ఒక మోపుడు పుల్లలు....దుంగలైతే వాటిని మళ్ళీ పగలేయించడానికి నా కెవ్వరూ పలకరు........ సన్నటి పుల్లలు చూచి....

ఘూషయ్య. వెంకటపోలాస తుమ్మ చస్తే, మొన్నే దాన్ని కొట్టు కొచ్చి దొడ్లో పడేశారు. అన్నీ దుంగలే. పాలేళ్ళు పొలం నుంచి వచ్చే వేళైంది. మళ్ళీ మీ రొకసా రొచ్చి, దగ్గరుండి వాళ్ళచేత పగలేయించుకొని, మీకు కావల్సినన్ని పట్టించుకు వెళ్ళండి.

కృష్ణమాచార్యులు. సరే, ఘూషయ్యబాబూ! సరే.

[వెళ్ళిపోతాడు.

వెంకటశాస్త్రి. ఘూషయ్యబాబుది ఎముకలేని చెయ్యి. "లేదు" అనేమాట ఆయన ఇంటా, వంటా లేదు. అడగనివానిదే పాపం; యథోచితంగా అందరినీ సత్కరిస్తారు.

వీరభద్రయ్య. నువ్వూరుకోవయ్యా, శాస్త్రిలూ, కాసేపు. వ్యవహారం మాట్లాడుతుంటే, మధ్య నువ్వేమిటి పానకంలో పుడకలా! ఏరా! మాధవరావ్! ఊరికే నీళ్ళు నములుతావు దేనికి? చెప్పరాదట్రా?—ఇది ఫస్టుక్లాసు రూటనీ, డెయిలీ కలెక్షన్ రెండు మూడొందల పైమాటనీ, ఈ ఛాన్సు పోగొట్టు కుంటే మళ్ళీ రాదనీ. నోట్లో నాలిక లేదట్రా?—మాటే పెగలదు.

మాధవరావు. ఔను, నాన్నా! ఇది లాంగు రూటు. ఇది మన కొస్తే....

[మళ్ళీ మాట మింగివేస్తాడు.

ఘూషయ్య. అయితే, పుచ్చుకో! పాతది నన్నడిగి పుచ్చుకున్నావా-కొత్తదానిమాట నన్నడగడానికి! ఇందులో నా పెత్తన మే మున్నది ?

వీరభద్రయ్య. అబ్బే! అదేంమాటే, బాబాయ్! నీవంటే వాడి కెంత భయభక్తులని !!

ఘూషయ్య. భయభక్తులున్నవాడైతే నేను నెత్తిన నోరు పెట్టుకొని మొత్తుకుంటున్నా నామాట ఖాతర్ చెయ్యకుండా, ఈ వ్యాపారంలో వేలు పెట్టేవాడా ? ఇది మనకు లాయకేనా? మన తాత ముత్తాతలు వ్యాపారాలే చేశారా? ఆ దేవుడిచ్చింది మన కేదో ఇంత వున్నదిగా! మనం తిననూ వచ్చు; నలుగురికి పెట్టనూ వచ్చు. నోటిదగ్గిరికూడు బోర్ల దోసుకోవడం కాకపోతే, వీడి కీ వంకర బుద్ధు లేమిటి ?

వీరభద్రయ్య. అదేం మాటే, బాబాయ్! డబ్బుకు నాలుగు డబ్బులు చేర్చి వాడు ప్రయోజకుడు కావాలనుకొంటుంటే!

ఘూషయ్య. అఁ! ప్రయోజకుడో, అప్రయోజకుడో కనబడుతూనేవుంది. చదువుకని పెడితే, మిటిక్లేషన్‌లో మూడు పిల్లిమంతరాలు కొట్టి, నెత్తిని గుద్దేసుకుని కొంపకి చేరాడు. అయిదారువేలు ఖర్చు పోతే అబ్బిం దేమిటి ? సిగరెట్లు, సినిమాలు, షోకులు—ఇవేగా ? వ్యాపారం వంక పెట్టుకొని మళ్ళీ బస్తీ కెక్కితే, ఏం కనబడుతున్నది ? కట్నంగా వచ్చిన యాభైవేలు గంగలో కలిసిపోవడమేనా ? మేదకు రాలని పెళ్ళాన్ని బెదిరించి, సదిరించి, దాని నగా, నాణెం పట్టుకుపోయి తెగనమ్ముకోడమేనా ? సిగ్గూ, యెగ్గూ లేకపోతే సరి!

వీరభద్రయ్య. నీకు మేము చెప్పేపాటి వాళ్ళమటగాని, వ్యాపార మన్నాక, లాభనష్టాలు తప్పుతాయటే, బాబాయ్? వాడు పద్ర సన్నాసి. అనుభవంలేక ముందు కొంత దెబ్బతిన్నాడే అనుకో. కాని, ఎల్లకాలం నష్టమే వస్తుందా?

వెంకటశాస్త్రి. పోయిన రెండేళ్లు వ్యయాధిపతి భుక్తి. నష్టం రా కేమి చేస్తుంది?

భూషయ్య. ఇంత తెలిసినవాడివి, "ఇప్పు డిది తగ"దని నువ్వు ముందే ఎందుకు చెప్పలేదయ్యా?

వెంకటశాస్త్రి. ఒకవేళ నేను చెప్పానే అనుకోండి! అయినా దుష్టగ్రహవీక్షణం తీక్ష్ణంగా వుండగా నామాట చిల్లిగవ్వకైనా చెల్లేదా?

భూషయ్య. ఔను. మావాణ్ణి చాలా దుష్టగ్రహాలు చుట్టుకొన్నాయి. అందుకనే ఇంత భ్రష్టుడయ్యాడు!

వీరభద్రరావు. ఇదుగో! వెంకటశాస్త్రీ! మధ్య సు వ్వేమి టయ్యా? పసపోసిన పిట్టలా వాగొద్దని నీకొకాడూ చెప్పేది!

వెంకటశాస్త్రి. ఇంతకీ మన కివ్వాళ శకునం బాగుండ లేదులెండి. భుజాన పంచె వేసుకొని, చెప్పులో కాలు పెట్టానో లేదో, ఎదురుగుండా....

వీరభద్రయ్య. చాల్లేవయ్యా! పెద్దమనిషి! కట్టిపెట్టమంటుంటే!!

[వెంకటశాస్త్రి పక్కన పేనుపల అయిపోతాడు.

వీరభద్రయ్య. భూషయ్య, బాబాయ్! నే నొక్కమాట చెబుతా, విను! తపో్ప, ఒపో్ప! మనవాడు వ్యాపారంలో వేలు పెట్టాడు. కొంత నష్టం వచ్చింది. ఇప్పుడు ఊరికే రొష్టు

పడితే, వచ్చిన నష్టం పూడుతుందా? మళ్ళీ కొత్త పెట్టుబడి పెట్టి ఈసారి పకడ్బందీగా వ్యవహారం నడిపిస్తే....

ఘూషయ్య. దాని కేమిరా! పోయినదానితో జతకావడానికి ఎవడి కొంపైనా తీసి మళ్ళీ పెట్టుబడి పెట్టండి.

వీరభద్రయ్య. అదేం మాటే, బాబాయ్! లేకపోతే, అసలుకే మోసం రాదటే?

ఘూషయ్య. అసలు లేదు: సిసలు లేదు. తను అల్లరిపడి, నన్నెందుకు అల్లరి పెడతాడుగాని. తట్ట తగలేసి చక్కాపమ్మను.

వీరభద్రయ్య. అదిమాత్రం మాటలటే, బాబాయ్! రావలసిన బాకీలు, యివ్వదేలిన బాకీలు, ఎన్ని లావాదేవీలు లేవు? వ్యాపారం కట్టి వేయడమంటే ఎంత పీకులాటపని!! చిన్నవాళ్ళం, ఈ విషయాలు మేము నీకు చెప్పాలటే? మనవా డొచ్చి నోరు తెరిచి అడిగాడనిగాని, ఇదే మరొకడో, మరొకడో అయితే,—వా డెంత కొమ్ములు తిరిగిన వాడైతే మాత్రం—నేను కల్పించుకొనేవాడినటే, బాబాయ్? ఫలానా కొత్త బస్సురూటు యిప్పిస్తే, కాస్త కాలూ, చెయ్యీ కూడ దీసుకుంటానని మనవాడు రాబట్టి, మినిస్టరు చెవిని ఒకమాట వేశాను.

ఘూషయ్య. ఇకనేం! పని అయిపోయినట్టే! మీ స్నేహితుడి రొట్టె నేతిలో విరిగిపడ్డట్టే!

వీరభద్రయ్య. మినిస్టరు మనం ఎంత చెబితే అంతే ననుకో. ఆ మాటకొస్తే, చీఫ్ మినిస్టరైనా మనం ఎక్కడ బరి గీసి

నిలబడమంటే. అక్కడ నిలబడాల్సిన వాడే. కాని, ఆ సెక్రటరీ గా డొకడున్నాడు. వా డొత్తి తెంపి !! వా దేవో అడ్డుపుల్లలు వేస్తున్నాడు. వాణ్ణి కట్టుకోవాలి. మేత పడందే వాడు మెత్తపడేటట్టు లేదు. ఒక్క పదివేల రూపాయిలు మనవి కావనుకొని గిరగిర తిప్పి, వాడిమొఖాన కొడితే....

ఘోషయ్య. కాంగ్రెసువాడి నంటావ్; దేశభక్తుడి నంటావ్; ప్రజాసేవకుడి నంటావ్. ఈ పాడు పని నీకు తగునట్రా ? ఎవరైనా వింటే, కాండ్రించి ముఖాన ఉయ్యరట్రా ?

వీరభద్రయ్య. ఆ ! ఎవడు మడికట్టుకు కూర్చున్నాడు ? ఎపదిని చూడబోయినా లంచమో, వంచమో పెట్టి, అక్కడ గడుపు కొనేవాడే ! ఇది పోలిటిక్స్ బాబాయ్. పోలిటిక్స్. ఇప్పుడు ప్రపంచమే ఇలా నడుస్తున్నది.

ఘోషయ్య. ఔనౌను. దిక్కుమాలిన ప్రపంచం. కుడీ యెడమూ; మంచీ చెడ్డా; పాపం పుణ్యం—ఏమీ లేని పాడు ప్రపంచం.

వీరభద్రయ్య. సత్యకాలపువాడివి నీ కన్నీ పట్టింపులు గాని, పని కావడమే ప్రధానం, బాబాయ్ ! ఈ రూ టొచ్చిందంటే మన వాడి పంట పండిందన్న మాటే !

వెంకటశాస్త్రి. మన మాధరావుగారికి ప్రస్తుతం భాగ్యాధిపతిభుక్తి. వాడు రాజ్యంలోనే వున్నాడు. వాడిని ధనాధిపతి చూస్తున్నాడు. వాహన, భాగ్యాధిపతులు కలిసేవున్నారు. అసలు జాతకానికే పంచానన యోగం పట్టింది. బ్రహ్మాండమైన యోగకాలం. ఇక పట్టిందల్లా బంగారమే.

ఘూషయ్య. సరే! సంతోషం! ఆ బంగారంలో నువ్వొక పది తులాలు అడిగి పుచ్చుకో; పెళ్ళాం బిడ్డలకు నాలుగు వస్తువు లేర్పరచుకోవచ్చు.

వీరభద్రయ్య. నీ ఎకసక్కెల కేమిగాని, బాబాయ్! చిన్నవాడినో, పెద్దవాడినో నేను చెబుతున్నాను. కాదు. కూడ దనకు. ఆ పదివేలకూ నువ్వు మాట దక్కించుకో.

ఘూషయ్య. ఈ మాట ఎప్పుడు ఎప్పుడు బయటి కొస్తుందా అని ఇందాకటినుంచి ఎదురుచూస్తున్నాను. పదివేల రూపాయలు కాదు కదా, పది దమ్మిడీలైనా నే నివ్వను. వీణ్ణి సంపాయించుకురమ్మని ఎవ రేడ్చారు? నిక్షేపంలాంటి కొంగ్రసూ రెకరాలున్నది. దాన్ని కనిపెట్టుకుంటే బంగారం పండదూ? అంతకంటే మన కేం కావాలి? ఒంటిగాణ్ణి నే నెన్నిటికని దేవులాడతాను? "నా" అని నిలబడేవాడు లేక పోబట్టేగా కోతలు, కట్టివేత వేళకు కాక, నోటిదగ్గిర కొచ్చిన గింజలు ఈ యేడు నీళ్ళపాలైంది? మనది మనం జాగ్రత్త పెట్టుకుంటే, మనం రాజాగా బ్రతకవచ్చునే! పది మందిని బ్రతికించనూ వచ్చునే!! అంతులేని ఆశకు పోవడం దేనికి? బోర్లపడ్డం దేనికి? వెధవ వేషాలు కట్టిపెట్టి, ఇఖనైనా కొంపకు చేరమను!

మాధవరావు [కోపావేశాలతో]. చేరకపోతే?

ఘూషయ్య. నీఖర్మ! నే నేం చేస్తాను?

మాధవరావు. అంతేనా?

భూషయ్య. అంత కాకపోతే, మరెంతరా? నా కడుపున పుట్టింది నువ్వొక్కడివే కాదు. నువ్వు ఒక్క వెలుగు వెలుగు తావని నీకోసం—చిన్నవాళ్లు—వాళ్ళకు అన్యాయం చేస్తానా?

మాధవరావు. నేను చచ్చినా ఇంతేనా?

భూషయ్య. సరే! ఒకడు తక్కువ పుట్టాడనుకొంటాను.

వీరభద్రయ్య. చిన్న సన్నాసి. తెలిసీ తెలియని మేళం. పెద్ద వాడివి—నువ్వెందుకే కాకపడతావు, బాబాయ్? సలభై యాభై వేలు వ్యాపారం మీద పెట్టనే పెట్టాడా? అది నున్నా చుడుతుంటే ఎవరైనా చూస్తూ చూస్తూ ఎలా వూరుకోగలరే, బాబాయ్? పెట్టిన మొత్తమైనా రాబట్టుకోగలిగితే, చల్లగా తప్పుకొందామనే వాడూ చూస్తున్నాడు. పైకం అర్జంటుగా కావాల్సొచ్చిగాని, నాలుగైదురోజుల యెడ మయింటే వాడే రకం ఫిరాయింపు చేసుకొనేవాడు కాడూ? అవతల మరొకళ్ళు ఆ సెక్రటరీగాడికి లెట్టింపు మొత్తం ఆశ చూపు తున్నారు. "ఖబడ్దార్" అని చెప్పి, ఆర్డర్ వాళ్ళకు వెళ కుండా ఇప్పటిదాకా పట్టుకొస్తున్నాను. నువ్వు "ఊఁ" అను! టెలిఫోన్‌లో ఒక్కమాట చెప్పి, ఆర్డర్ని తెల్లవారేసరికి మన వాడి కాళ్ళదగ్గిరికి తెప్పిస్తానో, లేదో!

వెంకటశాస్త్రి. సిరి వస్తుంటే మోకా లడ్డకూడదు, భూషయ్య బాబూ.

భూషయ్య. మీరు వెయ్యి చెప్పండి, లక్ష చెప్పించండి. నేను చిల్లిగవ్వైనా వెయ్యిజారను.

వీరభద్రయ్య. నీమాట నీదేనటే, బాబాయ్? నే నొక్కమాట....

ఘూషయ్య. ఈ సంగతి మరి నా దగ్గిర మాట్లాడ పద్దురా. అబ్బాయ్! ఏదో నీతిగా, నిజాయతీగా కాలక్షేపం చేస్తున్నా. ఈ ఘటం ఇలాగే వెళ్ళిపోనీ! లంచాలు, పంచాలు, ఆ పాపానికి ప్రాణంమీది కొచ్చినా నే నొడికట్టను. ఏ జన్మాన ఏం పాపం చేస్తే [మాధవరావును చూపిస్తూ] వీడు నా కడుపున చెడబుట్టాడో! అందుకు జత ఇంకో పాపం దేనికి? పుట్టుగతులు లేకుండా పోవడానికా?

మాధవరావు [దిగ్గున లేచి]. సరే! నే నేమైపోతేనేం!—నువ్వు పుణ్యం మూటకట్టుకుని స్వర్గానికి వెళ్లు! రావయ్యా, శాస్త్రుల్గారా! రండి, వీరభద్రయ్యగారూ! రండి! ఇక్కడ మరొక క్షణమైనా ఆగడానికి వీల్లేదు.

వెంకటశాస్త్రి. బయలుదేరిన వేళావిశేషం! నాకు ముందే దుశ్శకునమయింది.

వీరభద్రయ్య. నల్లపిల్లివి—నిన్ను వెంటపెట్టుకు రావడమే దుశ్శకునం! సరిగాని, మాధవరావ్! నీ వాలకం నా కేమీ బాగా లేదు. పెద్దవాడు—ఆయన నిన్ను పది అననూ వచ్చు; నువ్వు పడనూ వచ్చు. పెద్దవాళ్లు తిట్టినా, అవి దీవనలే. అబ్బే! నువ్వు తొందర పడకూడదు, కాస్త నిదానించు!

మాధవరావు. అదంతా నాకు తెలవదు. మీరు వెంటనే కదులుతారా, లేదా?

వీరభద్రయ్య. పోనీ, ఈరాత్రి ఆలోచించి, రేపటికి చెబుతావటే. బాబాయ్? నన్ను మళ్ళీ రమ్మంటే రేపు పొద్దున్నే వస్తాను. రమ్మంటావా?

భూషయ్య. ఊహుఁ!

వీరభద్రయ్య. అంత తేలిగ్గా తోసెయ్యబోకవే, బాబాయ్, నా మాట! వ్యాపారరీత్యానే కాక, మరొక విధంగా కూడా మన వాడు చిక్కున పడ్డాడు.

భూషయ్య. మరొక చిక్కు కూడానా? ఏమిటది?

వీరభద్రయ్య. ఏదో వున్నదిలే! తెలిసీ తెలియనితనంవల్ల పెద్ద ఊబిలో దిగబడ్డాడు.

వెంకటశాస్త్రి. దశబాగున్నా, గోచారంలో అష్టమ గురుడు. వాడు ఊబిలోకి దించడ మొక లెక్కా? మెడకు ఉచ్చునే బిగిస్తాడు.

భూషయ్య. మన బుద్ధుల్నిబట్టే మన జాతకా లుంటాయి. చేతు లారా చేటు తెచ్చుకుంటూ నెపం నక్షత్రాలమీదికి తొయ్యడం దేనికి?

వీరభద్రయ్య. నువ్వలా అంటే కాదే, బాబాయ్! మాధవరావు మెడ నిజంగా ఉచ్చులో చిక్కుకున్నదంటే నమ్ము!

భూషయ్య. మంచిది. నువ్వెన్ని చెప్పినా, దాన్ని తీసి నేను నా మెడకు తగిలించుకో బోవడం లేదు.

మాధవరావు [దిగ్గున లేచి]. నే పోతున్నా.

[రివ్వున వెళ్తాడు.

వీరభద్రయ్య. దూకుడుకుగా పోతున్నాడు. ఏమి తిప్పలు తెచ్చు కొంటాడో? నేనూ పోతానుగాని, ఎందుకైనా మంచిది, కాస్త వెనకా ముందు పరకాయించవే, బాబాయ్! లేకపోతే పస్తాయిస్తావ్. వెళ్ళొస్తా మరి.

[వెళ్ళిపోతాడు.

వెంకటశాస్త్రి [తనొక అడుగు వెనక్కి తగ్గి]. భూషయ్యబాబూ! పేదబ్రాహ్మణ్ణి! పిల్లా జెల్లాతో గంపెడు సంసారం. తాము దయ వుంచాలి. తమ జాతకం ఒకసారి దయచేయిస్తే—

[బయటినుంచి మాధవరావు "ఏమయ్యా! శాస్త్రుల్లూ!! తగలబడవే" అని అరుస్తాడు.

వెంకటశాస్త్రి [బయటి మాధవరావుతో]. వస్తున్నా, బాబూ వస్తున్నా! [ఎదటి భూషయ్యతో] సురేకారంపాలు, భూషయ్య బాబూ! తొందరపాటు తగదని అబ్బాయిగారికి చెవినిల్లు కట్టుకుని నేను చెబుతూనే వున్నా. దశానాథుణ్ణి అష్టమాధిపతి చూస్తున్నాడు. అంచేత అదృష్టమేమో పడుతుంది కాని, అష్టకష్టాలలో పడక తప్పదన్నట్టు కనిపిస్తూ వుంటుంది. నే నొస్తా, భూషయ్య బాబూ! సెల విప్పించండి.

[నమస్కరించి వెంకటశాస్త్రి వెళ్ళిపోతాడు. వెంటనే మోటారుకారు బయలుదేరి వెడుతున్న చప్పుడు వినబడుతుంది. భూషయ్య ముఖంలో కలత కనబడుతుంది. కొన్ని క్షణాల తర్వాత, అప్రయత్నంగా శ్రీమదాంధ్ర భాగవతం అందుకొని, కృష్ణమాచారి గుర్తుపెట్టి వెళ్ళిన పేజీవద్ద దానిని విప్పుతాడు. మనస్సు కలత తీరడాని కన్నట్టు, "ఆశాపాశము దాగడున్ నిడుపు"...అనే పద్యం చదువుతాడు. ఆ పిమ్మట సీసపద్యాన్ని అందుకొని "సంతుష్టుడీ మూడు జగముల బూజ్యుండు, సంతోషి కెప్పుడు జరుగు సుఖము, సంతోషి గాకుంట సంసారహేతువు, సంతసంబున ముక్తిసతియు దొరకు"

అనే మొదటి గండు సంకీర్తనాలు పూర్తిచేస్తుండగా
కృష్ణమాచార్యులు తిరిగి ప్రవేశిస్తాడు.

కృష్ణమాచార్యులు. భగవత్కథా కాలక్షేపానికి విఘ్నం లేని కని వామనావతారఘట్టాన్ని పూర్తి చేస్తున్నావా, భూషయ్యబాబూ ?

భూషయ్య. అబ్బె. లేదండీ! మనస్సు చికాగ్గావుంటే. యాదాలాపంగా....

కృష్ణమాచార్యులు. చికాకే మరి! ఇదెంత అప్రతిష్ఠ! ఇదెంత అప్రతిష్ఠ! మీ కుటుంబ గౌరవానికీ. మీ వంశమర్యాదకూ . అయ్యయ్యో!—ఎంత మచ్చ! ఇంతకీ ఇది విధి వైపరీత్యం. భూషయ్య బాబంటే సాక్షాత్తు ఆ ధర్మరాజని లోకమంతా మ్రోగిపోవడ మేమిటి, అట్టి ధర్మప్రభువు కడుపున ఫోర్జరీకి పాల్పడే కొడుకు పుట్టడ మేమిటి ?

భూషయ్య [మిన్ను విరిగి మీద పడ్డట్టు]. ఆఁ! ఫోర్జరీ యేమిటి?

కృష్ణమాచార్యులు [తెల్లబోతూ]. ఏఁ ? భూషయ్య బాబూ! నువ్వింకా విననే లేదా ?

భూషయ్య. అయ్యో ఖర్మ! ఫోర్జరీ యేమిటండీ ?

కృష్ణమాచార్యులు. నాలుగైదురోజుల క్రితమే నేను కర్ణాకర్ణిగా విన్నాను. పాపం, పుణ్యం ఆ భగవంతుడి కెరుకని నీ చెవిని వెయ్యలేదు. కాని, ఈపూట ఊరంతా గుప్పుమంది. ఎక్కడ వినబోయినా ఈమాటే మహా విడ్డూరంగా....

భూషయ్య. అబ్బ! అసలు విషయమేమిటండీ ?

కృష్ణమాచార్యులు. వస్తున్నా. ఘూషయ్యబాబూ! దానికే వస్తున్నా. నీ సంతకాన్ని అబ్బాయి ఫోర్జరీ చేశాడట.

ఘూషయ్య. నా సంతకాన్నా? ఎప్పుడు? ఎందుకు?

కృష్ణమాచార్యులు. ఆ దుష్టుడు లేడూ?—వీరభద్రయ్య!—అతగాడు—ఏదో బస్సురూటట—పర్మిటట—వాడి శ్రాద్ధమట—ఆ గొడవలు నాకు తెలియవ్—"అదెంత భాగ్యం? మన చేతిలో పని—చిటికలో అయిపోతుంది—నాదీ పూచీ—ఒక్క పదివేలు పట్టుకురావోయ్" అన్నాడట.

ఘూషయ్య. ఔను, ఇప్పుడేగా — మీ రిక్కడుండగానే—ఆ పదివేలిమ్మని నా దగ్గరి కొచ్చి వెళ్లారు. మరి, ఫోర్జరీ యేమిటి?

కృష్ణమాచార్యులు. అబ్బాయి నెల నాడే పదివేలు అప్పుచేసి యివ్వడం, దాన్ని రః ఖర్చులని, ఆ ఖర్చులని వీరభద్రయ్య గు ట కా య స్వా హా చేసివెయ్యడం జరిగిపోయిందట. ఘూషయ్యబాబూ!

ఘూషయ్య. సరే, ఏం తగలబడ్డాడో గాని, ఫోర్జరీ యేమిటంటే?

కృష్ణమాచార్యులు. ఆ అప్పు పెట్టినవాళ్ళు "మీదిఅవిభక్తకుటుంబం-నోటుమీద మీ నాన్నసంతకం కూడా కావా" లన్నారట. సూర్యుడు ఇటు అటు పొడిచినా నువ్వు సంతకంపెట్టేది లేదని తెలుసుగనక—"ఆఁ! ఎవరు చూడొచ్చారులే!" అని నీ బదులు కూడా అబ్బాయే సంతకం చేశాడట.

ఘూషయ్య. అరి భడవ! ఎంత పని చేశాడు!

కృష్ణమాచార్యులు. వస్తుతః అబ్బాయి మంచివాడే. కాని, ఆ భ్రష్టాకారి ఘుండావాడు వీరభద్రయ్య స్నేహం చేసి చెడి పోతున్నాడు. ఛః చిక్కు అతగాడు తలకు చుట్టించే.

ఘూషయ్య. అయితే, వీ డింతా వాడి చంకే నాకుతున్నాడేం?

కృష్ణమాచార్యులు. పసితనం, బాబూ! పసితనం!!

ఘూషయ్య. ఇంకేం పసితనం? పాతికేళ్ళొస్తే? [ముక్కుమీద వేలు వేసుకొని] అన్ని విధాలా స న్నెంత నగుబాట్లపాలు చేస్తున్నాడు!

కృష్ణమాచార్యులు. లోకానుభవం తక్కువ, ఘూషయ్య బాబూ, లోకానుభవం తక్కువ! ఆ వీరభద్రయ్య మైరావణ్ణి చంపి పుట్టాడు. అతగాడు బట్టలో పేలాలు వేయిస్తాడు; అరచేతిలో వైకుంఠం చూపిస్తాడు. తిమ్మిని బ్రహ్మి చేయగల సమర్థుడు. మహామహా కొమ్ములు తిరిగినవాళ్ళే అతగాడి మాయలో పడి పోతారు. ఇహ, మన మాధవరావుమాట చెప్పాలి? జరిగిం చేదో జరిగింది. వస్తాయించి లాభం లేదు. రెండోకంటి వాడికి తెలియకుండా ఆ పదివేలూ పంపించి, తెల్లవారక ముందే ఆ నోటు మన చేతి కొచ్చేటట్టు........

ఘూషయ్య [ఆందోళనాపూర్వకంగా]. అది పరాయివాళ్ళ చేతిలో వుండడం ప్రమాదమే!

కృష్ణమాచార్యులు. ప్రమాద మని నెమ్మదిగా అంటావేమి, ఘూషయ్యబాబూ! దాన్ని మన చేతికి రాబట్టుకోకపోతే కుత్తుక పట్టుకుంటుంది. వాళ్ళు "మా పదివేలు మాకు తెస్తావా?

సివిల్, క్రిమినల్ చర్యల్ని జరపమంటావా ?" అని యాకుడు చేస్తున్నారట. మీ రిహా తాత్సారం చేస్తే రాదు. తలలో నాలిక వంటి మనిషి నెవరినైనా చూచి, అతగాడి చేతికి పైక మిచ్చి, తెల్లవారేసరికి ఎలాగైనా సరే....

ఘోషయ్య [బాధతో బరువుగా]. కొడుకురాసిన దొంగనోటు తెప్పించ మంటారు!

కృష్ణమాచార్యులు. లేకపోతే, కొంప లంటుకోవూ, ఘోషయ్య బాబూ? దుష్టసహవాసం చేసి, చెయ్యరాని పని చేశాడనుకో! అయినా జ్యేష్ఠుడు. జెయిల్లో పడ్డాడంటే, వంశానికే తరతరాలకూ తలవంపులు రావూ?

ఘోషయ్య. ఇప్పుడు అంతపనీ జరగలేదటండీ? ఫలానా వారబ్బాయి ఫోర్జరీ చేశాడంటూ లోకం కోడై కూస్తున్న దని మీరేగా ఇంతకుముందు చెప్పారు!! జెయిలుకు వెళ్ళడం ఇంతకంటె అప్రతిష్ఠ కాదుగా? ఇంత బ్రతుకూ బ్రతికి ఇంటి వెనకాల చచ్చినట్టు, నా కొడుకు రాసిన దొంగనోటు నా కివ్వమని నేను అడ్డమైనవాడి కాళ్లా వేళ్లా ఎక్కడ పడతానులెండి? వీడు రాసిన దొంగనోటు ఇదొక్కటే నన్నమాటేమిటి? ఎన్నున్నవో!

కృష్ణమాచార్యులు. అబ్బే! వోడు వోడంటే కంచమంతా వోడేనా, ఘోషయ్యబాబూ? ఇందాక నీదగ్గరి కొచ్చినప్పుడు అబ్బాయి ముఖాన కత్తివేటు వేసినా నెత్తురుచుక్క వున్నదా. పాపం! చాలా సిగ్గుపడిపోతున్నాడు!

ఘూషయ్య. వాడు సిగ్గు విడియా ఉన్నవాడైతే, అన్ని అటభ్థా లాడతాడా? "ఏదో బుద్ధి తక్కువైంది. గడ్డి కరిచాను. నన్ను ఒడ్డుకు చేర్చ" మంటే, అవారి వారి. ఆ మాట వాడి నోటివెంట వచ్చిందా ?

[లోపలినుంచి పనిమనిషి, పసిపాపొస్త్రి పిల్లవాడి గొంతు "నాన్నా! చెల్లాయి నందుపట్టం వేసుకొంటున్నది."

ఘూషయ్య. అది చేదుపుట్ట. కాస్త తేనెలో కలిపి వెయ్యండిరా!

కృష్ణమాచార్యులు. అమ్మాయికి నెమ్మళించ లేదా ఘూషయ్య బాబూ ?

ఘూషయ్య. ఆఁ! కొంత నెమ్మళించింది. నిన్న సాయంత్రం నుంచి జ్వరం తిరుగుముఖం పట్టింది.

కృష్ణమాచార్యులు. మొత్తంమీద చాలా పెద్ద ఖాయిలా తీసింది. రత్నంవంటిపిల్ల. ఎక్కడ దాపురించిందో ఆ విషజ్వరం. పైకి అనలేదుగాని, పోయిన వారం నాకు మనస్సులో కొంత దొక్కు పడింది.

ఘూషయ్య. ఎవ రెంత ఖంగారు పడితే నేమండీ! వాడు వాకిట్లో వాడు వాకిట్లోనుంచే వెళ్ళిపోయాడు గాని, లోపలికి తొంగైనా చూశాడా? అన్నయ్యను చూడాలని అది కలవరిస్తే, అక్కడికీ మొన్న కబురుకూడా చేశాను. తన షోకు, తన దర్జా, తన సుఖం, తన గొడవేతప్ప మరొకరి ఊసే వాడికి పట్టదు. ఏమిటో ఈ విపరీతపు బుద్ధులు. కాలమహిమ కాబోలు!

కృష్ణమాచార్యులు. ఇంకా పసివాడు, ఘూషయ్యబాబూ! పసివాడు. ఎలాగైనా, ఈ ఉచ్చు మీరు తప్పించాలి.

ఘూషయ్య. అయితే, వీడికంటే పసివాళ్ళు లేరూ? వాళ్ళ మాటేమిటి? వీడికోసం వాళ్ళకు చిప్ప చేతి కివ్వమంటారా?

కృష్ణమాచార్యులు. ఆమాట నిజమే ననుకో, ఘూషయ్యబాబూ! కాని మాధవరావు........

ఘూషయ్య. వాడు నా పెద్దబిడ్డ; వాడి మాట మీరు నాకు చెప్పాలటండీ? పై పై గాంభీర్యమేగాని, వాడివిషయమై నే నెంత కుమిలిపోతున్నానో మీ కేం తెలుసు? ఇప్పుడు మీరు చెప్పిన మాట వినేసరికి నవనాడులూ క్రుంగి నేను సగం చచ్చానంటే నమ్మండి. కాని, నీతీ నిజాయితీ లేనివాడిని—కొడుకైతే మాత్రం—కాపాడాలన్న తాపత్రయం మనకు తగునా? అట్టివాడు ఏ గంగ కలిసినా ఒక్కటే. "మన కున్నది మనకు చాలదట్రా?" అని ఎంత మొత్తుకున్నా గోడకు చెప్పినట్టే అయింది. వాణ్ణి దురాశ పీడిస్తున్నది; దుర్మార్గుడౌతున్నాడు. సరే, వాడి కర్మ వాడు అనుభవిస్తాడు. ఎవరి కర్మ కెవరు కర్తలు? సర్లెండి—ఏదీ ఆ పద్యం—దాన్ని మళ్లీ వినిపించండి: "ఆశాపాశము దా గడుఁ—నిడుపు...."

కృష్ణమాచార్యులు. ధర్మరాజువని నీకు ఊరికే పే రొచ్చిందీ ఘూషయ్యబాబూ! నీబోటివా ళ్ళింకా మిగలబట్టే....

ఘూషయ్య. మీ మాటలకేమిలెండి. ఆ పద్యం వినిపించండి.

[కృష్ణశాస్త్రిగారి గేయాలు "ఆశాపాశము నా నిదుర నిదుర" అని ఉచ్చైస్స్వరంతో చదువుతున్నంతలో...

తెర]

